శ్రీరస్తు

# కళాభానువిజయము

అను

## చక్కని శృంగార నవల

ఇయ్యది

పంచరత్నము - సుబ్బరామప్పగారిచే

రచితము






ప్రకాశకులు:

సి.వి.కృష్ణా బుక్‌డిపో,

16/99. అమ్మన్ కోవిల్ వీధి,

వాల్టాక్సు రోడ్డు పోస్టు, మదరాసు.1



దీని వెల] 1957 [3-0-0

శ్రీరస్తు

# కళాభానువిజయము

అను

## చక్కని శృంగార నవల

ఇయ్యది

పంచరత్నము - సుబ్బరామప్పగారిచే

విరచితము




ప్రకాశకులు:

సి.వి.కృష్ణా బుక్‌డిపో.
19/99. అమ్మన్ కోవిల్ వీధి,
వాల్‌టాక్సురోడ్డు పోస్టు, మదరాసు.1.



దీనివెల] 1957 [3-00

# ప్రకటన

ఇందువలన అందరికి తెలియజేయడము ఏమనగా వ. మ. త్యాగరాయశెట్టి ప్రచురించుచుండిన ఈ క్రింద తెలియపరచిన మూడు పుస్తకములను తే 20-2-57 ది. కాపీరైటు హక్కును పొందియున్నాను గాన యీ పుస్తకములు వలయువారు యీ క్రింది అడ్రసుకు వ్రాయగోరెదను.

1. శతకంఠరామాయణము-వచనకావ్యము
2. సహస్రకంఠరామాయణము-వచనకావ్యము
3. కళాభానువిజయము-చక్కని శృంగార నవల

ఇట్లు

సి. జి. మురుగేశ మొదలియార్

ప్రొప్రైటర్:—సి. వి. కృష్ణా బుక్ డిపో,
నెం. 19/99 అమ్మన్ కోవిల్ వీధి, మదరాసు1
తపాలుపెట్టె నెం. 1805 మదరాసు-1

శ్రీ ర స్తు

శ్రీరామచంద్రాయ నమః

# శ్రీ కళాభాను విజయము

—:*:—

## ౧ ఆర్త ప్రకరణము

శా. లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలం బయ్యెఁ బ్రాణం
బులుఁ, ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె తనువుఁ డస్సెఁ
శ్రమం బయ్యెడిఁ, నీవేతప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపఁ
దగుఁ దీనునిఁ, రావే యీశ్వర కావవే వరద సంర
క్షించు భద్రాత్మకా.

శ్రీకైలాసవాసా! పార్వతీరమణా! శంకరా! భక్తవశంకరా! రక్షింపుము. రక్షింపుము. అక్కటా! పరమేశ్వరుఁడు నన్ను సృజించి నాకీయధికారం బొసంగినది మొదలిదివఱకొకరికైనను కించిదపకారం బొనర్చి యెఱుఁగ. లోకోపద్రవం బొనరించుచున్న భూతగణంబులను శాసించుటకే గదా నాపుట్టుకకు కారణము. ఈ మహారాజ్య సార్వభౌమపట్టాభిషేక మొనర్చుటయేగాక యణిమాదిసిద్ధులును అఘటనాఘటనసామర్థ్యమూ పరమేశ్వరుఁ డొసంగియున్నవాఁడు. నేనిట్టి పదవిగలవాఁడను గదా యని యొకపరియైనను గర్వము నొందక విధినియమానుసారినై యధికారము చూపుచుందును.

అఖండమయిన నాయాజ్ఞకుబద్ధులై బహువిధభూతగణములు సంచరించుచుండినను వారిమనముల కెంతయో యాహ్లాదకరుడనై యుందుదు. శాంతమార్గముననే భూతగణముల దుర్వృత్తుల మాన్పి వారియిష్టానువృత్తి వర్తింపకుండునట్లు కొన్ని హద్దులు గల్పించి కత్తిచూపక వారిప్రేమకు పాత్రుఁడనై పరిపాలించుచుందును. ఇట్టి నిరపరాధిని నైన నేనట్టిబంధనంబులం దగులువడితి, అబ్బా నాసంధు లన్నియు మహామంత్రపాశంబులం బంధింపబడి యమబాధ నొందించుచున్నవి. అయ్యో! నేఁటి కిరువదిదినము లయ్యె. కపాలపురీ మధ్యవిభాసితసహస్రవిద్రుమస్తంభ సంభృతమహామంటపాంతర సింహాసనంబుపై భూతరాజ్యమూర్ధాభిషిక్తుఁడనై పేరోలగంబుననున్న నాకు భూతములు ఛత్రములఁ బట్టుచుండుదురు. ప్రేతములు చామరముల వీచుచుందురు. పిశాచములు మకరతోరణములు బారులు దీర్చుచుందురు. బ్రహ్మరాక్షసులు స్వస్తివాచనాశీర్వచనము లొనర్చుచు ప్రత్యహమును పంచాంగశ్రవణ మొనర్చుచుందురు. కూశ్మాండములు భేరీమృదంగాది బహువిధవాద్యములు బోరుకొల్పుచు ముందుప్రక్క నిలుచుచుందురు. వైనాయకులు కైవారంబు లొనర్చుచు వందిమాగధులు వడువున నడుచుచుందురు. ఇట్టి నావైభవం బెందుఁబోయె. దశకోటిభూతగణముల కధిష్ఠాతనై యున్న నాకింత యాహార మొసఁగువా రైనను లేక తుదకు నీర మొసంగువా రైనను గనరాక యాఁకటిచే మలమలమాడి యఘోరింప వలసివచ్చె. భూతములలో నొకరినైనను నాచెంతకు రానియ్యక నన్ను విచారించకుండున ట్లొనరించిన యాదురాత్ముం డెంతటి ప్రతిభావంతుఁడో తెలియదయ్యె. జగమున నాకన్న

వధికులు లేరను గర్వంబున నుబ్బూఁతలూఁగుచుంటి. ఇట్టి నా ప్రతాప మాదురాత్మునిచెంత ధూపప్రయోజనమైనను లేక పోయె. దురాత్ముఁడననేల మహాత్ముఁ డనియే చెప్పనగును, లేకున్న జగదప్రతిప్రతాపతేజోదుర్నిరీక్షుఁడనైన నన్ను మంత్రపాశములచే బంధించునంతటి శక్తి గలుగునే! అబ్బా! యీఘోరమంత్రపాశములచే బంధింపఁబడి నాప్రత్యంగంబును నిప్పుడే భస్మ మగునేమో యను నంతటి మంటలు వాఁడమి గోఁడుఁ గుడిపించుచున్నవి. ఊపిరి విడుచుటకైనను శక్తి లేకున్నది. హా! నే నేమి తనవలె క్రూరకృత్య మొనరించలేదే! యబల సమాయిక తరుణవయస్కయగు నొకబాలిక నా దురాత్ముని బారినుండి తప్పించుట కుపక్రమించితి నంతియే గదా! సర్వదేవతామూర్తులును తుదకు నేనును మంత్రాధీను లము. అట్టి మంత్రములన్నియు నాభైరవుఁడు యానీచుఁడు యారాక్షసుని స్వాధీనమం దుండుటచే నా కిట్టిపాటు వచ్చె. అతనిపై నేఁ జేయు ప్రయత్నములన్నియు బూడిదలోని హోమమయ్యె. ఎంతటివారికైనను గ్రహగతులు చాలనప్పు డాఫల మనుభవించియే తీరవలయు. అయ్యో యాఁకలిచే కడుపు దరికొని యుండుచున్నది. నన్ను రక్షించువా రెవ్వరు! నాపాశబంధములం ద్రెంచువా రెవరు! యా క్రూరకర్ముని ద్రుంచువా రెవరు! నాయాఁకలి దీర్చువా రెవరు! ఇక ముప్పది దినములే నాయువధి. ఆవల సజీవముతో నాప్రత్యంగంబును ఖండింపంబడి మంత్రపూతముగా విధియుక్తముగా నభిచార హోమమున మరణించవలసినదే గదా! సకలవేదమాత గాయత్రీమహాశక్తి విశ్వామిత్రు నభిచారహోమమున చతు ష్పదయై యుండియు త్రిపదాగాయత్రియై యుండలేదా! నే

నెంతటివాఁడ. మంత్రాభిచారహోమంబునఁ దెంతటి దేవత యైనను నశించవలసినదే. నో రెండె, ప్రాణవాయువులు స్వస్థానచలనంబు నొందె. హా! యని భూమ్యాకాశంబులు నిండునంతటి యార్తారవంబుచే హిమవత్పర్వతసానుదేశంబు నందుండు భయంకరారణ్యమధ్యమునం దొక యశ్వత్థవృక్షం బుపై పెద్దభూతము దుఃఖించుచుఁ దన్ను రక్షించుటకే దేవు డైనను జనుదెంచునేమో యని నలుదిక్కులం గాంచుచు నెవ్వరిం గానక నార్తి దూలుచుఁ బ్రాణంబులపై యాశవదలి మరణమే శరణమని దుఃఖించుచుండె.

---

# ౨ వృత్తాంతప్రకరణము

పరమపావనమైన జంబూద్వీపంబునందు గల నవవర్షములలో నతిశ్రేష్ఠతమమైనది భారతవర్షము. దీనిచుట్టు పరిమితి తొమ్మిదివేలు యోజనములు. స్వాయంభువ మన్వంతరమున ప్రియవ్రతమహారాజకుమారుఁడైన యాగ్నీధ్రుని కాలమునుండి తద్వంశీయుఁడైన జడభరతుని పరిపాలనపర్యంతరం బజనాభం బనియుఁ, బిమ్మట భారతవర్షం బనియుఁ బ్రసిద్ధిఁ జెందినది. ఈ వైవస్వతమను వంశీయుఁడైన సగరచక్రవర్తి సుతు లఱువదివేలమంది యజ్ఞాశ్వమునకై భూమినిద్రవ్వినందున సముద్రసంధులును ద్వీపకల్పములును యేర్పడి సముద్రమునకు సాగర మను పేరొసంగిననాఁటినుండియే భారతవర్షమే నవఖండములుగా నేర్పడినవి. ఈ నవఖండములలో పరమోన్నతప్రభావప్రకాశతరమైనది మన హిందూఖండము. దీనిని శకుంతలానందనుఁడైన భరతుఁడు పరిపాలించినప్పటినుండియు

భరతఖండమని యెన్నిక గన్నది. ఈ దేశమునకు మూఁడు దిశలయందు సముద్రమును, ఉత్తరదిశయందు హిమాలయ పర్వతమును హద్దులు గలిగియున్నది. సప్తద్వీప నవవర్ష నవఖండములలోఁ బ్రధానమణిప్రాయమైనది మన హిందూ దేశము. ఇందలి ప్రజలు సకలవిద్యాసార్వభౌములు, గౌరవ నీయులు, గంభీరహృదయులు, ఆర్తజనరక్షణ దీక్షావిచక్ష ణులు, హీనవిషయములందుఁ బ్రవేశించువారు కారు, హీన మును దూషించెదరు. అందుచేతనే హిందూదేశమని పేరు వడసినది. "శ్లో॥ హీనం చ దూషయ త్యేషాం హిందూ రి త్యుచ్యతే ప్రియే" అని మేరుతంత్రమునందు గలదు. "హీనం దూషయతీతి హిందూః" అని శబ్దోత్పత్తియు చాటుచున్నది. వీరు కేవలశరీరారోగ్యమునే పురుషార్థమునే స్వార్థలాభమునే ముఖ్యమని నమ్మువారు కారు. ఏకార్య మాచరించవలసి యున్నను తొలుదొలుత భగవదారాధనం బొనర్చి యావల కార్యప్రయత్నం బాచరింతురు. తత్ఫలమును భగవత్ప్రీతి నొనర్చుచుందురు. సర్వభూతసమత్వం బీదేశీయులదే సొమ్ము. పుణ్యపాపముల తారతమ్యం బధికముగా నెఱుంగుదురు. పాపకార్యము లన్న వెనుకంజవేయుదురు. వర్ణధర్మముల కాశ్రమధర్మముల కీదేశమే గణనీయము. పుణ్యతరంగిణులా పుణ్యక్షేత్రములా బహుళతరతరుశోభిత దశవిధారణ్యములా! ఆహా! భూస్వర్గంబన, భూకైలాసంబన, భూవైకుంఠంబన, హిందూదేశమే యని ప్రతిజ్ఞ చేసి చెప్పనగును. ఇట్టి వున్నత స్థానము ఆర్యావర్తంబనియు, దక్షిణాపథంబనియు రెండువిధ ములుగా వింధ్యపర్వత దక్షిణోత్తర భూభాగములు ప్రసిద్ధిఁ కెందినవి. శ్రీమదాదినారాయణావతారంబగు వేదవ్యాస

మహామునీంద్రుఁ డీదేశప్రభావమును వర్ణించునప్పు డితర దేశ ములయందు సహస్రవర్షములు జీవించి పునరావర్తిగల్గి బహు దుఃఖంబు లనుభవించి పుట్టుచు చచ్చుచుండుటకన్నను హిందూ దేశమున ముహూర్తమాత్రము జీవించి ఖట్వాంగమహారాజా దులవలె శ్రీరఘువమోక్షపదవి జెంది పునరావర్తిరహితశాశ్వత సౌఖ్యం బనుభవించుట మేలని మహాభాగవతమున వ్రాసి యున్నవాఁడు. భగవంతుని యేకవింశద్యవతారములకు జన్మ భూమి యీ భరతఖండమే. షట్చక్రవర్తులు, షోడశమహా రాజులు, కవిసార్వభౌములు, మన్వంతరపురుషులు, త్రైలోక్య రాజ్యార్హులు నీ దేశముననే జన్మించి యితరవర్షద్వీపములను జయించి వారలచే యరిగొని దేవేంద్రవైభవమున నిచ్చటనే యునికిఁ గల్పించుకొనిరి. వేదములు, శాస్త్రములు, నానా దేశభాషావైచిత్రియు, వ్రాతవైఖరియు, దైవోత్సవములు, ధర్మనిర్బంధముల కీదేశమే బీజాంకురము. వేదోల విరాట్స్వ రూపమున సగుణమూర్తియైన పరమపురుషుని కీ హిందూ దేశమే సహస్రారస్థానము. భగవంతుఁడను శుభగ్రహమున కీభరతఖండమే పరమోచ్చస్థానము. జపతపస్నాన సంధ్యా ద్యనుష్ఠానముల కీదేశమే యునికిపట్టు. కర్మ భక్తి జ్ఞాన వైరాగ్య స్వార్థత్యాగ పరోపకారముల కీయజనాభమే మంది రము. సమస్త సస్య వస్తు ఖనిజంబుల కీ సేతుశీతాచలాంత ర్భూమియే ధామము. ఇట్టి దేశవాసులు యీ పరమపుణ్యా త్ములు శక్తిహీనులనియుఁ, దెలివి తక్కువ గలవారనియు, ననాగరకులనియు, హీనస్థితి గలవారనియు నితర దేశవాసులచే హేళనం బొనర్పఁబడుచున్నారు గాని యట్లు హేళనంబొనర్చు వారియందే యీపరిహాసవాక్యములకు దగుచర్య లణఁగి యీ

క్రమించియున్నవి. భారతీయులు కేవల వైరాగ్యపరులు, శరీరములను ప్రపంచవైభవములను నమ్మువారు కారు. సమస్త వేదశాస్త్రము లెఱింగియు, ప్రకృతిచిత్రములు గమనించియు, దద్విమర్శచేసియు పారమార్థిక చింతయే ప్రాధాన్యంబుగా నున్నవారగుటచే జడభరతునివలె దెలియనివారిరీతి నటింతురు. భారతీయులకుఁ దెలియని ప్రకృతిపరతత్త్వవిషయిక రహస్యములు లేవు. పరమతపస్సిద్ధిగల యమనస్క యోగులు తమ మహిమలం జూపక బాలోన్మత్తపిశాచములరీతి నెట్లు వర్తింతురో వీరట్లుందురు. అహంకారమున విఱ్ఱవీగరు. పరాక్రమముననో ప్రళయకాలరుద్రులు, చెట్లుచాటున దాగియు, నేమరించియు, యంత్రసాధనములఁ బ్రయోగించియు, విషవాయువులను భూమిలోనుండి విడచియు, కందకములలో దాగికొనియు శత్రువులను జంపువారు కారు. వీరి కీయింద్రజితుమాయ లధర్మములని మనసొగ్గదు. ముఖాముఖియందుఁ దమ ప్రతాపమనర్గళముగాఁ గనుబఱచి విజృంభించి శత్రువులను చెండాడుదురు. వెన్నుఁజూపి పఱువెత్తరు. ఆతత్త్వమును తమలోపమును నెఱుఁగంగలేక యూరరు లీనిందావాక్యములు ప్రయోగించి దేవునిచే తాము నిందింపఁబడుచున్నారు. మన భారతీయులలో నొక్కొక్కరి నిందావాక్యముల కోర్వక భారతీయతత్త్వ మెఱుఁగని మూర్ఖుల కెఱుకగునట్టుల విజృంభించి మహాశక్తిని బైలుపఱచి సకలదేశంబులవారిని యేవిషయమునందైనను తమకుఁ గ్రిందు చేసికొనియున్నవారు. ఇందులకు శ్రీరామ పాండవాది పురాణపురుషులును, శంకరాచార్యస్వామి వివేకానందదాది చరిత్రకారులును, బాలగంగాధర మహాత్మగాంధి ప్రముఖ యాధునికులును నిదర్శకులు.

మఱియు పరమసుస్వభావసాధ్వీతిలకంబులగు హిందూదేశ యువతీమతల్లుల సుచరిత్రంబు లెన్న పరమేష్ఠికైన నలవి యగునే! వీరు భర్తయే పరదైవతమని భావించి తదాజ్ఞా బద్ధులై తన్మనశ్చరులై తత్సేవాపరులై తద్ధ్యానమానసులై యుందురేగాని తమసిగ్గును బాటింపక తమధర్మముల ననుసరింపక తమలక్షణములు గమనింపక యితరపురుషులతో సభలలో నుపన్యాసంబు లిచ్చుచుందురా! ఇతర పురుషకరగ్రహణంబు లటుండనీ, స్పర్శ చేయుటకైనను మనసొగ్గియుందురా! స్వేచ్ఛల హద్దుమీరి మాటలాడుదురా! తమయధికారమును వెల్లడిపఱతురా! పురుషగౌరవంబున సమభాగార్హ లయ్యుం డియుఁ బురుషులకన్న మునుపు తా మితరులచే గౌరవంబు ననుభవింతురా! తమవిద్యను భర్తలకు సహాయ మొనరించుట యందును పుత్త్రులకు బుద్ధిఁ గఱపుటయందును, పాతివ్రత్యాభివృద్ధియందును, సువ్రతనియమములయందును, శిశుపోషణల యందును, అభ్యాగతాతిథులపూజలయందును వినియోగింతురేగాని తమ ప్రతిభ ప్రతిశాముఖంబుల వెల్లడించి భర్తను పాకయజ్ఞంబునకు నియమించి యుపన్యాసము లొసంగుపనియే ప్రధానముగా గమనించి మహావిద్వాంసురాండ్రనుకొనవలె నని పెద్దల నవమానించుచు సనాతనమార్గావలంబకులై యున్న సాధ్వీమణులంజూచి పూర్వకాలశౌనస్తనని హేళనం బొనర్చుచు విటపురుషులకు నయనానందకరంబుగ తమ సర్వాంగంబులు దృశ్యాదృశ్యంబుగా నుండునటుల దోమతెర వంటి సూక్ష్మవస్త్రంబులం ధరియించి పనిలేనిపని కిటు నటు చరించుచుఁ దముభర్తలకన్నను దామే ప్రజ్ఞావతులమని పిట్ట పీకుచు భర్త భుజియింపక మున్ను భుజియింపుచు విచ్చలవిడి

వర్తింతురా! రుగ్ణతయో శక్తిహీనతయో యగు సమయమందైనను తమభర్త లుపచరించుచుండగా మనసాగ్గక విధిలేక వలదని ప్రార్థించుచు దమ్ము నిందించుకొనుచు పశ్చాత్తాపంబు నొందుచుందురు. ఇట్టి సుజ్ఞాననిధులు గనుకనే మన హిందూ సుందరులలో నొకసతి తనభర్త మృతి జెందియుండినను మరల బ్రతికించుకొనియె, నొకసతి తనపతి సన్నిధియందగ్ని ముఖముగాఁ దన పాతివ్రత్యమును స్థిరపఱచుకొనియె, ఒకసతి తనభర్త నిర్యాణమైయున్నను దనకుమాత్ర మహాగ్ని శిలయం దగుపడునట్లు వరమును సంపాదించుకొనియె. ఒకసతి మహాసభయందు గ్రూరులు, దనకట్టినపుట్టంబు లొలువబడుచున్నను దన పాతివ్రత్యప్రభావముచే నెడ తెగనివలువల నభివృద్ధి నొందించుకొని తనమానంబును గాపాడుకొనియె. ఇట్టి మానవతు లీదేశంబున వేనవేలు గలరు. ఈ సతులు దైవభక్తి పతిభక్తిపూరితంబులగు గ్రంథంబులం జదువుచుండురేగాని లోకవార్తలకు మఱగి గృహకృత్యంబులు మాని భర్తసేవ విడనాడి దైవభక్తి మఱచి వ్రతములు మంటగల్పి వాయనదానములపై దుమ్ముఁజల్లి గౌరీపూజల నణగఁద్రొక్కి-దేశదేశవృత్తాంత పత్రికలను దెప్పించుకొని ప్రత్యేకభవనములలో దారుమయాసనంబులపైఁ గూర్చొని పరపురుషులతోఁ గరగ్రహణములతోఁ గరతాళధ్వనులతో జదువుచు నవ్వికొనుచుందురా! ఆహా! యీ భారతీమణుల నొక్కసారి స్మరించిన బహుజన్మపాపములఁ దరియించు. వీరికి వ్రతములన్న కడుభక్తి. వ్రతము సద్యఃఫలవంతములైనవి. అపుత్రకులనేకు లనేకవ్రతంబు లొనర్చి పుత్రవంతులై యున్నవారు. కొందఱు వ్రతములొనర్చి తమభర్తల నెడ తెగని రుగ్ణతలనుండి

విముక్తిఁ జెందించి రక్షించియున్నవారు. కొందఱు కన్యకలు వ్రతముల నాచరించి తాము కోరినవారినే భర్తగా వరించి సుఖముల నందియున్నారు. వ్రతము లనేకము లీహిందూదేశమున ననేకవిధములుగా నున్నవి. అందులో బ్రతిశుక్రవారమును కొందఱు భారతయోషారత్నము లొకవ్రతం బొనర్తురు, ఆవ్రతము దేవీపూజగా పరిణమించును.

ఇఁక, మనకథాకాలము చెంత కరుగుదము. నాఁడు శుక్రవారము, పాంచాల (పంజాబ్) దేశ ముఖ్యపట్టణమగు మణిస్యందః (కాంపిల్య - లాహోర్) పట్టణమునకు బడమర నుండు భువనేశ్వరీదేవాలయం బలంకరింపఁబడియుండెను. దేవీవిగ్రహము నపరిమితభూషణములతో బలువిధపువ్వుము లతో శుభ్రతరచేలముతో హరిద్రాచూర్ణ కుంకుమాక్షతలతో నలంకరించియుండిరి. పతంగుఁడు పశ్చిమాద్రినుండి సముద్రమున స్నానంబొనర్చుట కుద్యుక్తుండై యుండె. మహావిష్ణువు హృదయమునఁ బ్రకాశించు కౌస్తుభమణి యన మార్తాండబింబం బెఱ్ఱవారి చూడచూడ వర్తులంబై యర్ధచంద్రాకృతియై రేఖామాత్రంబై తుదకదృశ్యంబయ్యె. ప్రదోషకాలప్రవేశంబయ్యె. భేరీముఖమంగళధ్వనులు చెలరేగె. నక్షత్రంబు లొక్కటొక్కటియే తలచూపుచుండెను. సంజచీకట్లు వాడమె. పురిలోనుండి దేవాలయమార్గముగా పుణ్యాంగనలు గుంపులు గుంపులుగాఁ జనుదెంచి దేవికి జ్యోతులు జోతలు సమర్పించి తమమందిరములకు జనుచుండిరి. ఏడుగడియల రాత్రియయ్యె. రాజపథము వెంట యిద్దరు స్త్రీలు జనుదెంచుచుండిరి. అందులో నొకసుందరి సర్వాంగసుందరి, నూతన బాల్యాధిక యౌవన, పదునై దేండ్లుగల ముద్దియ, సమస్త

భరణోపేతయై స్వర్ణతంతురేఖాబిందుసంయుతంబగు సరిగంచు ధాతచేలము ధరియించి బంగారుబిందువులుగల రక్తవర్ణకంచుకముఁ దొడగి హారిద్రావర్ణమైన యమూల్యతర చీనాంబరము మేలుముసుం గిడి జగంబులం గెలువ శంబరారి గాంగేయ శకల చంద్రకళల నమృతంబున నూరి తటిల్లతాతతులచే మెఱుంగొనర్చి విరించిపై మాఱొడ్డి సృజియించిన భువనమోహినీలతికయుం బోలి తేజరిల్లుచు పలువిధపుష్పాక్షత జ్యోతికుంకుమ హారిద్రాచూర్ణ తాంబూలములచేతను, ఘనసార గంధసార ప్రముఖసారభద్రవ్యములచేతను కదళీఖర్జూర ద్రాక్షాదిఫలసంతతులచేతను, పరిపూరితంబగు బంగారుపళ్ళెరము వామకరంబునం ధరియించి నొక కుశేశయంబును దక్షిణకరంబునందు బట్టికొని పదనూపురమంజీర ఝుళాఝుళధ్వను లుప్పతిల్ల జనుదెంచుచుండె. మఱియొకసతి యిరువదియైదు వత్సరముల వయస్సుగల్గి స్వర్ణకలశంబుచే జలంబును తాళవృంతంబును ధరించి నాముద్దియకు సేవలొనర్చుచు తాళవృంతంబుచే విసరుచు వచ్చుచుండె. నామెంగన్న నొక చేటికంబోలి చెప్పకజెప్పుచుండె. ఇట్లు రాజపథంబున వచ్చి వచ్చి కుంకుమరేఖాపరిశోభిత నిటలతటముతో మందహాస సుందర వదనారవిందముతో పరమభక్తియుత సువ్రతనియమముతో మందగమనముతో యానందహృదయముతో దేవాలయ మహాద్వారముచెంత కరుదెంచె వారలంగని దేవాలయ పరిచారకార్చకాదు లెల్లరు వెనుకల కొదిగి నిలువంబడిరి. వారల కడకంటిచూపులం దిలకించుచు రంగమంటపమునం బ్రవేశించి ద్వారములను మూసికొని గర్భగృహంబులోని కరిగి భువనేశ్వరీబింబమునకు ధ్యాన స్నాన నైవేద్య తాంబూల

పూర్వకంబుగా షోడశోపచారపూజ లొనర్చి పునఃపూజాంత మున తన్మూర్తిని మనఃపీఠంబునందు నెలకొల్పి యామోహా నాంగి లేచి కరపుటంబు ముకుళించి నిలువంబడి;

శా. స్రగ్వస్త్రాగరుధూపధూమపటలీసాంకర్యచిద్రూపిణీ
ప్రాగ్వేద్యాంతరహాస్యభూషణమణీ బ్రహ్మాండసద్గర్భిణీ
భృగ్వత్రిచ్యవనాబ్జభూసురమరుద్భిర్గీయమానాగ్రణీ
ఋగ్వేదాశ్రిణీ పాపసంహారిణీ శ్రీరుద్రాణి నన్ బ్రోవవే.

ఓజగన్మాతా! మంగళాంగీ! నీవరప్రసాదముననే మా జననీ జనకుల కేను జనియించితి, నీకృపచే సమస్తవిద్య లెఱింగితి, సౌందర్యమును సుఖము నొసంగియున్నదానవు, ఇట్టి నన్నొక విద్యావిహీనుఁడైన బీదమానవున కొసంగునట్టి మా తలిదండ్రుల మనంబున సంకల్పింపజేసి యున్నదానవు. నా కా రూపహీనుడైన లోమకేశుని వరించుటకు మనం బొప్పక యున్నది. బంధువులతో సఖీజనులతో మాపితరు లీ లోమ కేశు న్వరియించుటకై చెప్పించుచున్నవారు. దేశదేశము నుండి రాబడిన రాజకుమారుల చిత్రపటములంగని వారొ క్కొక్క రొక్కొక్క విషయమున కొదువగలవారైనందున నవమన్మథాకారులై యున్నను నామనం బొప్పకయున్నది. వారి లోపము లాపటములం గనినమాత్రముననే నీకరుణచే నాకు స్ఫురించుచుండె. అట్టి జ్ఞానంబట్టి నిర్భాగ్యునివాత ద్రోయుటకా యొసంగితివి. ఇట్లొనర్చుట కన్నను నీఖడ్గముచే నామస్తకముం దునిమి బలిగొనుము, లేకున్న నాకోర్కె నెఱ వేర్ప నెంచితివా! హరిద్వార బ్రాహ్మణోత్తమునిచే వినిన మహాపురుషుఁడు, నవమన్మథాయమానుడైన యామోహా

నాంగుఁడు, సమస్తకళ్యాణగుణవిచక్షణుఁడైన యావిద్యానిధి, ధనుర్వేదపారీణుఁడైన యాప్రతాపవంతు, పరోపకారదీక్షా బద్ధుఁడైన యాసాధుస్వభావు, నాయజ్ఞానాంధకారప్రతాప భానుండగు కళాభానుఁడను రాజకుమారుఁడు నాచే వరింపఁ బడియున్నవాఁడు. అమ్మహాత్ముఁ నేనెఱుఁగ, నతనిచెంత కరుగుటకే సాహసింపఁజాల, నాబ్రాహ్మణునిచే నాప్రార్థన రహస్యముగా వ్రాసి పంపియున్నదాన. పరమపతివ్రతాతిలకములగు సావిత్రీ దమయంతీ యువతులవలె నేనును కోరియున్న దాన, అమ్మహాపురుషు లాసాధ్వీమతల్లులచెంత కేవిధంబునం జనుదెంచి పాణిగ్రహణం బొనర్చిరో యావిధి నిమ్మహాత్ముఁడు నాచెంత కేతెంచి నాకరగ్రహణం బొనర్పజేయుము. నే నమాయికురాల, ప్రపంచజ్ఞానం బెఱుంగ. తల్లీ! భువనేశ్వరీ! సమస్తభక్తుల కోర్కెల నెఱవేర్చు నీకు నాయొక్కదాని కోర్కె నెఱవేర్చుట భారమగునే! జగజ్జననీ! నే నిదే మందిరంబునకై జనియెదనని నమస్కరించి తీర్థప్రసాదముల స్వీకరించి దేవాలయోపరిభాగమున కేతెంచి ద్వారంబులం దెఱచి గృహోన్ముఖులై జనుచుండిరి. ఆ మార్గమునకు నుత్తరముగా నం దానుకొనియున్న నదీతీరమునం దిద్దరు బ్రాహ్మణులు సాయం సంధ్యావందనాదినిత్యకృత్యము లొనర్చి మడిపంచలుకట్టుకొనుచు మాట్లాడుకొనుచుండుట మనతరుణు లిర్వురు విని వీ రేవిషయమును మాట్లాడెదరోయని నిలిచి యాలకింప భువనమోహిని యనియు, మణిస్యందన మనియు వినుపించె. నంత చేటికంగాంచి భ్రమణికా! వీ రేదియో ప్రస్తావవశమున భువనమోహినీ యని నాపే రుచ్చరించుచున్నారు. అదో! విభావసు మహారాజుగారని మాతండ్రిగారిని, శ్యామలాదేవి యని మా

తల్లిగారిని పేర్కొనుచున్నారు. కొంచెముసేపు నిలువుము. వీరింక మనదేశరహస్యము లేమి మాటలాడుదురో వినవలయు ననిన, అమ్మా! ప్రొద్దుపోయియున్నది. దేవాగారపరిచారకు లొక్కరొక్కరే పురిలోని కరుగుచున్నవారు, మన మిరువు రమే యగుదుము. వీ రేదేశబ్రాహ్మణులో వీరికంటబడిన మన కేమి యపాయము తటస్థించునో! మీ జననీజనకు లూర కుందురా! నన్ను మన్నింతురా! నిన్ను విశ్వసింతురా! పోవుద మని చేటికి జెప్పె. చెలీ! ని కెందు కింతభయము, నా తలి దండ్రు లింతమాత్రమునకే నీప్రాణము దీసి నన్ను నిందింతురా! ఈ వృద్ధబ్రాహ్మణులపై ననా సంకోచపడియెదవు! ఇప్పుడు మన కేరివలననైన నపాయము తటస్థించెనేని వీరే మనకు సహాయపడుదురు. సాంబశివులం బోలియున్నవారు భయపడకుము. మాపితరులను సమ్మతిపఱచుటకు నేనున్న దాననుగదా వలదు, భయపడవలదు. పలుమాఱు వీరు మన పేరుల నుచ్చరించుచున్నారు వినియెదము నిలువుమని చెప్పి రాజమార్గమువదలి నదీతీరమున నున్న సహకారవృక్షము క్రింద నిలువంబడిరి. నా బ్రాహ్మణు లీవిధముగా మాటలాడు చుండిరి:—

౧-బ్రా:—అయితే సూర్యనారాయణశాస్త్రిగారూ! మీరు కాశీపురినుండి యిచ్చటికి వచ్చి మూడురోజులయి వుండునా!

౨-బ్రా:—లేదండి నిన్న సూర్యోదయ మగుసరికి యిచ్చటికి వచ్చి స్నానాది నిత్యకృత్యము లొనరించుకొని పూరిలోని కిం బోయితిని గాని, మీపూరును మీరు వచ్చినకార్యమును తెలియచేయలేదే. ఒకటి రెండుసార్లడిగినను నా

వృత్తాంతమునే విచారించుచూ మఱిపించుచున్నారే గాని కారణమేమి?

౧-బ్రా:—అదేమి యప్పుడే జెప్పితినే, మరల నేమి జెప్పవలయు?

౨-బ్రా:—యేమి చెప్పితిరి, మీపేరు సుబ్రహ్మణ్యశర్మయని జెప్పితిరి గాని మీవృత్తాంతము వివరింపలేదే?

సుబ్ర:—నాకథ మీవంటి నిష్కల్మషచిత్తులు విన యోగ్యమైనది కాదు, నావంటి నిర్భాగ్యుఁడే వినవలయు. కానిందు తాము దెచ్చిన మీరాజకుమారునిపట మీభువనమోహినికిం గనుపఱచితిరా? ఆకాంత సమ్మతించినదా?

సూర్య:—మీ కెపుడు దయగలుగునో అప్పుడే మీవృత్తాంతము జెప్పెదురు లెండు, నేను వచ్చినపని వాకిటిలో ముగిసిన దన్నట్టున్నది. ఈ కన్యకమాత్రమే యీరాజుగారికి సంతానమఁట, పుత్రులు లేరఁట, రాజు చిన్న భార్య మేనల్లుడు లోమకేశు డనువానికి భువనమోహిని నిచ్చి వివాహమొనర్చి యీరాజ్యం బాతనికే యొసంగుదురఁట, ఆ కన్యకకుమాత్రము యిష్టము లేదఁట.

సుబ్ర:—ఆ కన్యక యిష్టపడకుండుట కేమికారణమో మీకు దెలుసునా?

సూర్య:—(చిన్నగా) ఆలోమకేశునకు తల్లిదండ్రులు లేరట, గర్భదరిద్రుడఁట, ఈ రాజుగారు కలభాషిణీదేవియొక్క సౌందర్యమునకు మెచ్చి రాజవంశమునకు చేరిన బీదవారి యింటిలో రెండవభార్యగా వివాహము చేసికొని వచ్చిరట, యీ లోమకేశుఁ డిరువది సంవత్సరములు వయస్సు గలవాఁడైనను మూర్ఖుఁడట, దరిద్రమునకుఁ దోడుగా

విద్యాదరిద్ర మావరించి యున్నదఁట, బహ్వాశి యఁట, నాగరికత లేదఁట యందుచే నుండవలయును.

సుబ:—అట్లయిన యీరాజుగారి రెండవభార్య పుట్టినిల్లెచ్చటయో?

సూర్య:—ఆంధ్ర దేశమున విజయవాడ యనుపురముగలదట.

సుబ:—ఓహో మహేంద్రవరమున కించుమించుగా సమీపమేనే.

సూర్య:—మీది మహేంద్రవరమా?

సుబ:—యిప్పుడు కాదండి నాకథ వివరింతును లెండు, తొందరపడకుడు. ఆమె మఱి యెవ్వరిని వరించినది?

సూర్య:—దేశ దేశములనుండి రాజపుత్త్రిల చిత్రపటములను దెప్పించి రాజునకు దెలియక కనఁబఱచినను యేదియో యొకలోపము గల్పించి యెవ్వరిని యిష్టపడకున్నదట.

సుబ:—వివాహామే యగత్యము లేదని యామె కిష్టముందునా?

సూర్య:—అటుకాదు, హరిద్వార రాజకొమారుని చిత్రపటము తెచ్చియున్న యొక బ్రాహ్మణుఁడు ప్రస్తావవశమున యొకానొక రాజకుమారుని విషయమై కొంతవఱకు జెప్పెనట, నాటనుండియు యారాజకుమారునే పెండ్లియాడవలెనని యున్నదనియు, లోమకేశుని వరియింపుమని యెంత బోధించినను సమ్మతించకున్నదనియు, నీపురిలో నేఁడు వింటిని. ఇఁక మీావృత్తాంతముఁ దెలియఁజేయక తీరదు.

సుబ:—బ్రాహ్మణోత్తమా! నేను ప్రయాగనుండి వచ్చుచున్నాను, నావృత్తాంత మెఱింగించుటకు నోరాడక

యున్నది. నాకడుపు దరికొని మండుచున్నది, నాదుఃఖం బింతింతయని వచించుటకు వీలుపడనిది, ఎట్టి ఱాతిగుండెఁ గలవాఁడైనను నాకథ వినినేని కంట దడిపెట్టక మానడు. ఊరువిడిచి కొంత మఱచియున్నాను. మరల నెందులకు జ్ఞాపకమగునట్లు లొనర్చెదరు. మీబోఁటి నిర్మలచిత్తుల మనంబున కాయాసము గల్పింపఁజాల, నాకథ యుండనీ. ఆకాంత వరియించిన రాజసుతుఁ డెవరో మీరు విచారించి యున్నారా?

సూర్య:—విచారించ కేమి. ఆతని దేశ మేదియో తలిదండ్రు లెవ్వరో తెలియదు గాని యతని పేరుమాత్రము కళాభానుఁ డట.

సుబ్ర:—ఆహా! ఆ విద్యానిధిని, ఆ నవమన్మథుని, ఆ ధనుర్ధరుని, ఆ ప్రతాపభానుని, ఆ కళాభానుని యీ రాజపుత్రికయే గాదు ప్రపంచమునఁ గల కన్యక లందఱు వరియించెదరుగాని యాకన్యకలకు లభ్యముగావలయుఁ గదా.

సూర్య:—ఏమండీ, ఆతని విషయము మీరును నద్భుతముగా వచించెదరే? మీకెట్లు దెలియును.

సుబ్ర:—మా రాజకుమారుని సంగతి నాకు దెలియదేమండీ. ఆతని ప్రతాపాదు లెఱుంగుదు గాని యాకుమారుని జూచు భాగ్యము నాకు లేకున్నది?

సూర్య:—మీ రాజకుమారుఁడని చెప్పితిరి. ఆ కుమారుని జూడలేదని చెప్పితిరి, మీసంగతి నాకు బోధపడక మిడుకుచున్నాను. స్వామీ! మన మిరువురము దేశాంతరగతులము, మన కెవ్వ రిచ్చట స్నేహితులుగాని బంధువులు గాని లేరు. స్నేహితము సాప్తపదాధీనము. చాలాప్రొద్దు

నుండియు మాటలాడుచున్న వారము. మన మిపుడు స్నేహితులమైతిమి. మీవృత్తాంత మెంతటి దుఃఖకరమైనదైనను నాకెఱింగించి మీదుఃఖమున నాకొకభాగం బియ్యుడు, చెప్పక తప్పదు.

సుబ్ర:—శాస్త్రిగారూ! నన్ను నిర్బంధపఱచుచున్నారు. తనకుఁ గల సంతాప మితరులతోఁ జెప్పికొన్నఁ గొంత యూరట గలుగునని లోకోక్తి గలదు. నాకథ వివరించెదను వినుఁడు. ఆంధ్రదేశమున గోదావరీనదీతీరమున మహేంద్రవరమను నగరము గలదు. ఆ పట్టణమున నరేంద్రచంద్రుఁడను రాజు గలఁడు. ఆ రాజేంద్రుఁడు దన ప్రతాపముచే దక్షిణాపథ మంతయు జయించి ధర్మముఁ దప్పక శ్రీరామచంద్రునిరీతి ప్రజలను దన కన్న బిడ్డలవలెఁ జూచుచు పరిపాలించుచుండె. అతనిచెంత నేను రాజపురోహితుఁడను, కవీశ్వరుఁడను, ఆస్థానపండితుఁడను, పౌరాణికుఁడను, స్నేహితుఁడను యిన్ని పదవులతో నెక్కువగౌరవము నార్జించి యుంటిని. నాకు నెలకొక్క నూరు దీనారములు గౌరవవేతన మొసంగుచుండె. ఆ రాజేంద్రునకు సంతానములేక యజ్ఞయాగాదు లొనర్చె, దానము లొనర్చె, దేవాలయములు కట్టించి బింబప్రతిష్ఠలు జేయించె, నాగప్రతిష్ఠలు నశ్వత్థవివాహము లొనర్చె, దీనానాథజనుల నాదరించె, యాత్ర లొనరించె నెన్నిప్రయత్నము లొనర్చినను సంతానము కలుగదయ్యె. రాజ్యముపై విసుకు జనియించె, ఏభోగము లనుభవించుటకు విరక్తి గలిగె, చింత మితిమీఱె, పరమసాధ్వీతిలకం బగు ప్రియంవదాదేవి యను తనపట్టఁపుదేవేరియుం

దానును దపం బొనర్చి సంతానంబు పడయవలయు నని నిశ్చయించి రాజ్యమును మంత్రి యాధీన మొనర్చి తపో వనంబునకై ప్రయాణమయ్యె. నేనును నా భార్యాసహితముగా వారివెంట వెడలుట కుద్యుక్తుఁడనై రాజుతో విన్నవించుకొంటిని యంగీకరింపఁడయ్యె, బహువిధముల వేఁడికొంటిని వలదనియు నన్నుఁ జక్కఁగా గాపాడవలె ననియు నా కేవిధమయిన కొఱంతయు గలుగగూడదనియు మంత్రికిఁ గట్టుదిట్టము లొనర్చి భార్యాసమేతుఁడై యా రాజేంద్రుఁడు నైమిశారణ్యమునకుం జనియె రాజ్య మంతయు మంత్రికి స్వాధీనమయ్యెఁ, గొంతకాలము జరిగె మంత్రికిఁ దుర్బుద్ధిపొడమె, మొదలనే మహాక్రూరుఁడు రాజ్యమంతయుఁ గరగతంబగుటచే మఱింత దుర్మార్గము ప్రబలె, నతనికి కవిత్వపురాణవేదశాస్త్రములయం దేమి యుఁ బరిచయము లేదు. శుద్ధమూర్ఖుఁడు, ద్రవ్యార్జనము నందే కడుప్రీతి, బహులుబ్ధుఁడు, నానాఁటి కాతని క్రూర కృత్యము మభివృద్ధిఁ జెందుచుండె. నా పాండిత్య మాతని చెంత నిష్ప్రయోజనమయ్యె, నాకుఁ బ్రతినెల కొసంగుచుండిన నూఱుదీనారములపై నాతని దృష్టిపాఱె, నెన్నిదినముల నుండి కడుపులోఁ గుములుచుండెనో యొకానొకదినమున దగ్గఱ నుండి నన్నుఁ బిలిపించి శర్మగారూ! మీరు నిర్నిమిత్తముగా నెలకు నూఱుదీనారములు రాచనగరునుండి తీసికొనుచున్నారు, విశ్వాసముచే రాజుగా రొసంగినను మనము వృథాగా నుపయోగించుకొనరాదు, రాజద్రవ్యాపహారకు లగుదుము. మీ కొక యధికార మొసంగెదఁ బన్నులు వసూలు చేసెదరా యనియె. మంత్రివరా! నేను

వైదికుఁడను, మిక్కిలి ఛాందసుఁడను, లౌక్యవృత్తులు నా కేమియుఁ దెలియదు, నావలన కాదని మీకుఁ దెలిసి యుండియు నన్నడుగుచున్నారే యంటిని. అట్లయిన వృథాగా నెలయొకటికి నూరుదీనారము లిప్పటినుండి యొసంగుట నిల్పుదలఁజేసి యున్నాఁడ, పండిత గౌర వార్థము నెలకొక పదిదీనారము లిచ్చెద మీరు భార్యా భర్త లిరువురే గాదా జీవనమునకుఁ జాలుననియె. బహు కాలము నుండియు నత్యంతగౌరవముతో నూరుదీనార ములు తీసికొని మహాపదవియందుండిన నేను బదిదీనార ముల కేమని సమ్మతింతును. మంత్రీ! నాపైన నీ కెందు కింతటి నిర్దయ, మారాజేంద్రుఁడు నన్నత్యంతప్రేమచే రక్షించుచుండవలెనని నీ కప్పగించి యున్నవాఁడే వలదు, వలదు. నాగౌరవవేతనముపై నీదృష్టిఁ బారనియ్యకుమని బహు వేఁడికొంటి. నెంత వేఁడుకొన్నను దుష్టకీటకవిషము వోలె నాతని మనస్సు మఱింత యుద్రేకమై యింక మాట్లా డిన నేనిచ్చెదనన్న పదిదీనారములు సహా యొసఁగను, మీ రాజున కేమి యడవిలోఁ దపము సేయుచున్నవానికి రాష్ట్రముయొక్క లాభనష్టము లేమెఱుఁగును, వార్ధ త్తము లందఱుఁ జేయవచ్చును నెఱవేర్చుట గదా దుర్ల భము, ఇచ్చట రాజభాండాగారమున ద్రవ్యము క్షీణించు చున్నది వృథా ద్రవ్యధ్వంస మొనరించి రాజ్యమును భ్రష్టు బట్టించవలెననియా నీసంకల్పము, చాలు చాలు. నీపాండిత్యము మా కనావశ్యకము, ఊరక పదిదీనార ములు దీసికొని పడియుండుమనియె. అయ్యో! బ్రాహ్మణుం డను, పౌరోహితుండను, బహుకాలమునుండి మిమ్మాశ్ర

యించుకొనినవాఁడను, దయయుంచుమని వేఁడికొంటిని. నీవు బ్రాహ్మణుఁడవా? చండాలుఁడవు, ఋణపాతకుఁడవు రాజద్రవ్యాపహారివి, నీవు పౌరోహితుఁడ వేమధికారమైన ర్తవు? పౌరోహితునికిఁ దగినదక్షిణ పదిదీనారములే రయుసంగద. నిష్టమున్నఁ గైకొనుము లేకున్న వదలుమనియె. చండాలుఁడ వన్నందుకు నా కత్యాగ్రహము గలిగె. అమాత్యాధమా! నేను నిక్కముగా నీ వన్నట్టు పౌరోహితుఁడనే, నాయధికారముఁ జెప్పెద వినుము. నీ భార్యయో నీకుమారుండో చచ్చిన నీమెడకు బద్ద వేయించి కుడికి నెడమకును ద్రిప్పించి ప్రేతకార్య పిండ ప్రదాన తిలోదకముల నేలోపము లేకుండా నెఱవేర్చు యధికారము గలదురా? నీచా! పౌరోహితుని కిదియే గొప్పయధికారమని యింకను బరుషోక్తులాడితిని, మంత్రి కాగ్రహము ద్విగుణీకరించె. బ్రాహ్మణాపశదా! ఈ రాత్రియే నీవును నీభార్యయును నీపురి దాఁటి పొండు, రేపుదయమున నీపురిలో నగపడితిరేని మీయిరువురకును శిక్ష విధియించెదనని దండనాధికారిని రప్పించి రేపుదయమున నీబ్రహ్మబంధు డీపురమునం దగపడిన శూలప్రోతముఁ గావింపుమని నాయెదుటనే కఠినమైన యాజ్ఞాపత్రిక నొసంగె నారాత్రియే నామందిరమునందుఁ గల సమస్తవస్తుసామగ్రి నంతయుం గైకొని కట్టుబట్టలతో విడిచి చనియె. నే నతిసంతాపముచే భార్యం దోడ్కొని యాప్రత్యూషముననే మహేంద్రవరము నిర్గమించి యాఁకలి ప్రొద్దున కన్నమును నీరమును దొరకక పరితపించుచు కాయగూరలం దినుచు బంధువులు స్నేహితులు నన్నెఱిం

గినవారు నుండుపురములందు జొరక బహుదూర మేతెంచి కానరాని దేశమునను భిక్షాన్నముం దెచ్చి యుదరపోషణ నొనర్చికొనుచుఁ బ్రయాగపట్టణముం జేరి యచ్చటనే ధర్మశాలయం దావాసము గల్పించుకొనియుంటిని. నా భార్య నవమాసముల గర్భవతి యయ్యును నావెంట బహు దుర్గమమార్గమునఁ గష్టముల కోర్చి సహధర్మచారిణీ ధర్మమును సార్థకపఱచె. మఱికొన్ని దినముల కొక యాడశిశువుం బ్రసవించె. నాపురమందు గల సాధ్వీమతల్లులు కటాక్షించి కాను పొనరించి బాలెంతరాలిని శిశువు నతిశ్రద్ధచే గాపాడిరి. యాత్రికులకు సంకల్పములు చెప్పుచు శ్రీమంతులకు ఫలమంత్రాక్షత లొసఁగుచు సాంవత్సరికములందు నిమంత్రణ కొప్పికొనుచు యజ్ఞంబుల ఋత్విక్కరణంబులందుచు నుదరపోషణఁ జరిపికొనుచు నాభార్యను నాకూఁతురను రక్షించుకొనుచుంటి. నాకొమార్తయగు సుశీల ప్రజ్ఞాశాలియై నావలన సమస్తవిద్యల నభ్యసించె. మఱికొన్ని దినములకు రజస్వలయయ్యె. పరిణయవయస్కురాలగు నాపుత్త్రికకుఁ దగినవరు నన్వేషింపవలయు, పరిణయమొనర్చుటకుఁ దగిన వస్తుసామగ్రి సమకూర్పవలయునని యోచించు తొలుత వరు నన్వేషించి యావల సామగ్రి సమకూర్పవలయునని నిశ్చయించి యుంటిని. మాఘమాసమేతెంచె. మాఘస్నానార్థమై దేశదేశములనుండి యనేకులు జనుదెంచి మేమున్న ధర్మశాలయందే భోజనపానములఁ దీర్చికొనుచుఁ ద్రివేణీసంగమమున స్నానమాచరించుచు నుండిరి. వారిలోఁ గాశీపురమునుండి స్నానార్థమై వచ్చియున్న విద్యార్థి యొక బ్రాహ్మణబ్రహ్మచారి రూప

యౌవన లక్షణ ప్రజ్ఞా బ్రహ్మవర్చస్వియై బ్రహ్మచర్యం బాచరించుచుండఁ గాంచితి. నాసుత నతని కియ్యవలయు నని నిశ్చయించి యతనివృత్తాంతము విచారించితిని. తనది కాశీపురమనియుఁ దలిదండ్రులు గలరనియు భారద్వాజస గోత్రమనియు ఋక్శాఖయనియుఁ గాశీపురముననే యానందవనమునం దాశ్రమంబు గల్పించుకొనియున్న భట్టపాదాచార్యులవలనఁ దర్కశాస్త్ర మభ్యసించుచున్నా ననియుఁ దనపేరు శ్రీపాదశర్మ యనియుఁ దన కిరువది యైదు వర్షములు వయస్సనియుఁ జెప్పె. మేము ఋక్శాఖ యందు శ్రీవత్ససగోత్రజుల మగుటచే నితనికే యొసంగ వలయునని నిశ్చయించి ఘటితార్థమునకై చూచుట కే దనుకొని, నాయనా! శ్రీపాదా! నాకొమార్త సుశీలను చూచియున్నావు గదా? ఆబిడ నీసహధర్మచారిణి యగు టకు నీకు సమ్మతమేనా? అని యడిగితినని చెప్పుచుండఁగా; సూర్యనారాయణశాస్త్రి ముఖమునం దొకవిధమయిన వికాసము గలిగి యేదియో మాట్లాడ నుంకించి మరల నుపశమించుకొనియె. అంత సుబ్రహ్మణ్యశర్మ యిట్లనియె. మరల నాబ్రహ్మచారి నాప్రశ్నకు జవాబుగా మాతల్లి దండ్రుల నడిగి వారు సమ్మతించి గైకొందుమన్న మీరు సమ్మతించి యొసంగెదమన్న మీ యుభయుల యాజ్ఞకు బద్ధుఁడనే కదా యనియె. నాభార్యయును సమ్మతించె. నాకూఁతు రొప్పికొనియె. యతఁడొప్పికొన్నట్టు ముఖలక్ష ణమువలనఁ దెలియుచుండె. అంతలో సూర్యనారాయణ శాస్త్రి తనయుల్లాస మణఁచుకొనలేక శర్మగారూ! యా బ్రహ్మచారి శ్రీపాదుఁడు నాకొమారుఁడే నండీ, మీకొక

సత్పురుషుల బాంధవ్యము దొరకుట దుర్లభము గదా! నేనును సమ్మతించియున్నవాఁడ, నుభయుల సెలవులు నేనే భరియించెద. నీ శ్రావణమాసముననే లగ్నము లున్నవి. కర్కి శ్రావణము గాదు, ముఖ్యముగా గురువు కర్కాటకమం దున్నవాఁడు, నాకును మా శ్రీపాదునకును గురుబలము చక్కఁగా నున్నది, "శుభస్య శీఘ్రమ్" అని పెద్దలు వచింతురు. మీ రేవిధమయిన కొఱఁత నుంచు కొనక మాగృహమునందే వివాహ మొనరింపుఁ డని నంతనే సుబ్రహ్మణ్యశర్మ మహాదుఃఖాక్రాంతుడై హా సుశీలా! ఈనిర్భాగ్యుని గర్భమున నెందుకు జనియించితివి తల్లీ యని యేడ్చె. అదిగాంచి శర్మగారూ! దుఃఖింపకుడు గడచిన వైభవమును దలఁచుట గతజలసేతుబంధనము గాదే, కలిమిలేము లెవ్వరికిని శాశ్వతము గాదు. ఎవ్వ రెవ్వరి కేయేకాలమున కేయేరీతిఁ జరుగునది మన మెఱుఁ గుదుమే. పూర్వజన్మకర్మ బోఁద్రోయుటకు మనతర మగునే. పూర్వకృత సుకృత దుష్కృతముల ననుసరించి యుండు జననకాలగ్రహ దశాంతర్దశలరీతిఁ జరుగునని శాస్త్రోక్తులు మీ కెఱింగింప నేసమర్థుఁడనే. మీ రెఱుఁగని శాస్త్రము లున్నవే? దుఃఖింపకుఁడనిన, స్వామీ! నే నా కలిమిలేములకుఁగా దుఃఖించలేదు. తండ్రీ! మీబోఁటి యాగర్భ శ్రీమంతుల బాంధవ్యము నావంటి గర్భనిర్భా గ్యున కలవడునే? ఏమి చెప్పుదు. నాకడుపు సంతాపద వానలముచే దహించుచున్నది. మీపుత్రునితో నిట్లు మాటలాడి మనమున నిశ్చయించుకొని సామగ్రుల సమ కూర్చుచుంటి. మాఘమాస మతిక్రమించె. శ్రీపాదుం

డుండే యుండె. మరల రెండుమాసములు జరగె. ఒకదిన మందు వేకువనలేచి త్రివేణీ సంగమమున స్నానమాచరించి నాపుత్రికయు నేనును నాభార్యయు ధర్మశాల కరుదెంచుచుంటిమి. ప్రళయమారుతమువలె నొక సుడిగాలి వాడెను. అందుఁ గన్నులు మోడ్చితిమి తెరచుసరికి నాకుమార్త లేదయ్యె. నాకొక తెయే పుత్రిక నేనెందుఁ జొత్తు నాసంతాపమునకు మేరయేలేదు. నేనెందెందో వెదకితి వెదకించితి నగుపడలేదు. నాపుత్రిక నొసఁగెదనని మీకుమారునితో నేఁ జెప్పినప్పటినుండియు వారిరువురు నూతనోద్వాహ వధూవరులరీతి నపుడే యన్యోన్యమైత్రి మెలఁగుచు నొంటిపాటగునప్పు డొకరితో నొకరు లజ్జాభరములచే మాటలాడుచు భక్ష్యపదార్థము లేదేని యొసఁగిన నొకరికొకటి యొకరు పెద్దవారలకుఁ దెలియకుండునట్లు డాఁచి యొసంగికొనుచు నరక్షణ మెవ్వరో యొకరగపడకున్నఁ దహతహపడుచు నెద్దియో యొకపని గవారివలె నేదియో వెదకువారివలె నటునిటు తిరుగుచు నెంతయో యుల్లాసములచే మామనస్సంతోషంబగునటుల మెలఁగుచుండిరి. నాకూఁతు రదృశ్యయైనంతనే మీసుతునకదే చిత్తభ్రాంతి గలిగి వెదకుచు నేనెంత నిర్బంధముతో నాతని కనిపెట్టుకొని యున్నను మఱుదినము వేకువనే లేచి యెందరిగెనో తెలియదయ్యె. నాభార్యమూరార్చి నాఁట నుండియు వారిరువురిని వెదకుచు నరణ్యములలో గుహలలో జనావాసములలో జూచుచు నీపట్టణంబున కేతెంచి యున్నవాఁడ. నిందు నగపడదయ్యె. అనునంతనె హా! శ్రీపాదా! యెటకేగితివిరా! నాయనా! భట్టపాదాచార్యుల

వద్ద విద్యాభ్యాసము సేయుచున్న వాఁడవనియే యున్న వాఁడనే! అని యఱచి సూర్యనారాయణశాస్త్రి మూర్ఛిల్లె. అదిగాంచి శాస్త్రిగారూ! మీరెందుకు దుఃఖింపవలయును. మన ముభయుల మొకే గురునియొద్ద జదువుకొన్న వారి వలె నున్న వారము. నేఁడు బహుళపంచమి గదా! చంద్రుఁడుదయించుచున్న వాఁడు. దైవ మొనర్చినట్లుగును. మన మిరువురము బిడ్డలను వెదకుచుఁ బోవుదము. ఈరాత్రి పురియందుఁ శయనించి రేపుదయమున నెందైనా వెడలుద మని యనుకొనుచు నిట్టూర్పు విడుచుచు వారాపురిలోనికిం జనిరి. సహకారతరుచాటున వినుచున్న మనతరుణు లిరువురు వారిమాటలు విని వారికష్టములకుఁ దాము శోకింపుచు భ్రమణికా! యాంబ్రాహ్మణున కేకపుత్రికయట, యదృశ్యయగుట కేమికారణమై యుండునని భువనమోహిని యనియె. వారిరువురి కీరీతి వాక్యార్థము జరిగె.

భ్రమ:—దేవీ! నీవును మీతండ్రికి కేకపుత్రికయే గదా! ఆ చిన్నదాని నేదైన భూతమో పిశాచమో యెత్తికొని పోయి యుండవచ్చును.

భువ:—భూతప్రేతములైన నొకవ్యక్తిపై నావహిల్లి నావ్యక్తి బంధువు లొసఁగు బలులవలనను శాంతులవలనను తృప్తిఁ జెంది పోవును. అట్లు లేకున్న స్తంభనమోహనాది మంత్రములచే బలాయనమగును. పూర్తిగా మనుష్యు నెత్తికొని పోయి యేమొనర్చును? అయ్యో! ఆబ్రహ్మచారి యెట కేగెనో; ఆచిన్నదానిపై నెంత మమత గలిగియుండెనో; పాపము ప్రేమ యనున దెంతటికష్టమునకైనను బాల్పఱచును గదా! ఇచ్చెదనను మాటమాత్రమె; ఇంకను వివా

హామే కాలేదే; ఎచ్చటెచ్చట వెదకుచున్నాడో పాపము.
భ్రమ:— దేవీ! నీవుమాత్రము వివాహితవై యున్నదానవా; ఆ కళాభానుమహారాజుగారిని జూచియైన నుండలేదే! ఆ పురుషోత్తమునియందె నీభక్తివిశ్వాసప్రేమము లగపఱచు చుండలేదా! అన్నిటికిని మనస్సే కారణము. ఒకక్షణమున నతిదూరమునందున్న ప్రేమపాత్రుల నరసి చనుదెంచునది మనస్సే. పాతాళాది చతుర్దశభువనముల నరక్షణములోఁ దిరిగి వచ్చునది మనస్సే. అనేకకోటి బ్రహ్మాండ బ్రహ్మ ప్రళయావ్యక్తాదుల నన్నిఁటిని దాఁటి పరమాత్మ తత్త్వముగాంచి యందుఁ జొర నభ్యాసము లేమి తదీయ తేజంబునుగాంచ నశక్యమై యొక్కక్షణముననే యందుండి మఱలఁ జనుదెంచు బ ధమోక్షము లొనరించునదియు మనస్సే. అందు మీరాబోఁటి సాధ్వీమతల్లుల మన మతి సాధుత్వమున నచంచలమై సంకల్పించిన మాత్రముననే యదియే పరమగతిగా నెన్నికొని తదేకధ్యానపారీణతఁ బొందుచుండుటఁ జూడవలయునా! వివాహామే కావలయునా; సంకల్పము మాత్రముచాలదా. ఆత్మతత్త్వమందఱియందు నొక్కటియే కదా! మనోగోళకేంద్ర సృష్టి పరికరభూతతత్త్వ మందఱియందు నొక్కటియే కదా! ధారణాశక్తిచే నభ్యాసవశముచే మహోన్నతిఁగాంచు మీబోఁటివార లిట్లన్న నేఁజెప్పఁగలదాననా! ఆబ్రాహ్మణులు తమకష్టసుఖములను జెప్పికొనుచునే కాలంబంతయు గడపిరి. మన కళాభానుని కథ కొంతవఱకు మాట్లాడి సాంగము గానియ్యరైరి. వార లీరాత్రి మనయూరనే యేదో యొకధర్మశాలయందు శయనించియుందురు. రేపటి

యుదయమున వెదకి మన రాకుమారునికథను దెలిసికొని చనుదెంచెద నీకిఁ దడయక మందిరంబున కరిగెదమని యిరువురు మాట్లాడుకొనుచుఁ బురిలోనికి వచ్చుచుండిరి. అప్పటికిఁ బదునొకండుగడియలరాత్రి కావచ్చెను. జ్యోతిర్గణములును, చంద్రభగవంతుఁడును దప్ప మఱియెవ్వరును లేరు. పక్షులు రెపరెపమని యెగసి యొకచెట్టునుండి మఱియొకచెట్టున వ్రాలుచుండె. కొమ్మకొమ్మల కెగురుచు దుముకుచు శాఖామృగము లేదైన ఫలములు భక్షించి పాఱవేయుచున్న నారాజపథపార్శ్వమునందున్న సాలిచెట్ల క్రింద పటపట శబ్దమగుచుండె. నాతరుణులు సహజభీరులుగాన నులికిపడుచు నటునిటుఁజూచుచుఁ గాలము మీఱి యున్నందున పెద్దలయాక్షేపము గల్గునని చింతిలుచు నడుగులు తడఁబడ నడచుచుండిరి. ప్రక్కననుండు చెట్లచాటునుండి యొకవ్యక్తి భయంకరఖడ్గమును ధరించి తటాలున యాకాంతల కెదురై వచ్చి నిలిచె. అతని ముఖమునకు నల్లఁగా మసిపూయఁబడియుండె. తెల్లనికృత్రిమగడ్డము కట్టఁబడియుండె. నల్లనిచీటిగుడ్డ తలకట్టు కట్టఁబడియుండె. అతఁడు నలువదియైదేండ్ల వయస్సుగలవాఁడై భయంకరాకారముతో నొకశిథిలవస్త్రము ధరించియుండె. అతనివెంట మఱియిద్దఱు ఖడ్గములు ధరించి తమరూపము బయలుపడకుండునట్లు ముఖమునఁ దెల్లనిచుక్కలు పెట్టికొని కంబడిచుట్టలు తలపై వేసికొని చల్లడములఁ దొడిగి క్రూరాకారముతోఁ జనుదెంచిరి. ఆ ముగ్గురు భువనమోహిని నదిమిపట్టుకొని నోట బట్టలు దుఱికి కాలు సేతులు బిగియఁగట్టి యెత్తికొని దేవాలయమార్గముగాఁ

చెట్లచాటునకుఁబోయిరి. ఆవిపత్తును గని భ్రమణిక కేకవై
చెకవేసి స్మృతిదప్పి నేలఁబడియె. మణిస్యందనపురమునకు
వెలుపల గుడిసెలు వేసికొని కాపురమున్న బీదజను లా
కేక విని పఱుగుపఱుగున జనుదెంచి యచ్చట బడియున్న
స్త్రీని గని యిది రాజాంతఃపురపరిచారికయగు భ్రమణిక
యని తెలిసికొని కూఁతలుపెట్టిరి. ఊరంతయుఁ గూఁతలె
గసె. వీధివీధినుండియు జనులు గుంపులు గుంపులై దేవా
లయమార్గముగాఁ బరుగిడుచుండిరి. పురరక్షకభటులు
తమ ధనుర్బాణాదిసాధనములతో బరుగెత్తివచ్చి యచ్చట
బడియున్న కాంతచుట్టును మూఁగియున్న జనులను వెను
కకుఁ ద్రోయుచుండిరి. ఈవార్త రాజనగరునకుం దెలిసె
యంతఃపురమునందుగన్న భువనమోహిని లేకయుండె.
ప్రతిశుక్రవారమును దేవీపూజ లొనర్చి వచ్చి యంతఃపుర
మున నుండెడి తీరున నున్నారనియే వారనుకొనియుండిరి.
రాజునకును రాజదేవేరులకును గలవరపాటు జనించె. రాజ
ధర్మము నేమియుఁ బాటింపక సామాన్యనిరీతి నడచుచుఁ
బాదచారియై యారాజేంద్రుఁడు దేవాలయమార్గముగాఁ
బరుగిడుచుండె. రాజదేవేరు లిర్వురును రాణివాస నిర్బం
ధము లేమియుఁ బాటింపక నలసటచేఁ దొట్రిలుచు నడు
గులు తడఁబడ నేడ్చుచుఁ బోవుచుండిరి. తన కాభువన
మోహిని నొసంగెద రనుమాట బుట్టినప్పటినుండియుఁ
దనపై నాకన్యక కిష్టము లేదని తెలిసియు, నొకటి రెండు
పర్యాయము లాకాంతచేఁ జీవాట్ల నొందియు, నాకన్యక
మీఁదనే ప్రేమగలిగియున్న లోమకేశుఁ డొకఖడ్గముఁ
గేలనంది తొట్రిలుచు రాజమార్గమున సత్వాతురతతోఁ

ఖరు గెత్తుచుండె. నాయంతఃపుర పరిచారిక పడియున్న చోటునకుఁ బోయి యారాజేంద్రుఁ "డమ్మా! భువన మోహినీ!" యని యఱచె. రాజుయొక్క ధ్వనివిని రాజ భటులు నచ్చట మూఁగియున్న ప్రజలును మార్గము విడిచి భయభ్రాంతులై నలుప్రక్కల నొదిగి నిలువంబడిరి. పడి యున్న భ్రమణికను దట్టి మెల్లన లేవనెత్తి యెదపై నొర గించుకొని, "భ్రమణికా! భ్రమణికా!" యని యొకవిధ మగు గద్గదస్వరముచేఁ బిలిచె. పరిచారికకు స్మృతి గలిగి, "భువనమోహినీ! అయ్యో! భువనమోహినీ!" యని యఱచి మరల నేలఁబడియె. రాజదేవేరు లాసమయమున డగ్గరిల్లి భువనమోహిని కేదియో యపాయము తటస్థించిన దని యందఱు నొక్కపెట్టున హాహాయని యేడ్చిరి. రాజ దుఃఖమునకు మేరయే లేదు. ఆ గోడుగాంచిన నమనస్కు యోగులైనను స్థిరచిత్తము గల్గియుండఁజాలరు, పామరుల సంగతి చెప్పనేల? చేటికకు మరల స్మృతిగలిగె. రాజు తన దుఃఖము నడఁచుకొని చేటికను సేదదేర్చి, "దాసీ! భువన మోహిని యేమయ్యె" నని యడిగె. దాసికిఁ బూర్తిగా స్మృతి గలిగె. రాజు తన్నాఁ ఱగించుకొని కూర్చుండి యున్నాఁడని కలవరపాటుచే లేచి చేతులఁ జోడించుకొని, "దేవా! నేను శుక్రవారమయినందున దేవీపూజ లొనర్చి వచ్చుచుండఁగా నీ నదీతీరమునం దిద్దఱు బ్రాహ్మణులు మన భువనమోహినీ వివాహ విషయమును, లోమకేశుల వారి వృత్తాంతమును దమపేరు నుగ్గడించుచు వారి దేశ వృత్తాంతములు వారికష్టసుఖములు మాట్లాడుకొనుచుండిరి. మనదేశ వృత్తాంతము లింక నేమయిన రహస్యములు

మాట్లాడుదురేమో యని యట్లే నిలువఁబడి వినుచుండఁగా వారంతటితోఁ జాలించి ధర్మసత్రమార్గముగాఁ బురము లోనికిఁ బోయిరి. మే మీమార్గముగా నింటికి వచ్చుచుం టిమి. ఈ చెట్లచాటునుండి ముగ్వురు పురుషు లేతెంచిరని చెప్పి యేడ్చుచు మాదేఁని సిగఁబట్టి నోటగుడ్డలు దూతిమి కాలుసేతులు బిగియఁగట్టి యెత్తుకొని దేవాలయమార్గ ముగా నుత్తరదిశఁబట్టి పరుగెత్తిరి. నేను దుఃఖము బట్ట లేక గట్టిగా నఱచి నేలం గూలితినని చెప్పగా నందఱు ఘోరమని యేడ్చిరి. పురమంతయు ఘూర్ణాయమాన మయ్యె. సైన్యాధిపతి జనుదెంచె. దిక్కు దిక్కులకును నాకాంత తెఱవరయ నియమింపఁబడియె. తదేకమనో భావముచే నున్న లోమకేశుఁ డీవార్తవినినంతనే మన్మ థోన్మాదమునఁ బ్రేమానుబంధమున మైమఱచి యెవ్వరికిం జెప్పక యారాత్రియే వెదకుచు ఖడ్గధారియై యుత్తర దిశగా వెడలిపోయె. మంత్రి నియామకమున సారథి యొక రథమాయత్తపఱచుకొనివచ్చె. ఆ బ్రాహ్మణులే యీ ఘోరకార్య మొనర్చియుందురా యని రాజు దాసినడిగె. అయ్యో! శుద్ధశ్రోత్రియులు. వారికి నీలాటి పుత్త్రపుత్త్రికా వియోగము తటస్థించి యున్నందున వెదకుచు వచ్చినట్లు వారిమాటలవలన స్పష్టమగుచున్నది. వారల ననుకొన్న లేనిపాప మార్జించినట్లగునని దాసి చెప్పె. అంత దేవేరుల తోడను జేటికతోడను రథముపై నారోహించి దుఃఖించు చున్న దేవేరుల నాశ్వసించుచు నారాజేంద్రుఁడు నగరు నకుం జనియె. అట మూఁగియున్న జనులును, పురరక్షక భటులును వారివారి యునికిపట్టుల కరిగిరి.

# 3 ప్రతిజ్ఞా ప్రకరణము

ప్రపంచంబునఁగల పర్వతంబుల కన్నిటికిని మహోన్నతంబైనది హిమవన్నగము, సమస్తౌషధీబృందముల కాలవాలమీ శీతశైలము, నిఖిలమాణిక్యరాశికి జననసీమ యీ హిమధామము, బహుమహర్షి జనావాస మీ చలిమల, ఆకసంబున నుండి భూమికిం దిగుటకు గంగామార్గ మీ మిహికాహార్యము సకలతపస్సిద్ధాశ్రమం బీ తుషారగిరి, గౌరీశంకరుల కునికిపట్టీ ప్రాలేయధరము, చతుర్ముఖ శౌనకముఖ మఖహోమధూమ ప్రకీర్ణ మీ శైలరాజము, వసుధార బదరికారణ్య నైమిశారణ్య బిందుసరోవర లోకపాలసరోవర కేదారేశ్వర బ్రహ్మకపాల అనంగనిర్వాణ గౌరీకల్యాణ రతీమాంగల్యాభివర్ధనాదిపుణ్య క్షేత్రసంయుతం బీ హిమవంతము. ఇట్టి పర్వతోపరిమహారణ్యంబునం దొకానొకదినంబున లేళ్ళను దఱుముచు వరాహంబులఁ ద్రుంచుచు నేనుఁగుల పాదంబులలోఁ ద్రొబ్బుచుఁ బక్షులం దోలుచు నలుదిశలం బాఱి ఱివ్వుఱివ్వున శబ్దభూయిష్ఠంబగు బాణజ్వాలలతో వేఁటసల్పుచుఁ దలచుట్టలం జుట్టి నడుమునకు నారచీరలఁగట్టి కౌపీనంబుఁ బెట్టి కుఱుచని యెదురుదబ్బలంబట్టి సూదులవలె వాఁడిగా జవిరిన యెదురు పుల్లలను యినుపములుకులను నిండించిన యంబులపొదులు వీఁపునఁ దూఁగాడుచుండఁ గూఁకటులు ముడివైచి కోహో కోహో యను ధ్వను లాకసంబున కెగయుచుండ వేయిమంది శబరార్భకులు జనుదెంచుచుండిరి. వారి వెనుక బాలసూర్య ప్రభం బోలు నొకవిధంబగు తేజం బరణ్యంబంతయు గ్రమ్ముకొనుచుండఁ గాంచనబిందుయుతంబగు నెఱ్ఱనిపీతాంబరము

నడుమునకుఁ జుట్టి దివ్యాంబరవినిర్మితంబగు కవచంబు దొడిగి పసుపువన్నెగల పట్టు దుకూలము రెంగులువారఁ గట్టికొని తన దేహచ్ఛాయను బురుడించు పట్టువస్త్రం బంగుగా ధరియించి కేశపాశంబు లూర్ధ్వంబునఁ గూఁకటిగా ముడివైచి పుష్పంబులం జుట్టి సువర్ణరత్నమయంబగు హారంబులును పుష్పమాలికలును యురంబునఁ దాండవిల్లుచుండఁ గరకంకణాంగుళీయ కర్ణకుండలాది భూషణములు ప్రకాశింపఁ బరిపక్వజంబీరఫలసదృశ దేహచ్ఛాయ యొప్పార నొక ధనుస్సు వామహస్తంబునను బాణతూణీరంబులు మూఁపునను శరములు దక్షిణాకరమునందును ధరియించి లోకమోహనానందకరంబగు ప్రసన్నవదనంబునఁ జందనవినిర్మితోర్ధ్వపుండ్రంబును గస్తూరీపరికల్పితబిందువును క్వచిత్కుంకుమపరివేష్టితంబగు భ్రూమధ్యంబును నొప్పార దారుమయపాదరక్షలఁ దొడిగి తొల్లి విశ్వామిత్రమహామునీంద్రు వెంటనంటి యాగసంరక్షణార్థమై చనియెడి శ్రీరామచంద్రునిఁబోలి యిరువదియైదు వత్సరంబులుగల యొక బాలకుండు చనుదెంచుచుండె. అతండు శబరార్భకుల కప్పటప్పటి కాజ్ఞ యొసంగుచు సింహకిశోరంబులఁ జంక నిఱికించుకొని పైఁబడ నుంకించుచున్న యాఁడుసింహమును శరాసనాగ్రంబునఁ బొడుచుచు వేఁటలాడుచు జనుదెంచుచుండ "హా పరమేశ్వరా! కైలాసవాసా! శంకరా! రక్షింపుము, రక్షింపు" మనెడి యార్తారవంబు విని యిట్టి యార్తారవం బొనర్చు వారెవ్వరో యని యాదిక్కునఁ జూచుచుండ మఱల నదే యార్తారవము విననయ్యె. అది గాంచి భిల్లులారా! మీ రిచ్చటనే వేఁట సల్పుచుండుడు, నే నచటికిం జని సమాచారంబు నారసి జనుదెంచెదనని చెప్పి

సింహాకిశోరంబుల నాడుసింహంబుచెంత బాలునైచి కవచో నల జక్కగా బిగించి శరవేగమున నార్తారవము బయలెంచు నుత్తరదిశం బట్టి చని యొక్క యశ్వత్థవృక్షాగ్రంబుపై నార్తా రవంబు సల్పు నొక పెద్ద భూతంబును గనియె. అదియు శల్యా వశిష్టంబై క్రమక్రమంబున హీనమగు స్వరముతో సమస్తాం గంబులు కట్టువడి కడుపుచిచ్చుచే నెఱ్ఱవాఱిన నేత్రము లొప్పార బరితపించుచున్న గని కరుణారసంబు వెల్లిగురియ నాపురుషోత్తముం డిట్లనియె.

ప్ర:—అయ్యా! నీ వెవ్వరవు? ఎందుల కీరీతి బరితపించుచున్న వాడవు?

భూ:—బాలకా! నే నొక దైవోపహతుడను, మంత్రపాశ బద్ధుడను, కడుపుచిచ్చుచే గడ తేఱుచున్నాడను.

ప్ర:—ఎవరిచే మంత్రపాశముల బద్ధుడవైతివో, అయ్యో! శుష్కించి యున్నావే, పాపము! కారణమేమి?

భూ:—నాకథ వివరించుట కిపుడు శక్తిహీనుడనై దాహ ముచే సుడివడియున్నాను. నే నాహారంబు గైకొని రెండు మాసములయ్యె. ఆ పర్ణపుటికలచే నదీపావనోదకంబు దెచ్చి యిచ్చిన గ్రోలి నాకథ వచియింతు నింతమాత్రము పుణ్యము గట్టికొమ్ము.

అనిన నిది యొక మహాసహాయమా యని తామరాకు లను దొప్పగా గూర్చి జలంబుల గొనితెచ్చి యిచ్చిన గడు పుని డఁద్రావి సేదదేర్చికొని, తండ్రీ! నిన్ను గన్న సాక్షా త్పరమేశ్వరుడు నన్ను గృతార్థుం జేయుటకు జనుదెంచె నేమో యని యొకవిధంబైన యుల్లాసము గలుగుచున్నది,

రెండుమాసములనుండి యింతమాత్రము నన్నుఁ బలుకరించిన వారు లేరు, నీవు బాలుఁడవయ్యు నా యాకృతికి దిగులొందక నన్ను నీదదేర్ప నుద్యమించి యున్నవాఁడవే! నీ ధైర్యసాహసంబు లెంతని కొండాడుదును, నాకథ సాంగముగా వివరించెద. నేను భూత ప్రేత పిశాచాది సకలవిధభూతగణములకు నాథుండ, నన్ను బేతాళుఁ డందురు. ఇచ్చటికిఁ దూర్పుదిశ నిదే హిమాలయారణ్యమున బ్రహ్మపుత్రానదీతీరమునం దొక భైరవపూజాపరుండగు భేండాభైరవుం డను కాపాలికరాక్షసుం డాశ్రమంబుఁ గల్పించుకొని యున్నవాఁడు. అతఁడు మహాక్రూరుఁడు. అతనిచెంత వేయిమంది చార్వాకరాక్షసులును వేయిమంది భైరవానుచరులును, వేయిమంది యాశ్రమశిష్యులును గలరు. ఆ రాక్షసభటులు ప్రజల కొనరించు బాధ లింతింత యని చెప్పుటకు వలనుపడదు. ఆ భైరవుఁడు మహామంత్రవేత్త. పరుకాంతదీక్షితుఁడు. వామాచారపరుఁడు. ప్రతిమంత్రమున శీఘ్రఫలంబుఁ బొందగల వాక్సిద్ధిపరుఁడు. ధనుర్వేదసాధనోపకరణంబగు నధర్వణ వేదం బాతనికిఁ గరతలామలకము. ప్రయోగోపసంహారములందు నేర్పరి. ఆ దురాత్ముఁడు ప్రతిదినమును భైరవవిగ్రహమున కొక నరబలి నొసంగుచుండును. ప్రతి సోమవారంబునం దొక శృంగారవంతురాలును, యౌవనాంగియునగు కన్యకను బలి యిచ్చుచుండు. అనవరతం బేదియో క్షుద్రమంత్ర మనుష్ఠానంబు చేయుచుండు. అత డొకదినము కర్ణకపాల యను మంత్రానుష్ఠాన మొనర్చి యుమ్మంత్రాధిదేవత నాహ్వానంబుగావించె. ఆ కర్ణకపాల నాముఖ్యపరిచారిక యగుటచే నాతో విన్నవించె. అది విని యెవ్వఁడురా నా చెంతనున్న నిన్నుఁ బిలుచు

లతిక్రమించినది, ఇంక నొక్కమాసంబే యవధి. పిమ్మట నా ప్రత్యంగంబును నభిచారమంత్రంబుల ఖండింపఁబడి సజీవముతో మారణహోమంబున యజ్ఞేశ్వరున కాహుతినై నామావశిష్టుండు గావలసినదే. నాగతి యిట్లయ్యె. నా దేహం బంతయు మంటలచే దహించుచున్నదని తట్టుకొనలేక భోరున నేడ్చె. అదిగాంచి యా బాలకుండును యేడ్చి అయ్యా! బేతాళా! ఈ విపత్తునుండి కడతేరుమార్గం బేమైనఁ గలదా! విమర్శింపుము. నే సహాయం బొనర్చెద.

బే:---నాయనా! నీవు పసివాఁడవు. అది మహాయసాధ్య కార్యము. నీచే నెట్లగును?

పు:---ఎంతటి కఠినకార్యంబైనను నాచరించెద. నిక్కై యగ్ని జొరమన్నను నుఱికెద ప్రాణంబులు విడువుమన్నను విడిచెదఁ జెప్పుము. జెప్పుము.

బే:---నాతరుణోపాయంబు చేనెఱుంగను. ఉత్తరదిశగా నిట్లే పోయి యతిదుర్గమంబగు పర్వతంబులు గడచి బదరీనారాయణంబును ప్రవేశించి యచ్చట నున్న నరనారాయణులను ఋషులను గూర్చి మూఁడుదినంబులు తపం బాచరింపుము, నిరాహారుండవై యుండుము. నీవు దేవాంశ సంభూతునివలె నగపడుచున్నావు. వారు నీకు దర్శనం బొసంగి యాబంధవిముక్త్యోపాయం బెఱింగింతురు. "తండ్రీ! యామార్గమున నీకంతరాయము లనేకములు సంభవించును. నీ విట్టిపనికిఁ బోవుచున్నావని యొకరికిం దెలియక బహురహస్యముగాఁ జనవలయు. బయలగునేని యా దురాత్ముఁడు సామాన్యుఁడు గాఁడు. నీ కనేకవిఘ్నము లొనఁగూర్చును. తుదకు ప్రాణంబున కెక్కుపెట్టును.

మరల నాగతియే నీ కగును. ఇట్టి దుర్ఘటకార్యంబునకుఁ బసికూనవగు నిన్ను ప్రేరేపించుచున్నవాఁడ" ననిన నమ్మహాత్ముం డట్టి యాకాశంబుపై దృష్టులు సారించి "ఓరి దురాత్మా! ప్రపంచమున నెందఱి పురుషులను, ఎందఱి స్త్రీలను ఆ పాపి భైరవవిగ్రహమునకు బలియిచ్చి యున్నావో? వారి బంధువుల నెంతమందిని శోకము గుడి పించియున్నావో? ఛీ! కష్టాత్మా! నీయట్టి దుష్టులు ప్రపంచంబునం దుండఁదగదు; మానవద్రోహీ! భేండాభైరవా! నిన్ను నా బాణజ్వాలలచే నేటికి ముప్పదియవదినంబున నిదే యశ్వత్థవృక్షంబునకు బలియిచ్చెద. అయ్యా! బేతాళా! ఇదే నాప్రతిజ్ఞ వినుము. హరిహర బ్రహ్మాదులడ్డమైనను, సకలగిరికాననంబుగా భూమండలం బొడ్డగిలి పడినను, సముద్రంబు లింకినను, నేటికి ముప్పదియవదినంబున యాభైరవుని సంహరించెద. నీబంధవిముక్తి యాచరించెద. ఆ రాక్షసగణంబులను పంచభూతంబులకు గ్రాసం బొసంగెద. ఆ మనుజాహారభైరవవిగ్రహంబును జూర్ణం బొనర్చెద. ఇట్లొనర్పనైతినేని మాతృద్రోహిగతికి, పంచ మహాపాతకంబు లొనర్చువారిగతికి బోవువాఁడ. మఱియు నాయస్త్రశస్త్రంబులతోఁ జితిఁ జేర్చుకొని యగ్నికాహారమయ్యెద. ఇఁక నీవు భయపడకుము ఇదె నారాయణ కవచంబున నీ కష్టదిగ్బంధనం బొనరించితి. నిన్నే మంత్రంబులును మారణహోమంబులును బాధింపవు. నాయానతిచే శబరార్భకులు ప్రతిదినంబును నీ కాహారమును నీరమును దెచ్చి యిచ్చుచుందురు. దుఃఖింపక స్వల్పకాలం బోర్చుకొనుము. శబరార్భకులను భయపెట్టక సౌమ్యతచే

వారిచ్చు యాహారంబుఁ బరిగ్రహింపుము. ఇదో నీకు నమ్మిక గల్గుటకై మరలఁ బ్రతిజ్ఞ నాచరించెద వినుము.

శా. రుద్రుం డడ్డమువచ్చినన్ మఱి సరోరుడ్గర్భుఁ డేతెంచినన్
భూభృత్స్వామిముఖాండమెల్ల ప్రళయాంభోరాశిలోఁ గ్రుంగినన్
సుద్రాఘిష్మకఠోరపాశముఖ యక్షుద్రాస్త్రపాతంబుచే
నాద్రోహిన్ దలద్రెవ్వసేతు రణరంగంబందు భూతాధిపా.

ఇఁకఁ బోయి వచ్చెదనని చెప్పి ధనుష్టంకారము గావించుచు నుత్తరదిశఁ బట్టి చనియె.

# ౪ అటవీ ప్రకరణము

అదే హిమాలయారణ్యమున దిద్దిఱు బాటసారులు మార్గమును గమనింపక కంటకములకు వెనుదీయక శిగి పొదలను లెక్కింపక వంకలు వాఁగులు గణింపక గిరికందరములకు జంకక మృగగర్జనలకు బెదరక మోములఁ జిఱుచెమటలు గ్రమ్మచుండఁ జిడిముడిపాటుతో నడచుచు గోఁచులూడిపోవుచుండఁ బలుమాఱు సవరించుకొనుచు నెద్దియో వెదకువారివలెఁ బగ లేడవముహూర్తమున సిరువదియాఱవ నాడికయందుఁ బడమరనుండి తూర్పుగాఁ బ్రయాణము చేయుచుండిరి. వారిలో నొకనికి యెఱ్ఱనిచాయగల యురమునందు రుద్రాక్షమాలలు తూఁగాడుచుండెఁ, ఎడమచంక నొకమాట నలంకరింపఁబడియుండె. దివ్యస్వర్ణతంతు పరిచిత్రితకాశ్మీరశాలువ తలకుఁ జుట్టుకొని రత్నస్థగితకుండలములు కర్ణములందుయ్యేలలూఁగ నడుమునకొక సన్నపంచ బిగించి పదిరెండు

మూరలు గల జరీపంచ పంచకచ్ఛలువైచిగట్టుకొని మూఁడు గజములుగల యంగవస్త్రము ధరించి నలువదియైదు సంవత్సరములు వయస్సు గలిగి యుండె. మఱియొక బాటసారి చామని చాయ పొడుగాటి శరీరము శిథిలమైన శాలువ తలకుఁ జుట్టుకొని యజ్ఞోపవీతము వ్రేలాడుచుండ దర్భ పవిత్రమనామికమునం దలంకరించి రుద్రాక్షమాల లురమునఁ దాండవింప భస్మకూశ్మాండమువలెఁ నొడలెల్ల విభూతిచే నలంకరింపఁబడి సన్నపంచ నడుమునకుఁ జుట్టి సాధారణధౌతచేలముం గట్టికొని పారాయణ పుస్తకమును. కాశీధావళియును గల మడిసంచి వామభుజమునఁ దూఁగాడుచుండ నేఁబదివర్షములు వయసుస్సు గలిగియుండె. వారివేషభాషలు గన్న బ్రాహ్మణోత్తములని చెప్పకఁ జెప్పుచుండె. చెట్లు పొదలు చీఁకటి మ్రానినీడలు గుహాలు కోనలు పెద్దపెద్దశిల లగుపడినపుడంతయు "శ్రీపాదా" యని యొకరును, "సుశీలా" యని యొకరును బిలుచుచుఁ బ్రత్యుత్తరము రానందునఁ గన్నుల నీరు గార్చికొనుచు నొకరినొక రోదార్చుకొనుచు నున్మత్తుల రీతి వచ్చుచుండిరి. సూర్యుండస్తమించె. వెలుతు రంతకంతకు మఱుగుపడి చీఁకటి తలఁజూపఁదొడఁగె. చుక్కలొక్కటొక్కటియే గానుపించుచుండె. అంధకార మతిక్రమించె. మార్గ మగుపడదయ్యె. మన బ్రాహ్మణు లుదయమునుండి యడవులం దిరిగి కుడుపులేక కడుపుచిచ్చుచే నొడలెల్లఁ జిక్కి ముడిగొల్ప నడుగులు తడఁబడ మరల "శ్రీపాదా" యనువారు "సుశీలా" యనియును, "సుశీలా" యనువారు "శ్రీపాదా" యనియును పిలుచుచు నిరాశాపరులై యొకరు మార్గదర్శకులై మఱియొకరు తదనుసారకులై నడచుచుఁ

దమప్రయత్నమంతయు వ్యర్థయగుటచే వారిరువు రీరీతి మాట్లాడిరి.

సుబ్ర:—శాస్త్రిగారూ! ఇఁక మనము నిరాశఁ జెందవలసి నదే గదా!

సూర్య:—శర్మగారూ! ఇది మిథునమాసము. ఇప్పు డస్త మానలగ్నము ధనుస్సు. మీరొనర్చిన ప్రశ్నాకాలము మకరలగ్నము. లగ్నాధిపతియైన శనియును మార్గాధిపతి యైన కుజుఁడును లగ్నమందున్నవారు, కార్యాధిపతి యైన శుక్రుఁడు శుభగ్రహమైన బుధయుక్తుఁడై వృషభమం దున్నవాఁడు, గురువు కర్కాటకమందుండి లగ్నమును జూచుచున్నాఁడు. యోచించఁగా లగ్నములో శని కుజ లుండుటచేతను, గురు శని కుజుల కన్యోన్యవీక్షణంబులు గల్గుటచేతను నిట్టి విపత్తు తటస్థించినది. ఈ సమయము నకు రెండు ఉచ్చగ్రహములును రెండు స్వక్షేత్రగ్రహము లును బలవంతమై యున్నవి. కార్యస్థానాధిపతు లిరువురు బలవంతులై యున్నవారు. శుభగ్రహమును బలవంతుఁ డైన గురుఁడుచ్చంగతుఁడై లగ్నమును జూచుచుండుటచే మన కార్యములన్నియు ననుకూలమే యగునని తోఁచు చున్నది. నిరాశఁ జెందునంతటి దుర్మార్గము లేదు. కాని చూతము, ఇంకను విమర్శింతము. కష్టము లనుభవించిన వాఁడుసుఖము లనుభవించియే తీరును. ఇది మిథ్యము దుఃఖింపకుము.

సుబ్ర:—స్వామీ! నాకాంతు రంతర్హితయైనది, నేను ప్రత్యక్షముగా గాంచి యున్నాఁడ. ఎంత వెదకినను కిలఁ

కువయే తెలియ దయ్యె. ప్రపంచమున జీవితమై యున్నదని యెట్లునమ్మవలయు. నే నెట్లు నిరాశఁ జెంద కుండుట.

సూర్య:— దేహస్థానమును జీవుఁడు చూచుచున్నాఁడు. ఆత్మకారకుఁడైన రవి యారింట బలవంతుఁడై యాయుస్థానమునకు లాభస్థానములో నున్నవాఁడు. దేహాధిపతి దేహములోనే యున్నవాఁడు. గ్రహయుద్ధము తటస్థించి యున్నందున ప్రాణాపాయము తటస్థించియు బలాధిక మగుటచే సుఖము గల్గియుండును. గురువు కర్కాటకమునకు వచ్చి యయిదునెల లయ్యె. ఇంకను మీకూఁతురు విపత్తులోనే యుండు ననుకొంటిరేమో! అట్లనుకొనకుఁడు. ఇప్పుడు విపత్తునుండి కడతేఱి సుఖవంతురాలై యుండును. భయపడఁ బనిలేదు. నా పుత్త్రునివిషయములో నిన్నరాత్రి మీరు నాతోఁ జెప్పినప్పుడే కాల మెట్లున్నదో యని చూచుకొని యోచించి ప్రాణభయము లేదని నిశ్చయించితి. వారుభయులకుఁ బ్రాణాపాయము కలుగదని దృఢముగాఁ బ్రతిజ్ఞ జేసి చెప్పఁగలను. వృథా దుఃఖించుచు శరీరమును గృశింపఁ జేసి కార్యప్రయత్నములయందాయాసాసూయలఁ జెందిన నేమిలాభము.

సుబ్ర:— మీరేదియో యొక విధముగా మనస్సున కూఱట గలుగఁ జేయుచున్నవారు. మీరు మహాత్ములు. మనో నిశ్చయము గలవారు. దైవజ్ఞు లగుటచే నూఱట గల్గియున్నవారు. నేనో, పండితనామధేయుఁడనే గాని నాయంత చంచలచిత్తుఁ డింక నొకఁ డుండ డని నా నిశ్చయము.

సూర్య:—అట్లనకుఁడు. ఎవ్వరికైనను గష్టము లేమాత్రము స్వల్పముగాఁ దటస్థించినను నదియే బ్రహ్మప్రళయముగా భావించి కడతేరుటకు మార్గమే లేదని దళదళలు పరికించు చుండుట సహజము. ఈ విషయము లన్నియును మీా రెఱుఁగనివి కావు. పుత్త్రికాశోకపరీతు లగుటచేతను, దదన్వేషణార్థమై గృహము విడిచి దేశాటనము నరణ్యా వాసము దటస్థించుటచేతను కేవల పామరత్వ ముగు పడుచున్నారు. ధారణాశక్తి గల మీాకెఱిఁగింప నే సమర్థుఁడునా!

సుబ్ర:—శాస్త్రిగారూ! ఇప్పటికైదునెల లయ్యె. నరణ్య రోదన మొనర్చితి, బడలిక హెచ్చయ్యె. మనసూఱట కలుగదయ్యె. ఇఁక నాభార్యకును నాకును త్రివేణీసంగ మమేదిక్కు. నేనొకఁడనే వెదకునప్పుడు నాకీబాధ యేమియు దోఁపకుండె. ఇపు డాకఁలి బాధించుచున్నది. అడుగులు తడఁబడుచున్నవి. జవసత్త్వములు తగ్గు చున్నవి. మృగగర్జనలకు భీతి వొడముచున్నది. నాఁడు లేని దేహాభిమాన మీనాఁడు గలుగుచున్నది. ఈ యరణ్యమునం దిఁక దిరుగాడలేను. ప్రయాగ కరిగి యెట్లో దేహయాత్ర గడపెద. ఈ రాత్రి యుండెందైనా విశ్ర మించి వారివారి యునికిపట్టులకు వారువారు వెళ్లుద మని పశ్చాత్తాపముచే మెల్ల మెల్లన నడుగిడుఁబత్తులు లెప లెపమని చెట్లనుండి లేచిన నులికిపడుచు లతయో పూరి పుడకయో మార్గమునందు బడియున్న సర్ప మను భ్రాంతిచే మిట్టిపడి మరల నిదానిరిచి పరికించి వృథా భ్రాంతిపడితి మనుకొనుచు మరల మరల నట్లనే భ్రమ

చెందుచు వచ్చుచుండ నచ్చట నొక దేవాలయ మగు పడెను. అయ్యది గోపుర ప్రాకారములు శిథిలమై భూమి నాశ్రయించి యుండెను, లోపలి కరుగుటకు దారి యగుపడ దయ్యె. బహిఃప్రదక్షిణప్రదేశం బంతయు నాగజెముడితో నిండుకొని యడుగిడు నసాధ్యమైయుండెను. నిదానించి చూచి యొకచో మంటితిన్నె గాంచిరి. ఆతిన్నె నెక్కి దేవాలయములోఁ బ్రవేశించిరి. ఒక దినుసు పురుగులు జీరుమని దేవాలయరంగమంటపమునం దఱుచుచుండెను. గబ్బిలములయొక్క దుర్గంధము చెప్ప వీలులేదు, నాసికారంధ్రము భేదించుచుండెను. బుఱ్ఱుబుఱ్ఱున నెగురుచు ఖేలనం బొనర్చుచు నటు నిటు దిరుగాడుచు విషయోపభోగిచిత్తమువలె నిలుకడలేక గబ్బిలములు గుంపులు గుంపులుగా నుండెను. ఆ దేవాలయమున కానుకొని యుత్తరదిశగా నొకవటవృక్షముపై భయంకరఘూకధ్వను లంబరము బగుల్చునట్లు మనశ్శాహ్నాణులచిత్తం బుత్తలము పెట్టుచుండెను. అది గాంచి వెలుపల శయనించుటకు ఘూకారవములకును, వ్యాఘ్రగర్జనలకును దిగులు జెంది యెట్లో యీదేవాలయమున నే యీరాత్రి గడిపి యుదయమున వెళ్లెద మని నన్నపంచలతో నారంగమంటపమున శయనోపయోగస్థలము మాత్రము నూడ్చికొని కరతాళధ్వనులచేఁ గబ్బిలములను దరిమి "కృష్ణా" యనుచు "వాసుదేవా" యనుచు "శంకరా" యనుచు నిట్టూర్పులు విడుచుచు నన్నపంచలను గృష్ణాజినములును పఱచుకొని మూటలు తలక్రింద నిడుకొని శయనించి మార్గాయాసము చేతను, నాహారము లేనందునను నిద్రరాక

యటుయిటు పొరలుచుండఁగా, "అయ్యో! జననీజనకులారా! వృద్ధాప్యదశలో నానిమిత్తమై యెంత దుఃఖించుచున్నారో? హా పరమేశ్వరా! నాగతి తుదకీ పాడుదేవాలయములో నఘోరించవలసినదేనా?" యని దేవాలయ గర్భగుడిలోనుండి యొకశబ్దము వినవయ్యె. అది విని బ్రాహ్మణు లులికిపడి లేచి, శర్మగారూ! ఇందేదియో భూతమో, పిశాచమో యునికిఁ గలిగించుకొనియున్నది. ఇది పాడుదేవాలయము. నేనుమాత్ర మిందుండను. చలియైనను మానె. మృగములు చంపినను సరియే. బయట కరగి యుందెందైనా బండలపై నీ రాత్రి గడపి యుదయముననే మాయూరికి నేను పోయెద. హా! మాశ్రీపాదుఁడు నా కెంత బాధకలుగఁజేసె ననియె. ఔనండీ! నాకును భయమవుచున్నది. ఇందు మీరన్నట్లు భూతమే యుండవలయు. మీయోచన బాగుగానే యున్నది. యెవరయ్యా మీరు? బ్రాహ్మణులుగా నున్నారే? భూతప్రేతముల కింత భయపడువారు మీరేమాత్రపుబ్రాహ్మణులో నాకుఁ దెలియకున్నది? బ్రాహ్మణుఁడు ప్రతిదినమును అర్క పావక సంధ్యోపాస్తి చేయుచు బ్రహ్మగాయత్రి జపించుచున్న నట్టి భూతబాధలు గలుగునే? అమ్మహాత్ముని దర్శనమైనమాత్రముననే నాదుష్టగ్రహము పలాయనమై పరుగిడవే? బీజమాత్ర బ్రాహ్మణులై ప్రవర చెప్పుమన్న మాపెద్దవారల నడుగవలె ననుచుఁ బరిశుద్ధజలములయందు మంత్రపూతముగా విధిప్రకారము స్నానం బొనర్పక ముఖకి దోముకొనుచు లలాటశూన్యులై సంధ్యావందనాల మంటఁగలిపి బ్రహ్మ

గాయత్రిపై దుమ్మునుచల్లి దైవభాషయందును, తమ దేశ భాషయందును వైరాగ్యము వహించుటయే గాక బహు నీచముగాఁ జూచుచు వేదాధ్యయన మడుగంటఁజేసి యితర దేశ భాషయే తమపరలోకసాధన మనియు దమ మహాపాతకోత్తారక మనియుఁ దలంచుచు దుష్టకర్మ లొనర్చుచుఁ దమవర్ణగౌరవమును బాటింపక తమపూర్వస్థితులు గమనింపక తమతపశ్శక్తిని దలంపక అన్యదేశ భాషాప్రగల్భములే వేదమంత్రములుగా నుపయోగించి పరిషేచనాపోశనాహుతు లభ్యాసవశముననో విధిలేకనో మనోవేగముకన్నను నధికత్వరచే నాచరించుచుఁ బర్వ పదార్థములరుచులుమాత్రము విధ్యుక్తముగా దొల్లిటి వారలకన్న నెక్కుడుగా నెఱుఁగు ప్రజ్ఞావంతులై భోజనాంతమున నొనర్చు బ్రాహ్మణవిధులు మఱచి చరించుచున్న కర్మభ్రష్టులు బ్రాహ్మణనామధేయులు భూత ప్రేతములన్న భయపడవలయు గాక. మీవంటి కర్మనిష్ఠాగరిష్ఠులు తపశ్శక్తిపరులు బ్రాహ్మణోత్తములు భయపడ దగునేమండీ. నేను భూతప్రేతములలో నెవ్వతెనుగాను, మీవలెనే యొకమానవజాతిలోఁ జేరిన యబలను అనాథను నన్నెవ్వరో దుష్టులెత్తికొనివచ్చి యీ పాడు దేవాలయమునందు గాలుసేతులు బంధించి వైచి పోయియున్నవారు, మీరు నాపాలిటి పరమేశ్వరులవలెఁ దోఁచుచున్నారు, నా కాలుసేతులు కట్లువిప్పి బంధవిముక్తిఁ జేయుమనిన; సుబ్రహ్మణ్యశర్మ యోచించి ఆశ్చర్యముఁగాంచి భూతప్రేతము లన్నందుకు నామె చెప్పిన వాక్యములకు లజ్జించి ధైర్యము వహించి గర్భాలయములోపలికిం

బోయి నాయంధకారమునసే తారాడి కాలుసేతులు కట్లు విడిచి యేమియో మాట్లాడ నుంకించి ఔనో! కాదో! యని సందేహించి యూరకుండె. ఆ యబలయు లేచికూర్చుండి మీ రెవ్వరో ఆపద్బాంధవులు, మీయుప కారమునకు నమస్కరించుచున్న దానననియె. వా రిరువు రీరీతి మాట్లాడుకొనిరి.

సుబ్ర:—అమ్మాయీ! నీ వీ ఘోరారణ్యమున కేదురాత్ముల వలనఁ దీసికొని రాఁబడితివి? నీకంఠధ్వనిచే మా సుశీల కాదని స్పష్టపడుచున్నది. నీ వెన్నిదినములనుండి యీ గుడియందు బాధపడుచున్నదానవు?

శాంత:—నావంటి నిర్భాగ్యురాలేనా మీ సుశీల. ఆమెకు నావలెనే యరణ్యరోదనము తటస్థించియున్నదా? ఆమె యెవరు? ఆమె కథ యేమి?

సుబ్ర:—మా సుశీలకథ యటుండనిమ్ము. నీకథ వివరింప వమ్మా.

శాంత:—అయ్యా! మీ ధ్వని నే నెచ్చటనో విన్నట్టున్నది, ఔను. నిన్న సాయంతనమున మణిస్యందన భువనేశ్వరీ దేవాలయోపరినదీతీరమున మాటలాడుచుండిన బ్రాహ్మణు లిరువురు మీరే యనుకొన్నాను.

సుబ్ర:—ఓహో! నీ వేమి ఆ విభావసుమహారాజపుత్త్రికయగు భువనమోహినివా?

భువ:—తలిదండ్రుల దుఃఖమునకు మూలమై సఖీజనులవియో గబాధకు చొవలమై బోదులచేఁ జిక్కి యన్నాహారాదులు లేక కాలుసేతులు బంధింపఁబడి యరణ్యరోదన మొన

ర్చుచు నీ పాడుగుడియందు మీచే బంధవిముక్తిఁ జెందిన కష్టాత్మురాలు నిర్భాగ్యురాలైన యీ భువనమోహిని నేనే.

సుబ:—నదీతీరమున మేము మాట్లాడుచుండుట నీ వెప్పుడు వింటి వమ్మా!

భువ:— నిన్నటిదినము శుక్రవార మగుటచే దేవీపూజకొఱకై వచ్చియుండినపుడు.

సుబ:—ఆవెంటనే రాజసుతను చోరు లపహరించిరని పుర మంతయు గగ్గోలుపడుచుండె. ఆచోరులచేఁ జిక్కినది నీవే యని యిపుడు నిశ్చయించి యున్నానన నతనే పట్టలేని దుఃఖముచే భువనమోహిని యేడ్చుచు మాతల్లిదండ్రు లెంత సంతాపపడుచున్నవారో; ఈ దురాత్ములు నన్నం దులకుఁ దెచ్చియున్నవారో; కొన్ని ఫలములు తెచ్చి యిచ్చి వారెచ్చటికో పోయియున్నారు. వారి కంఠధ్వని వలనఁ జిరపరిచితులువోలె దెలియుచున్నది గాని స్ఫురింప లేదు. తమరూపములు బయలుపడకుండునట్లు వివిధము లుగా వేషములు మార్చుకొనియున్నారు. వారియుద్దేశ మేమో తెలియకున్నది. ఇంకను మాతల్లిదండ్రులను జూచుభాగ్యము నాకుఁ గలదో లేదో; నాపాలిదైవముల వలె నీయంధకారారణ్యమున మీరు తోడైతిరి, ఆదురా త్ములు రామున్నే యీ దేవాలయము విడిచి యెందో మఱుగుస్థలములో నీరాత్రి దాగికొనియుండి సమయముఁ జూచుకొని మా పట్టణమునకుఁ బోవుదము, నాప్రాణ ఋక్షణ సేసినందులకు మాతండ్రిగారిచే మీకెక్కువ బహు మతిఁ జేయించెద. మహాత్ములారా! ఇంతమాత్రము

పుణ్యము గట్టుకొనుండనియె. అంత సుబ్రహ్మణ్యశర్మ యిట్లనియె ఈ స్థానము విడిచి యెచటికిఁ బోవుటకు వలను పడదు, ఉదయమునుండి బహుశ్రమపడియున్నాము, అడుగిడలేము, ఇందే యుందము. వారురానీ చూతము. మేమిరువురము, నీవొకతెవు ముగ్గుర మున్నాము. నిశ్చింతగాఁ బండుకొనుము. వారింకేమివత్తు రెందో పరుండి నిద్రించియుందురు. రే పుదయముననే లేచి మనము చెట్ల చాటుగా వారికి గపడక యూరఁ జేరికొందము. నిన్ను మీతల్లిదండ్రులచేతికిఁ జేర్చుపర్యంతము నీవెంటనే మేముందుము, భయపడవలదని యూరడించుచుండిరి. ఎవ్వరో మాట్లాడుచు దేవాలయసమీపమునకు వచ్చుచున్నట్లు చప్పుడియయ్యె, అదే వారు వచ్చుచున్నారని భువనమోహిని చెప్పి భయపడుచు లేచి బ్రాహ్మణుల మఱుఁగున నిలువంబడియె. బ్రాహ్మణు లట్టే లేచి సన్నపంచెలకు జెంబులు బిగించి కృష్ణాజినపుచుట్టు లొకచేతఁ బట్టికొని రంగమంటపద్వారమునకు జేరి యొక ప్రక్కన నిలువబడిరి. వారరు దెంచి ధ్వజస్తంభ వేదికపైఁ గూర్చుండి యీవిధముగా మాట్లాడిరి.

వీరుఁడు:—శకుంతా! మన మతిక్రూర కార్య మొనర్చితిమి. చేయునపు డేదియో యుత్సాహము ప్రబలియుండెను గాని యిప్పు డావిషయమున్న మనసు వెనుకంజ వేయుచున్నది ఇందులకు నీ వేమందువు?

శకుం:—తండ్రీ! ఏదో యొక కార్యమున కుపక్రమించునప్పుడే కార్యాకార్యములు యుక్తాయుక్తములు యోచించి చేయవలయు, ఇపు డాయోచన లేక యేమును మించి

కార్యమొనర్చియున్నాము. పట్టి విడుచుట పురుషలక్షణము గాదు. వచ్చిన యపకీర్తి వచ్చియే యుండును. అనుభవింపకతప్పదు. అందులకు నాలుల యోచించిన నేమి లాభము? మనకౌశికునియభిప్రాయ మెట్లున్నదో.

వీరుఁడు:—కౌశికా! ఇందులకు నీయభిప్రాయ మేమి?

కౌశి:—తండ్రీ! మాయన్న యభిప్రాయమే నాయభిప్రాయము కాఁగల కార్యములు కాకమానవు. ఆ యబలకర్మ మట్లు క్రూరమరణము జెందునట్లు ఘటయోగము గలిగి యున్నది. అందువలననే మన కిట్టిబుద్ధి కలిగియున్నది. తెచ్చియున్నాము. వెనుదీయక రేపుదయముననే మన కార్యము ముగించికొని వెళ్ళవలసినదే; సిరి వచ్చెదనన్న వలదను నిర్భాగ్యుఁడు గలఁడే? సార్థకమగు వీరనామధేయముచే నలంకార మొందుచున్న మీరే యీవిషయమున వెనుకంజ వేయ నేనేమి విన్నవించఁగలవాఁడ?

వీరుఁడు:—చేతులార నొకయబలను సంహారింపవలె నన్న మనస్సొప్పకయున్నది. ఈకార్యము మీరే యొనర్చిరందు అవల జరుగు కార్యములు యోచించనగును.

శకుం:—నేనుమాత్ర మట్టిక్రూరకార్య మొనర్చుటకు ధైర్యవుఁడనా? నావలనఁ గాదు. మనకౌశికుఁడే యాపని యొనర్పవలయు.

కౌశి:—తండ్రీ! ప్రయత్నించితిమి, చేయకతీరదు. చేసినను జేయుటకు సమ్మతించినను జేసినఫలమున కేమాత్రము లోపముండదు. అందులకు సందేహమేల? మీ కిష్టము లేకున్న నేను సర్వసిద్ధుఁడనై యున్నవాఁడ. రేపుదయ

మునన్నో యిపుడేన్నో నే నీ దేవాలయమునం దీకార్య మొనర్చెద మీ రూరక చూచుచుండుడు.

వీరు:—కుమారులారా! మన చేతులార నీక్రూర కార్య మొన ర్చుట కిష్టము లేకున్నది. ఈ ఘోరారణ్యమున విడిచి వెళ్ళిన నేవేని క్రూరమృగములు భక్షించును. మనమేల నంతటి కార్య మొనర్పవలయు?

శకుం:—అరణ్యములో విడిచిన నుపయోగము లేదు. ఎవ్వ రెఱుంగన ట్లొక జరతలోనో గుహలోనో ద్రొబ్బి జను దెంతము. అన్నాహారము లేక యుండే మరణము జెందును.

వీరుడు:—ఔను. శకుంతా! ఇచ్చటి కొక్క క్రోసుదూర మున సుప్తముఖి యను గుహ యొకటిగలదు. అందు ద్రొబ్బి రెండు ద్వారములకు బలమైన శిలల నడ్డపెట్టి జను దెంతము. ఆపల నీవు జెప్పినట్లగును.

శకుం:—ఆ గుహ మీరెందులకుఁ జూచి యుంటిరి? మీ కెట్లు తెలియును?

వీరు:—ఆయన వెంట నొకతూరి వేఁటకొఱకై వచ్చియుంటిని నన్నొక్క వనగజము దరుముకొనియె. నా సాహస మంతయు వినియోగపఱచినను ప్రయోజనము లేకపోయె. పరువెత్తితిని నా వెంటఁ దరుముకొనియె. నాకు దిక్కుదోఁ చక యిష్టము వచ్చినట్లంతయుఁ బోయితి. పెద్దగుండులో నొకసరవ యగుపడియె. అదియే గుహాముఖము. లోపలఁ బ్రవేశించితి. గజము నావెంటదూరి జాతిసందులో నిఱికి కొనియె. నేను లోపల నటునిటుఁ బరికించితి. నావలఁ బడి గజములదూరములో నుత్తరదిశగా నొకద్వార మున్నట్లు

దోఁచె. అచ్చటి కరిగి లోపలనుండి బండను ద్రొబ్బితి. మార్గమగుపడియె. బయటికివచ్చి ముఖద్వారము చెంత కరుదెంచితి. నాయేనుఁగు తాతిసందులోఁ జిక్కి తనుకు లాడుచుండె. నాచేనున్న శూలముచే వెనుకనుండియు మర్మస్థానములందుఁ బొడిచి చంపి జనుదెంచితి. అందుచే నా కాగుహ సంగతి తెలియును. దానిలో నీయబలను ద్రొబ్బి వచ్చితిమేని యెవ్వరు దెలిసికొనలేరు. అన్నాహార ములు లేక యల్లే మరణము నొందును. తడవుచేయక యాపని యొనర్తుము, లెండు. రేపుదయమునం దాకార్య మొనర్చుట యసాధ్యమగును. ఇపుడే యాకార్యమున కుపక్రమింతము. కౌశికా! నీవును శకుంతుండును గర్భ గుడిలోనుండు నాకాంత నెత్తికొని రండనిన వారు లేచి దేవాలయములోనికిఁ బ్రవేశించుట కుపక్రమించిరి. వీరి మాట లాబ్రాహ్మణు లాద్యంతము విన్నవారగుటచే వారిని లోపలఁ బ్రవేశింప నీయఁగూడదని బ్రాహ్మణు లయ్యేను తెంపుబూని ద్వారమునకుఁ జెఱియొకప్రక్క న ధట్టించి నిలువఁబడియుండిరి. చోరులు లోపలఁ బ్రవే శించుట కుపక్రమింపఁగా నెవ్వరు లోపల రాఁగూడదని గర్జించిరి. ఆధ్వని విని వీరిరువురు నులికిపడి తొలుత వెను కంజవేసి మఱల నిదానించి పదపదమని తమలోఁ దాము పురికొల్పుకొని పెద్దవాడైన వీరుని సహాయముతో లోపల నుగ్గబోయిరి. వారింగాంచి దురాత్ములారా! మీవృత్తాంత మంతయు మీమాటలవలనఁ దెలిసికొన్నాము. మేము బ్రాహ్మణులము. మాదేహములోఁ బ్రాణము లుండు నంతవఱకు నీకాంతను మీ కప్పగింపము. లోపల రాకుడు

శరములతోనైనను శాపములతోనైనను జంపువారు బ్రాహ్మణు లనుమాట మీరు వినలేదో? పొండు. ఇఁక మీకీకాంత దక్కదు. ఆశ వదలుకొని పొండని భీషణముగాఁ జెప్పిరి. ఓహో బ్రాహ్మణులారా! అట్లయిన సరే. మాకు బ్రహ్మహత్య రానియట్టి మార్గము విడువుడు. మా కార్యమునకు మీ రభ్యంతరము చేయకుడని బలవంతముగా నొక బ్రాహ్మణుని ద్రోబ్బుకొని కౌశికుఁడు లోపలికిం దూరెను. మఱియొక బ్రాహ్మణుఁడు తనచేతిలో నున్న చెంబుతోఁ దనముష్టికొలఁది నతని మస్తకముపై నొకపోటుఁ బొడిచె. ఆ దెబ్బచేఁ గేకవేసి కౌశికుఁడు స్మృతిఁదప్పి భూమిపై బడియె. శకుంత వీరుల కత్యుగ్రహముబొడమె. ఒక్కపెట్టున లోపల దూరి బ్రాహ్మణులను గ్రుద్దిరి. వారును చెంబులతోఁ గొంతదూరము పోరాడి తుదకుఁ జోరులచేఁ బట్టువడిరి. ఆ దేవాలయ స్తంభములకుఁ గట్టివేయఁబడిరి. పాప మా బ్రాహ్మణు లేమి చేయుదురు? కట్టుబడిరి. భువనమోహిని చీఁకటియందు బ్రాహ్మణుల మఱుఁగున నుండుటచేఁ గౌశికాదులు గర్భాగారమున నెంత వెదకినను దొరకలేదు. మఱల నచ్చటికి వచ్చిరి. పదమంజీరధ్వనులు కరకంకణధ్వనులు బ్రాహ్మణుల వెనుకనుండి సన్నగా వినవచ్చె. అచ్చట నుండవలయునని పోయి తారాడి యాకాంతను బట్టుకొనిన నామె వాపోయె. బలవంతముగా నీడ్చుకొనివచ్చి మఱల గాలు సేతులు బంధించి యిరువురెత్తికొని దేవాలయము నిర్గమించిరి. వీరుఁడు ఖడ్గపాణియై వారిముందర నడచుచుండె. అప్పుడప్పుడే చంద్రుఁ డుదయించుచుండెను. వా రంద

యును నుత్తరదిశగా వెళ్ళి యాకాంత ప్రాణములను దీయ యత్నించుచుండ నామె యాయరణ్యమంతయు మాఱు మ్రోగునట్లుగా నేడ్చుచు "ఈ దురాత్ములు నన్నుఁ జంపుట కెత్తికొనిపోవుచున్నారు. ఎవ్వరయినను వచ్చి నన్ను రక్షింపరాదా? దైవమా! నీవును దయమాలి యున్నావా? తరులారా! మీలో నెవరికైనను నాయందుఁ గనికరము గలుగదా" యనియు, మఱల నపుడే యుద యించి తనచల్లని కిరణములచే లోకమంతయు వ్యాపింపఁ జేయుచున్న చంద్రునిం గాంచి, "దేవా! సమస్తజగంబులలో జరుగు సత్యాసత్యము లెఱిఁగి దుష్టుల శిక్షించి శిష్టుల రక్షించు మహానుభావుఁడైన నీ వీ దుష్టుల సంహరించి నన్ను రక్షించకున్నవాఁడవైతివా"

గీ. "చంద్రవంశోత్తమ మహాత్మ సర్వరక్ష
మునివరాశ్రమవర్ధన మోహాబింబ
ఓకళాభాను నీకళాయుధముతోడఁ
ద్రుంపవే వీరి నన్ను రక్షింపరావె"

అనియు బిగ్గఱగా నఱచుచుండె. అంత చంద్రోదయమై యుండినను దట్టమైన వృక్షముల నీడనుండియు మేఘగర్జనం బోలు నొక సింహనాదముతో "భయపడవల" దను ధ్వని విననయ్యె. తటిల్లతయో యనునంతటి కాంతిచే నొక ఖడ్గ విజృంభమాణము చోరుల కన్నులకు మిఱుమిట్లు కొలిపె. పద ఘట్టనలచేఁ బృథివి కంపించునట్లొక వ్యక్తి తటాలున నా చోరులమూఁపులపైఁ బిడికిటచేఁ బొడిచె, వారు నిశ్చేష్టితులై నిలువంబడిరి. మఱల వారలకు ముష్టిప్రహారణము లైన తాపుల కోర్వలేక యాకాంతను విడిచి శక్తిహీనులై నేలం

గూలఁబడిరి. నిదానించిచూడ నా తేజోమూర్తి యామె కాలు చేతుల కట్లు విప్పుచుండె. ఆ దుష్టులు తమప్రాణములపై నాశ వదలిరి. కౌశికుండట్టె లేచి తప్పించుకొని పరువెత్తె. తక్కిన యిరువురు పైకిలేచుటకును పారిపోవుటకును బ్రతిఘటించు టకును దిక్కులోఁచక "వీఁడెవ్వఁడు; ఈ యపరరాత్రివేళ నిం దెందులకుఁ జనుదెంచె; ఈతనిప్రభారాశి యఖండంగా నున్నదే" యని యనుకొనుచు వెలవెలఁబోవుచున్న నాయిరు వురిం బట్టికొని యానూతనపురుషుఁడు తరుమూలంబులకుం బంధించి గడగడవడఁకుచు దుఃఖించుచున్న నా యబల నూర డించి "తరుణీ! నీకష్టములు గట్టెక్కినవి. దుఃఖింపకు" మని చేతిం బట్టికొని వీఁపుపైఁదట్టి తల నిమరె. అది విపత్సమయ మైనను నక్కాంతకుఁ బరపురుషకరస్పర్శ సమ్మతి లేకుండియు విధిలేనందున నూరకకాంతినిముఖముఁ జూచుచు "మహాత్మా! ఈ యాపత్కాలమున నన్ను రక్షించితివి. నీవే నా కాప ద్బాంధవుఁడవు. భగవంతుఁ డీరూపమునఁ జనుదెంచి నన్ను రక్షించి యున్నవాఁడు. ఆ పాడుదేవాలయమునం దిద్దఱు బ్రాహ్మణులు నానిమిత్తమై వీరిచే దెబ్బలదిని బాధజెంది స్తంభములకు బంధింపఁబడి యున్నవారు, వారినట్లే బంధ విముక్తి రొయునర్పవలె" నని ప్రార్థించు చున్నదాన ననియె. అంతటి యాపత్కాలమైనను గద్గదకంఠముచే స్పష్టాక్షర ములు లేక మాట్లాడు చుండినను నామాట లమృతమును మథింపఁబుట్టిన నవనీతముంబోలె నా నూతనపురుషున కానందమయంబై యామెవెంట దేవాలయమార్గముగాఁ బోవుచుఁ దన మనమున నిట్లని యోచించె. ఈ సతీతిలకంబె వ్వరో! ఈదురాత్ము లేమికారణముచేఁ గైకొని పోవుచుండిరో!

ఈ తన్వీనామాక్షరంబు లెవ్వియో? ఈ కాంతయేభూకాంతుని పుత్రికయో? ఆహా! ఎట్టిక్రూరకాల మరుదెంచియున్నది ఎందుఁగన్నను భైరవపూజలు పెచ్చుపెరిగియున్నది. ఆ పాపి భైర మతమును స్థాపనజేసిన దురాత్ములెవ్వరో; ఎందరు పురుషులనైనను యెందరు స్త్రీలనైనను బలి యిచ్చుచుందురు. దానికొఱ కీసుందరినిం గైకొని పోవుచుండిరో? ఏమో? ఆహా! ఈ సతీతనూవిలాసము దేహాంగనలయందైనంగలదే? వివాహితయో? నవివాహితయో? బ్రాహ్మణియో? క్షత్రియాంగనయో? చంద్రభగవానుని తేజఃకరండము బ్రహ్మాండమంతయునిండి యుండుటచే నీయండజయానలక్షణములం బరికిం క్షత్రియాంగనవలెఁ జెప్పఁ జెప్పుచున్నది. ఈ తరుణి కరస్పర్శం బైనప్పటినుండియు మనమునం దొకవిధమయిన మోహాంబంకురించి యున్నది. ఈరీతి ప్రాణాపాయమునం దుండిన దగుటచే శృంగారమోహములం దిరస్కరించి కేవల భయవైరాగ్యముల నాశయించినట్లు చూడ్కులచేఁ దెలియనగుచున్నది. శీఘ్రబుద్ధి నిష్ప్రయోజనము. నిదానించి విచారింతము. అన్నియు స్పష్టపడును. దేవాలయమునందు బంధింపఁబడియున్న బ్రాహ్మణులచే సర్వవిషయములు తెలియనగు నని యనుకొనుచు దేవాలయము చెంతకువచ్చి యంధకారబంధురమై యుండుటచే లోపలఁ బ్రవేశించుటకు సాధ్యము లేక తన కవచమునం దున్న ఘర్షణశీల (చెకుముకి) చే ననలంబు సంధించి పూరిపుడకలచే రగుల్కొల్పి బృహదగ్ని సృష్టి చేసె. ఆ వెలుతురుచే దేవాలయములో బంధింపఁబడియున్న బ్రాహ్మణు లగుపడిరి. వారికట్లు విప్పినమాత్రముననే వారా తేజోరాశిం

గాంచి సంతోషసాగరమున నోలలాడి భువనమోహినిం గాంచి "తల్లీ! భువనమోహినీ! వచ్చితివా? ప్రాణములతో నున్నదానవా?" యని మితిమీఱి పలుకుచు నప్పుడే శత మానం భవతీత మంత్రములచే నాశీర్వచనాక్షతలు నూతన పురుషున కొసంగి "మహాపురుషా! ఈ కాంతయును మేమును నీచే బునర్జీవితులమైతిమి; నిన్నుఁ గన్న తేజోరాశివై బాల భానునివలెఁ బ్రకాశించుచున్నావు; మాపాలిటి దేవుఁడవు; ఆపద్బాంధవుఁడ" వని పొగడుచుండిరి. అతం డేదియో మాట్లాడ నుంకించుచుండ దేవాలయోపరి భాగమునుండి;

ఆ. "ఓలతాంతగంధి! యోచంద్రబింబాస్య!
యోసరోజపాణి! యోసువాణి!
భువనమోహనాఖ్య! భువనైకమోహిని!
యెందుఁ గలవొ! పలుక వేల తన్వి"

అనుసబ్దము వినుపించె. అంతలోఁ దత్పరిసరంబునం దొకటిసి హంబు భువనభయంకరముగా గర్జించె. "అయ్యో! భువనమోహినీ! చచ్చితి; చచ్చితినను నొకయార్తారవము మఱల వినవయ్యె. మననూతనపురుషుఁ డట్టేలేచి రొయిక పెట్టున దేవాలయోపరిభాగమున కేతెంచిచూడ నొకవ్యక్తి ఖడ్గధారియై స్మృతిఁదప్పి పడియుండె. దానింగాంచి మెల్లనఁ దట్టి లేవనెత్తి సేదఁదేర్చి యోపురుషపుంగవా! భయపడకుము. లెమ్ము లెమ్మనియె. అతనికి స్మృతిగలిగి వచ్చితివా భువనమోహినీ! నీ విందేయున్నావా? మంచిసమయమునకు వచ్చి నన్నుఁ గాపాడితివే? భువనమోహినీ! భువనమోహినీ! యని మఱల నేలంబడియె. అయ్యో! ఇతఁడెవరో? ఈ కాంత నరయుచుఁ జనుదెంచి పడియున్నవాఁడు. ఈ కాంతకు భువన

మోహినీ యనునామం బుండవలయుఁ గానిమ్ము చూతముని మఱల వీఁపుపైఁదట్టి భయపడకుము, సింహగర్జనకింత భయపడు మనుజులుగలరే? అయ్యా! లెమ్ము లెమ్మని సేవఁ దేర్చె. అతఁడును లేవగా నాతని చేతిం బట్టుకొని దేవాలయములోనికిఁ దోడ్తెచ్చుచుండ నతం డీపురుషోత్తముని తేజంబునుంగని నిర్విణ్ణుఁడై, అబ్బా ఇతఁడు దేవేంద్రుఁడు కాఁబోలు! లేకున్న నిట్టి తేజంబు మానవులయం దుండునే? ఈ యర్ధరాత్రివేళ నిచ్చటి కెందులకువచ్చియుండునో? ఇతనిం బల్కరించుటకే గళఁ బెగడక యున్నదే యనుకొనుచు నాతనివెంటఁ బోవుచుండె. దేవాలయములోనం బ్రవేశించిరి. జేయివిడచి యమ్మహాపురుషుఁ డొక్కచోఁ గూర్చుండె. ఆవ్యక్తి యందున్న బ్రాహ్మణులను లోక మోహనాంగియగు నా సుందరినిం గాంచి యౌనా కాదా యని యట్టె నిదానించి జూచి మఱల బ్రాహ్మణులపై దృష్టి సారించి యాపురుషపుంగవుంగని యాకాంతం బరికించి దృఢనిశ్చయుండై ఆహా! భువనమోహినీ! భువనమోహినీ! నాపుణ్యావశముల నిన్నుఁ గంటి, నిన్నటినుండియు నన్నాహారముల వదలి యడవులంబడి వెదకి వేసరిల్లి తుద కిచ్చటికి జనుదెంచి సింహగర్జనకు బెగడి స్మృతిఁదప్పి యమ్మహామహునిచే నూరడఁజెంది వచ్చిన నా యాయాసమంతయు ఫలియించె. తరుణీ! నిన్నుఁబరిణయంబై రాజ్యాభిషేకంబును బొంది రాజనై చంద్రకాంత శిలాసౌధమున హంసతూలికపై యనంగసామ్రాజ్య మనుభవించు టెన్నఁడోయని యువ్విళ్లూరుచున్న నన్ను మోసగించి యెవరో దురాత్ములు నిన్నపహరించుటచే నీవరణ్యమున నిడుములు బడుచుండ నేను మందరమునఁ గుడిచి కూర్చుండి

సుఖము లనుభవించు చుందునే! నీచెంత నున్నపుడు ప్రళయ మే తెంచినను నాకుఁ గష్టముగాఁ దోఁపకుండె. ఈ యొకటి రెండుదినముల కే నీవియోగముచే యుగములై మన్వంతరములై బ్రహ్మప్రళయమై తోఁచుచుండె. నిన్నుఁగని ధన్యుండనైతి. తరుణీ! నీ యాశ్లేషసౌఖ్యంబిమ్ము. నీమృదు కరములచే నన్నాలింగనం బొనరించి యొకముద్దొసంగుము. కనకకుంభోపము లగు నీకుచంభములకు నాకరముల దాసత్వం బంగీకరింపుము. అడవులలో నిడుమలఁబడి యడుగిడ లేక నడచి వచ్చిననన్ను నీమృదుతరమగు నుడువులచే యూఱడి మాన్పుము. పద్మకుసుమారములగు నీయడుగు లొత్తెద నను గ్రహింపుము. నాచేఁ బరిచర్యఁ గొమ్ము. నన్ను సరసింపకుము. నే నేమి విద్యావంతుఁడను కానో; రూపములేదో; నాచెంత యౌవనముకఱవో; నన్నేల తృణీకరించెదవు? సరసకుఁ జేర్పుమా? నీయిష్టమేమి? పలుక వేల? అని మోహోన్మాదమున మైమఱచి మహాపురుషసమక్షమంబని గమనింపక తన మూర్ఖత్వము బైలుపడఁ బలుకసాగె. మహాపురుషుఁ డాశ్చర్యమొందె. బ్రాహ్మణులు నిర్విణ్ణులైరి. భువనమోహిని కమానుషంబై శోకరోషములు ద్విగుణీకరించె. క్రూరనిరీక్షణములతో నాతనిం గాంచి, దురాత్మా! లోమకేశా! నీ యజ్ఞానము పెచ్చుపెరుగుచున్నది. ఉత్తమక్షత్రియుఁడవై యుండిన నీకీ నీచగుణ మలవడదు. మీతల్లి నిన్నెవ్వరో కిరాతకువికిఁగని యున్నట్టున్నది. ఎన్నివిధముల నిన్నుఁ జీకొట్టినను నీమూర్ఖతనము మానక పెక్కులు ప్రేలెదవు, నానిటు తత్తమై యరణ్యరోదన మొనర్చి కడుబలియున్నందున నిన్ను మన్నించితి. లేకున్న; ఇదే నాగుప్తఖడ్గముచే నీశిరం బెగురగొట్టి

యుండును. నే నేమి వెలయాలి ననుకొంటివే? ఉన్మత్తా! ఇది వర కనేకములగు మార్లు చీకొట్టితినే; తెలివి లేదటరా? ఇంక ప్రేలిన నీ నాలుకఁ గోసి వై చెదనని కరాళించి మహిషాసుర మర్దనివలె విజృంభించుచున్న నమ్మహాపురుషుఁ డడ్డమువచ్చి, అయ్యా! నీ వెవ్వరో, కేవలప్రాకృతపురుషునివలె నగుపడి యెదవు; పండితుఁడవు కావు; ప్రపంచజ్ఞాన మెఱుంగవు. ఈ యరణ్యమునం దిపత్సమయములో బ్రాహ్మణులయెదుట మోహోన్మాదమున నిట్టిమాటలు బల్కిన నీ వెట్టి యారణ్యుం డవో తెలియకున్నది; కూర్చుండుము. బడలియున్నవాఁడవు. మనస్సును స్వాధీనమం దుంచుకొనక యింద్రియానంతవ్యా పైన మానవుండు తప్పక చెడును. ధారణాశక్తి గలవాఁడవు గమ్ము. నీ పల్కులువినుట కసహ్యముతోగాక నిన్నిపుడే హత మొనరించునంతటి రోషమునహా బొడముచున్నది. చాలుఁ జాలునని రెట్టఁబట్టి కూర్చుండబెట్టి బ్రాహ్మణోత్తములారా! చాలప్రొద్దయినది శయనింపుడు. ఉదయమున నందఱి సమా చారము వినవలెనని యున్నవాఁడ; నేనును శయనించెద. అయ్యా! లోమకేశా! నీవును శయనింపుము. అందఱు శయ నింపవచ్చునని యొకవిధముగు నోరజూపుచే భువనమోహినిం జూచి తానుశయనించె. అందఱును విశ్రమించిరి. మనలోమ కేశునకు నిదుర రాలేదు. అటునిటుఁ బొరలుచు నిట్లని యోచించె. ఎవ్వరో దుష్టులీకాంత నెత్తికొని బోవుచుండ నీపురుషుఁడు రక్షించియున్నవాఁడు. ఈతని రూపప్రతాపములు చెంత నేను శలభప్రాయుఁడను. భువనమోహిని యాతనిం బలుమఱు గాంచుచుండె. అన్యోన్యమోహాంకురం బపుడే సూచించుచున్నది. తొలుతనే నాపేరన్న నోరరించుచుండె.

ఇట నిందతి యెదుట ప్రత్యక్షముగా నిందించె. ఇంక నీపురుషుని గన్నకంటితో నన్నుఁగాంచి యెంతమాత్రము భ్రమించును. ఎట్టి మూర్ఖుఁడైనను సామ్రాజ్యమునువిడిచి భిక్షాటనమున కాశించునా? సర్వవస్తుజలనిధి ప్రముఖవసతులయందాఁతేరు దివ్యదేశపట్టణమును వర్జించి మరుభూమియందుఁ గాపురంబుండుటకు యోచించునా? ఇతండున్న నాకును భువనమోహినికిని గడుదూరము. ఇట్లు ప్రయోజనము లేదు. ఏదో యొక కలహముఁ గల్పించుకొని సమరంబొనర్చి యితని సమయింతమన్న నాకు సహాయముగా దేవేంద్రాదు లరుదెంచిన నితనిం జయించుట దుర్లభము. జయించుట యుండనిమ్ము, బ్రతుకుటయే సందేహము. ఇదియు బ్రయోజనము లేదు. ఈతఁ డొంటిపాటుగా నున్నపుడు నమ్మించి మోసగించి యేదియో యొక యుపాయముతోఁ గడతేర్చవలయును. ఇతఁడు సమసినేని యావల నీసతి నాకుఁ గరతలామలకము. ఇదియే సరియగు యోచన కానిమ్మని యింకను పలువిధములుగాఁ గోర్కెలుఱ్ఱట్లూఁగుకొనుచు నాఁడుదయమునుండి తిరిగిన యాయాసముచే నటునిటుఁ బొరలుచు నిద్రించె. భువనమోహినియు గర్భాగారమున శయనించి నిద్రరాక నటునిటుఁ బొర్లుచు తనగతికిఁ జింతించుచు నీమహాత్ముఁ డెవ్వఁడో సమయమున కేతేరకున్న నన్నాదురాత్ములు గిరికందరములోఁ బాఱవైచి వచ్చియుందురు. ఇతనిఁగన్న దేవతాస్థానములోని వాఁడుగా గనఁబడుచున్నాఁడు. నన్నురక్షించుటకు భువనేశ్వరీ మనోహరుండగు శంకరుఁడు క్షత్రజనవంశకరుఁ డీవిధముగా వచ్చియుండవలయు. లేకున్న నీయుపరాత్రివేళ నొంటిగాఁ దటిలతాతతింబోలు తనదేహ

కాంతి కన్నులకు మిఱుమిట్లుగొల్ప నెందులకుఁ జనుదెంచు? ఇమ్మహాత్ముఁ డాయురారోగ్య భోగభాగ్యముచేతను పుత్త్ర పౌత్త్రాభివృద్ధిచేతను దులదూఁగునటుల భగవంతుని బ్రార్థిం చుచు గృతజ్ఞనై యుండెద. మాతలిదండ్రులెంత దుఃఖించుచు న్నవారో; వారి నోదార్చువారెవ్వరు గలరు? వార్ధక్యదశలో నేకపుత్త్రికయగు నావియోగముచే నింకను జీవవంతులై యుందురో యుండరో యని సంశయించుచున్నదాన. ఈ బ్రాహ్మణోత్తము లెంతటి దయామయులో తమబిడ్డలనైనం దలంపక నాకొఱకు కాఁదురాత్ములచేఁ దాపులుబడి. బధితులై ప్రయాసవహించి యున్నవారు. వీరి మేలునకే ననవరతమును వందనము లాచరించుచుండెద. ఈబ్రాహ్మణు లమ్మహా పురుషుఁడు నన్నేవిధముననైనను రేపు మాతలిదండ్రులచెంత జేర్తు రిది నిశ్చయము. ఈమూర్ఖుఁడైన లోమకేశునికి గొన్ని విధములచే నీతి బోధించితి. కసరితి. చలులచే నానల ద్రోబ్బిం చితి. ఎంతటి యగౌరవ మొనర్చినను దుర్భాషలాడుచుఁ బతి వ్రతా భాగధేయనైన నామనస్సు నొప్పించుచున్నాఁడు. నన్ను బాధించుటచే నీతని కేదియో విపత్తు మూఁడనున్నది. ఈ మహాపురుషుని సన్నిధిలో నీచతరముగా నీదురాత్ముఁడు మాట్లాడె. ఛీ ఛీ; నాబ్రతు కన్నిట గౌరవహీనముగా నున్న దనుకొనుచు నిద్రరాక యట్లే పరుండియుండె. ఆ నూతన పురుషుండు శయనించి యేదేదియో యోచించుకొనుచు నిద్ర రాక పొర్లుచుండి చోరులపై జ్ఞాపకము పోయి వారినిఁ గట్లు విప్పి యిచ్చటి కీడ్చుకొనివచ్చి వారి సంగతి విచారింపవలయు ననుకొని దిగ్గునలేచి ధనుఃఖడ్గములు సవరించుకొని దేవాల యము దాఁటి వెడలిపోయె. నిద్రరాక యటునిటుఁ బొర్లు

చుండిన భువనమోహినియుఁ జివాలున లేచి యాతని వెనుక ననుసరించె. అతండును బహుమంజీరధ్వనులు విని వెనుకంజూడ నాకాంత వచ్చుచుండంగని యిది మహాగహనము; అంధకారము; నిన్నుఁ జెఱఁగొని చనుచుండిన చోరుల బట్టికొనివచ్చి వారి యపరాధము విచారించెద నీవంతవఱ కిందె యుండుమనియె. లజ్జాభరముచే నాఁటల నే నీ నరకకూపమునం దుండజాల; నన్నుఁ దోడ్కొనిపోయి మాతలిదండ్రులచెంత నిడిచి పెట్టి పుణ్యముఁ గట్టికొనుఁడనియె. ఇదె వచ్చెద; భయపడకుము; బ్రాహ్మణు లున్నవారు; త్వరగా మీతల్లిదండ్రుల చెంతఁ జేర్చెద. అచ్చట లోమకేశం డున్నవాఁడని యోచింపకుము. నీ కేదేని ద్రోహము తలపెట్టనేని నేనిందే యుందును గదా యని చెప్పుచున్నంతలో నా యడవియందున్న సింహము మఱల గర్జించె. సహజభీరువు గాన నాగర్జన కోర్వలేక హా! యని యెక్కుడేటున నాపురుషుని దబ్బుకొని గడగడవడఁకుచు నిలువఁబడియె. సుకుమారమృణాళ సదృశకోమలబాహువల్లరీ పరివేష్టితుండై తదీయతనూస్పర్శమున కానందపరవశుండై మైమఱచి కొంతదడ వూరకుండి మానవతీ! భయపడకుము. నీ లక్షణములు గన్న క్షత్త్రియాంగన యని స్పష్టమగుచున్నది. సింహగర్జనలకు ధనుష్టంకారములకు భేరీభాంకారములకు క్షత్త్రియులు భయపడుదురే! ఊరడిల్లుమని వీఁపు దట్టి నీ వీ దేవాలయమునందే యుండుము; నేనిదే వచ్చెదనని సమ్మతిఁ జెప్పి చేతులు విడిపించి వెనుకకుం దోడ్కొని దేవాలయముననే విడిచిపెట్టి యుతం డపరాధుల బంధించియున్న దిశంబట్టి చనియె. మఱి కొంతదడవరుగఁ దూర్పు తెల్లవారె; అరుణకిరణము లన్నిదిక్కులయందును బ్రసరించుచుండె;

లోమకేశుండును బ్రాహ్మణులును మేల్కాంచిరి. ఆపురుషుం డెందేగెనని లోమకేశుఁడు బ్రాహ్మణుల నడిగె. మేమెఱుంగమని వారు చెప్పిరి. అపరాధులను బంధించిన స్థలమునకుఁ బోయి వారినిఁ బట్టుకొనివచ్చెదనని వెళ్ళియున్నవాఁడని భువనమోహిని బ్రాహ్మణులతోఁ జెప్పె. తన కిదే సమయమనియు నొంటిపాటు తటస్థించి యున్నదనియు నేదియో మాయ గావించి యాతని సంహరించియే తీరవలయు ననుకొని, బ్రాహ్మణోత్తములారా! ఆ దురాత్మ లెవ్వరో నేనును జని చూచి యాతనికిఁ దోడై యిచటి కీడ్చుకొనివచ్చెదనని లోమకేశుఁ డనియె. మంచిదని బ్రాహ్మణులు చెప్పిరి. సగమువీడ పీడినదని భువనమోహిని గొణిగె. అతం డామాటవినియు విననిరీతిగా దేవాలయము దాఁటి లజ్జారోషములు బెనుగొనుచుండ వెడలిపోయె. ప్రాతఃకాలకృత్యము లొనర్చుటకై బ్రాహ్మణు లాసమీపమునందున్న జలాశయముచెంత కరుగుచు తల్లీ! నీవిందే యుండుము; భయపడకుము; సంధ్యావందనాదు లొనర్చుకొని త్వరలోఁ జనుదెంచెదమని చెప్పి వారు వెడలిపోయిరి. ఆ కాంతయు జెక్కిట జేయిచేర్చి ప్రాణభీతిచే పాతివ్రత్యధర్మమును గమనింపక పరపురుషునికరస్పర్శయు నాలింగనమును సల్పితిని. లోమకేశుం డిట్లాడె. నే నెంత యవివేకురాలనైతిని; ఉదారణాశక్తి లేనికాంత తనవ్రతమును గాపాడుకొనఁజాలునే? సింహము గర్జించినమాత్రమున నతనిం దబ్బుకొనఁదగునా? ఛీ! నాజన్మమంతయు మానహానికరముగా బరిణమించుచున్నదని కంటఁ దడిపెట్టి వామపదాంగుష్ఠముచే నేల రాయుచుండె. అంత నకస్మాత్తుగా దేవాలయమంతయుఁ బొగగ్రమ్ముకొనియె. ఆమె భయపడి చూచుచుండ గన్నులు

మాఱఁతబడునంతటి కాంతిచే నా ధూమమధ్యమునుండి ఖడ్గ కాంతి గానుపించె. భోరను శబ్దము బొడమె. దిక్కుతోఁచక భయపడి యామె కన్నులు మూసికొనియె. ఒక్కక్షణములో నకస్మాత్తుగా నామె యంతర్హితయయ్యె. భోరను శబ్దమును విని జలాశయమునుండి బ్రాహ్మణులు బయలువిడివచ్చి చూడ భువనమోహిని లేకుండె. సుశీల నిదేమియో యని యనుకొనుచుఁ బిలుచుచు నఱచుచు వారెందో చనిరి.

## ౫ అన్వేషణ ప్రకరణము

సుశీ లాంతర్హిత యైనంతనే యున్మత్తునిరీతి శ్రీపాద బ్రహ్మచారి కోనలలో దూరుచు గుహాలయం దరయుచుఁ దిరిగి తిరిగి దుఃఖించుచు నాహార మాసింపక నీరముం గోరక కొటుల సంకోచస్థలము లగుపడినను;

క. శీలాచారసుశీలా,
బాలా బాలేందుఫాల పల్కవిదేలా
యేలా గైకొవాగద నా,
మాలిమి వీడకను జూచి మయిలల లలనా.

సీ. కలకాల మిటు గానకను జీరుచుండఁగా
నో యనవేల నోహో సుశీల
ఘనసారగంధి నామన సారయంగ నీ
పాదరిండ్ల నున్నావో పువ్వుబోణి
కఱకుటసురులు నిన్ను నణఁకిరో కొట్టికిరో
యెటుబోయితో గదే యిందువదన

నాపై నిప్రేమంబు లోపమైయుండిన
తల్లిదండ్రులనైన దలఁపరాదె
జాలిఁ జెందితి నీలీల మేలమేల
పాలితునిలీల జూడకో భ్రమరవేణి
రావె ననుగాంచ వేవేగ రావు లేల
శీలగుణజాల చాల సుశీలబాలా

తల్లిదండ్రుల విడిచితి; చదువుఁ జాలించితి; గురుసేవ విడనాడితి; సర్వము నీవే యని భావించియున్న నన్నిట్లు యల జడి నొందింపకుము.

మ. తమిగాంధర్వము గోరుచున్నయది చిత్తంబు త్తలంబయ్యె ని
క్కము కామునిగెలువంగ సాధనమహాశోకంజాక్షి గారింపకే
గమికర్మిక్రుతుండై యరణ్యములలోఁ గష్టంబులం జెంది నీ
సమరాలింగన మేను గోరితిని కాంతిని దీర్పవే మానినీ.

తరుణీ! నన్నలయించుట కిదియేనా సమయము? ఇదే యెందో డాఁగియున్నదానవు. అదిగో;

ఉ. ఈతరునీడ నుండినను నిచ్చలుగాంచి భ్రమింపఁజేయ ని
వాతరుకుంజపుంజములయందు మఱింగితి కావె జూచితిని
పీతదుకూలరేఖ లివె పెంపెసలారె తటిల్లతాగతిని
హా! తరుణీ! సుశీల! హృదయంబున నాఁటిమరుల్ దలంపవే.

అని యున్మత్తుండై చెట్లచాటున వెదకి నటఁ గానరా కున్న మఱల;

క. శీలాచారసుశీలా,
బాలా బాలేందుఫాల పల్కవిదేలా
యేలాగైతివో గద నా,
మాలిమి వీడకను జూచి మయిలల లలనా.

అయ్యో! ఇంకఁ జూడఁగలనా? యమునానదీతీరమున సైకతస్థలియం దానాఁడు మన మిరువురమై యున్నప్పుడు.

మ. అరవిందానన జూచితే కమలనాళాహారముల్ గాంచి మై,
మొరపుం బెట్టుచు రెక్కలార్చుచును దా నొయ్యారముం
జూపుచుల్, పరటల్ గూరఁగఁ జేరునంచఁ గని దవ్వై
పోయె నివేగతిల్, నరుకోర్కుల్ నెఱవేర్తువో యిటులనే
వర్తించెదో పైదలీ.

అని నేనాఁడు నర్మోక్తులు విని లజ్జాభరముచే లేని కోపంబును దెచ్చుకొని కనుబొమలు ముడివడ జాఱుకుచుఱుకున యపాంగవీక్షణంబుల నన్నుంజూచి యెందులకే నలయుదునో యని మఱలఁ జెఱునవ్వు నవ్వి నాహృదయం బపహరింప లేదో; ఇదే యిచ్చటఁ బొదరిల్లు అగుపడుచున్నది చూచెద నని అటకుం బోయి;

క. శీలాచార సుశీలా,
బాలా బాలేందుఫాల పల్లవిదేలా
యేలాగ్గ తివో గద నా,
మాలిమి పీడకను జూచి మయిలల లలనా.

ప్రత్యుత్తరము రాకున్న నిర్విణ్ణుఁడై పక్షులను వృక్షములం గాంచి.

గీ. లికుచతరువర! గంటివే; లికుచకుచను
భృంగభూపాల! జూచితే; భృంగకచను
శుకకులేశ్వర! గంటివే; శుకసుచను
కరుణతోఁ జెప్పుడీ మీరు కాంతతెఱఁగు.

ఇం కెందుఁ గలదు. ఏదురాత్ములచే నేమిపాటు బడెనో, అయ్యో! అదిగో; నే నెంత బేలనైతి! ఈ పొదరిండ్లయందే యగుపడి మఱల నెందెందు వెదకినను గానరాకున్నావు. నేఁ బలుమాఱు బిలచుచుండినను;

క. వినలేదో యిటు లేవో,
కనియున్నను బల్కరింపఁగా మనసీదో
మనోన యేమనియెదవో,
తనుమధ్యా యింకనైన దయఁ జూడగదే.

అయ్యో సుశీలా! బాలా యని వెఱ్ఱిబట్టినవానిరీతిఁ జూచుచు నఱచుచుఁ దిరుగుచుండఁ గొంతదూరమునం దొక సంబోధనారావము వినఁబడియె. అది విని యెవ్వరో తన్నుఁ బిలుచుచున్నవా రనుకొని యాలకించె. ఓశశాభానుభూపాలా! అని పిలుచుట స్పష్టపడియె. ఎవ్వరో యని యాదిశం గాంచుచుండ నొకబ్రాహ్మణుఁ డేఁబదియేండ్లవయస్సు గలవాఁడు మఱల మఱలఁ గశాభానుభూపాలా! యని పిలుచుచు నాతని చెంత కరుదెంచె. అయ్యా! మాసుశీలం జూచితివే! అని శ్రీపాదుఁ డడిగె. మాశశాభానుం గాంచితివే! అని యాబ్రాహ్మణుఁ డడిగె. వార లీరీతిఁ బ్రసంగ మొనరించిరి.

శ్రీపా:—ఆహా! మాశశాభానుని వెదకుచుఁ జనుదెంచిన పుణ్యాత్ములు మీరెవరండీ!

బ్రా:—నే నెవరైన నేమి! మా శశాభానుఁ డనియెదవే, ఆతనికిని నీకును బాంధవ్యము గలదా! నీవు బ్రాహ్మణ బ్రహ్మచారివలె నగుపడుచున్నావు. నీ వీ యరణ్యమునం దొంటిగా నుండుట కేమి కారణము!

శ్రీపా:—నే నుండుట మాసుశీలకొఱకు.

బ్రా:—సుశీల యెవరు?

శ్రీపా:—సుబ్రహ్మణ్యశర్మ కూఁతురు.

బ్రా:—ఆమె యీయరణ్యమున నెందుల కున్నది? నీతలి దండ్రు లెవరు? ఎందున్నారు? ఆ సుశీలకు నీకును దాంపత్యము గలదా? ఎవరైన నె త్తికొనివచ్చి యున్నవారా? నిన్ను విడిచి జనుదెంచినదా? నీకథయంతయుఁ దెల్పుము.

శ్రీపా:—మాసుశీల మీకగపడెనా? మాటలాడితిరా? కళాభానుని జూచితిరా? మీయూ రెయ్యది? మీ రెందుల కాకళాభానుని వెదకుచున్నారు? సుశీల యెవరు? కళాభాను డెవఁడు?

బ్రా:—అయ్యో! ఏమిట్లు మాటలాడుచున్నావు?

శ్రీపా:—నేను సుశీలను వెదకుచున్నాను. ఆ సుశీలయే కదా కళాభానుఁడు. కళాభానుఁడే గదా నీవు. కాదు. ఆ కళాభానుఁడు నేను. మాసుశీలకు మిత్రుఁడను. నీవే సుశీలవై యుండవలయు. సుశీలకు దిగ్భ్రమింగితి వేమి? మాట్లాడకున్నావు. పాపము, నీ కేమి తెలియును. మాట్లాడుచున్నావే? అదిగో మాసుశీల. చెట్లచాటునకు బోవుచున్నది నన్ను బిలుచుచున్నది. పోయెదనని యేమేమో మాటలాడుచు;

క. శీలాచార సుశీలా,
బాలా బాలేందుఫాల పల్కవిదేలా
యేలా గైతివొ గద నా,
మాలిమి వీడకను జూచి మయిలల లలనా.

అని యఱచుచుఁ జెట్లచాటునకుఁ బరువెత్తె ఆ బ్రాహ్మణున కేమియుండో(పక సీతఁ దున్మాదావస్థయం దున్నవాఁడే! పాపము; పిల్లవాని కెంతటి యవస్థ సంభవించినది. ఇతరవృత్తాంత మరయుదమన్న నొకమాట కొకమాట సంబంధము లేక మాట్లాడుచున్నవాఁడే; యేమి చేయనలయుఁ! గానిమ్ము. ఈతని వెంటఁజని కొంతవఱకు బోధించి శైత్యోపచారములొనర్చి యీతని వృత్తాంత మెఱింగెదనని యనుకొనుచుఁ బోయి కర్పూరకదళీదళం బొకటి చేతం బట్టుకొని యటునిటుఁ దిరుగుచు సుశీలా! నిన్ను గైకొనిచనిన పురాత్ములు నీ తనూవిలాసంబంతయు నీయరణ్యములపాలొనర్చి నిన్నచ్చటనో దాచి యున్నవారు. ఈ యరఁటియాకుచే మాఁడుమాఁర్లువీచి, రమ్ము సుశీలా! రమ్ము సుశీలా! యనిన రాకుందువే? కుందములుగదా! నీరదనములు ఇట్లేయెన్నియో గలవు నవ్వితివేల? సుశీలా! నాకవి మెన్నఁడుపయోగింపఁ కుందును. నీ తనూవిలాస మభివర్ణించుటకు నొక్కపద్యమల్లుటకే నాచేతఁగాకున్నదే? ఇంతిమాత్రమునకే నేను శ్రీపాదకవినఁట, శ్రీపాదకవీశ్వరుఁడఁట. శ్రీపాదకవీంద్రుఁడఁట, శ్రీపాదకవిబ్రహ్మనఁట. అయ్యో! నాకే నవ్వు వచ్చుచున్నది. మా సుశీలను వర్ణించిన దేకవిత్వము; మా సుశీలను వర్ణించువారే కవులు. నేను కవినిగానా? సుశీలా నేనింతగా బిలుచున్నను గనికరింపవేల? రమణీ! యమునానదీకల్లోల శీకరంబులం దడిసి తత్తటినీహృదయంగమసికతాతలంబులం దాసీనవై యపాంగవీక్షణంబులఁ దిలకించి కించిత్పరిహాసిత వదనారవిందవై యలనాఁడాడిన నర్మగర్భోక్తుల నెడి సుధారసధార లీనాఁడుం దులకించి నాపరితాపాతపం బాఱఁద్రోలు మాపితరులసన్నిధి

నధికలజ్జాభరముచే నన్నుఁ దేఱిజూచుటకే శంకించుచు వారు మఱుఁగైన నదేసందుగొని కుందగుచ్ఛంబును విసరి నాహృదయమునకు వైచి నే మఱలఁ బుష్పబంధము విసరినది తప్పించుకొనుటకు యతిశీఘ్రయానమునఁ బితరుల సన్నిధికేగి తెలియనిదానిరీతి నటించుచుండలేదా? ఆ నటన; ఆ చూపు; ఆ మాలిక; ఆ మరులు; ఆ విరాళి; ఆ నర్మగర్భములు మఱచితివో? ఆ విశ్వాసమును నీ హృదయపీఠమునుండి చెఱచితివో? నిన్నెత్తికొనిపోయిన దురాత్ము లేదేని బాధపెట్టనుంకించిన నన్నుదఁటి యుఱచితివో? నిన్ను బాసి భూమియందుండుటెట్లు? అని యనుకొనుచున్న శ్రీపాదుని చెంతఁ జేరి నావిశ్వాసుండర్భకా! యెందులకింతపరితపించెదవు? మీ సుశీలను నేఁ జూపెద; ఇంకఁ బిలువకుము; అలయకుము; రమ్ము రమ్మని కరంబుఁబట్టికొనఁ బోయిన, నోహో వచ్చితివా సుశీలా! యెందులకు స్త్రీవేషము విడిచి పురుషవేషము ధరించియున్నావు? నన్ను మోసగించుట కిటులున్నావోయని యాలింగనం బొనర్చుటకై చనుదెంచె. అదిగాంచి బాలకా! ఇట్లున్మాదమువహించు బ్రాహ్మణుని నే నెందును గాంచలేదు; మీ సుశీలను నే జూచియున్నాను; నా వెంటరమ్ము; నా మాట నమ్ముము; నీ పేరేమియో చెప్పుమని చేతింబట్టికొని తన చెంబునందున్న జలము నాతనిముఖముపైనం జల్లె. జలస్పర్శయైనంతనే కొంతప్రజ్ఞ గలిగి నలుదిశలం బరికించి తా నరణ్యమున నున్నామనియుఁ, దన్నొక బ్రాహ్మణుఁడు మాట్లాడించుచున్నావాఁ డనుకొని; మహాత్మా! మీ రెవరో పుణ్యపురుషు లీ యరణ్యమున కెందులకుఁ జనుదెంచితిరనియె. బాలకా! నే నెవరయినది మఱలవివరింతు. ఇప్పుడు సాయం

కాలమైనది; ఈ పుణ్యనదియందుఁ గాలకృత్యములు దీర్చి కొనివత్తము రమ్మని బ్రాహ్మణుండనియె. అక్కటా! నేను సంధ్యావందన మొనరించి యెన్నిదినములయినదో నాకే జ్ఞాపకములేదు; సుశీలావియోగసంతాప భూయిష్ఠుఁడనై యన్నియును మఱచియున్నవాఁడనని శ్రీపాదుఁడు జెప్పె. నాయనా! మనము బ్రాహ్మణులము. పరమేశ్వరుఁడు గుణ కర్మములు విభజించి యీ యీవర్ణములవారి కీయీవృత్తు లాచరణీయమని నియమించి యున్నవాఁడు; మనవృత్తులు మనమే యాచరింపకున్న నిఁక నాచరించువారెవ్వరు; నీవు బ్రాహ్మణ బ్రహ్మచారివి; యజ్ఞేశ్వరు నర్చించుటో, గురు శుశ్రూష చేయుటో, అధ్యయనము జదువుటో విడిచి యన వరతము సుశీలావియోగ సారముగ్నుఁడవై స్నానసంధ్యాదులు మఱచి దైవోపాసనవిడనాడి గురుశుశ్రూష విసర్జించి చదు వుటమాని యరణ్యమున నొంటరిపాటున నిట్లు సుశీలా! సుశీలా! యని కలవరింపుచున్న బ్రాహ్మణవర్ణజాతుఁడ వైనను నిక్కమూరయ బీజమాత్ర బ్రాహ్మణుఁడవేగాని గుణకర్మసహిత బ్రాహ్మణుఁడవు కావు. కర్మచండాలుని కన్నను జాతిచండాలుఁ డుత్తముడని పెద్దలు వచింతురు. కర్మభ్రష్టుఁడే కర్మచండాలుఁ డగును. ఛీ! చాలుఁ జాలు; రమ్మని పిలుచుకొనిపోయి యమ్మహానదియందు స్నాన సంధ్యావందనాదు లొనరించి యొకశిలాతలంబుపైఁ గూర్చుండి తనచెంత నున్న సత్తు వాతనికిఁ గొంచె మొసఁగి తానును భుజించి, నాయనా! నీ వృత్తాంత మెఱింగింపు మన్న శ్రీపా దుఁడు దనకథ సంక్షేపముగా వివరింపఁదొడఁగె. మాది కాశీనగరము; మాతండ్రి సూర్యనారాయణశాస్త్రి; మాతల్లి

శ్రీదేవి; నాపేరు శ్రీపాదుఁడు; నేను ఆనందవనమునందున్న భట్టపాదులవారియొద్ద తర్కశాస్త్ర మభ్యసించుచుఁ గడచిన మాఘమాసమున స్నానార్థమై ప్రయాగకరగి ధర్మశాలయం దావాసముగాను సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కూతురగు సుశీలను పాణిగ్రహణ మొందుటకు సమ్మతించి యన్యోన్యప్రేమానుబంధమున విజృంభించుచు స్నానమాచరించుచు వారిచెంతనే యుంటిని. ఒకానొక దినమునందా సుబ్రహ్మణ్యశర్మగారు కుటుంబసమేతముగా వేకువనే త్రివేణీసంఘమమునందు స్నానమాచరించి ధర్మశాల కరుదెంచుచుండ నకస్మాత్తుగా వారి కూఁతురగు సుశీల యంతర్హితయయ్యె. నే నాసతిని వెదకుచు వెదకుచు నాలుగైదుమాసములనుండి యరణ్యములలోనే యున్నవాఁడ ననిన; అయ్యో సుబ్రహ్మణ్యా! నీయవస్థ తుద కేరీతి పరిణమించెరా; చెల్లెలా సుమతీ! నిన్ను జూడవలెనని యెన్నియోమార్గములనుకొని విధిలేక మానుకొని యుంటిని; తుదకు నినుఁ జూచుటకే భాగ్యము లేకపోయెనే! అమ్మాయీ! నిన్ను వెదకుచు మాసుబ్రహ్మణ్యుఁడెం దెందవస్థపడుచున్నాఁడో! దైవమా! ఎవ్వరెవ్వరి కేరీతిఁ జరుగునదియు దెలియునుగదా! మహావైభవమున మహేంద్రవరమున నరేంద్రచంద్రమహారాజునొద్ద నమేయసౌఖ్యంబు లొందుచున్న నీ కెట్టి విపత్తులు తటస్థించెనో యని బ్రాహ్మణుఁడు దుఃఖించె. శ్రీపాదుఁడు నిర్విణ్ణుఁడై మహదాశ్చర్యమగ్నుఁడై; అయ్యా! మీ రెవ్వరు? సుశీల మీ కేమికావలయు? మీచరిత్ర విమర్శించవలెనని ప్రార్థించు చున్నాననిన; నాపేరు విశ్వావసుశర్మ; నాయూరు హరిద్వారము, మీమామ సుబ్రహ్మణ్యశర్మ యాత్రార్థమై నరేంద్రచంద్రమహారాజుగారి

వెంట హరిద్వారమునకువచ్చి గంగాద్వారమున స్నానము సేయుచుండ మాతండ్రి వాసుదేవశాస్త్రిగారు సంతసించి నాచెల్లెలు సుమతి నొసంగె. వారుభయులు సంతోషముచే మహేంద్రవరముచేరిరి. నే నప్పుడప్పుడు మహేంద్రవరము నకుఁబోయి చూచి వచ్చుచుంటిని గాని మాతండ్రిగారు కాల ధర్మ మొందినయనంతర మతిభాధలచే ననుకూలపడదయ్యె. అతనికి స్థానభ్రష్టత్వము కలిగినదనియుఁ, బ్రయాగయం దున్నవాఁడనియు విని పోయి చూచివత్తమని యనుకొని యుంటిని. తుద కీగతిఁ బరిణమించె? ఏమిసేయుదునని దుఃఖించి, నాయనా! శ్రీపాదా! నీ వీ యరణ్యమున సంచరిం పకుము. మీ తల్లిదండ్రు లెంత దుఃఖించు చుందురో, పాపము. నీవు కాశీనగరమునకు వెళ్లుము. నేనును గళాభాను నార యుచు నందె దైనా సుశీలయునికిఁ దెలిసిన తగుప్రయత్న మొనర్చి విపత్తునుండి తప్పించుకొని జనుదెంచెద. పొమ్ము, సుఖంబున నుండుమనిన, స్వామీ! నా సహపాఠియైన కళా భానునికొఱ కెందులకు వెదకుచున్నారని శ్రీపాదుఁ డడిగిన మఱల వా రీరీతి సంభాషించిరి.

విశ్వే:—ఏమీ, కళాభానుఁడు నీ సహపాఠియా? ఏగురువు నొద్దఁ జదువుకొంటిరి.

శ్రీపా:—ఆనందవనములో భట్టపాదాచార్యులయొద్ద నేను తర్కశాస్త్ర మభ్యసించుచుంటిని. ఒకానొక దినము దీకళాభానుఁడు మాగురువుల చెంతకుఁ జనుదెంచి పాదాభి వందనములొనర్చి వారియనుమతిచే నొకచోఁ గూర్చుండి ప్రసంగవశమున వారిరువురికి వాక్యార్థముజరిగె. వ్యాక రణ భాగములలో నుభయులును మహాపాండిత్యముతో

రెండుదినములు పోరాడిరి. ఆహా! ఆకళాభానుని మేధాశక్తి నేనేమని చెప్పుదు, మూఁడు వ్యాకరణములయం దద్భుత పాండిత పాండిత్యవైఖరి గలిగియుండుటచే మాగురువులు పరాభవముచెంది, బాలకా! నీవు దేవాంశసంభూతుఁడవేగాని మానవుఁడుగాదని యగ్గించె. అంత విద్యావంతుఁడయ్యును గర్వపడక మాగురువులచెంత భయనమ్రతలు జూపుచు మిగులభక్తిగలిగి వర్తించుచు. మహాత్మా! జ్యోతిషశాస్త్రమును గవిత్వలక్షణమును నాకుఁ దెలియఁజేయవలయునని ప్రార్థించె. మా గురువు లామోదించి పుత్రా! నీకన్న నాకు ముఖ్యశిష్యుఁడు గలఁడే? అవశ్యముగా నెఱింగెదనని చెప్పిరి. మూఁడు మాసములకే యా విద్యల రెంటియందును మహోపాధ్యాయుఁడయ్యె. అపుడు మేమిరువుర మత్యంతమిత్రులమై సహపాఠులమై యుంటిమి. తర్కశాస్త్రమం దొకటి పూర్వపక్షము నైనను సిద్ధాంతీకరించలేకపోయితి. మా ప్రతిభ నే నేమిచెప్పుదు? అట్టి మహానుభావుని వెదకుచు నరణ్యములలో నిడుమలుబడుచున్న మీ రెంతటి మహనీయులో యని సంతోషపడుచున్నవాఁడ. నాఁడు మా గురువుచెంత సెలవుగైకొని నైమిశారణ్యమున కా కళాభానుఁడు వెడలె. మీరిచ్చట వెదకుచున్నా రెందులకు?

విశ్వా:—మృగయావినోదార్థమై శబరార్భకులతో నిచ్చట నున్నవాఁడని యాశ్రమశిష్యులచే నెఱింగి చనుదెంచి యిచ్చట వెదకుచున్నాఁడ.

శ్రీపా:—అమ్మహాపురుషునితో మీ కంతటి త్వరయైన కార్యమేదేనిఁ గలదా? వినఁదలఁచి యున్నాను.

విశ్వా:—నేను మాహరిద్వార రాజకుమారుఁడయిన బృహద్వర్మచిత్రపటముఁ గైకొని పాంచాలదేశమున మణిస్యందనపట్టణేశుఁడైన విభావసుమహారాజకుమారితయగు భువనమోహినీదేవి చెంతకుఁ దీసికొనిపోయి యుంటిని. ఆకన్యక మహామేధాశాలిని. ఏరాజపుత్త్రుని చిత్రపటము గాంచినను ముఖవిలాసములోనే యాతని గుణగణము లన్నియు విమర్శించి యాతనియందున్న ప్రధాన దుర్గుణము లుగ్గడించి యితని నే వరింపనని చెప్పుచుండును. మారాజసుతుని పటమును జూచినపు డేమి చెప్పునో యని చూచుచుండ నితనికి వామకరాంగుష్ఠనఖమధ్యమునం దొక కృష్ణమచ్చ గలదు. అందుచే నీతఁడు రాజ్యభ్రష్టుఁడగును. మఱియు నీతని వామజానుజంఘులమధ్యమునం దొక గ్రంథి గలదు. అందుచే నితఁడు ముప్పదియాఱవవత్సరమున సన్న్యాసంచారి యగును గాన నితని నే వరియింపననియె. ఇంతటి నిశ్చయ విషయము లుగ్గడించెడి మహామేధాశాలిని కీ కళాభానుఁడే తగువరుఁడని యతని ప్రతిభ నే నెఱుంగుదును గాన నామె చెంత నితని గుణము లుగ్గడించితి. కించిన్మీలితలోచనయై యోచించి యాతఁడే తనవరుఁడని నిశ్చయించి తనవేడికో లమ్మహాత్మున కెఱింగింప వలయునని నన్నుఁ బ్రార్థించి యొకపత్త్రికా ముఖమునఁ దనహృదయము ప్రకటపఱచి యొసంగియున్నది. ఈ వృత్తాంత మాతనికిం దెలియపఱచి పత్త్రిక యొసంగుటకే యిందు వచ్చియున్నవాఁడ.

శ్రీపా:—ఆతనికిని మీకును బరిచయ మెట్లు గలిగె? మీ రాతని నెచ్చటఁ గాంచి యుంటిరి.

విశ్వా:—హరిద్వారమహారాజుగారి యాస్థానమునం దొక
నొకదినమున విద్వత్పరీక్షసభ చేరె. దానిలో నితం డొక్క
సభ్యుఁడుగా నుండె. బాలకా! నేనేమి చెప్పుదు. ఎవ్వ
రెవ్వ రేయేవిద్యలలో దక్షులవారలం గెలిచి యుందురో
వారినందఱి నాయావిద్యలయందు పరాభూతులం గావించి
జయపత్రికంబునుం బొంది సకలవిద్యాసార్వభౌముఁడని
మహాసభలో నభిషేకింపఁబడి గజారోహణుఁడై యాపట్టణ
మంతయు మంగళవాద్యములతో నుత్సవంబయ్యె. అతని
వాగ్జృంభణయు నాపాండిత్య మాకవిత్వధోరణియు నా
జ్యోతిషప్రభావము నాధనుర్విద్యాప్రౌఢిమయు వేయేల?
అతఁ డెఱుంగనివిద్య యీ ప్రపంచమునందే లేదని యను
కొని యున్నవాఁడ. నే నా రాజపురోహితుఁడు నగుటచే
మాయింటనే యాతని కతిథిసత్కారము లొనర్ప మా
రాజుగా రాజ్ఞ రొసంగియుండిరి. అప్పుడె యాతనికిని
నాకును నెక్కువపరిచయము గలిగియుండెను అప్పుడు
దప్ప మఱల నే నాతనిఁ జూడలేదు. ఈ పత్రికను నాతని
కొసంగవలయును. అందుచేఁ జనుదెంచితి. నీ వింకనిం
దుండకుము. పురంబున కరుగుము. ఈ రాత్రి నిటనుండి
యుదయముననే వెడలుమని యాతం డాశిలాతలంబుపై
నిద్రించె. శ్రీపాదునకు నిద్రరాక సుశీలయందే మమత
నుంచుకొని యిట్లని వితర్కించె.

సీ. చెలి! మధురసధార లొలుకఁగా నొకమాట
బలుకవే నామనోజ్వలము గాఁగ
ఘనతరాపాంగ వీక్షణముచే నొకమారు
జూడవే నామనఃపీడ వీడ

బాహువల్లరితోడఁ బరిరంభణానంద
  మయ్యుఁ జేయవే మనోభయము దూఁగ
కనకకుంభోపమ స్తనయుగళంబులు
  గ్రుమ్మవే మన్మథుదొమ్మి మాన్ప

గీ. హా లతాంతాంగి! హా చంద్రహాస! హా ప్ర
వాళ! యధరోష్ఠ! హా మనోజ్ఞానవాల!
హా ధనుర్భ్రూప్రదేశ! హా హా సుశీల!
రావె కరుణింపవే వేగ రా వదేల.

క. ఘననూతనసంభవయా,
వనమునఁ గడులజ్జచేత వరలెడిముగ్ధ
ప్రణయోక్తు లాడినామన,
మునఁ గల తాపంబు మాన్పు ముద్దులబాలా!

చ. కడచెనె నైదుమాసములు గానఁగరాదు లతాంతగంధియే
యడవులలోనఁజిక్కి—మహాదాత్రిని దూలుచు నేడ్చుచున్నదో
విడిచెనొ ప్రాణవాయువులు వేసటనొంది నన్నుఁ దలంచెనో
తడఁబడెఁ జిత్తమిత్తఱిని దప్పి జనించె నిఁకేమి సేయుదున్.

అని తలంచుచు మైమఱచి నిద్రించె.

# ౬ గుహాప్రకరణము

రాత్రి మూఁడవయామము కృష్ణపక్షమగుటచేఁ జంద్ర భగవానుఁ డప్పుడే యుదయించి తన చల్లనికిరణములచేఁ బ్రపంచమునకును జీవకోటికిని యాప్యాయమాన మొనరించు చుండె. మహాధావళ్యమైన యాకిరణములు బ్రహ్మాండ మంతయు నిండుటచేఁ బిండి యారఁబోసినట్లుండె. అది యొక భయంకరారణ్యము. క్రూరమృగము లొకప్రక్క భయంకర ముగా గర్జించుచుండె. మఱియొకప్రక్క ఘూకారవములు మనమునకుఁ భీతిఁ గొల్పుచుండె. అచ్చటనే తొల్లి కౌరవులు పాండవులు ప్రపంచ ప్రళయకరమగు యుద్ధ మొనర్చిరి. అందుచే నది ధర్మక్షేత్రమయిన కురుక్షేత్రమని ప్రసిద్ధి వహించియున్నది. శ్రీమదాదినారాయణమూర్తియొక్క యాఱవయవతారంబగు పరశురామమూర్తి తన పితృహంత కులపైఁ గలిగిన క్షాత్రముచే క్షత్రియుల నిరువదియొకమాఱు వధించి వారి రక్తముచేఁ బితృతర్పణ మొనరించిన శమంత పంచకమను నైదుసరోవరము లందుగలవు. ఆ సరోవరతీర మునం దొక విశాలశిలపై ముగ్గురు పురుషులు గూర్చుండి యీవిధముగా మాటలాడుచుండిరి. వారు మన భువన మోహినీ యపహారకులగు శకుంత వీర కౌశికులే.

వీరుఁడు:—కుమారులారా! తలవనితలంపుగాఁ జనుదెంచి తన ముష్టిప్రహారణములచే మనలం బడఁగొట్టి భువన మోహినిం బ్రాణాపాయమునుండి తప్పించిన యాతం డెవఁడుగా నుండవచ్చు?

శకుం:—అబ్బా! ఆతని దలఁచుకొన్న నా దేహము వడఁకు చున్నది. ఎంతటి భుజబలము గలదో! ఒక్క పెట్టునకే నా సంధిబంధములన్నియు సడలె. మఱియొక పెట్టునకు నేలఁ బడి పైకి లేవలేక పోయితి.

కాళీ:—నే నేమో తప్పించుకొని పఱువెత్తితిని. ఆతని పెట్టు బడియుండిన నీవఱకు నీయరణ్యముననే నా యంతమై యుండును.

శకుం:—తమ్ముఁడా! సి వేమాత్రమో యనుకొంటిని. ఆ దేవాలయమున బ్రాహ్మణుని చెంబుపోవునకే మూర్ఛిల్లి తివి. ఇఁక మహాభుజబలము గలవానిపోటున కెట్లు తాళు దువు? ఇఁక ముందు యుద్ధసమయముల నీవు వెనుక నుండ వలసినదే; ముందునకు రావలదు.

కాళీ:—అట్లనకుము. నేను బాలుఁడను. ఇదివఱకు నిట్టివి చూచియుండలేదు. ఇఁక ముందు జరుగఁబోవు నాప్రతాప మును దిలకించుచుండుము.

శకుం:—రాత్రి మా యిరువురను బంధించిన యమ్మహాపురు షుఁ డిప్పు డగుపడిన నేమి సేయుదువు?

కాళీ:—అంతటి భాగ్యమా. ఈ ఖడ్గధార కాతని బలియొసంగి నాకసిఁ దీర్చుకొననా? నేను దప్పించుకొని వెళ్ళకున్న మన ముర్వురము కట్టుబడి విడిపించుకొనుట కుపాయము లేక నఘోరించుచుందుము. నేనుగదా మీకుఁ గట్లు విప్పినది.

వీర:—ఉండనిమ్ము. భువనమోహిని మనచేతినుండి సడలె. ఆనూతనపురుషుఁ డుండిన మనకే గాదు, ఆతని తేజంబుఁ గన్న దేవతలైనను జయించి భువనమోహినిం గైకొనుట యసాధ్యము! ఇందుల కేమియు క్రిఁ బన్నవలయు?

శకుం:—అతని నెట్లైనను మోసగించి సంహరించిననే గాని మన కార్య మనుకూలపడదు. అతనిని సమయించుట కేమి యుపాయమో యనుకొనవలయు.

కాళి:—మన ముగ్వుర మేకముఖముగా నాతనిం దొడరినం జావక నిలుచునే? అందులకు యోచించు టేమి?

వీరు:—ఆహా! అపని సరికాదు. మనము ముగ్వురమే యగ వలదు, వేయిమందియైన నాతని తేజస్సునకే నిలుచుట సాధ్యము కాదు. ఎదిరించుమాట లనుకొననేల? మోస గించుట కేమియు క్తిం జేయవలెనో జెప్పుడు.

శకుం:—అప్పు డీచెట్లకు మనలను బంధించియుండెను గదా! తప్పించుకొన్న సంగతి యిదివఱ కాతనికిఁ దెలిసియుండదు ఎటులైనను మన నిమిత్తమై యాతఁడు దప్పక వచ్చును అప్పు డొంటిపాటవును. ఆవల సంగతి మీరే యోచింప వలయు?

వీరు:—కుమారులారా! వేఱుయోచన నాకుఁ దోఁచలేదు గాని నీవన్న మేర కాతఁడు జనుదెంచినంత నతఁడు చూచు నట్లుగా మనము పరుగెత్తవలయు. మన వెంటఁ దఱుము కొనివచ్చిన చిక్కినట్లు నటించుచు నటునిటుఁ ద్రిప్పుచుఁ గేడించి కికురించుచుఁ దొల్లి మాయామృగరూపధారియైన మారీచుఁ డెటువలె శ్రీరామచంద్రు నలయించి మోస గించెనో యటులనే యుత్తరముఖముగాఁ బఱువెత్తి యుం దున్న సుప్తముఖీగుహాలో మనముగ్వుర మేకముఖముగా బ్రవేశించి మఱియొక మార్గముంబట్టి బయలు వెడలు దము. ఆ మార్గము నాకుఁదప్ప నితరుల కెవ్వరికిం దెలి యదు. మనలఁ దఱుముకొనివచ్చి యతఁ డందుఁ బ్రవే

శించును. అవలన మన మూరెండుద్వారములకు బలమైన గుండ్లు సడ్డుపెట్టవచ్చు. మన మతిత్వరగా ముందుగా నాతఁడు చూచునట్టుగా ప్రవేశింపవలయు. ముందు వెనుక లయినంత కార్యము చెడును. ఆ గుహాలో దూరినేని యంతటితో సరి. ఆతని యంత మందే కాఁగలదు. అవల మన కన్ని కార్యములు కరతలామలకము. ఇందులకు మీ రేమందురు? త్వరగాఁ జెప్పుడు.

కాశి:—తండ్రీ! మీరాగుహం గాంచి బహుకాలమై యుండ నచ్చు. అం దిప్పుడు క్రూరమృగములో సర్పములో యావాసము గల్పించుకొని యుండవచ్చు. మనము ముప్వుర మొక టేతూరి యందులో ప్రవేశించితిమేని యతనికన్నను మునుపు మనము సొచ్చువారమగుటచే నాతనిం జంపఁబోయి మనమే యందులోఁ జావవలసివచ్చును. అట్లు గాదు. తొలుదొల్త మీరందుఁ బోయి గుహాద్వారములను గుహాను పరిశోధించి రెండుద్వారములలోను సరాసరి దూరిపోవుట కేయాటంకము లేకుండున ట్లొనర్చి గుహా ద్వారములు మూయుటకు బలమైన శిలలఁ బొందుపఱచి యుంచిన యావల మేమిరువురము జనుదెంచెద మనిన నిది సరియైన యోచనయని యా గుహామార్గమును తత్సంకేతముల నెఱింగించి వీరుఁడు ఖడ్గపాణియై వెడలె.

మన నూతనపురుషుఁ డపరాధులను బంధించిన వృక్షసమీపమున కేతెంచి వారగుపడమి యటునిటుఁ బరికించుచు దనమనమున నిట్లనుకొనియె. ఈ యపరాధులు చోరులవలె నగపడలేదు, వీరేదియోఁ కారణాంతరమున నీ కాంతను సంహరింపవలె ననియే యుద్దేశము గలవారై వచ్చినరీతి నగపడు

చున్నది. వీరేగాక యింకను వీరివా రచ్చటచ్చట నుండ వలయు, అపరాధులలోనే యొకం డపుడే తప్పించుకొని వెడలె నే నావిషయమును గమనించనైతి, శుద్ధ వేదజడుండగు విప్రుని వలె మునువెనుకల నరయక వారి నిచ్చట బంధించితి. తప్పించుకొన్న యతండో మఱియెవరో వీరిని బంధవిముక్తిం జేసియుందురు. ఇట్లు తప్పించుకొని పోయినవారిదే యెందో యుందురే గాని యూరక తమయునికిపట్టులకుం జనరు. ఈ కాంత నెట్లయినను వారి తల్లిదండ్రులచెంతం జేర్చి పోవల యునే గాని తుద కాబ్రాహ్మణులచేతి కప్పగించి నేను వెడలి నను మఱల నాకాంత కపాయము తటస్థించుట సిద్ధము. వీ రెందుండిన నుండవిమ్ము; ఆ కాంతను వారి పురము జేర్చు టకుం బ్రయత్నించవలయు ననుకొని దేవాలయాభిముఖుండై కొంతదూర మరుగువఱకు భువనమోహినీ! భువనమోహినీ! యను సంబోధనారావము వినంబడియె. మఱల నిదియేమో మోసము జరిగియున్నదనుకొని వడివడిగాం జనుదెంచుచుండ సుబ్రహ్మణ్యశర్మ సూర్యనారాయణశాస్త్రిగా రఱచుచుం బరువెత్తి వచ్చుచుండిరి. వారింగాంచి భువనమోహినికి మఱల నేమి విపత్తు తటస్థించియున్నదని యడిగె. అయ్యా! మీ రరి గిన యనంతరము లోమకేశుండు మీకు సహాయ మొసంగం బెద నని చనుదెంచె. అంతలో దెల్లవారె. మేము కాల్యకృత్యము లొనర్చుటకు జలాశయమున కరిగితిమి. దేవాలయములో భువనమోహిని యొక్క తెయే యుండె గొప్పధ్వని యొకటి గలిగె. మేము విని త్వరగా దేవాలయములోనికి వచ్చి చూడ భువనమోహిని లేకుండె. అందందు వెదకితిమి. కానరాదయ్యె. మీచెంత కరుదెంచి యున్నదేమో యని యరయుచు నఱ

చుచు వచ్చియున్నవారమని చెప్పి దుఃఖించిరి. ఆ మాటలు విన్నంతనే యమ్మహాత్ముఁడు దిగ్భ్రమఁ జెందె. మఱియు నతని కడుపునఁ జెయిపెట్టి కలఁచినట్టయ్యె. శోకము రోషము ముప్పిరిగొనుచుండ. కొంతవఱకట్లే స్తబ్ధుఁడై యుండి బ్రాహ్మణోత్తములారా! ఆ దురాత్ములు రాత్రి నాచేబంధితులై యెట్లో తప్పించుకొని పోయి మన మొక్కరును లేని సమయముఁ గనిపెట్టుకొనియుండి యీకాంతను మరల నపహరించి యుండవలయు. కార్యము మించినది. అయినదయినది. ఆ కాంత తెరువరయుఁ ద్వరగాఁ బ్రయత్నింపవలయు. ఇంక నాలస్య మొనరించిన మొదటికి మోసమువచ్చును. వారిపుడిపుడే గైకొనిపోయి యుందురు. మీరా దక్షిణదిశయందుఁ గల గిరికంధరములు లోయలను, మఱియు మఱుఁగగు స్థలములును జూడుఁడు. లోమకేశుఁడు మీకగపడెనేని తూర్పు దిశ నారయుమని చెప్పుడు; నేనిదె పశ్చిమోత్తరదిశగా వెదకుచుఁ జనియెద ననియె. ఆ బ్రాహ్మణు లిరువురు వెదకుచు నఱచుచు దక్షిణదిశగా వెడలిరి. మన నూతనపురుషుఁ డుత్తరాభిముఖుఁడై చిడిముడిపాటుతో శోకరోషము లుబ్బుఁత లూఁగ ధనుఃఖడ్గాదిసాధనములతోఁ గొంతదూరం బరుగనట జెట్లచాటునుండి యిరువురు మనుష్యు లుత్తరముఖముగా బఱువెత్తిరి. వారింగాంచి వీరే యాదురాత్ములు. నాచే బంధితులై తప్పించుకొన్నవారు. వీరై యుండవలయు. మునుపు తొలుతనే తప్పించుకొన్నవాఁ డింకను వీరితోఁ గలిసియుండి నట్టగపడలేదు వాఁడెందో నణఁగియుండి యొంటిపాటొట గనిపెట్టి మఱల నాకాంత నపహరించియుండవలయు. వీరందఱొకచోఁ గలియుట కెందో యొక సంకేతస్థలము గలదు.

అచ్చటికే నన్నుఁ గని పఱువెత్తుచున్నవారు, వీరెందు వోయి నను విడువక వెంటనే పోయి యాసంకేతస్థలమును గుర్తించిన నందే యాకాంతను సహా బంధించి సంహరించుట కుద్యుక్తులై యుందురు. ఆ సమయమున కొదిగి యాకాంతను మఱలఁ బ్రాణాపాయమునుండి తప్పింపవలయు ననుచు బహువేగముగాఁ బఱువెత్తుచుండె. ఆచోరు లొక గుహాముఖము చెంతకుం జని లోపలనుండి వచ్చు సంకేతధ్వని యాలకించి నిస్సందేహమని యాగుహాలోపలం బ్రవేశించిరి. అదిగాంచి యీగుహాయే వీరి సంకేతస్థల ముండవలెయు, ఆకాంత నీ యెడనే బంధించి దాచియుందురు. వీరు లోపల కరిగినతోడనే తప్పక వధింతురు, నేను త్వరగాఁ బోవలయుననుకొని ఆయుధముఁ జక్కఁగా బంధించుకొని యమ్మహాత్ముఁ డాగుహాముఖమును బ్రవేశించి వడివడిగాఁ జనుచుండె. ఎంతదూరమరిగినను వారి యునికియే గానరాదయ్యె. ఇంకను ముందున కరిగిన విశాలస్థల ముండవలయు నందందఱు గలిసియుందురనుకొనుచు గుహానుసరుఁడై కొంతదూరము వంగికొనియుఁ గొంతదూరము కూర్చుండియుఁ గొంతదూరము దోఁగియుఁ గొంతదూరము దేఁకియు నావల సాష్టాంగదండప్రణామములు చేయువానివలెఁ బొర్లబడి బరుకుచు నంధకారమున జిబ్బటీలమలము నాసికాపుటములు భేదిల్లుచుండఁ బోయి యెందు గన్నను వెలుతురుగాని సరియైన మార్గముగాని యగుపడక బొర్లబడి బరుకుచుఁ జని ఱాతిసందులో నిఱికికొని కదలుటకు మెదలుటకు వీలుపడక ఓహో! ఆ దురాత్ములు నన్ను మోసగించి యుండుట నిశ్చయము. ఈగుహాయందే నన్నంత మొనరించవలెనని యిందు బ్రవేశపెట్టి వారేదియో యొకమార్గము

దెలిసియుండి వెడలిపోయి యున్నవారు. ఇంతటి ప్రయత్నము గలవా రూరకబోయి యుండరు. గుహాద్వారములకు బలమైన శిలల నడ్డము ద్రోసియే పోయియుందురు. ఎట్టిశిల లడ్డమున్నను నాపాదఘాతమునకు నిలువవు గాని నే నిటనుండి మరల గుహాముఖముచెంత కేరీతిఁ బోవలయును? చిక్కికొనియున్నవాఁడ. అయినది మోసమైనది. ఇఁక బ్రతుకుట దుర్లభము. నా యాశ వదులుకొనవలసినదే! అయ్యో!

సీ. ముసలితనంబుచే మూలెడిమాతల్లి
నను గాన కెంత సంతాపపడునొ
బహుతపంబులచేత బడలినమాతండ్రి
నను గాన కెంత సంతాపపడునొ
పరమపతివ్రతాచరితయౌ యుక్కాంత
నను గాన కెంత సంతాపపడునొ
తనకష్ట మీడేర్చు ననెడి బేతాళుండు
నను గాన కెంత సంతాపపడునొ
గీ. శబరశాబకు లెందెందుఁ జనిరొకో
ప్రతిన యేమయ్యెనోకో నా బ్రతుకుదెరువు
లేదు లేదీమహాగుహయేఁ దలంప
విధిని దాఁటంగ నౌనె యాశీధికిన్న న.

ఉ. పుట్టితి క్షత్త్రవంశమున భూసురదత్త సమస్తవిద్యలన్
మెట్టితి నార్యమధ్యమున మేదినిలోఁ బ్రకటప్రతాపతన్
దొట్టితి సుప్రసిద్ధకవిధూర్జటి నైతిని తెక్కతేర కీ
గుట్టలలోనఁ బ్రాణములు గోల్పడఁ గాంచితినయ్యొ దైవమా
ఉ. కానఁగ రాదు చీఁకటి వికాసము గల్గదు పాపిచీపరల్
వీనులు బ్రాఁగ బ్రామసెడిని వెల్గది యెచ్చటలేదు శ్రీహరి

ధ్యానము సేతమన్న మది దక్కదచంచలమార్గమందుహా
యేనరుఁ డెట్టివేళల నదేగతి బట్టునొ గానరాదుగా.

మ. వ్రతదానార్చనయాత్రలంబడలి సుత్రామాదులున్మెచ్చగా
క్రతుహోమాదులొనర్చినన్ బడసిసౌఖ్యంబేమియున్ లేకదుః
స్థితులై వార్ధకమందు పుత్రహతిగాసిన్ జెందునట్లాయె నా
పితరుల్ వారలఁ దేర్చువారలెవరో ప్రేమాతిరేకంబునన్.

మ. ఒకరిన్ ముప్పుననుండి గాచెదిని సుదీయోద్దండదోశ్శక్తిహా
నికలంబయ్యెను నిర్నిమిత్తముగ నావృత్తాంతమున్ జెప్పవా
రొకరైనన్ గలరేయి కేమిగతియో యాయుక్తబు యోచింపలే
కకటా వచ్చితినింద్రుఁ జొచ్చితిను హాహంకారుఁడై చచ్చితిన్.

శా. చండాంశుప్రకట ప్రతాపతరవిశ్వస్తంభనద్వేషణో
ద్దండాఘోరకఠోరమంత్రశతవిద్యాపౌష్టిమాడంబరా
ఖండోదీర్ణమహాప్రభావస్ఫురః ఖండాట్టహాసోగ్రుఁ డౌ
ఛేండాభైరవునెట్లు ద్రుంపుదునికన్ భీమాగ్రమాంతంబునన్

ఉ. రెండుదినంబులయ్యెనిట క్రూరగుహాంతరమందుఁ జిక్కినో
రెండె నపానప్రాణములవృత్తులు దగ్గె దృఢత్వమాగె బ్ర
హ్మాండము భగ్నమైనగతియయ్యెను జిత్తముతత్తతిల్లె నె
వ్వండొ పరాత్పరుండతఁడు పాలనసేయఁగరాడొ లెండొకో

మ. అకటా! భారతభూనృపాలముకుటోద్యద్దివ్యమాణిక్యసం
చకితాసాధ్యపదాబ్జభాగుడయివిశ్వప్రాజ్ఞతన్ మించుచున్
బ్రకటారాతిసతీమణీశుభదసూత్రద్రోహియై యొప్పు రా
జకుమారుండయి నిట్టులైతినిగదా సాధింపనౌనే విధిన్.

అక్కటా! విధిలేదు. రెండుదినములయ్యె. ఆకలిచేఁ గడుపు దరిగొనుచున్నది. నో రెండె. ఇఁక నాయంత్యఘుడి

యులు సమీపించినవి. ఈ ప్రపంచభ్రాంతు లేక ననురక్షిం పవు. జననమాదిగా నిరువదియైదవయేట నాకు మారకం బుండవలయు. లేకున్న నిట్టివిపత్తు తటస్థించునే? ఛీ! అసత్య వాదినైతి. నాప్రతిజ్ఞ వృథయయ్యె. ఆ కాంత కేమిగతి బట్టి యున్నదో? ఆ బ్రాహ్మ లేమయిరో? ఇంకెందుల కాయోచన? ఇట్టిమరణసమయమునందు శ్రీపరమేశ్వరధ్యానమే తారకము. సంసారసాగరోత్తారకము మహాపాతకవిదారకము. అనుకొని శ్రీపరమాత్మను దనహృదయకమలమునందు ధ్యానించుచు,

శ్లో. శ్రీమత్పయోనిధినికేతన చక్రపాణే
భోగీంద్రభోగమణిరాజిత పుణ్యమూర్తే,
యోగీశ శాశ్వతశరణ్యభవాబ్ధిపోత
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్.

శ్లో. బ్రహ్మేంద్రరుద్రమరుదర్కకిరీటకోటి
సంఘట్టితాంఘ్రికమలామలకాంతి కాంత,
లక్ష్మీలసత్కుచసరోరుహరాజహంస
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్.

పరమపురుషా! నారాయణా! నీ చిత్రచరిత్రము( బొగడ నాతరముగాదు. జగదంతర్బహిశ్చరుండవై సమస్తభూతకృత సుగుణదుర్గుణము లెఱింగి దుష్టశిక్షణ శిష్టరక్షణం బొనర్చు మహానుభావుఁడవయిన నీ వీగుహాంతరమునఁ జిక్కి దిక్కు దోచక ప్రాణంబులపై యాశవదలి నీ పాదంబులే తారక మని యున్న నాకష్టము లెఱుంగవే? ఆపద్బాంధవా! కమల నాథా! రక్షింపుము రక్షింపుము. అని భగవంతుని స్తోత్రము గావించి యప్పరమాత్మను దనహృదయకుహరమున బ్రతి

ష్ఠించి మానసపూర్వకముగా షోడశోపచారములర్పించి తదేక ధ్యానపరుండైయున్న నమ్మహాత్మున కనేకకోటి తటిల్లతాతులంబోలు తేజము హృదయాకాశమునందు ధగద్ధగాయమానంబై గాన్పించి మఱుఁగుపడియె. ఇదియేమివిశేషమని కన్నులు దెఱచిచూడ నాయంధకారముననే యతనికానుకొని యుత్తరదిశయందు సూక్ష్మరంధ్రములో వెలుతురగుపడియె. ఇదియొకగుహాంతర్ముఖంబై యుండవలయు. ఈ ద్వారమునకు బంధించిన శిలామధ్యంబునుండి బహిఃప్రకాశమీరీతినగపడు చుండవలయుఁ జూచెదనని యట్లే బోర్లబడియుండి నిక్కి కుడిచేతితో నాతాతింద్రోబ్బె. ఆతనిభుజబలముచేఁ గదలినదై యాశిల దడదడశబ్దముచే దొర్లుచు నావలంబడియె. ఒకమనుజుఁడు వంగికొని పోవునంతటిమార్గము వెలుతురు నగపడయె. దానింగాంచినదే యాతని సంతోషమునకు మేరలేకుండె. తా నాతాతిసందున విఱికికొని యుండినను మార్గ మగుపడినసంతోషమున ముందునకు నుగ్గుటచే నాతని భుజబలమునకుఁ బ్యరతోపమానములై యున్న యా రెండుశిలలను స్వర్ణకారకుఁడు గ్రహణోపరణంబగు సాధనముచే రజితమయ పాదభూషణమును ముఖస్థానంబునం దొత్తిన నెట్లొకటికొకటి విశాలమై పాదముల నిఱుకునుండి తప్పించునో, యట్లాతని దేహ మిఱుకునుండివదలి సుఖముగా నావల వెడలపోవునంతటి లాఘవం బేర్పడియె. మృత్యుముఖమునకు గుఱియగుచున్న యమ్మహాత్ముఁడు గుహాంతర్ముఖంబునుండి బయలువెడలె. చల్లనిగాలి వీతెంచె. కొంతసేపు పరమానందముచే హాయిఁజెంది యటునిటుఁ జూచుచుఁ బ్రపంచజ్ఞానమయుఁడై మఱల నేదిశయందుఁగన్నను మార్గము

లేకుండె. నాల్గుచదరంబులుగల యిసుకతొట్టెవలె నొకకోన యగుపడియె. అదియు నాగుహాంతర్ముఖమున కైదుగజముల పాటున నిసుకబావివలెనుండె. ఒక్కటేశిల నాల్గుదిశల నావరించుకొని మహోన్నతంబై సెలయేటులచేఁ బాచిపట్టియున్నందున నెక్కుటకు జారుడుగల్గి కడునసాధ్యంబై యుండె. పడమరదిశ కొండచరియనుండ యొకగజమెండప్రమాణముగా పూర్వాభిముఖముగా నీటికాలువ లోఁతులోఁ బ్రవహించుచుఁ దూర్పుదిశ కొండచరియలోనికిం జనుచుండె. అందున్న యిసుకయంతయు బంగారపు రాపాడివలె మినమినలాడుచుండె. అదిగాంచి భగవచ్చిత్రమునుం గొనియాడి యాయిసుకలోఁడి చిన్న చలమొకటికల్పించి యందు స్నానమాచరించి సంధ్యావనంబొనరించి యా నిర్మలోదకంబులం ద్రావి యిసుకపైఁ బరుండి నిద్రరాక తనప్రతిజ్ఞయుఁ దన యవస్థయుఁ దలంచుచుఁ దా నాగుహానుండి విముక్తిఁజెంద మార్గముగలిగినందుకు భగవంతుం గొనియాడుచు నన్ను తన కరస్నాత్తుగా నంధకారబంధురంబై పట్టపగలె యదిరేయివలె నేదియుండోఁపకుండునట్లయ్యె. దానింగాంచి యేమివిపరీతమని యోచించుచుండ;

శా. ఆ పెక్ జీకటిమధ్యమందుగల యుద్యత్ఖడ్గకాంతిచ్ఛటల్
దోపన్ గ్రూరకఠోరదంష్ట్రలుభువిద్యోభాగముల్ గ్రమ్మదు
ర్వ్యాపారాధికభీమదేహరతన్ వ్యక్తిద్వయం బజ్జభూ
షోపాలంబకులైన దానవులనన్ జోద్యంబుగా దోఁపఁగన్.

ఆవ్యక్తులు రెండును వెల్లకిలఁబరుండియున్న నమ్మహాత్ముని చెంతకు మెల్లమెల్లనఁ దలపాటున కొకరును పాద

ములచెంత కొకరును జనుదెంచి కూర్చుండి తలయును పాద
ములును బట్టి యెత్తుట కుపక్రమింప నత్యం డమితమైన తన
బలముకొలఁది పాదములచెంత నున్న నావ్యక్తివక్షముపై
బిడుగు వంటి చప్పుడుగల్గి కాలితో నొక్కతన్నుదన్న ఆ
పెట్టుబడి గుహాయంతయు ఘూర్ణిల్లునట్లును కొండలు ప్రతి
ధ్వని చునట్లును గేకవేసి యట్టెమూఁడుపొర్లు బొర్లి నోటియం
దును నాసికాపుటములందును రక్తము గ్రక్కుచుఁ దన్ను
కొనుచుండె. శిరఃపార్శ్వమునందున్న మఱియొకవ్యక్తిని
జటలు పట్టుకొని చిప్పున పైకిలేచి కరముచే లేవనెత్తి దక్షిణ
పాదముతోఁ దన్ని నేలఁబడవైచి పడిన యాకళేబరమును
మరల వామపాదముచేఁ దనబలముకొలఁది యొకతన్నుదన్నె.
ఆ పట్టుతో నాకళేబరమెగసి దక్షిణ దిశయందుగల పర్వత
సానువునకుండగిలె. ఆయిరువురు నిశ్చేష్టితులైనంతనే యంధ
కార మెచటికిఁ బోయెనో! ఇరువదియారవ నాడికయందు
సూర్యభగవానుఁడు ప్రయాణముగుచుండుట విశదమయ్యె.
అంధకార విముక్తమై దిశలెట్లు ప్రకాశము జెందుచుండెనో.
మననూతనపురుషుని మనం బట్లు వికాసము జెంది దక్షిణదిశ
కొండచరియగాంచె. కళేబరముయొక్క తాఁపుచే నాకొంత
చరియతో పడదోసినారన్నట్టదికించియున్న యొక్క బండ
యొరగిలి లోపలనున్న గుహాద్వారమును స్పష్టపఱచుచుండె.
ఆబండను దనబలముకొలఁది పట్టి పెకల్చి తీసివైచె. గుహా
ముఖం బొకటి యగుపడియె. అదియును జతురశ్రమై
నలుప్రక్కల బంగారురేకుచేఁ గప్పఁబడి యనర్ఘరత్నములచే
నలంకరింపఁబడియుండె. ఆ ద్వార మొకమానుజుఁడు సరాసరి
ప్రయాణముగునంతటి విస్తీర్ణోన్నతము గలిగియుండె. ఆశ్చ

ర్యము ద్విగుణీకరించి యిదియొకవిశేషము! ఇందేమున్నదియో చూచెదనని గుహాయందుఁ బ్రవేశించుచుండఁ దాలి తాపుచే నేలంబడిపొరలుచున్న వ్యక్తికి స్మృతిగలిగె. అటునిటుఁ బొరలఁదొడఁగె. ప్రాణముతో నున్నవాఁడే; పాపమీతని కాపత్కాలముగదా! కొంతసేద దేర్చెదనని కరుణచే నీరంబును దెచ్చి నోరుదడిపె. దేహముపైఁ జిలికించె. అతని కప్పటకప్పటికి గొంచెముగొంచెముగా స్మృతిగలిగి కనులు విప్పి లేచి కూర్చుండి నలుప్రక్కలంజూడ మూర్తీభవించిన నారాయణావతారమో యన్నట్టు తనయెదుటనున్న మహాపురుషుంజూచి చేతులు జోడించుకొని "పుణ్యాత్మా! కరుణాసముద్రా! భుజపరాక్రమోదీర్ణా! నీవంటి ప్రతాపవంతుని నే నిదివఱకెందును జూడలేదు. నీవంటి కరుణాసముద్రుని నే నెందును వినలేదు. ఇరువదియైదు సంవత్సరముల వయస్సు గలవాఁడవయ్యును, బహుయుద్ధములం దారితేఱిన పరాక్రమశాలురనందఱిం బరాభూతులఁగావించి జగంబునం దద్వితీయపరాక్రమవంతుఁడై కపాలభైరవుఁడను పేరుచేఁ బ్రఖ్యాతి వహించి, భేండాభైరవునిసర్వసైన్యమునకు నధిపతినై యున్న నన్నీవిధి నొకతెన్నునకే ప్రేతలోకముం దర్శింపఁ బంపితివి. మహాత్మా! నేను నీకు దాసుఁడ నన్ననుగ్రహింపుము. చంపకుము. లోకమునం దెంతటివాఁడైనను దనశత్రుఁడగువాఁడు ప్రాణాపాయసమయమందున్న మఱింత ప్రయత్నమొనర్చి చంపనుద్యమించునేగాని నీవలెఁ గరుణచే నుపచరించి రక్షించుటకుఁ బ్రయత్నించునే? కరుణానిధీ!" యని పొగడె. అంత వారిరువురిట్లు ప్రసంగించిరి:—

నూతన:—కపాలభైరవా! ఇతఁడెవరు? ఇతని పేరెయ్యది?

కపాల:—భేండాభైరవుని రాజ్యంబున మంత్రిపదవియందున్న వాఁడు. ఇతనిపేరు కఠోంభైరవుఁడు.

నూతన:—అటయిన మీరాయిరువురు భేండాభైరవునిపోష ణలో నుండువారే గదా?

కపా:—దేవా! మే మిదివఱకు నాక్రూరకర్ముని దుర్మార్గమున కును, ప్రతాపమునకును వెఱచి యాతని చెంతనుండి యనేక క్రూరకార్యములొనర్చుచుంటిమి. నీపాదహతిచే నీతఁడు ప్రేతపురి నలంకరించె. నేనును జచ్చుచుంటి. ఆయుశ్శేషం బుండుటవలనను నీయుపచారంబుచేతను మరల జీవించితి. ఇఁక నేనాభైరవుని చెంతకరుగను. నీ వెందున్న నందేయుండెద నీ వేది పంచిన నయ్యది యాచరించెద. తండ్రీ! నీప్రతా పాగ్నిముందట నేనొక శలభప్రాయుఁడనేగదా!

నూతన:—నీమాటలు నే విశ్వసించితినిగాని భేండాభైరవుని చెంత బహుకాలమునుండి సేవ యొనర్చుచుండి నేఁడు విధికృతముగా నిటుఁ బరాభవమైనమాత్రముననే స్వామి కార్యమువిడిచి యొరులకు మనసియ్యవచ్చునా? ఇది భృత్యధర్మమగునా? నావాఁడవని దృఢముగా నిన్నెట్లు విశ్వసింపవచ్చును? ఈ స్వల్పమునకే యవాయునలితమై యున్న సఖ్యత్వమును స్వామిభృత్యఋణానుబంధమును నింత శీఘ్రమున నశించినవని చెప్పుచున్న నిన్నెట్లు నమ్మ వచ్చును?

కపాల:—తండ్రీ! నీవు పిన్నవాఁడ పయ్యును గుణవృద్ధుఁడవు. నీతికోవిదుఁడవు. ప్రాణాపాయసమయమున రక్షించి యున్నవాఁడవు. నేను రాక్షసుఁడనుగాను. భైరవుఁడను గాను. క్షత్రియవంశమునకుఁ జేరినశూరుఁడను. ఈ

ఖేండాభైరవుని దుర్వృత్తులకు సహింపక మనభారతభూపాలు రొక్కరొక్కరే సర్వసైన్యములతోఁ జనుదెంచి, యాతనితో యుద్ధమొనర్చి జయింపలేక సఖ్యమొనర్చి కొందఱు, పరువెత్తి యోడిపోయి కొందఱు, ప్రాణములు గోల్పోయి కొందఱు యిట్లనేకమంది యనేకవిధములుగాఁ బరాభవముజెంది యిపుడు పదిసంవత్సరములనుండి యెవ్వరుగాని యీ భైరవునిపై యుద్ధమునకుఁ జనుదెంచు వారు లేరు. ఆసమయములో నేనొక రాజసైన్యాధిపతినై వచ్చి భైరవానుచరులతో యుద్ధమొనర్చి బహుమంది కాపాలికభైరవుల నంతమొందించి యొకదకొకచో నలసి నిద్రించు సమయమునందు వారిచేఁ బట్టువడి భైరవవిగ్రహమునకు బలియగుటకుఁ దీసికొని పోఁబడితిని. అపుడు కరచరణములు బంధింపఁబడి యుండినను మోఁకాలి తాఁకులచే మోఁచేతి పెట్టులచే శిరోఘట్టనముచే వారలను నాచెంతకు రానియ్యక కలవరపాటు నొందించితి. అదిగాంచి ఖేండాభైరవుఁడు నాసాహసమునకు మెచ్చుకొని పలువిధముల నన్ను బ్రార్థించి తనసైన్యాధిపతిగా నుండునట్లు లొప్పించుకొనియె. నాకిష్టము లేకున్నను భారతభూమిాశు లెవ్వ రింతటివారు లేరని విధిలేక నేనందే నిలిచితిని గాని, నాఁటినుండియు నెంతమంది స్త్రీలను బురుషులను భైరవదేవునకు బలియొసంగి యున్నవాఁడనో! ఎన్ని ఘోరకార్యము లొనర్చి యున్నాఁడనో, ఈనాపాపమును విచారించుటకు మఱియొక యమధర్మరాజును సృష్టి చేయుదురని నమ్మియున్నాను. ఇక నేనట్టిక్రూరకృత్యము లొనర్పనని దృఢముగాఁ బ్రతిజ్ఞఁజేసి చెప్పుచున్నాఁడ.

నేఁడు నీపాదస్పర్శమైనంతనే కఠోరహృదయమంతయు బహుళతరార్ద్రంబై మృదుత్వ మవలంబించుచున్నది. నీవు పుణ్యపురుషునివలెఁ దోఁచుచున్నావు. నీ తేజంబీ గహనం బంతయు నిండుకొన్నట్టగపడుచున్నది. తండ్రీ! నన్ను నమ్ముము. నీవు నమ్మకున్నను నేనిఁక భీండాభైరవుని చెంత కరుగను. అతఁడెట్టి మంత్రములచే నన్నుఁ గట్టి వేయునో, ఎట్టి యస్త్రములచే నన్ను సంహరించునో, అనుభవించి ప్రాణంబులనైన నను విడిచెద గాని నే నయ్యెడ కేఁగను. నీ కిష్టమైన నన్ను విశ్వసింపుము, లేకున్న నట్లనే యుండుము.

మాతన:—అతని చెంతకుఁ బోకున్న మంత్రములతోడను శస్త్రములతోడను జంపు నంటివే. యాతఁ డేమి మంత్ర వేత్తయా?

కపాల:—అయ్యయో! అయ్యయో! దేవా! నేనేమి చెప్పుదు? అథర్వణవేద మాతనికిఁ గరతలామలకము. వేయేల! బహువిధభూతనాథుఁడైన బేతాళుఁడే యాతని మంత్ర పాశబద్ధుఁడై యిపుడించుమించుగా మూఁడుమాసముల నుండి గహనమం దఘోరించుచున్న వాఁడు. ఇంక నొక్క నెలదినములలో మారణహోమముమై నామావశిష్టుఁడగును. నే నేమాత్రమో యోచింపుఁడు.

మాతన:—నీ వాతని చెంతం జేరకమును పేరాజునొద్దనుంటివి. అపుడు నీ పేరేమి?

కపాల:—నేను మా రాజు వెంట యుద్ధమునకు రాలేదు. ఆతని మంత్రియైన కాళీభద్రుని వెంట వచ్చి భైరవాశ్రమమునఁ బరాభూతుఁడనైతిని. మా మంత్రిగుణముల కన్నను భైర

వుని గుణములే యుత్తమమని నిశ్చయించి నేనచ్చటనే నిలుచుట కొప్పికొంటిని. అప్పటి నాపేరు వీరసేనుఁడు.

నూతన:—నీవే దేశమున సైన్యాధ్యక్షపదవియం దుంటివి? మంత్రివెంట వచ్చుట కారాజు బాలుఁడా? ఉన్మత్తుఁడా? తపోవనగతుఁడా? ఏమయియున్నవాఁడు?

వీర:—నాయనా! గోదావరీ నదీతీరమున మహేంద్రవరమను నగరమునందు నరేంద్రచంద్రుఁడను రాజుగలఁడు. అతని యొద్ద సైన్యాధిపతినై యుంటిని. ఆ మహారాజు సంతానము లేక రాజ్యమును మంత్రియాధీన మొనర్చి తపోవనమున కరిగె. ఈ ఢుండాభైరవుని ప్రతాపము దుర్వృత్తులు దేశమంతయు గగ్గోలు పఱచుచుండె. అందుచే మంత్రి వెంట యుద్ధమునకు వెడలి నేఁ జెప్పినట్లు పరాభూతుల మైతిమి.

నూతన:—కొంచెము యోచించి వీరసేనా! మాయావిడంబమును వియద్గమనప్రభావమును నీకెట్లు గలిగె?

వీర:—దివ్యజ్ఞానసభలయందుఁ జేరిన ప్రతిసభ్యున కొక్క సంజ్ఞాబింబ మేవిధి మెడలలో దూఁగాడుచుండునో యావిధి భైరవాశ్రమమున జేరిన ప్రతిమనుజునకు భైరవనామధేయ మొసంగి స్వర్ణపతక మొకటి మెడలో వైచి యుందురు. ఆపతకమునం దొక్క యంత్రము భైరవునిచే నిర్మింపఁబడి యుండును. అది మెడలో నున్నంతసేపును వియద్గమన శక్తియు మాయావిడంబనమును గలుగుచుండును. ఆపతకమును ధరించుకొన్నవాఁడు ప్రపంచజ్ఞానము గలిగి యున్నప్పుడు సంకల్పించెనేని వియద్గమనాది ప్రభావములు జరుగుచుండును. అతండు మూర్ఛయో మరణమో

నిద్రయో చెందునపుడు సంకల్పము లేకుండునుగాన మాహాత్మ్యము లన్నియు నశించుచుండును. నాకు నొక్క పతకము గల దిదె చూడుము.

నూతన:—మీ రరుదెంచి నాపాదము లొకరును శిర మొక రును బట్టి యెత్తుట కుపక్రమించితిరే! నన్నేమి చేయఁ దలఁచియుంటిరి? మీ రిచ్చటి కెందులకు వచ్చితిరి? మీరు గొప్ప యధికారులయ్యు నేదేని కార్య ముండినఁ జారుల నంపక మీరే వచ్చునంతటి కార్యమేమి?

వీర:—మంత్రపాశబద్ధుఁడైన బేతాళుని విడిపించెదననియు ఖేండాభైరవుని సంహరించెదననియు నొక్క పురుషుఁడు ప్రతిజ్ఞ జేసి తత్కార్యాసక్తుఁడై బదరికారణ్యమున నర నారాయణాశ్రమమునకు వెడలినాఁడని మా భైరవేశ్వరు నకుఁ దెలిసి యాతఁ డెవరో వెదకి తెచ్చి భైరవదేవునకు బలియిండని యనేక చార్వాక కాపాలిక గణముల నందం దంపి మాయిరువుర నొక్కదిశకుఁ బంపుటచే మేము వెద కుచు బహుప్రయాసపడి యెందు గనపడకుండుటచే మరలి పోవుచు నీ పర్వతాగ్రమార్గముగా వియద్గమన మొన ర్చుచు నిచ్చట నిన్నుగాంచి వృథాగా నెందుల కరుగ వలయు. భైరవదేవునిపో రొకదినమునకైనను దీరవది తీరినదే గదా యని బలియిచ్చుటకై నిన్నెత్తికొనిపోవఁ బ్రయత్నించితిమి. నీప్రతాప భావములుగన్న నాప్రతిజ్ఞా పురుషుఁడు నీవే యైయుందువని యోచించుచున్నవాఁడ నీవగుదువో కావో నాకుఁ దెలియదు. ఇదియే మా ప్రయాణకారణము. నీ వెవరు? నీ వెందుల కిట నున్న వాఁడవు?

నూతన:—అయ్యా! నేనొక్క రాజకన్యకను జోరులబారి నుండి తప్పించి వారిని సంహరించుటకై వెడలితి. అందొక పాడుదేవాలయంబునం దొంటిగా నున్నపు డాకాంతను మరల నపహరించియున్నవారు. ఇం దెందైన దాఁచియుం దురేమో యని వెదకుచు వచ్చి యీగుహను గాంచి యిటకు వచ్చితి. ఇం దెందు గన్నను వెలుపల కరుగుటకు మార్గము లేక కొంత విశ్రాంతిఁ జెందుటకై శయనించి యుంటి; ఆవల మీరరుదెంచితిరి. ఇఁక నీవు వెడలిపొమ్ము ఇది దేవసంచారయోగ్యస్థలమువలె నగపడుచున్నది. ఇం దీ శవము నుండనివ్వకుము. గైకొని యెచ్చటనైన నం బాఱ వైచి నీ యిచ్చకొలఁది జనుము.

వీర:—బాలకా! నేనప్పటినుండియు నిన్ను విడచిపోవనని బతిమాలుచున్నను నన్ను విశ్వసింపక నీ యిచ్చకొలఁది పొమ్మనుచున్నాఁడవు. సత్యముగా నన్ను నమ్ముము. నీకేవిధమయిన ద్రోహము దలపెట్టను. నీయాజ్ఞకు బద్ధుఁడై యుందును.

నూతన:—వీరసేనా! నీమాట లంతటి విశ్వసనీయములు కావు. బహుకాలమునుండి ఛండాభైరవాశ్రమసభ్యుడవై యుండి వారివలెనే క్రూరకార్యము లొనర్చుటయందు నీ ప్రకృతి కభ్యాసమైయున్నది. అభ్యాసముకొలఁది ప్రకృతి కార్యము లొనర్చుచుండును. సృష్ట్యాదిగా యేతత్క్షణ పర్యంతము దురభ్యాసమునకు లోనైన చతుర్వింశతి తత్త్వయుక్తుఁడైన జీవుఁడు బహుజన్మాభ్యస్త విషయమును వర్జింప శక్తుఁడు గాక మరల మరల జన్మించుచుండును. అభ్యాసము వదలలేని ప్రకృతియే కర్మకు గుఱియగు

చున్నది గాన కఠోరకృత్యములయం దభ్యాసము వహించిన నీమనస్సు దుష్కృత్యము లొనర్చుటకే యింద్రియముల నీడ్చుచుండును. వానిని ద్రిప్పి స్వాధీనమం దుంచుకొనుశక్తి నీకుఁ జాలదు. అందుచేత నిన్ను విశ్వసించుటకు వలనుపడదు. నన్ను శరణుఁ జొచ్చినవాఁడవగుటచేఁ జంపక రక్షించితిని పొమ్ము. ఈశవము నిట నుండనియ్యకుము.

వీర—దేవా! అనాదికాలమునుండి జన్మ మెత్తుచుఁ గర్మకులోనైన జీవుల కకస్మాత్తుగా సజ్జనదర్శన స్పర్శమాత్రముచేతనే బహుకాలానుసరణ దురభ్యాసమును విడిచి సన్మార్గప్రవర్తకులై జన్మకర్మములఁ బాఱఁదోలి మోక్షసామ్రాజ్య మనుభవించి యుండలేదా! సత్పురుషుఁడైన నీదర్శన మాత్రముననే నాయజ్ఞానమెల్ల నుచ్చాటనమై యున్నది. జ్ఞానోదయమైనది. నీపై భక్తి జనియించినది. ఇంక నేను క్రూరకార్యము లొనర్చుటలేదని ప్రతిజ్ఞాపూర్వకముగా నిశ్చయముగాఁ జెప్పుచున్నాఁడను.

నూతన—అట్లైన వియద్గమన మాయాప్రభావములు గల నీ రక్షాబింబమును ద్రెంచి నాచేతి కొసఁగుము. నీవు కపటివో నిశ్చయజ్ఞుఁడవో తెలియుచున్నది.

వీర—అదియొక కార్యమా? ఇదె గైకొనుమని మెడయందున్న స్వర్ణపతకముం ద్రెంచి యొసంగి యింకనైన నను నన్ను నమ్మితివి గదా యని యడిగె.

నూతన—ఇప్పటికిఁ గొంతమాత్రము నమ్మియున్నాను. మఱికొన్ని సంగతులు నిన్నడిగెద దాఁచక చెప్పెదవా?

వీర—నిరభ్యంతరముగా నాకుఁ దెలిసియున్న విన్నవించెద.

నూతన—నీ యేలికయగు భేండాభైరవుని విడిచి నన్నాశ్రయించి నే నెంత నమ్మకున్నను నమ్మిక కలుగఁజేసి నా చెంత నుండెదనని కంఠోక్తిగాఁ జెప్పుచున్నావే, నావలన నీ కేమి లాభము గలదు?

వీర—నీవు ప్రతాపవంతుఁడవు; దేవేంద్రాదులతోనైనను మార్కొనునంతటి తేజో దుర్నిరీక్షుఁడవు; నీ యాజ్ఞకు లోనై యుండెద. ఆ దురాత్మ నాక్రూరకర్మ భేండాభైరవుని నీబాహుబలముతోడనో యస్త్రశస్త్రములచేతనో సంహరించి లోకమునకు బాధ దీర్తువనియుఁ, దత్కార్యము నందు నాచే నైనంత సహాయము నీకొనర్పవలెననియు నిన్నాశ్రయించి యున్నాను. నీ వాదురాత్ముని ద్రుంచుట నాకు లాభము గాక ప్రపంచమంతటికిని లాభము.

నూతన—ఆభైరవుఁడు మహామంత్రవేత్తయనియు, అధర్వణ వేదాభ్యాసి యనియుఁ జెప్పితివే, అతని నేవిధముగా సంహరింపవలయునో నీకుఁ దెలియునా?

వీర—అధిజ్యశరాసనుఁడవు. ఆబద్ధగోధాంగుళీ తనుత్రాణుఁడవు. ఆయత్త ఖడ్గఖేటాది పరికరుండవై బాలభానుం దిరస్కరించు తేజముచే నున్న నిన్నుఁ గన్న నిక్క మా దేవేంద్రుండని చెప్పక చెప్పుచున్నది. నీవు ధనుర్వేద పారీణుండవై యుందువు. నీయస్త్రశస్త్రములచేత నాతని సంహరింపకున్న నింక నతనిం జయించువా రాప్రతిజ్ఞా పురుషుఁడు గాక మఱియెవ్వరు గలరు?

నూతన—నాయస్త్రములకుఁ బ్రత్యస్త్రము లెఱుంగును. ముష్టియుద్ధ మొనర్చుట కాతఁ డతిదృఢాంగుఁడు. బహు యుద్ధములయం దారితేఱి తపఃప్రభావసంపన్నుఁడై యున్న

వాఁడు. మాయావిశారదుఁడు గాన నాతని సంహరించుట
కుపాయ మేదేని దెలియఁజేయుము.

వీర—నీ వాక్యములు నిశ్చయము. అతని చెంత వేయిమంది
చార్వాకరాక్షసులు, వేయిమంది కాపాలికరాక్షసులు,
వేయిమంది భైరవానుచరులు, వేయిమంది యాశ్రమ
శిష్యులు, మూఁడునందల జవసత్త్వసంపన్నములైన గుఱ్ఱ
ములు, అఱువది రథములును, సింహాసనములు గలిగి
దీర్ఘకాయములై వ్యాఘ్రామలనైన లెక్కగొనని కుక్క
రము లొకనూఱుంగలవు. చార్వాకులు, కాపాలికులు
వీరలు రాక్షసులు. భైరవానుచరులనువారు భేండాభైర
వుని జ్ఞాతులు. ఆశ్రమశిష్యులనువారు నావలె వారలకుఁ
బట్టువడిన పరాక్రమశాలురైన మానవులు. వీర ద
తాభేండాసురుని తపఃప్రభావ మాయావిడంబములచేఁ
బ్రతాపవంతులై యజేయులై యున్నవారు. వారలందఱిం
జయించియే యావల భేండాభైరవుని సంహరింపవలయు.
ఆ యాశ్రమములోఁ బ్రవేశించుటకు సర్వస్వతంత్రాధి
కారముగల నాకే గుండె చెదరుచుండును. ఆ కుక్కరము
లతోఁ బోరి జయించిన నొకదేశమే జయించినట్లగును.
శత్రువు లరుదెంచిరేని విజృంభించి శత్రువులలో దూరి
చించి చెండాడునంతటి శౌర్యవంతములైనవా జాగిల
ములు. ఆ భైరవాశ్రమముచుట్టు మహోన్నతమైన పర్వత
పఙ్క్తి కలదు. భైరవ హింసాలయమున కానుకొని
తూర్పుదిశగా బ్రహ్మపుత్రానది ప్రవహించుచుండు. ఆ
పర్వత పఙ్క్తి వెనుక రెండువేలమంది రాక్షససైన్యము
లనేకాయుధపాణులై యనవరత మాశ్రమము రక్షించు

చుందురు. ఆపర్వత పఙ్క్తికి లోపలివైపున వేయిమంది రాక్షసభటులు కాపుందురు. వీరే ఛేండాభైరవుని యంగరక్షకులు; మహాబలవంతులు. ఏ రాహింసాలయమును, రాక్షసనివాస కుటీరములును, బలికొఱకై తెచ్చిన స్త్రీపురుషుల నారయుచుందురు. భైరవాలయముచుట్టు నయిదునూర్లమంది రక్షించుచు నాతని సమీపమునందుందురు. మిగత యేనూఱుమందియు భూమండలమున సంచరించుచు భైరవదేవుని బలికొఱకు స్త్రీలను బురుషులను దెచ్చి యాతని కర్పించుచుందురు. పర్వతములకు లోపలవైపునఁ గాపున్న యంగరక్షకభటులచెంతనే మూఁడునూర్ల గుఱ్ఱములు సన్నద్ధమైయుండును. భైరవాలయమునొద్ద గాపున్నవారిచెంత రథములఱువదియుఁ గుర్కారములు నూఱును బ్రకాశించుచుండును. ఆపర్వత పఙ్క్తులలోఁ దూర్పుదిశయం దొక మార్గమును బడమర దిశయం దొకమార్గమును గలదు. ఆ మార్గములచెంతనే రాక్షసగణములు కాపాడుచు బర్వతాగ్రములపై యచ్చటచ్చట నాశ్రమముచుట్టు కాణాలు గల్పించుకొని యుందురు. ఉత్తర హిమాలయపర్వతములోనుండి బ్రహ్మపుత్రానది ప్రవహించుచువచ్చి యాశ్రమము నొరయుచు దక్షిణముగా వెడలి గంగానదియందు గలియుచుండును. ఇట్టి మహావైభవముతో నున్న ఛేండాభైరవు నెట్లు జయించెదవో నీవే యోచింపుము. నాకేమియుఁ దోఁపకున్నది. నన్నేమి పనినొనర్పుమని సెలవొసంగెదవో యాపని నొనర్చుటకు సంసిద్ధుఁడనై యుందును. యుద్ధమొనర్పుమన్న నాశక్తికొలఁది నీకు సహాయమొనరించెద

ఆమీఁద నీయిష్టము. ఇంకొకటి పడమరదిశనుండి దడెంత్తు వారికి నాశ్రమములో బ్రహ్మపుత్రానది యడ్డగింపదు. తూర్పుదిశనుండి వచ్చువారికి నూత్రి మాబాధగలదు.

నూతన:—నీవంటి యాశ్రమశిష్యులుగాక మిగత రాక్షసగణ ములకు సహా యీరతాబింబములు గలవా?

వీర:—వారు సహజరాక్షసులగుటచే వియద్గమన మాయా శక్తులు గలిగియుందురు. అందుచే వారికిరతాబింబము లుండవు.

నూతన:—దేశదేశములనుండి బలవంతమున దెచ్చిన పురుష లను స్త్రీలను దెచ్చిన యాక్షణమే బలియిత్తురా దానికొక వ్యవధిగలదా?

వీర:—ఆతని చెంత నొకపట్టికగలదు. తెచ్చినపురుషులను స్త్రీలను గ్రమముగా నందు వ్రాయుచుండును. క్రమక్ర మార మొకరివెనుక నొకరిని బ్రత్యహము పురుషులను బలియిచ్చుచుందురు. స్త్రీలాశ్రమమునకు వచ్చినది మొద లైదవ సోమవారమునాఁడు పట్టికాక్రమప్రకారము బలి యిత్తురు. స్త్రీలు బొత్తిగా లేకున్నంతట యేసోమవారము గాని యున్నవారినే యుపయోగపఱతురు.

నూతన:—నాలుగైదు దినములలోపల నొకరాజకన్యకను మీ యాశ్రమమునకుం దీసికొని రాఁబడినదా?

వీర:—తీసికొనిరాఁబడినది. రాజకన్యక భువనమోహిని యను పేరుగలది. ఆమెతండ్రిపేరు విభాసుమహారాజు. ఆమెయూరు పాంచాలదేశమున మణిస్యందనపట్టణము.

నూతన:—ఆహా! ఆసతికొఱకే నేనిందు వెదకుచున్నాను. ఈవఱకు బలియొసంగియుందురో యేమో! ఈయరణ్య

ములో గుహలో కోనలోఁ దిరిగి ప్రయాసపడుచున్నాఁడను. మరల నాచోరులే యపహరించిరేమో యనుకొని యుంటిని. వీరసేనా! ఆకాంత నెట్లయినఁ దప్పిచునుపాయము యోచింపుము.

వీర:—తప్పించుట సాధ్యముగాని కార్యము. ఆయిదవ సోమవారమునకు నాకాంత నేమిరొయొనర్త్రురు. ఆవల బలియిత్తురు. సుశీలయను నొక కాంతను దప్పించుటచేతనే బేతాళుఁడు కట్టువడి మారణహోమమునకు గుతియైయున్నవాఁడు. బేతాళునికట్లు విడిపించెదననియు, భేండాభైరవుని సంహరించెదననియుఁ బ్రతిజ్ఞ చేయొనర్చిన యమహాపురుషుని వ్యవధి యింకఁ బదుమూఁడు దినములే యున్నది. ఆలోగా నాతఁడుగాని నీవుగాని వచ్చి భేండాభైరవుని ద్రుంతులేని భువనమోహిని యొకతెయేగాదు; అచట బలికొఱకై తీసికొని రాఁబడిన కాంతలందఱును బురుషులందఱును దప్పింపఁబడుదురు. మీ రెవరాయాశ్రమముపై దాడివెడలినను నాచేనైనంత సహాయమొనర్చెద. ఏవిధినైనను భేండాభైరవునినింక భూమిపయి నుండనియ్యఁగూడదు. బహుహత్యలు జరుగుటచే యనావృష్టిదోషము కల్గియున్నది. యజ్ఞములొనర్చుట కేరాజును బ్రయత్నించలేదు. ఇఁక దేశము సుభిక్షముగా నుండవలెనన్న నెట్లుండును?

నూతన:—ఆప్రతిజ్ఞాపురుషుఁ డెవరో తెలియదయ్యె. ఆతనికి మన మేవిధముగా సహాయమొనర్పవలెనో, భేండాభైరవుఁ డేరీతి సంహారమగునో స్ఫురింపకున్నది. కానిమ్ము మరల నీ వాభైరవాశ్రమమునకే జనుము. ప్రతిజ్ఞాపురుషుఁ డరు

దెంచినపుడు నీవు తగుసహాయ మొనర్పుము. అమ్మహా పురుషుఁడెవరో యెఱింగి యాతనివెంట నేనును జనుదెంచెద. అంతవఱ కేవిధమయిన బలులు భైరవున కొసంగ కుండునటుల నేదోయుక్తిఁ గల్పింపుము.

వీర:—కల్పించుటేమి! ఈకపాలభైరవుఁ డాతని జ్ఞాతియే గదా! అతని నిర్యాణముచేఁ బదిదినములశుచి యనుభవింపవలయును. ఆ పదిరోజులలో నేపూజలు నేబలులు జరుగవు. పదునొకండవ దినముననే భైరవపూజయు బలియు జరుగును. ఆలోపల మరల నెవరయిన నాతని జ్ఞాతులు మరణమొందిరేని పదదినములశుచి ననుభవించు చుందురు. ఇదియేయుపాయము వేఱులేదు.

నూతన:—కానిమ్ము. అంతమాత్రముగలదుగదా! ఇఁక నీ వరుగుము. ఈతని మరణమాతఁడు నిశ్చయముగాఁ దెలిసి కొని యశుచి నాచరించుచుండనీ. నీ వీశవము నచటికే యెత్తికొనిపొమ్ము. ఆపదిదినములలో నాప్రతిజ్ఞాపురుషుఁ డెందుండునో తెలిసికొని నేనేవచ్చెద. ఇదె నీరక్షాబిబము మరలఁగొనుము. వియద్గమన మాయాశక్తులచేఁ ద్వరగాఁ జనుము. సత్యమునందు మనసుంచుము. నాతోనాడిన ప్రమాణోక్తులను మఱువకుము. క్రూరుసన్నిధిలోఁ గ్రూర కృత్యములే యొనర్చుటకు మనస్సు పలుపోకలం బోవు చుండును; ఇంద్రియనిగ్రహపురుషుఁ డాత్మోద్ధారణం బొనర్చును. ఆత్మనుద్ధరించుటయే మానవజన్మమునకు సార్ధకము. మనుజేతర జన్మములం దాత్మోద్ధారణజ్ఞానం బుండదు. పొమ్ముపొమ్మని త్వరపెట్ట నాతఁడు రక్షాబింబ మెప్పటియట్ల ధరించి యమ్మహాత్మునికి నమస్కరించి క

బంమున త్రిక్కొని వియన్మార్గమునకెగసి పోయివచ్చెదనని చెప్పుచు వెడలిపోయె. సనాతనపురుషుండా గుహా ముఖంబునుగాంచె. అది యపూర్వచిత్రితంబై యనేక మణిగణాకీర్ణంబై యానందమయంబై యొప్పారుచుండె. ఆద్వారమున కిరుప్రక్కలందును నొకచో గరుత్మంతుఁ డమృతమును దెచ్చుచుండునట్లును నొకప్రక్క నాంజనే యుఁడు ద్రోణాద్రి దెచ్చుచుండునట్లును నొకటికొకటి యభిముఖముగా బఁగారుచే రెండువిగ్రహములఁ దీర్చి పలు విధముత్యరత్నములచే నలంకరింపఁబడియుండిరి. ఇది యొక మహాశ్చర్యముగదా! యని లోపలఁ బ్రవేశించె.

నలుప్రక్కలయందును సువర్ణపుటికలచే భిత్తిక లెత్తఁబడి యిటికల సందులయందు బలువిధరత్నములచేఁ దీఁగ వరుస లలంకరించి యుండుటఁగాంచి యామార్గముగాఁబోవఁ బోవ గుహాంతరము విశాలంబై పెద్దబయలొక్కటి గానవయ్యె ఆ బయలునందు బహుదూరము దక్షిణాభిముఖముగాఁ బోయి పోయి యొకపట్టణమునుగాంచె. ఆపట్టణ మెటుగన్నను బంగారుమయంబై యుండె. విద్రుమ స్తంభములు రత్నఘటి తస్ఫకవాటములు వైడూర్యమణులచేత నిర్మింపఁబడిన సౌధాగ్ర భాగములు హేమమయంబైన వేదికలు మరకత స్థగితమైన వాతాయనములు వజ్రములచేఁ దాపఁబడిన బంగారుగృహ ములు నాలుగైదంతస్తులు గలిగియుండె. ఈపట్టణ మమరా వతియో! యలకావతియో! భోగవతియో! ఇందెందుల కున్న దో యని యాశ్చర్యమువహించి యిట్టి పట్టణమున నొకమను జుడైనను లేకుండుట కేమికారణమో యని యనుకొనుచు నప్పురమధ్యంబును గాంచుచుండ నచ్చట సహస్రస్వర్ణ స్తంభ

సంభృతంబగు నొకమంటప మగపడియె. ఆ మంటపము బంగారుగోడలచే ముక్తికతోరణములచే స్వర్ణగవాక్షములచే బహువిధచిత్రములచే భూభాగమంతయుఁ బులిచర్మముచే నలంకరింపఁబడి మనోహరంబై యుండెను. ఇంకనేమివిశేష మున్నదో యని పరికింప నామంటపాంతరమున సప్తఫణామణి మండితంబై వలయాకార పీఠంబుపై రత్నస్థగితంబైన యాదిశేషపర్యంకం బగపడియె. తన్మధ్యంబునం దనేక మణిగణయుత స్వర్ణకిరీటహార కేయూర కంకణాది భూషణభూషితంబును జతుర్భుజభాగవిభాసిత శంఖచక్రగదా ఖడ్గాద్యాయుధవిభాసితంబును బ్రసన్నవదనంబును స్వర్ణపీతాంబరాలంకృతంబునునగు నొక లక్ష్మీనారాయణ విగ్రహంబు విరాజిల్లుచుండె. ఆ విగ్రహమునకు వామభాగంబున స్వర్ణమయంబై బహువిధ భూషణాంబర పుష్పాలంకృతంబై హరిద్రాచూర్ణ కుంకుమాక్షతశోభితంబై చతుర్భుజవిలసితంబై పద్మాలంకృతకరయుతంబై సుహాలక్ష్మీవిగ్రహంబు ప్రకాశించుచుండె. ఇరుప్రక్కల ఘృతపరిపూరితాఖండ పంచకం బఖండంబై ప్రకాశించుచుండె. అందెవ్వరును లేకుండిరి. అది గాంచి మహాభక్తిపరవశుండై కరయుగళములు మోడ్చి ప్రదక్షిణనమస్కారము లొనర్చి యెదుట నిలువంబడి పురుషసూక్త శ్రీసూక్తములచే స్తుతించి తనివిసనక మరల నిట్లని స్తుతియించెను.

శా. శ్రీమంతంబు సనాతనంబు శుభమున్ చిన్మాత్రమున్
సత్యమున్
సాయుజ్యాదిచతుర్విమోక్షపదవీ స్థానంబు లేదాందహ్యా

ద్వైతమాంతస్థమఖండపూర్ణ మజరంబోంకారమైనట్టి శ్రీ
రామబ్రహ్మపదాంబుజంబులను నేఁ బ్రార్థింతు మోక్షార్థినై

శా. విద్యుద్వహ్ని నిభంబు కేవలము సద్విద్యాప్రపంచాద్యమున్
సద్యోమోక్షకరంబు పాపహరమున్ సాక్షాత్ప్రకాశంబుగం
బద్యోగంబు మహాతపలము సత్ప్రాగ్వ్యద్యమధ్యంబునున్
హృద్యంబౌ భవతారకంబు నుదినూహింతున్ రమానాయకా

యని పొగడి మహాలక్ష్మీ విగ్రహంబునుం గాంచి

శా. శ్రీలక్ష్మీకలిత నీరజాభవదనే క్షీరాబ్ధిరాట్కన్యకే
లీలాలోక్యసమస్తకాండనికరే క్లీం హ్రీం సుబీజాక్షరే
నీలాంభోధరమేచకచ్ఛకరుచే నిత్యాన్నదానప్రియే
బాలేందుప్రతిభాసమాన నిటలే పద్మాలయే పాహిమాం.

పరమపురుషా! నారాయణా! జగజ్జనన హేతుభూతుం డవు. జగద్రక్షణవిచక్షణుండవు జగత్సంహారనిపుణుండవు. సకల భూతాంతర్మధ్య తేజోమాత్ర చేతనాశక్తియుతుండవు. అనాద్యవిద్యామాయామయంబుచే జీవకోటుల కర్మానుగుణ్యంబుగా సృజియింపుచుందువు. భక్తుల హృదయంబునందు బంధితుండవై మహానందముచే మెలంగుచుందువు. నిత్యానపాయినియైన శ్రీరమాదేవితోఁ గ్రీడయందున్నపుడైనను భక్తహృదయాంభోజంబునందున్నపు డనుభవించెడి మానంద మనుభవింపవు. అనాదికాలమునుండి వర్తమాన జన్మపర్యంతము నీమహత్త్వంబెఱుంగక నహంకార మమకార క్రియాకలాపంబులచేఁ గప్పఁబడి బహుమాతృగర్భమునం దుద్భవిల్లి యిడుమలుబడుచున్న నే నీజన్మమునసే పూర్వపుణ్య

ఫలప్రభావమున నీవిట్టివాఁడగు కెంటింగితి. అదియు నీప్రసాద మున నే లభించియున్నది. యుగయుగములరిదును ధర్మక్షీణమై యధర్మబాహుళ్యమైనపుడు భూమియం దవతరించి ధర్మ స్థాపనం బొనర్చుచుందువు. అది నీప్రమాణవాక్యము. ఈకలి యుగంబున నెందులకి ట్లుదాసీనంబొనర్చితో తెలియదయ్యె. ఎచటఁగన్నను బరహింసాపరులే. యెటుగన్నను భైరవ పూజాధురంధరులే. వామాచారమున కిక్కాల మనర్గళమై యున్నది. సత్యదయాశౌచంబులు క్షీణించుచున్నవి. యజ్ఞ ములన్నియు మనుజసంహార యజ్ఞములుగాఁ బరిణమించు చున్నవి. భేండాభైరవుఁడను క్రూరుఁ డసంఖ్యాక ప్రాణుల సంహరించుచున్నవాఁడు. నీవాక్యముల నీవేయాచరింపకున్న నిఁక ధర్మస్థాపన మొనర్చువారెవరు? దేవదేవా! నీలీల లనంతము. నీప్రభావమఖండము. నీప్రకాశ మఖిలాండమయము. నీకనేక వందనములు.

శా. కృష్ణా! సుందరదా కుచేలభరణా కేకారవామోదితా!
కృష్ణా! రక్షణకుంభజన్మవినుతా! క్రూరాసురధ్వంసకా!
కృష్ణాంగాకురువంశదాంవహనా! కీర్తిస్ఫురాకోమలా!
కృష్ణాగ్రారదసారథీవంద లక్ష్మీనాథ! నారాయణా!

అని స్తుతించుచున్నంతలో నెచ్చటనుండియో,

శ్లో. త్వమాదిదేవః పురుషః పురాణ
స్త్వమస్య విశ్వస్య పరం నిధానం,
వేత్తాసి వేద్యంచ పరంచధామా
త్వయాతతం విశ్వ మన న్తరూపా.

అని భగవద్గీతాశ్లోకము వినంబడియె. విని యేమిది! నిర్మానుష్యమైన యీపురమునం దీధ్వనిపుట్టుటకేమి హేతువోయని నలుదిక్కులం గాంచుచుండ మరల,

శ్లో. నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ,
అనంతవీర్యామితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః.

అని మరల వినుపించె. అతం డాశ్చర్యయుతుండై యేమిది భగవంతుండు నాయం దిట్టియధికారగుణములు గల్పించి నీవేరయినర్హుమని నన్నుద్బోధించుచున్నాండా కాదుకాదు. ఎవరో భగవద్భక్తులు భగవద్గీతయందు విశ్వరూపసందర్శన యోగాధ్యాయమును పారాయణ మొనర్చుచు వచ్చుచున్నారదె చప్పుడు వినంబడుచున్నదని చూచుచుండ శల్యావశిష్టమై ముడతలుపడిన దేహముతో జడలుగట్టిన నెఱసిన వెండ్రుకలతో నారచీరలుధరియించి కృష్ణాజినము వక్షమున కడ్డము వైచికొని జపసరము కరమందు బట్టికొని యొడలెల్ల విభూతిచే నలంకరింపంబడియుండ నపుడపుడు హరినామస్మరణఁ జేయుచుఁ బ్రపంచజ్ఞానమునువదలి తదేకధ్యాన మానసయై భగవద్గీతా పారాయణ మొనర్చుచు నామటపములోని కొక్క వృద్ధతపస్విని యేతెంచె. ఆపుణ్యాంగనంగన్న మననూతనపురుషున కధికభక్తి జనియించి యీమెయిందెందుకున్నదియో యీమె పేరెయ్యదియో యీనగరమునకేమి నామధేయమోయని యనుకొనుచు శీఘ్రమున నాతపస్విని సన్నిధికిం బోయి, అవ్వా! వసుంధరుండు నమస్కరించుచున్నాండని చెప్పుచు సాష్టాంగ

నమస్కారములొనర్చి చేతులుజోడించుకొని లేచి నిలువంబడియె. ఆసాధ్వియుఁ జిరునవ్వున నాయనా! నీవుపుణ్యపురుషుఁడవు. నీ వృత్తాంత నే నెఱుంగుదును. పరోపకార పారీణుఁడవు. బాలుఁడనయ్యును కల్యాణగుణ భూయిష్ఠుండవై యున్నవాఁడవు. నీకు శుభములుగాతమని యాశీర్వదించె. ఆవల వారిరువు రీరీతి ముచ్చటించిరి.

వసుం—అవ్వా! ఈపట్టణ మింతశృంగారముగా నున్నది ఎటుగన్నను బంగారు తాండనమాడుచున్నది. ఇందెవ్వరు కాపురముండకుండుట కేమికారణము? ఈ పట్టణమునకు నామధేయ మేమి?

తప—ఈప్రదేశమునందు దొల్లి కణ్వమునీంద్రుఁ డాశ్రమముఁ గల్పిచుకొని యుండి తనకూఁతురు నిర్యాణమును జెందుటచే దుఃఖము బట్టఁజాలక యీస్థలము నిర్మానుష్యమగునటుల శపించి తాను దక్షిణదిశగా వెడలి పాపఘ్నిబహుదానదుల మధ్యమునం దాశ్రమముఁ గల్పించుకొనియె నాఁటినుండి యీస్థలము నిర్మానుష్యమయ్యె. మరల మయుఁడను దానవేంద్రుఁడు తపమున విధాతను మెప్పించి నిర్మాణశక్తి వడసి తన నిర్మాణవిచిత్రం బెట్టుండునో చూడవలెనని యీగుహలోఁ దనకౌశలంబంతయుఁ జూపి యీపట్టణము బంగారుమయమగునట్లు సృజియించి దీనికి హేమపురంబని నామకరణం బొనర్చె. కణ్వముని శాపముచే నేఁటికిని నిర్మానుష్యముగనే యున్నది.

వసుం—ఇది హేమపురమా శ్రీమద్రామాయణమం దొకచో గుహలో హేమపురమున్నదనియు, నిర్మానుష్యమనియుఁ జదివియున్నాను. అది యేనా యిది.

తప—అవును. తొల్లి సీతాన్వేషణాపరులై యాంజనేయాదు లిటకరుదెంచి మార్గమెఱుంగక కొన్నిదినము లిందే యుండి నాచే నాతిథ్యము వడసి వెడలిపోయిరి. నాఁట నుండియు నిందెవ్వరు బ్రవేశింపరైరి. ఈనాఁడు నీవరు దెంచియున్నవాఁడవు.

వసుం—తల్లీ! నీకు స్వయంప్రభయను పేరుకలదుగదా!

స్వయం—అవును.

వసుం—ఆహా! ఏమిభాగ్యము! అవ్వా! ఆంజనేయాదులు వింధ్యపర్వతమునందున్న బిలద్వారములోఁ బ్రవేశించి యీ హేమపురంబుఁ జేరిరని కిష్కింధాకాండమునం దున్నదే! నేనిహిమాలయారణ్యములో గుహాముఖంబున బ్రవేశించి బహుకష్టము లనుభవించి యిట కరుదెంచితినే యీ హేమపుర మిదియౌనా? కాదా? యని సందేహ ముగా నున్నది.

స్వయం:—ఈపురమునకు రెండుమార్గములు గలవు. ఒకటి వింధ్యపర్వతమున బిలద్వారమును, మఱియొకటి హిమా లయ ప్రాంత్య కురుక్షేత్రమున సుప్తముఖీ ద్వారమును గలవు గాని సుప్తముఖీద్వార మనునది యభేద్యమైనది. ఈమార్గమునం దరుదెంచినవారు మార్గమధ్యమున నిఱికి కొని యన్నాహారములు లేక వటించి చత్తురు. నీవు మానవమాత్రుఁడవుగావు. అందుచే నేయపాయముఁ జెందక యిచటికి వచ్చియున్నవాఁడవు. నిన్ను గన్నందుకు నేను ధన్యురాల నగుచున్నాను.

వసుం:—సర్వజ్ఞులై బహుకాలమునుండి తపఃప్రభావముచే శరీరము ధరించి సాక్షాత్పరమాత్మస్వరూపమైయున్న మీా

రక్షకుడ! అఘోర సంసారసాగర తరంగాందోళితుండ నై కర్మపాశబద్ధుండ నై యున్న నేనక్షకుడ! బాలుండఁగాన తల్లీ! నీపాదాభివందనముచే నీదర్శనముచే నాపాపములు పలాయనంబయ్యె. ధన్యుండ నైతి. మహానుభావులైన యాంజనేయాదులం గాంచిన నీనయనే ప్రియములతో నీవసుంధరుం జూచితివి. కరుణాతరంగి తేక్షణములు నాపై ప్రసరించితివి. అమ్మహాత్ములు సంచరించియున్న యీపురి నేను గాంచితినని చెప్పి నేత్రంబులు ముకుళించి చేతులుజోడించి,

శ్లో. "మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

శ్లో. యత్ర యత్ర రఘునాథకీర్తనం
తత్రతత్ర కృతమస్తకాంజలిం,
బాష్పవారిపరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాంతకం."

అని శ్రీమదాంజనేయుని ధ్యానించి నిలచియున్న వసుంధరుం గాంచి యాతని సద్గుణగణంబులకు సంతసించి స్వయంప్రభ హర్షితరాంతఃకరణయై తనకరంబున నాతని శిరంబుఁ దడవుచు "వత్సా! బహుకాలజీవి వయ్యెదవు. విజయశస్సుధాధవళిత దశ దిగంతరుండవయ్యెదవు. భారతభూపాల కిరీటరత్నాలంకృత పాదతలుండవై సార్వభౌమపదవి నందెదవు. దుష్టనిగ్రహ శిష్టపరిపోషణాది సుగుణాభరణుండవయ్యెదవు. సనాతనధర్మప్రతిష్ఠాపితుండవయ్యెదవు. తండ్రీ! నీవు ధనుర్వి

ద్వయం దభినవార్జునుండవు. భుజబలమునం దనిలాత్మజుండవు. ధర్మమార్గమునం దజాతశత్రుండవు గమ్మని మరల మరల నాశీర్వాదము లొనర్చి "వసుంధరా! ఇది కలికాలము. ధర్మ మార్గం బెంత యవలంబించిన నొక్కొక్క సమయమునందు పాషండధర్మములయందు బుద్ధి ప్రసరించుచుండును. నీవు ధారణాశక్తిగలవాఁడవై "సత్యంవద! ధర్మంచర" యను నుపనిషద్వాక్యమును గమనించుచుండుము. ఆర్యులయెడ నణఁకువ గలిగి వర్తింపుము. నేనిట్టి విద్యాప్రభావవంతుఁడను గదా! యని గర్వింపకుము. పలుమరు కయ్యమునకుఁ గాలు ద్రవ్వకుము. దిగ్జయానంతరము యజ్ఞంబు లొనరింపుము. నీవు మూర్ధాభిషిక్తుఁడవై నప్పుడు ప్రజలను నీకన్నబిడ్డలవలె గాపాడుము. వారు క్షామడామరంబులచే బాధపడునపుడు తగు చికిత్సలు చేయించి యన్నోదక వసతుల నేర్పఱచి కాపాడుము. నిర్నిమిత్తమైన పన్నులు నియమించి వారిని వేధింపకుము. లాభనష్టములు యోచింపక ప్రజోపయోగ కార్యము లొనర్చుచుండుము. నీచే నియమింపఁబడు దేశాధికారులకును బరగణాధికారులకును, మండపాధికారులకును అధికారానుసారము విచారించి స్వజాతీయులనక యితరవర్ణమువారనక సర్వసమత్వముచే వేతనము లొసంగుచుండుము. పక్షపాతము లొనరింపకుము. ప్రజలద్రవ్యమును వారి సమ్మతిచే నీకు యుక్తమని తోఁచిన ప్రజోపయోగ కార్యములకు వినియోగింపుము వర్ణాశ్రమ ధర్మములు చక్కఁగా విచారింపుము. చతురంగ బలంబులకును నెలవేతనములు గడువుదప్పక యొసంగుచుండుము. ప్రతియూరునందును బంచాయతీ న్యాయస్థానముల స్థాపింపుము. నేను జక్రవర్తినిగదా! నాకేమిగొదువ యని

యొకచోఁ గూర్చుండి ప్రజల కష్టములు ప్రతినిధులపై వైచి వారలను విచారింపక ప్రతినిధుల వాక్యములే వేదవాక్యముల వలె నమ్మి నీసౌఖ్యము నీవైభవము నీవినోదములయందే కాలము గడుపుచుండకుము. వేదబాహ్యులైనవారల దండింపుము. నిరంకుశముగా దినదినమున క్రొక్క్రొ శాసనము నిర్మించి యాశ్లేయమైన ప్రజల హక్కులకు బాధకము గల్పింపకుము ప్రజోపకారమునకై పాటుబడక స్వలాభగౌరవములపై యాశగలుగు డంబాచారుల నాస్థానసభ్యులుగా నియమింపకుము. దాక్షిణ్యమునకు విధిలేక ప్రజలాస్థానసభ్యునిగా నెన్నుకొన్నను అట్టివారిని గూఢమార్గముగాఁ బరీక్షించి యోగ్యులైనవారినే సభలోఁ జేర్చికొనుము. అయోగ్యులను ప్రజాసమ్మతి లేకున్నను స్వేచ్ఛగా వదలింపుము. సనాతన మతధర్మములయం దాసక్తులై వర్ణానుసారాచార ప్రవర్తకులైన వారల కితరమత ధర్మము లుద్బోధించి మతభ్రష్టులుగ నొనర్పకుము. క్షపణక కాపాలిక చార్వాకపాషండ మతస్థులయందైనను బ్రజోపద్రవ ధర్మముల నాచరించువారినే శిక్షింపుము విద్యాభివృద్ధికై యచ్చటచ్చటఁ బాఠశాలల నేర్పఱుపుము. వ్యాపారధర్మముగా రాజ్యమును బాలింపకుము. అతిథి అభ్యాగతుల నాదరింపుము. నీవు సర్వవిద్యావంతుఁడవై యుండినను నీచెంత కరుదెంచు విద్వాంసుల బరీక్షించి వారి యోగ్యతానుసారము గౌరవింతువుగాని వాక్యార్థముచేఁ బరాభూతులుగా నొనర్పకుము. మరుభూములందుఁ బానీయశాలల నేర్పఱుపుము. దేవోత్సవాదులు త్రేతాయుగమునుండి జరుగుచున్నవి గాన వాని నాటంకపరుపక పురోవృద్ధి యొనర్పుము. బ్రాహ్మణవృత్తుల నపహరింపకుము. స్వలాభపరుఁడవై ప్రజారక్షణ

మందుఁ బక్షపాత మొనర్చితివేని యనావృష్టిదోషము సంభ వించును. పంటలు పండవు. అపుడు జీవనార్థమై ప్రజలు ఘోర కార్యము లొనర్పవలసివచ్చును. ధర్మపరిపాలనలేని దోష ముచేఁ బ్రజల పాపమంతయు రాజు నాక్రమించి ధ్వంసమొన ర్చుటయేగాక యతని పాపములను విచారించుటకుఁ బదిమంది యమధర్మరాజులైనం జాలరు. నీవొనర్చు సత్కార్యము లన్నియుఁ బరమేశ్వరప్రీతి యొనర్చుచుండుము. ప్రపంచ రాజ్యభోగాదులన్నియు నశ్వరంబని వైరాగ్యము వహింపుము పరమాత్మ తత్వనిరీక్షణాభ్యస్తుండ వయ్యును రాజ్యపరిపాల నమునందు విరక్తి వహింపకుము. గోహింస యొనర్చువారల వెదకి వెదకి ఖండించి యగ్ని కాహుతి యొసంగుము. నాయనా! ఈధర్మము లన్నియు నీవెఱుంగనివి కావు. బాలుఁడవగుటచే మఱచియుందువని జ్ఞాపక మొనర్చుచున్నదాన. నేఁజెప్పినవియు జెప్పక మఱచినవియు యోచించి సనాతనధర్మ విమర్శచేఁ బ్రజలను రక్షించుచుండుము.”

వసుం—ధర్మమూర్తివి సత్యస్వరూపిణివి జగన్మాతవు తల్లీ! నీవాక్యము లమృతోపమానములై నామనం బానంద మయంబొనర్చె. ఇంకను గొన్నిసందేహములు గలవు. నివృత్తి యొనర్పవలయు.

స్వయం—అగత్యము కానిమ్ము. తెలిసియున్న భగవన్మతము నకు విరుద్ధముగాకున్న సందేహనివృత్తి యొనర్చెద.

వసుం— భేండాఖ్యుండను రాక్షసుని నీకుఁ దెలియునా?

స్వయం— తెలియకేమి? ఆదురాత్ముఁ డసాధ్యుఁడు. క్రూరుడు మాయావి. మంత్రవేత్త. భైరవపూజాపరుఁడు. వాని పేరన్న దేవేంద్రాదులు భయపడుచుందురు. ఎంతమంది

స్త్రీపురుషులను భైరవునకు బలియొసంగి యున్నవాఁడో లెక్కింప నసాధ్యము.

వసుం—ఆ దురాత్ముని సాధించుట కేమయిన నుపాయము గలదేని విమర్శింపుము.

స్వయం—యోచించి తపంబునకుఁ బ్రొద్దయినది నేఁబోవ లయు నీవు బదరికారణ్యమున కరుగుము. నరనారాయ ణాశ్రమమున విశదము కాగలదు.

వసుం—అవ్వా! ఆదురాత్ముని సంహరించెదనని ప్రతిజ్ఞఁ జేసి యున్నవాఁడను. ఆ కార్యము నావలన సాధ్యమగునా!

స్వయం—అదియును జెప్పుటకు నాకు వ్యవధిలేదు. అనాగత మును వక్కాణింపఁగూడదని భగవన్మతము. విధికృత ముగా నేవిధి జరగవలయునో యట్లు జరుగుచుండును. నీ ప్రయత్నమును మానకుము.

వసుం—ఈగుహ నిర్గమించుట కేదయినా సరియైన మార్గము గలదా?

స్వయం—ఆంజనేయాదులును దొల్లి యీగుహానిర్గమ మా ర్గం బెఱుంగ లేకుండిరి. నాతపఃప్రభావముచే బయలం జేర్చితి నీవు నల్లే కన్నులు మూసికొనుము బయలంజేర్చెద ననిన పరమసంతోషముతో నామెకును లక్ష్మీనారాయణ విగ్రహంబులకును బలుమారు నమస్కరించి స్వయం ప్రభానుమతిచే గన్నులు మోడ్చి నిలువంబడియె. కొంతతడ వరిగినంతనే యాతపస్విని యనుమతిచేఁ గన్నులు తెఱచు నప్పటికి దానొక నదీతీరమునం దశ్వత్థవృక్షముచెంత నున్నట్టుదోఁచి యాతపస్వినికి నమస్కరించి అవ్వా! నన్ను బదరికారణ్యమునకుం జనుమని సెలవొసంగితివిగదా ఈ

గహనమున నే నేమార్గముగాఁ బోవలయునో విమర్శింప వలయుననిన "నాయనా!

క. అదిగో చూడుము కదళీ,
బదరీతరుషండభరిత పావనవనసం
పద పార్శ్వభాగమార్గము,
తదనుసరుఁడవగుచుఁ జను ముదగ్దిశగాఁగన్.

క. అతిదుర్గమభూధరసం,
తతిగల దాపైన దేవతటినీతీరో
దితపథమునందు వడివడి,
ధృతిమాలక జనుము ఘోరమృగమయముగుటన్.

చ. అటఁగల దబ్జభూకృతమహాత్తరదివ్యసరోవరంబు త
త్తటతరుశాఖభాసిత తత్పతగస్ఖలితాంబుబిందుచా
కృటితగుళుధ్వనిశ్రుతవికుంఠితరమ్యవియచ్చరధ్వని
స్ఫుటతరచంచరీక పిబఫుల్లసరోజమరందగంధమై.

అదియే లోకపాలసరోవరము. ఆపరిసరమే బదరికారణ్యము. అటకరిగి బేతాళుఁ డెఱింగినరీతి తపంబాచరింపుము. నీకుఁ గార్యసిద్ధియగునుగాకయని దీవించి యాతస్విని యంతర్హితయయ్యె. వసుంధరున కానందంబు పెచ్చుపెరిఁగి దేహంబుప్పొంగె. మరలమరల నాతస్వినివాక్యంబులు దలంచుచు లక్ష్మీనారాయణవిగ్రహముల ధ్యానించుచు ధన్యుండనైతి ననుకొంచు నుదగ్దిశాభిముఖుండై పోవుచుండ "అయ్యో! నన్నీదురాత్ముఁ డెటకో గొనిపోవుచున్నవాఁడు. ఎవ్వరయిన నన్నురక్షింపు" డను వార్తారవం బాకాశమునుండి విననయ్యె. వసుంధరుండట్టె యాకాశంబును జూడ నొకరాక్షసుం డొక్కమానవు నెత్తికొని పోవుచుండగని యోహో! ఛేండా

భైరవుని చారుడే యీతనినెత్తికొని పోవుచుండవలయు నను కొని మహాకోపముచే నిలునిలుమని యదల్చి ధనువంది క్రూర నారాచము సంధించి యాకర్ణాంతముగాలాగి విడిచె. అదియు రివ్వున నేగి యారాక్షసు నఱకాలియందుదూరి నడుమున బయలువెడలె. ఆవేదనకోర్వలేక తానెత్తికొని పోవుచున్న పురుషునివిడిచి మందగమనముతోఁ బోవుచున్న మఱియొక బాణముచేఁ బెడతలందాటించె. ఆదెబ్బచే నతనిజవసత్వములుతగ్గి దబ్బున నేలంబడుచున్న వారిరువురు నిరుకరంబుల బట్టి నేలఁబెట్టి రాక్షసునకు స్మృతిదప్పె. ఆ మనుజుఁడు గడ గడ వణఁకుచు నిలువలేక గద్గదకంఠముతో గ్రుక్కిళ్లుమ్రింగుచు "మహాత్మా! నీవెవరో నాపాలిటి యాపద్బాంధవుండవు. నీవు లేకున్న యారాక్షసుఁడు నన్ను దినివేసియుండును. రక్షించితివి నీవు శ్రేయంబు బొందు" మని పొగడుచుండ నంతలో నారాక్షసుఁడు మూర్ఛదేరి పరువెత్త నుపక్రమించె. వసుంధరుఁడు మఱియొక మార్గణముచేఁ బాదనఱకువైచె. ఆతండు వెనుదిరిగి యొకవృక్షశాఖమును విఱుచుకొని గిరిగిరం ద్రిప్పుచు వసుంధరునిపై నుఱికె. రెండమ్ములచే నావృక్షశాఖను ఖండించి మఱియొక బాణమున నాతని దక్షిణభుజము ద్రుంచి యాతనిపై లంఘించి నేలంబడవైచి వక్షముపయింగూర్చుండి ఖడ్గముచే నాదురాత్ముని కంఠంబు త్తరించుటకుఁ బ్రయత్నించె. "మహానుభావా! శరణు! నీవుత్తమక్షత్రియునివలె నగుపడుచున్నావు. నేను ప్రాణభీతిచే సుడివడుచున్నాను. అపరాధిని. క్షమింపుము. భేండాభైరవునాజ్ఞచే నావిధి నేను నెఱవేర్చుచుంటిని కాపాడు" మని యారాక్షసుఁడు ప్రార్థించె. దయామయుండగుటచే నమ్మహాత్ముఁడాతని విడిచి దురాత్మా! ఇఁక

నెన్నటి కిట్టి క్రూరకార్యము లొనర్చుకు మీతప్పిదమునకుఁ దగుశిక్ష యనుభవించి యున్నవాఁడవు పొమ్మని చంపకాతని విడిచిపెట్టె. ఆతఁ డింతియచాలునని చేయఁబోఁగొట్టుకొని యేడ్చుచుఁ బలాయనం బయ్యె. భయపడుచుఁ దన్ను నుతించుచున్న బ్రహ్మచారింగని "అయ్యా! నీవెవ్వర వీతనికెందులకుఁ జిక్కితివి. నీకథ వివరింపు" మని వసుంధరుండడిగె. అందులకు బ్రాహ్మణుఁ డిట్లని చెప్పె. "ఆపద్బాంధవా! నాపేరు శ్రీపాదశర్మ. మాది కాశీనగరము. సుశీలయను కాంత నన్వేషించుచు వచ్చుచున్న నన్నీదురాత్ముఁ డెత్తికొని పోవుచుండ నీవు రక్షించితి" వని తనకథనంతయు సంగ్రహముగా వినుపించె. మరల వారిరువు రీరీతిఁ బ్రసంగించిరి.

వసుం:—అయ్యా! కాశీనగరమున భట్టపాదాచార్యులయొద్ద తర్కశాస్త్ర మభ్యసించుచుంటివిగదా!

శ్రీపా:—ఔను! నీకెట్లు తెలియును?

వసుం:—యాత్రార్థమై కాశీనగరమునకు వచ్చియుంటిని. అపుడు నీతోఁగొంతకాలము స్నేహితధర్మము నాచరించి యుండియు గుర్తింపలేకపోయితిని. నీవు శ్రీపాదశర్మనని చెప్పినంతనే జ్ఞాపకమునకు వచ్చుచున్నది. భట్టపాదాచార్యులవారు క్షేమముగానున్నవారా? వారిచెంత నేనును గొంతవిద్యాభ్యాసము చేసియున్నవాఁడను.

శ్రీపా:—నిన్ను నేఁజూచినట్టును జిరపరిచితమైనట్టు కంఠధ్వనియును జ్ఞాపకమున్నది. సమయమున కేతెంచి స్నేహితమును సార్థక మొనరించితివి. నీకుఁ బ్రత్యుపకారము చేయఁజాల. అనవరతము నీస్నేహిత మొనర్చెద నీకే రెయ్యది యొఱఁగింపవలయు.

వసుం—నన్ను వసుంధరుండని పిలుచుచుందురు. నీ వీయరణ్యమున నొంటరిగా దిరుగకుము. ఆ పాపాత్ములు మరల నీకప కార మొనర్తురు నా వెంటనే యుండుము. సమయము చూచి తగుసహాయ మొసఁగి నిన్నుఁ గాశీపురయు జేర్చెద.

శ్రీ—మా సుశీల యగపడువఱకు నేనూరికిఁ బోవను. ఇంకే ప్రాణములైన విడిచెద. లేకున్న నీ వెంటనేయుండెద. మా సుశీల యిందెందైన నున్న దేమో జూడవలయు.

వసుం—శ్రీపాదా! మీ సుశీల నేను వెదకించి నీకొసంగెద నీవా చింతవిడువుము. ఊరక నా వెంటరమ్ము.

శ్రీ—నీవంత దృఢముగాఁ జెప్పుచున్నావే! ఎందైనఁ జూచి యున్నావా?

వసుం—ఆవిషయమడుగకుము ఇరువది దినములలో సుశీలను నీసన్నిధిఁ జేర్చెద తొందరపడకుము.

శ్రీ—అట్లయిన మా సుశీల జీవితురాలై యున్నదిగదా!

వసుం—శ్రీపాదా! నీకుఁ బండితనామధేయమేగాని శుద్ధ పామరుఁడవై యున్నవాఁడవు. నీ మొదలిగుణమాంతయు మారియున్నట్టున్నది. జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడవు కవీశ్వరుండవు గణితశాస్త్రమెఱింగితివి తర్కమభ్యసించితివి వేదాభ్యాస మొనర్చితివి. చూడుము! సుశీల జీవవంతురాలై యున్నదో లేదో సిద్ధాంత మొనర్పుము.

శ్రీ—నే నీవిద్యల నెఱుంగుదునని నీ కెట్లు తెలియును?

వసుం—తెలియకయే వచించితి ననుకొంటివా? నీవును నేనును భట్టపాదాచార్యులయొద్ద జ్యోతిషముల నభ్యసింపలేదా మఱచితివో.

శ్రీ—ఓహో! నీవేమి కళాభానుఁడవా?

వసుం——నేను వచ్చిన యనంతరము వచ్చినవాఁడుగదా కళా భానుఁడు, నేను వసుంధరుండనువాఁడను.

శ్రీపా——కళాభానుఁడుగాక మఱియొకరితో నేను విద్యాభ్యాసంగ మొనర్చి యుండలేదే! నీవు క్రొత్తగాఁ జెప్పుచున్న వాఁడవు నాకుస్ఫురింపలేదు.

వసు——సుశీలావియోగ సంతాప ధూమావృతుఁడవై యున్న నీకేవిషయము జ్ఞాపకముండును. కళాభానుఁడని కలవరించెద వదియేమి?

శ్రీపా——అహా! ఆ విద్యాచక్రవర్తిని ఆ విలాసంతీమనోహరుని ఆగంభీరసాగరుని ఆశరణ్యా వరేణ్యుని అసుహృత్పయోజభానుని అప్రతాపభానుని అమూఢజనాజ్ఞానతమోభానుని అపరిపంథిగర్వాంధకారభానుని కళాభానుని స్మరియింపకుందునే? నాప్రాణమిత్రుఁడే, ఆర్యజనాశీర్వచనపాత్రుఁడే, సుచరిత్రుఁడే, పాపాటవీవీతిహోత్రుఁడే, నీవాతని జూచియుండలేదు. మిత్రుఁడని యసృతము లాడుచున్నాఁడవు. అమ్మహాత్మునకొక సందేశపత్రిక లభించినది. ఇచ్చి గాఢాలింగనమాచరించి మిత్రత్వము సార్థకపఱచెద. నినుగన్నప్పటినుండియు నమ్మహానుభావుఁడు నాకు జ్ఞాపకమునకు వచ్చుచున్నాఁడు. నీధ్వనియును విన్నట్టుజ్ఞాపకమున్నది. మనమిరువుర మేకకాలమందు భట్టపాదాచార్యులవద్ద విద్యాభ్యాస మొనర్చియు నీవన్నట్టు మోహాంధకారం మగ్నుఁడై యున్నవాఁడ. నీకున్న జ్ఞాపకశక్తి యీయాజ్ఞానలతాఛేదునకి నీ మిత్రభేదునికి నీమూఢగహ్వరాను మోదునకి నీ శ్రీపాదునికి లేకున్నది. తండ్రీ! ఈసమయమునందకస్మాత్తుగ నీవిచటనుండి యా

క్రూరబైరవానుచరునుండి తప్పించితివి. కృపారసంబు నాపైఁగురిపించితివి. మిత్రుఁడైన నామనమును మెప్పించితివి. ఆదురాత్మునొప్పించితివి. నీకాయురారోగ్యైశ్వర్య పుత్రపౌత్రాభివృద్ధి యగునట్లు లాభగవంతుని ప్రార్థించుచుండెద.

వసుం—నీవు సుకృతవయోరాశివి నీపూర్వపుణ్యావశమున ని న్నానీచునిబారినుండి భగవంతుడే తప్పించి యున్నవాఁడు. నిమిత్తమాత్రుఁడైన న న్నీరీతిఁ బొగడఁదగునే? మిత్రుఁడవు సహపాఠివి బ్రాహ్మణుఁడవైన నీ వార్తుఁడవై యున్నప్పుడు చంద్రవంశో త్తమక్షత్రియుఁడనై జన్మించి యుపేక్ష యొనర్పఁదగునే? కానిమ్ముఁ కళాభానునికి సందేశలేఖ లభించినదని చెప్పితివే, అందున నేమివిశేషమున్నదో రహస్యముగాకుండిన నేఁ జూడఁదగినదైనఁ జూచుట కామోదించుచున్నాఁడ.

శ్రీ—ప్రాణరక్షకా! నీకెటింగింపని రహస్యము కలదా? ఇదె ప్రతికఁజూడుమని యొసంగె. అతం డాపత్రికవిప్పి మనమున నే చదువుకొని తలయూచి పత్రికనుమడిచి మరల శ్రీపాదుని చేతికొసంగి నీకీపత్రికలభించు టెట్లని యడిగె.

శ్రీ—సుశీలనరయుచు నరణ్యములో నేను దిరుగాడుచుండ నచ్చటికి సుశీలామాతులుండైన విశ్వావసుశర్మ కళాభాను నరయుచువచ్చి నాకథవిని యీపత్రిక నాకుఁ జూపించె. నీకెట్లులభ్యమయ్యెనని యడిగితిని. తాను హరిద్వార రాజకుమారుని చిత్రపటముఁ దీసికొని మణిస్యందనమునకుం బోయి ప్రస్తావవశమునఁ గళాభానుని వృత్తాంత మా రాజకన్యకతో వచియించినప్పటినుండియు నాకాంత

కళాభానునే వరించి యాతనికిఁ దనసందేశమును వ్రాసి యిచ్చినదని చెప్పి నన్నరణ్యములో నుండవలదని బోధించి తాను కళాభాను నరయుచు వెడలిపోయె. నేనాతని నొడంబఱచి కాశీనగరమున కరుగక మరల సుశీలనన్వేషించుచు వచ్చుచుండ దారిలో నీపత్రిక పడియుండె. అదిగాంచి అయ్యో! అతఁడేమైనయుండునోయని వగచి పత్రికం జేతఁ బట్టికొని వచ్చుచుండ నీదురాత్ముఁ డొక్కపెట్టున వియన్మార్గమునుండి చనుదెంచి నన్నెత్తుకొని పోవుచుండి నీచేఁ బరాభూతుఁడై నన్నువిడిచి చనియె. ఇదియేపత్రికా వృత్తాంతమనిన వసుంధరుఁ డిట్లనియోచించె. ఆబ్రాహ్మణుఁ డేమయ్యెనో పాపము! భైరవానుచరు లెత్తికొని పోయియుందురో? క్రూరమృగముల కాహారమయ్యెనో కానిమ్ము. భైరవాశ్రమమునకే బోయియుండిన పట్టికా ప్రకారముగదా బలియిత్తురు. ఇప్పుడా యాశ్రమమున కశుచిసమయ మగుటచే రక్షింపబడిన కన్యకయే యీ శ్రీపాదుని సుశీలయై యుండవలయు. ఆమె కాశీపురమునం దన్నపూర్ణాదేవాలయములో నున్నదని యితనికిఁ జెప్పితినా మరల నాకెఱింగింపకనే యొంటరిగా నచటికింబోవఁ బ్రయత్నించును. అట్లుపోవునపుడు భైరవానుచరుల కంటఁ బడెనా యీతనిపని యంతటితో సరియగును. అందుచే నామర్మ మెఱింగింపక నా వెంటనుంచుకొని తగుసహాయ మబ్బినపు డీరహస్యము మెఱింగించి పంపవలయు ననుకొని కొంచెముసేపు విశ్రమించి స్వయంప్రభోక్త మార్గానుసారమై శ్రీపాదుని వెంటఁగొని చనిచని గొప్పపర్వతము లెక్కుచుఁ గొనదిగుచు ముందు శ్రీపాదుండును వెనుక

వసుంధరుండును బోవుచుండి బహుదుర్గమారణ్యములు నిర్గమించుటచే శ్రీపాదుఁ డాయాసమొంది మృగగర్జనలకు భయమంది "వసుంధరా!

చ. సిరిగల దేగపిట్టలును జీకురుపక్షులు గుడ్లగూబలున్
జిఱుతలు లేడు లేనుగులు సింగములున్ గరడుల్ సివంగులున్
గరుకున గూయుచున్నవి వికావికలై దిగులొందితయ్యయో
పరపగు రేణికాన నిఁకఁ బాదము లూనగ లేను మిత్రమా.

ఉ. అమ్మలరీతిఁ బాదములయందున గంటి కఘాతమయ్యె నీ
వెమ్మెయిబోయెదో శ్రమమ దెట్టుసహింతువొ జాలుచాలుని
క్కమ్ముమహాత్ముఁడీవు పటుకాపురుషుండను నేను దుఃఖభా
రమ్మున మగ్గినాడనను రక్షణ జేయగ బూనుమాత్వరన్"

అని విలపించి యడుగిడ లేక యందే గూర్చుండె. వసుంధరుం డాతనింగాంచి "మిత్రమా! సింహ శరభ వ్యాఘ్ర భల్లూకాది మృగభయంకరారవనిబిడీకృతమా యరణ్యమునం దెట్లు సహించి సుశీల నన్వేషించుచుంటివి? కంటక పాషాణమయమై నిష్పాపియమై దుష్పథావృతమైన దుర్గములం దెట్లు సంచరించితివి? నాఁడులేని యాయాసం బీనాఁడు గల్గినదే? సుశీల నన్వేషింపవలయునా వలదా? లెమ్ము. ఈగంగానదిని స్నానమాచరించి కొంతతడ విట విశ్రమించి వెళ్లుద" మని గంగానదియందు స్నానపానాదు లొనర్చి తత్తీర తరుచ్ఛాయలందు విశ్రమించియుండినపు డా నదీమతల్లింగాంచి శ్రీపాదుఁడు,

సీ. ఈదేవియేగదా యీశుశిరంబుపైఁ
దాండవం బాడుచుఁ దనరుచుండు

నీనదియేగదా హిమవన్నగాగ్రంబు
    నందుండి భూమిపై నవతరించు
యాస్రవంతియెగదా హితమతిచే
    శౌరిపాదోద్భవాఖ్యచేఁ బరఁగుచుండు
నీమతల్లియెగదా యెల్లలోకంబులు
    తనవారిచేతఁ బావనముసేయు

గీ. నారి! యీగంగ దివ్యవిహారరంగ
భక్తజనసంగ దుర్ఘోరపాపభంగ
చలబృహద్భంగ కమలాగ్రచరితభృంగ
పొగడఁ దరమాన మిత్రమా భువనమునను.

ఈ నదియందు స్నానమాచరించిన మాత్రముననే యాప్యాయమానమై మార్గాయాసమంతయు నంతరించిన దిఁక వెళ్లుదము.

వసుం—రమ్మా నీవు నడువఁజాలవు. నాభుజములపైఁ గూర్చుండుము.

శ్రీపా—వలదు కొంతదూర మరుదెంచెద. ఆవల చూచి కొందము.

వసుం—చాలును రమ్మనియెత్తి తనభుజముపై నెక్కించుకొని మహావేగముగా నడచుచుండె. బహుదూర మరిగినంత నచట ధూమంబును వేదఘోషయును వినంబడియె అల్లి పోవుచు నొక యాశ్రమంబుచెంత కరిగి దానింగాంచి శ్రీపాదుఁడు "వసుంధరా!

సీ. అదె! యాజ్యహోమధూమావృతాంగార
    సంజాతిస్ఫులింగాభ్రచాల్యమగుచుఁ

దతయుదాత్తానుదాత్తప్రత్యయోద్గీయ
వేదమంత్రార్భటీవిశదమగుచుఁ
బరమస్రుక్స్రువపరిస్తరణేధ్మ దర్భాజ్య
చరుపురోడాశసంభరిత మగుచు
నధ్వర్యుహోతసభ్యప్రవర్గ్యబ్రహ్మ
యాగ్నీధ్రఋత్విక్ప్రయాత మగుచు

గీ. గీయతాత్రావయోన్మంత్రహూయనిర్జ
రాగమనదీక్షితదృగ్ద శాశాంతఋషిభి
రంభబిందుప్రపాతకణారంభ మగుచు
ననన మొప్పారుచున్న దాశ్రమముఁ గంటె."

అని మఱియు నేదియో చెప్పుట కుపక్రమించుచుండ "శ్రీపాదా! ఇదియే బదరికారణ్యము. అదియే లోకపాల సరోవరము. ఇందే నేను తపమాచరింపవలయు" ననుచు భుజమునుండి యాతనిడించి సరోవర సమీపమున కిరువురుం జనిరి. ఆసరోవరమున కష్టదిక్కులయందు నమృతశిలా విరచితంబులగు మంటపంబు లెనిమిది వెలయుచుండె. ఆమంటపములలోఁ బరికింప భార్యాసహితమైన యింద్రాగ్ని యమ నైఋతి వరుణ వాయు కుబేర యీశాన విగ్రహముల బూర్వాదిగా గ్రమంబునఁ బ్రతిష్ఠింపఁబడియుండె. అదిగాంచి స్వయంప్రభోక్త లోకపాల సరోవరం బిదియేయని నిశ్చయించి స్నానంబొనర్ప నుద్యుక్తుఁడై యున్న నాకాసార రామణీయత కచ్చెరువంది శ్రీపాదుఁడు,

చ. కుసుమలతాతతుల్ తటినిఁ గొమ్మల గూడియు నీదులాడ వె
కసమగు నీటిపక్షులు వికస్వరసుస్వరతన్ ధ్వనింప సం

తనయున నబ్జమాధురిమతంబునఁ ద్రావియుఁ దేటులాడగా
నినుమునఁ గూడి యూసరసి యింపెసలాడెగదా వసుంధరా.

అని తత్తటంబుపైఁ జూచుచు నిలువంబడిన వసుంధ రుఁడు స్నానోన్ముఖుండై "శ్రీపాదా! యిఁక నే స్నానమాచ రించి తపంబున కుపక్రమించెద. నీవు భయపడకుండుము. ఇందే భూసురులున్నవారు. ఆయాశ్రమమున నుండుము. లేకున్న నీమహోన్నతామృతశిలపై నుండుము. ఒక వేళ నీ కేదేని భయము గలుగు విపత్తు తటస్థించెనేని నన్నుఁ బిలు వుము నీకు భయము బాపెద. ఈపరిసర కందమూల ఫలము లచేఁ దృప్తిఁజెందుచుండుము. రాత్రివేళల నమృతశిలపై ననో ఆశ్రమవాసుల చెంతనో విశ్రమింపుము. పలుమారు బిలుచుచు నాతపంబున కంతరాయముఁ గల్పింపకు" మని చెప్పి యా సరోవరంబున స్నానమాచరించుట కుద్యుక్తుండై సోపాన మార్గముగా దిగుచుండె. ఆసరోవర తీరమునుండి "యష్ట దిక్పాలక స్నానయోగ్యంబగు నీసరోవరంబున స్నానంబాచ రింపవలదు. సాహసమొనర్చితివేని నీకపాయము తటస్థించు" నను వాక్యములు వినంబడియె. ఎవ్వరిట్లు బలుకుచున్నారని వసుంధరుఁడు నలుప్రక్కలంగాంచి యేమియుం గానక యే విమయమో యని స్నానోన్ముఖుండయ్యె. మరల నదేరీతి విన వించె నదిగాంచి,

వసుం:—అయ్యా స్నానమొనర్పఁ బోవుచున్న నన్ను వారిం చుచున్నావు. నీరూపం బగపడదు. నీవెవరు!

అధి:—నే నీ సరోవరాధి దేవతను.

వసుం:—ఎందులకు నన్ను వారించెదవు!

అధి:—దీనిం బ్రవేశించిన నీకపాయము గలుగఁగల దందు చేత వారించుచున్నాను.

వసుం:—దేవీ! ఇందు స్నాన మొనరింపవలసిన కార్యమొం డుగలదు. అందుల కేమియుపాయముఁ జెప్పెదవు?

అధి:—గంగానదిగలదు. బిందుసరోవరముగలదు. గంగోత్తరి గలదు. వానియందు స్నానమొనరించినఁ గల్గని కార్యసిద్ధి యీసరోవరంబునం గల్గునే?

వసుం:—అమ్మా! ఆర్యులేవిధి జెప్పియుందురో యారీతిఁ గార్యసిద్ధి నొందవలయు. అపాయము గల్గునని బెదరి వారి వాక్యోల్లంఘనం బొనర్చి కార్యభంగ మొనర్చికొని యప కీర్తి నొందుటకన్నను ఆర్యవాక్యానుసార మొనర్చి యందుచే లభ్యమైన యాపత్తు ననుభవించుట మేలు గాదా? ఇందుఁ బ్రవేశించిన నాకేమి యుపాయము తట స్థించును?

అధి:—ఈసరోవరమునఁ బాదంబద్దినమాత్రముననే పర్వత ములంబోలు నెనిమిది గరుడపక్షు లరుదెంచి నిన్నెత్తికొని పోయి తినివేయును.

వసుం:—గరుడపక్షుల బారినుండి తప్పించుకొనిన?

అధి:—ఈసరోవరములో నున్న నలువురు క్రూరరాక్షసు లీడ్చికొని పాతాళమునకుంబోయి నిన్ను దినివేయుదురు.

వసుం:—అష్టదిక్పాలకు లారాక్షసుల నేల శిక్షింపకున్నారు?

అధి:—వారసాధ్యులు. బ్రహ్మవరానుభూతులు. అందుచే వారలతో మైత్రిఁ గల్పించుకొని సమయమును వేచి యున్నవారు.

వసుం:—అంతటి యసాధ్యులైన రాక్షసులుండు నీసరోవరమున వారెట్లు స్త్రీలతో స్నానాదు లాచరింతురు? నీమాటలనే విశ్వసింపఁజాల. అమ్మహాత్ముల కసాధ్యులైన రాక్షసు లీప్రపంచమందు గలరే? జగములు పుట్టింపను సమయింపను శక్తిగలవారల నిట్లాడఁదగునే? నన్ను భయపెట్టుటకు నిట్లు పలుకుచున్నదానవు. తల్లీ నమస్కరించి వేఁడువాఁడ నన్నాటంకపఱుపకుము. నాకార్యసిద్ధియగునట్లు నీయాశీర్వచనం బొసంగుము.

అధి:—నాయనా! అట్లనకుము. దేవతల కసాధ్యమైన నివాతకవచులను రాక్షసుల నర్జునుఁడు సంహరింపలేదా? దేవతల కసాధ్యులైన రాక్షసులను సూర్యవంశ మహీశులైన ముచుకుంద ఖట్వాంగ దశరథులు సంహరింపలేదా? దేవతల కసాధ్యులగుటచే గదా వారలను సంహరించుట భగవంతుఁ డనేకావతారము లెత్తవలసివచ్చె. దేవతలైన మాత్రముననే యద్వితీయు లనుకొంటివే? అట్లనక నీ యుద్యమమును మానుము.

వసుం:—తల్లీ! నాపై ననుగ్రహించి శుభవాక్యములచే నన్నాశీర్వదింపుము. నేను స్నానమొనరింపక మానను.

అధి:—నీయిష్టము. ఇఁక నేఁజెప్పఁజాల నీకుశుభమగుఁగాక.

తల్లీ! వందనము. నాకిదియే కావలయుననుచు ధనస్సు చేతినంది యొకవాఁడియమ్ముదీసి సుదర్శన నామమంత్రంబభిమంత్రించి యష్టదిగ్బంధన సంకల్పంబుగాఁ బ్రయోగించె. అదియును ధనస్సునుండి వెడలి కాలచక్రంబురీతి గర్గిరం దిరుగుచుఁ జిటచిటధ్వనులతో విస్ఫులింగములు రాలుచు నాకాసారంబున కష్టదిశలయందును నొకచోట నున్నదని నిశ్చయించు

టకు వలనుపడక ప్రజ్వలించుచుఁ దిరుగుచుండె, దానింగాంచి శ్రీపాదుఁడాశ్చర్యమగ్నుఁడై "భళీ! వసుంధరా! దివ్యాస్త్రకోవిదుండైన నిన్నుఁ బొగడఁదరమే!" యని నుతియించె. అతండు కోదండం బెక్కుడించి యొక్క తరుమూలంబునం దుంచి సరోవరంబునందిగి పాదప్రక్షాళనం బాచరించుచుండె. అంత ఘోరమని శబ్దముగలిగె. ప్రళయమారుతం బువీచె. పక్షివిక్షేపములచేఁ బరిసర వృక్షశాఖలు పెళపెళధ్వనులచే విరుగుచుండ శరవేగంబున నెనిమిది గరుడపక్షు లెనిమిది దిశలనుండియు నేతెంచి సరోవరములోనికిం దిగుట కసాధ్యమై వసుంధర ప్రయుక్త సుదర్శనాస్త్రాగ్ని కోర్వలేక పిండుగట్టి చదల వాడుచుండి వృక్షశాఖలపైఁ గూర్చుండె. వసుంధరుఁడు సరోవరమున స్నానమాచరించుచు నఘమర్షణమంత్రముఁలం జెప్పికొనుచు సంకల్పించుచుండె. సరోవరములోనుండి గుబగుబమని బుగ్గలెగసె. జలాంతర్గతామృతశిలాసోపానములపై నిలిచియున్న వసుంధరుని రెండుపాదములం బట్టికొని యిరువురు రాక్షసులీడ్చిరి. అప్రయత్నమున నుండువాఁడగుటచే నీటియందుఁ గూలఁబడి ధైర్యమునువదలక మహాసాహసమున వానుపాదమును బట్టియున్న రాక్షసునిచేయి తన బాహువుచాచి యందుకొని లేచినిలునంబడి ధట్టించుచు నాతనిం బయిటికీడ్చి యట్లసోపానములపై ద్రొబ్బి రెండు చేతులంబట్టికొని లోపలనున్న మఱియొకపాదముచే నాతని ముఖముపైఁ దన్నె. ఆతాపుచే బాధజనియించి పాదమును విడిచిపెట్టె. వసుంధరుఁడు సోపానములపై కెక్కి చేతనున్న రాక్షసుని జరజరఁ ద్రిప్పి సోపానంబులపై వైచె. అతం డాదెబ్బచే వేదనం బొందుచుండె. లోపలనున్న రాక్షసుఁడు

బయటికురుదించి యార్చుచు వసుంధరునిపైఁ దుమికె. తనపైఁ బడుచున్న దనుజునివక్ష మధికత్వరచే ముష్టిచేఁ బొడిచె. అతం డాదెబ్బచేనొచ్చియుఁ గాసారతటమునందున్న వృక్ష శాఖ విఱచుకొని వచ్చునంతలో నటబడియున్న రాక్షసుఁడు సేదదేరి లేచి పటపట పండ్లుగొఱికి భుజము లప్పళించుచు దక్షిణభుజం బెత్తికొని ముష్టిసారించి వసుంధరుని వక్షముపైఁ బొడిచె. ఆతాపునకు దేహముగంపించె. కన్ను లెఱ్ఱవాఱె. హుతవహునకు ఘృతంబిడునట్లు రౌద్రముచేఁ బ్రజ్వరిల్లి హుంకరించి పదఘట్టలనచేఁ గాసార సోపానంబు లుఱ్ఱూఁ తలూఁగుచుండఁగా వడివడి నాతనిపైకి లంఘించి యారాక్ష సుని నరచేతితోఁ దాటించె. ఆపెట్టుచే నాతనిశిరంబు వ్రయ్యలై భూమిపయింబడియె. వృక్షశాఖవిఱచుకొని వచ్చుచున్న దనుజుఁ డాతనిపాటుఁగాంచి యార్భటించి మండలాకృతిందిరుగుచు వృక్షశాఖం ద్రిప్పుచు వసుంధరునింగొట్టె. అతఁడా పెట్టు దప్పించుకొని యతిలాఘవముచే నితరు లెఱుఁగనంతటి లాఘవమున వృక్షమూలమునందున్న తనఖడ్గము నందికొని వరనుండి సరాన బెఱికి నతిచిత్రగతులచే ఖడ్గముం ద్రిప్పుచు నారాక్షసుని కుడిచేయిపై గుఱినిడి వైచె. అదియు ధగద్ధగాయమానముగా మిఱుమిట్లు గొల్పుచు రివ్వునఁబోయి యాతని భుజమును ఖండించె. వృక్షశాఖయు క్రమ్మగు నాహస్తము పిడుగువంటి చప్పుడుతో భూమిపయిం బడియె. ఆ దానవుని రౌద్రమునకు మేరయే లేదు. కోపంబు రూపంబైన వడువున వామభుజం బెత్తికొని పిడికిలి సవరించి వచ్చుచుండె. అతం డదిగాంచి యతిలాఘవముచే నాతని భుజముపై కెగసి పాద ముచే శిరముఁ దన్ని కేశపాశంబులం బట్టికొని యటనుండి

భూమిపై దూకి యాతని తలవంచి వీపుపై గ్రుద్దె ఆతనిపైఁ బిడుగుపడినట్లయ్యె. ఆ రాక్షసునికి జవసత్త్వములు తగ్గె, నోట రక్తము గ్రక్కె. స్మృతిదప్పి యట్టె నిలునఁబడియుండె. అంత సరోవరములోనుండి మరల కలకలధ్వను లుప్పతిల్లె. ఇదియేమో యని జూచుచుండఁగా నిరువురు క్రూరరాక్షసు లంబరము వగుల నార్చుచు నీటనుండి వెడలివచ్చుచుండిరి. వసుంధరుఁ డతిశీఘ్రమున ధనస్సు కేలనంది యశనిపాతోప మంబులగు పదిబాణము లధికత్వరచే వారిపైఁ బ్రయోగించి నీటనుండి వెడలునంతలోపలనే శిరంబు నెగురఁగొట్టె. వారి రక్తముచే సరోవరమంతయు నెఱ్ఱవాఱి చూడ నసహ్యమై యుండె. ఆకళేబరములు నీటమునుంగక మును పే వసుంధరుఁ డందులో దుమికి యీడ్చి పాఱవైచె. స్మృతిదప్పియున్న యొక భుజరాక్షసుఁడు మూర్ఛదేరె వానింగాంచి "రాక్షసా ధమా! నీపై దయగలుగుచున్నది. నిన్ను వధించుటకు నా కిష్టము లేకున్నది. ఈసరోవరంబున నున్న మీవారందఱిం దోడ్కొనిరమ్ము. వారందఱిం గడపి నిమ్కంటకం బొనర్చెద. దురాత్ములారా! బహుదూరమునుండి వ్రయ ప్రయాసలకోర్చి పుణ్యక్షేత్ర పుణ్యతీర్థ యాత్రల కరుదెంచు పుణ్యాత్ములీతీర్థ మూలయందు స్నానమొనర్చుటకు మీవలన బాధ. క్షేత్రము లలో విగ్రహదర్శన తీర్థప్రసాదముల స్వీకరించుట కర్చకు లతో బాధ. మీరు ఘోరరాక్షసులు. వారు మానవరాక్ష సులు. కలవారో లేనివారో యని యోచింపక పుణ్యక్షేత్ర గౌరవముతో బహుదూరమునుండి వచ్చియున్నవా రనెడి యభిమానమును వర్జించి తాము పుణ్యక్షేత్రేశ్వరార్చకులై యుండియు యాత్రికులను బాధించఁగూడదను న్యాయము

కడఁద్రోచి మధువునుఁ గన్న పిపీలికాదులవలె బాధించుచుం దురు. తాము విధించు కట్నము లిచ్చినగాని దైవదర్శనముఁ జేయింపరు. వారియందున్న రువ్వయో గవ్వయో గుంజుకొని వారు మరల స్వదేశమున కరుగుటకు భిక్షాటన మొనర్ప గుఱిచేయుచుందురు ఇట్టి దురాత్ములను తలలంత ఖండము లగునట్లు నఱికినను పాపము రానేరదు. దురాత్మా! చావక బ్రదికియున్న మీవారలం దొడ్కొనిరమ్ము పొమ్మనిన నాతం డేమియుఁ బలుకక తన సోదరులు గతించినందులకు దుఃఖించుచు నతఁడు బాలుఁడై యుండియుఁ బరాక్రమమున సింహకిశోరుఁడై యేమియు నొవ్వక యుండుటఁ జూచి నిరాశ వహించి తనచేయి బోయినందులకు లజ్జించుచు నేనుండియు నేమి ప్రయోజనమునుకొని పరువెత్తివచ్చి వసుంధరునియెదపై దనకాలితో నొక తన్నుఁ దన్నె. ఆతాపు నతిలాఘవముగాఁ దప్పించుకొని ఖడ్గంబందుకొని యొక్కవిసరుచే నాతని కంఠము తుత్తునియ లొనర్చి యాకళేబరమును సరోవర తటమునుండి విసరివైచి తాను ధనుఃఖడ్గముల శుద్ధినొందించి కాసారతటం బుననుంచి "తల్లీ! జలాధిదేవతా! నీయాశీర్వచన ప్రభావ ముచే నాస్నానమున కాటంక మొనర్చువారల బాధలన్నియు గడచియున్నవాఁడ. ఇం కనుజ్ఞ యొసంగుము. సుఖంబున స్నాన మొనర్చెద" నని చేతులుజోడించి ప్రార్థించె. ఆతనిపై మందారపుష్పంబులు బడియె. అదిగాంచి దేవి యనుజ్ఞ యొసంగినదని నిశ్చయించి స్నాన మొనర్చి సంధ్యావందనాదులం దీర్చి పరిశుభ్రమనముచేఁ దత్పశ్చిమతీరంబునఁ బూర్వాభి ముఖముగా దర్భాస్తరణంబు నవరించి పత్రపుటికలచే జలంబు లుంచుకొని భస్మంబుచేఁ దిర్యక్పుండ్రంబు నవరించి భూశుద్ధి

యొనర్చి విఘ్న నివారకమంత్రముల నుచ్చరించి నలుదిశల యందు మంత్రోదకంబునుం జల్లి సుదర్శనాస్త్రమును బున స్సంధానము గావించి రక్షోఘ్నహరణ మంత్రములచే నష్ట దిగ్బంధనం బాచరించి యవధులు గల్పించి తపంబున కుద్యుక్తుఁడై భయపడకుండుమని శ్రీపాదు నెచ్చరించి యాదిత్యున కంజలియొనర్చి విఘ్నేశ్వరు ధ్యానించి పూర్వాభిముఖుండై యూర్ధ్వబాహుండై నిజనాసాగ్రనిరీక్షణ మొనర్చుచు నచల భావముచే వసుంధరుఁడు నరనారాయణోద్దేశముగాఁ దప మాచరించుచుండె. శ్రీపాదుఁడు కందమూలములచేఁ దృప్తిఁ జెందుచు వసుంధరోక్త ప్రకారము వర్తించుచుండె. నాఁడు గడచి మరునాఁ డరుణోదయం బయ్యె.

శా. ఆకాసారతటంబు పూర్వదిశ దివ్యంబై నరారాలపై
బైకారంబగు వాలుజూపులసునుబ్బైయున్న చక్రదోయిపై
వీకన్ జూపిడి కన్బ్బమల్ గులుక నావృత్తిన్ చెలుల్ గొల్వ న
స్తోకానందము జెందుచున్ మరునిరాతుఖ్యాకరమున్ బోలుచున్

ఉ. మోటులుపల్లవింపఁగనుముద్దులు గూర్పమాఁగనులౌనన్
గూటువయర్థముల్ దెలుపఁ గుల్కుచుఁ దంబురవట్టిగోటిచే
మీటుచు మంద్రమధ్యనభ మేరువులందు నటింప నంగుళుల్
బాటలు పాడుచుండె నొకపద్మదళాక్షి పికస్వరంబునన్.

క. ఆరోహణావరోహణ,
దారుల్ లయమూర్ఛకళల దాటుస్వరముల్
తీరుల్ హాయిన్ గొల్పఁగ,
సారసదళనేత్ర యొప్ప సంగీతముచే.

శ్రీపాదుఁ డమృతశిలాసీనుండై యాసంగీతం బాల
కించి తదీయానందమునకు మైమఱచి "యహా! ఈసునాదం
బెందుండి జనుదెంచుచున్నదది. ఇది దేవభూమి యగుటచే
నేవిద్యాధరాంగనయో! ఏగంధర్వకామినియో!. ఇట సంచ
రించుచుఁ దన యుల్లాసంబు బయల్పఱచుచున్నయది పోయి
చూచి వచ్చెద" నని యమృతశిలావరోహణం బొనర్చి కొంత
దూరం బరిగి యాసరోవర పూర్వతటంబునఁ జెంగావిపావడ
కుచ్చెళ్ళువార ధరియించి సరిగంచుచీనాంబరము వల్లెవాటు
వైచి ప్రత్యంగంబును దివ్యభూషణములచే నలంకరించి పద
మంజీర ఝుళంఝుళధ్వను లమందానందంబుఁ గొల్ప గాంధ
ర్వంబుచాలించి జంత్రంబాబండపై నిడి యటునిటు సంచరించు
చున్న నొక్కదివ్యాంగనంగాంచి చిత్తంబు భ్రమించి మరల
నిదానించి చూచి సుశీలయని నిశ్చయించి శ్రీపాదుఁ డానం
దాశ్చర్యములు బెనఁగొన మైమఱచి "ప్రాణేశ్వరీ! సుశీలా!
నీవియోగ దుస్సహసంతాపముచే భయంకరారణ్యములం
దిరిగితిరిగి యిటకరుదెంచి నాపూర్వపుణ్యావశముచే మరల
నిన్నుం గాంచితి. ధన్యుండనైతి" నని పల్కుచు నాకాంత
సమీపమున కరుగుచుండ నాకాంతయు నొక్క లతా నికుంజ
ముల మాటునకుం జని పొదరిండ్ల చాటుననే చేలాంచలము
వాయుచలితమై పటపటలాడ మెఱపుఁదీగంబోలి వసుంధరుడు
తపం బాచరించుచున్న కాసార పశ్చిమతటంబున కేతెంచు
చుండె. శ్రీపాదుఁడు మైమఱచి "కాంతా! పోకుము నీకై
బహుబాధపడియున్నవాఁడ. ఇంక నన్నలయింపకు" మనుచు
బిలుచుచుఁ బోవుచుండె. ప్రాతస్సంధ్యా సమయంబగుటచే
వసుంధరుఁడు సమాధిఁజాలించి స్నానార్థమై సరోవరాభిము

ఖుఁడై యుండి శ్రీపాదుని యుమ్మలికముఁ గాంచి మరల నిది యేమి కెత్తి "శ్రీపాదా! నీవు కేవలపామరుండవై ధారణా శక్తి లేకున్నవాఁడవే? సర్వవిద్యాగరిష్ఠుండవయ్యు నిప్పు డోఁజకుఁడ"నియె. "వసుంధరా! ఇదే యీపొదరిండ్ల చాటున మా సుశీల యనుచున్నది. నన్నుఁ గాంచియుఁ బల్కరింపకున్న దదేమంజులధ్వనుల నాలకింపు"మని చేజాపి చూపుచుండ నాసుందరి మేఘంబునుండి బయల్పడు విద్యుల్లతయుంబోలె పొదలచాటునుండి బయల్పడియె. అపు డాకాంత సుశీలగా కుండె. శ్రీపాదునకు సిగ్గై తలవాంచి "వృథాభ్రమ కెంతిని. వసుంధరా! క్షమింపు" మనియె. వసుంధరుం డట్టె చూచు చుండ నాకాంతయు నొయ్యారముచే వసుంధరుఁడు జూచు నట్టుగా,

సీ. కీల్గంటుఁ గీల్గొల్పి కేల్దోయి నిక్కించి
గుబ్బల నుబ్బించుఁ గొంతదడవు
అద్దంబు చేఁబట్టి ముద్దుకస్తురిరేఖ
కొద్దిగా సవరించుఁ గొంతదడవు
చిఱునవ్వుఁ గాన్పించి సిగ్గునఁ దలవాంచి
గోటిచే నిలఁ ద్రవ్వుఁ గొంతదడవు
మాటాడుమా కీరమా చూడుమా యింత
కోపమా యనిపల్కుఁ గొంతదడవు

గీ. బొమలు ముడివైచుఁ బువ్వులపొదలఁ జేరు
తేఁటులను ద్రోలుఁ దనలోన మాటలాడు
నలుకు నులుకును బెళుకును గులుక మెలఁగు
మనవసుంధరుహృదయంబు మరులుగూర్ప.

శీతసరోజమును కరమందు ధరించి వీచుచున్న నా కాంత నట్టె నిదానించి చూడఁ దనచే రక్షింపఁబడిన భువనమోహినివలె నగపడుటచే "నాహా! ఈలతాంగి యిటనుండుట కేమికారణము! ఛేండాభైరవాశ్రమమందున్నదని కపాలభైరవుఁడు చెప్పె. అది యనృతమయియుండునా? లేక వీరసేనుఁడటకేఁగి ఛేందునకు దెల్పక అయినది కానీ చూతమని విడిచి పుచ్చియుండునా? కానిమ్ము! భువనమోహినియే నిక్కమేని యెన్నడు గల్గని యీసొగసులు గుల్కుచుఁ గన్నవారలు విరాళిజెందునంతటి నటనజూపుచు నిటు మెలంగునే!" యని యనుకొనుచున్నంతలో నా కాంత పొదలమాటునకరిగి మరల బయల్పడ నపుడు భువనమోహిని గాకుండె. వసుంధరుఁ డది గాంచి "శ్రీపాదా! ఈసతి చాతురింగంటివే? తొలుత సుశీల వలె నీకును మరల భువనమోహినివలె నాకును నగపడినది. ఇదియుఁగాక యిప్పుడొక యప్సరాంగనవలె నగపడుచున్నది తొల్లి యష్టావక్రుఁడను మునిపుత్రుని బ్రహ్మచర్యంబుఁ బరీక్షించిన నుత్తరదిశాంగనయో, లేక మత్తపోభంగంబొనర్ప జనుదెంచిన మోహినియో యైయుండవలయు. నీవు భ్రమింపక యమృతశిలాతలంబుపై నుండుము. నేనిదే స్నానంబాచరించి జనుదెంచెద" నని చెప్పి కాసారము చెంతకుం బోవుచున్న నమ్మత్తకాశిని బెళుకు చూపులచేఁ జూచుచు వసుంధరునకు సమీపించె. అతండును వైరాగ్యనిరీక్షణంబులం జూచి యేవికారముం జెందక సరోవరంబునకుఁ దిగుచున్న నాతనిం గాంచి మందహాసముచే "రాజకుమారా! సంపూర్ణ యౌవ్వన సుకుమార కోమలతనూ విరాజమానుఁడై యున్న వాఁడవు. నూతన బాల్యాధిక యౌవ్వనాంగీపయోధర పరీరం

ఘనానంద తరంగంబులం దేలియాడక సుధాధరీయధరమధు రసం బానక నిస్తులకస్తూరీ పత్రభంగ ముద్రాముద్రిత లక్ష్మీ కర వక్షస్థలుండవు గాక దశవిధచుంబన కళామర్మస్థానోపరి నఖక్షత దంతక్షతాది రీతిఁ జర్యలొనర్పక నీరంధ్ర నిబిడీకృత ఘోరారణ్యమున జితేంద్రియుండవై నిరాహారుండవై కాయ మును శుష్కింపఁజేసి తపం బొనర్చుచున్నవాఁడ వీ కాయ క్లేశమున నీవొందెడి లాభ మెయ్యది?"

వసుం:—నీ వెవరు? ఎందుల కీయరణ్యమున నొంటరివై సంచ రించుచున్నదానవు?

కాంత:—పురుషవర్యా! నేనొక రాజకన్యకను మాతలిదండ్రు లచే నిశ్చయింపబడిన పురుషు లెవ్వరు నాకిష్టపడకుండు టచే వారలకుం దెలియనీయక తగినవరు నరయుచుఁ జను దెంచి యున్నదాన. నాపేరు ప్రత్యంగిర. నాయూరు ప్రాలేయపురము. నాతండ్రి యద్రిభూపుఁడు. నాతల్లి జలర సాదేవి.

వసుం:—కానిమ్ము. నీవొనర్చిన యుపన్యాసమున కానందించి యున్నవాఁడఁగాని యది కేవల పామరులయొక్క మతము. పండితుల కీయుపన్యాసములు రుచింపవు. గాన నేను స్నానంబున కరిగెద. కోపగించుకొనకుము.

ప్రత్యం:—ఆర్యా! నావృత్తాంతము తొలుతనే వివరించితిని గదా నాకుఁ దగినవరుఁడవు నీవని నిశ్చయించియున్నాను. కరగ్రహణం బొనర్చి గాంధర్వమార్గం బవలంబింపుము.

వసుం:—అమ్మా! నీ వెంత ప్రపంచ భ్రాంతులయం దుయ్యాల లూఁగుచున్నదానవు? తల్లిదండ్రుల విడచి యొంటరిగా గహనాంతర సంచారివై యిటురాఁదగునా? ఇట్టి సాహసం

బొనర్చువారిని వరించుటకు నుత్తములు సమ్మతింతురా! ఛీ! తగదు. మరల నీయూరికిం జనుము. మాతలిదండ్రుల సమ్మతిచే నీవు వివాహితవు గమ్ము. ఇట్టి జగజంతవగు నీయుపన్యాస మిఁక నెట్లు పరిణమించుచుండునో నీవే యోచింపుము. నాదారికడ్డము నిల్వకుము. స్నానవేళాతి క్రమణంబగుచున్నది నేఁబోవలయు.

ప్ర:—హృదయేశ్వరా! కఠినమాటలచే నాహృదయ మేటికి నొప్పించెదవు? ఋతుధర్మము యోచింపవలదా? తరువులు వసంత ఋతుకాల మరుదెంచినపుడు పుష్పించును. చిగురించును. ఫలించును. పలువిధములైన పులుఁగులు పల్లవాదులను మెసవి విహారం బొనర్చుచుండును. పుష్పమకరందముం గ్రోలి తుమ్మెదలు ఝంకృతులు జేయుచుండును ఇట్టి వసంతఋతు సమయమున హేమంతఋతు ధర్మము లలవడునా? అట్లే దేహమను నుద్యానవనమునకు యౌవనమను వసంతఋతుకాల మిపుడరుదెంచి యున్నది. ఇట్టి నీవు వార్ధక్యమను హేమంతఋతు ధర్మము నాచరించుచున్నవాఁడవు. ఇదితగదు. ఏయేఋతు కాలమున నాయా ధర్మ మాచరింపవలయు. నీవో జగన్మోహనానంద మంగళాకారుండవు. నవయౌవన ప్రాదుర్భావ తనూవిలసనుండవు. నాబోఁటి మదవతుల నొక వేయుమందినైన సదృష్టిఁ జెందించునంతటి శక్తిగలవాఁడవై యుండియు వైరాగ్యవృత్తిచేఁ బ్రపంచానంద మనుభవించుచు సమయమును నిష్ఫ్రయోజకంబొనర్చి వృద్ధునివలె వర్తించుచున్నవాఁడవు. ఇట్టి యశక్తుఁడవనియును, మందుఁడవనియు నేననుకొనలేను. తరుణవయస్కుఁయగు నొక

యువతి తనకుఁదానే వలచి ప్రార్థించి రొంటరిగైయున్న
పుడు విడచు పురుషుఁడు గలఁడే? నీశృంగారమునకుఁ దగిన
పౌరుష మెందుఁబోయె? ఛీ! ఛీ! తగదు. నే నవివాహితనగు
టచే పరసతినిగాను. క్షత్రియవంశంబునందు జన్మించుటచే
నీచస్త్రీనిగాను, సర్వవిద్యాపారంగతురాలనగుటచే మూ
ర్ఖురాలనుగాను. నీప్రయత్నము లేదు. అలభ్యయోగము
ఎందుల కీవిధి యోచింతువు లెమ్ము రమ్ము. అదే! చంపక
సుమ సౌరభానంద పుష్పశయ్యాతలమునకో, క్షుద్రాక్ష
భూరుహాశ్రిత ద్రాక్షాలతామంటపముమాటునకో, పుష్ప
పరాగాకీర్ణ హరిద్రాచూర్ణ శంకాకళంకిత కమలగంధ
సహిత మలయపవన విహారమనోహర సికతాతలంబునకో
జలచర సంచారజనిత విమలతర తరంగాందోళిత రాజ
హంసారవ హృదయంగమ కాసారతీరమునకో రమ్ము.
చాలుఁజాలు నీనపుంసకాలాపములు వినువ్రము. గతించిన
యౌవనము మరలఁ జనుదెంచునే?

వసుం:—స్త్రీలకు లజ్జావతులని యొక పేరుగలదు. నీయందు
లజ్జయనునది యణుమాత్రమును గనుపింపదు. సమస్త
విద్యాప్రద్యోతమానురాలవగుటచే మూర్ఖురాలను కానని
నీవన్న దిందులకేనా? నీవిద్యనంతయు బహుసద్వినియోగ
పఱచుచున్న దానవే? స్త్రీవిద్యనభ్యసించి యిట్లు స్వేచ్ఛగా
వర్తించి యావిద్యను దుర్వినియోగపఱచుటకన్నా విద్య
నభ్యసింపక కేవల పూర్వాచార పరాయణురాన్నను
యుండుటచేఁ గీర్తివంతురాలగును. పురుషుఁడుగాని స్త్రీ
లైన విద్యనభ్యసించుట జ్ఞానమార్గ మవలంబించుటకేగాని
దేహమనియు నుద్యానవనమనియు, వసంతఋతువనియు,

యౌవనమనియు నఖండపాండిత్యము చూపుటకొఱకు గాదు. నీవు విద్యావతివై యుండియు మూర్ఖులకన్నను గనిష్ఠదశయం దున్నదానవు. దేశకాలములను యోచింపక సమయము గమనింపక యోగరూఢులైన మాబోటి వారల మకులుగొల్పి వ్రతభంగములొనర్చుట మీబోటి యయోగ్యతగల స్త్రీలకు సహజగుణము ఋతుసమయమైనమాత్రముననే పర్యసంక్రమణ శ్రాద్ధాదులయందు మిథునవృత్తుల నాశ్రయింతురా? స్త్రీలకు స్వాతంత్ర్యము లేదని పెద్దలు చెప్పుదురు. నిన్ను నిచ్చెదనని వాగ్దానమొనర్చినను నీవంటి కాముకపురుషుఁడే నిన్ను వరించును. అటులవరించినవాఁడు నిందాపాత్రుఁడగును. కానని పురుషులతోఁ గానని దేహములోఁ గఠినోక్తులు నమానుషోక్తులాడిననమాత్రముననే నావ్రతతపములు బారఁద్రోలి పట్టువిడచి యధమపురుషులలోఁజేరి యనృతాదిదోషములనుభవింతు ననుకొంటివే? ఇంద్రియముల ననుసరింతు ననుకొంటివే? నీవు రాజకన్యకనని చెప్పినమాత్రముననే నమ్మితిననుకొంటివే? కాదుకాదు. నిక్కముగా రాజకన్యకవనుమాట యట్లుండనిమ్ము. మానవకన్యవేగాదు. నాతపమును భంగపఱచుటకై దేవతలచే నియమింపఁబడిన యప్సరసవో, అష్టావక్రునిఁ బరీక్షించిన యుత్తరదిశాంగనవో, భేరుండాఖ్యైరవప్రయుక్త మాయాశక్తివో యైయుండవలయు. నీసాహసమింకఁ జాలింపుము. నీపేరు ప్రత్యంగిర యని చెప్పితి వప్పుడే సంకోచించితి. ప్రత్యంగిర యనునది మంత్రశాస్త్రమం దొకమాయాశక్తిగదా! ఉండనిమ్ము. దేవతానామములిడుట మనహిందూదేశమున సహజమును

కొండము. తండ్రిపేరు యద్రిభూపుడు. తల్లి జలరస. ఊరు ప్రాలేయపురము. ఈమాటల యోచింపఁగా మీతండ్రి హిమవంతుఁడు. మీతల్లి యప్సరసయగు మేనక. మీ యూరు హిమవత్కేదారమనుటచే నీవు పార్వతీదేవి యొక్క యపరావతారమని స్పష్టపడుచున్నది. తల్లీ నీవే నా తపోభంగ మొనర్పవలెనన్న నాయత్నమున్నదే. కల్యాణీ!

యనిపల్కుచు నాకాంతం జూడఁజూడ మేఘశ్యామల శరీరమును, లలాటమునఁ జంద్రరేఖయు, డమరుక త్రిశూల ములు గలకరములు వెలయ నొక్కసింహంబుపై నెక్కి మంద స్మిత కటాక్షవీక్షణములచే వసుంధరుం దిలకించి, "వత్సా! నీవు భద్రబుద్ధివి. నేను ప్రత్యంగిరానామక బ్రహ్మాస్త్రమును. శ్రీండాభైరవ ప్రయుక్తనై నిన్ను సంహరించుటకువచ్చి నీచే విధింపబడిన సుదర్శనాస్త్రధాటికినోర్చి నీచెంతఁ జేరుటకు శక్తి చాలక మాయారూపమువహించి తపోభంగమొనర్చియైనం జావలయుననుకొని యట్లొనర్చితి. నీవు సామాన్యపురుషుఁడవు కావు. నాపయి నాగ్రహము వహింపకుము. నీకు శుభమగుఁ గాక" యని దీవించి నా మాయాశక్తి యంతర్ధానంబయ్యె. వసుంధరుండును స్నానమాచరించి నిత్యకృత్యము లొనరించి మరలఁ దపంబొనరించుచుండె. ఇట్లు మూఁడుదినంబులయ్యె. నాల్గవదినమునం దుదయమున నిత్యకృత్యములుదీర్చి శ్రీపా దుంజీరి "బ్రాహ్మణోత్తమా! నాతపస్సంకల్పత్రిరాత్రములు కడచినవి. నాయిష్టదైవములు సాక్షాత్కరింపరైరి. ఇఁక నాసంకల్పంబు సార్థకపఱుపవలయు. నాశరీరము నగ్నికాహారం బొసంగెద. నీవీయాశ్రమవాసులచెంతనుండి సమయమువేచి

కాశీనగరంబున కరుగుము. అం దన్నపూర్ణాదేవాలయంబున మీసుశీలగలదు. అయ్యెడ కరుగుము. నాపై దయయుంచుము. చితిఁ జేర్చుకొనవలయు ననుజ్ఞ యిమ్ము."

శ్రీ:—అయ్యో! వసుంధరా! ఇదియేమిసంకల్పము? ఇంత శీఘ్రమున దేవతలు ప్రత్యక్షంబగుదురే? నరనారాయణు లంత సులభసాధ్యులే? త్వరపడనేల? ఇంకనొకటిరెండు దినములు తాళినంత తపస్సిద్ధిగాదే? సాక్షాత్ శ్రీమన్నారాయణాపరావతారంబగు నరనారాయణమూర్తులు దయావిహీనులు కాదురే?

వసు:—మిత్రమా! నీకుఁ దెలియదు. నాప్రయత్న మతిశీఘ్రతపస్సిద్ధిగలకార్యము. ఆవలనయనను గాకున్నను సరియే. అటుకాదు. నేఁజెప్పినట్టు జరిగియే తీరవలయు. మీ సుశీలయున్న యునికిఁ దెల్పియున్నాను. ఈయాశ్రమవాసుల సాహాయ్యముచే నేఁ జెప్పినట్లొనర్పుము. నాయుద్యమమున కంతరాయములు గల్పింపకుము.

శ్రీ:—ప్రాణరక్షకా! నీకన్న నా కాసుశీల యెక్కువ యను కొంటివే? సుశీలకు నేనుగాకున్న మఱియొక్కభర్తయౌను. నీవంటిప్రాణమిత్రుఁడు లభ్యమగునే? నిక్కముగా నేనిన్ను విడువఁజాల నీవేరీతి నొనరింతువో నేనును హుతవహున కాహారంబయ్యెద నన్నాటంకపఱుపకుము.

వసుం:—శ్రీపాదా! శుద్ధపామరుఁడవైతివే? బ్రహ్మమూర్తిచే సకలశాస్త్రవేదివై మూర్ఖముబట్టిన నేనేమని వచింతు?

శ్రీపా:—నన్నేమి కృతఘ్నుఁడ ననుకొంటివే? పరమ తేజస్తపోవిద్యాగరిష్ఠుండగు ప్రాణమిత్రుఁడగు నిన్నుఁగోల్పోయి నేనెట్లు శరీరమును భూమిపై నిలుపుకొనియుందును?

నీకన్న నాకిష్టులగువారలు గలరే! నీప్రయత్నమునకు నే నాటంక పఱుపను. నాప్రయత్నమునకు నీయాటంక మక్కఱలేదు. అమ్మహాత్ములైన నరనారాయణమూర్తులకు దయగలిగెనేని మనమిరువురము సుఖంబున నే యుందుము. విధి యావిధి జెప్పలేదు. మనకిరువురి కొకే రీతి నంతముగలుగునట్లున్నది. అందులకు యోచింపనేల!

వసుం—శ్రీపాదా! నేను నీకు మిత్రుఁడగుట నిక్కవమే గదా!

శ్రీపా—నిక్కము! నిశ్చయము! నిస్సంశయము! ఒకమారు గాదు వేయిమార్లు.

వసుం—అట్లయిన నాకొక వరము దయచేయవలయు.

పా—ఈవిషయముతప్ప మఱియెయ్యదియైన నొసంగెద నీకాటంక మేమిగలదు!

వసుం—నన్నుఁడఁబాయని ప్రేమానుబంధముచే నావలె నగ్ని ప్రవేశ మొనరించుటకు సిద్ధుఁడవై యున్నాఁడవు కానిమ్ము. తొలుత నే నగ్నిప్రవేశ మొనర్చెద. ఆవల నీ యిష్టమెట్లో యట వర్తింపవలయు. నాయెదుట మొనర్పఁగూడదు. నీశరీరవియోగము నేఁజూచి సహింపఁ జాలను. ఇంతమాత్రము దయయుంచుము.

శ్రీపా—ప్రాణరక్షకా! ధురంధరుఁడవైన నీశరీరవియోగమును నేఁగాంచి సహించునంతటి కఠినహృదయుండనే! మనమిరువురము కేతూరి యొకరిచేయి నొకరుబట్టికొని భగవంతుని ప్రార్థించుచు నగ్ని కాహారమయ్యెదము. నే నపుడే చెప్పలేదా! ఈ విషయము తప్పయని.

వసుం—అయ్యో! ఇంకేమి యొనర్పనగును? సుశీలా విషయమప్పుడే నీకుఁదెలియజేసి నిచ్చటినుండియే కాశీనగరమున కంపించియున్న నాకీప్రాణగొడ్డము లేకుండుఁగదా? మించినది. అన్నికార్యములు మునువెనుకలరయక యొనర్చుచుఁ జిక్కునఁబడుచున్నవాఁడ కానిమ్ము. నిన్నిందుల కొటంక పఱుపవలయు. నీయిష్టము వచ్చినట్లొనర్పుము.

అని సమిధలం బ్రోదిచేసి చితిసమకూర్చి ఘర్షణశిలచే ననలంబు సంధించి యూకుదొప్పలయందున్న జలము నాచితిపైఁ బ్రోక్షించి యనలం బాచితికిం దగిలించిన ధగద్ధగాయమానమై ప్రజ్వలించుచుండె. వసుంధరుండు నిర్మలచిత్తముచేఁ చేతులు జోడించుకొని "హవ్యవాహనా! సమస్తప్రాణికోటికి నాధారభూతుండవు. జఠరాగ్నిస్వరూపుఁడవు, త్రయస్త్రింశత్కోటిదేవతామూర్తులకొసంగు హవ్యములనన్నియు నేకొదువయులేక నీయం దర్పితమైయుండినను వారివారి భాగములు వారివారి కొసంగు నిరాశాపరుఁడవు. సత్యవాదివి. నాలుగు శృంగములు, మూఁడుపాదములు, రెండుశిరములు, నేడుహస్తములుగల తేజోమూర్తివై తోమరమును, శక్తియును, ఘృతపాత్రమును స్రుక్స్రువములు ధరియించి మేషవాహనంబుపై నెక్కి వామభాగమున స్వాహాదేవి యొప్పారుచుండ నాకుఁ బ్రసన్నుఁడవు గమ్ము.

శ్లో. నమస్తే గార్హపత్యాయ నమస్తే దక్షిణాగ్నయే,
నమ ఆహవనీయాయ మహావేద్యై నమోనమః.

అని ప్రార్థించుచుఁ బ్రథమ ప్రదక్షిణ నమస్కారం బొనర్చి, మరల నొకచోనిల్చి "వైశ్వానరా! పరోపకార

మొనర్చినందులకోక దుర్మార్గునిచే బద్ధుండైన నామిత్రుని బంధవిముక్తినాచరించుటకై నిన్నర్థించుచున్నవాఁడ. నాతపోదేవతలగు నరనారాయణమూర్తు లిదివఱకె రుదెంచి నన్ను కటాక్షింపరైరి. నాసంకల్పప్రకారము మూఁడుదినము లతిక్రమించె. ఇది నాల్గవదినము. ఇప్పుడైన నమ్మహాత్ము లరుదెంచి నాకోరిన వరములొసంగిరేని సంతసించెద, లేకున్న నిదే నా శరీరమును నరనారాయణప్రీతిగా నీయందుఁ బడవైచెద. నీవును వారలు నెవరిభాగములు వారకొసంగి తృప్తిఁ జెందుఁడు.

శ్లో. కాండద్వయోపపాద్యాయ కర్మబ్రహ్మస్వరూపిణే,
స్వర్గాపవర్గరూపాయ యజ్ఞేశాయ నమోనమః."

అని ప్రార్థించుచు ద్వితీయప్రదక్షిణ నమస్కారం బాచరించి మరల నొకచో నిలువంబడి, "అగ్నిభట్టారకా! పరమపుణ్యాత్ముఁడైన ఈశ్రీపాదుఁడు నాముఖ్యమిత్రుఁడు. ఇతఁడు నావియోగమును సహింపక తనశరీరమును నీయందు బడవైవ నుద్యుక్తుఁడైయున్నవాఁడు. నేనెంతవలదన్నను ప్రాణములపై నాశవదలి నిశ్చలచిత్తుడై పంచమసంతోషముచే నెప్పుడెప్పుడని యెదురుచూచుచున్నాఁడు. ఇమ్మహాత్ముఁడు బ్రాహ్మణబ్రహ్మచారి. సత్యవంతుఁడు. కావున నితనిశరీరమును నీవుదహింపక సుఖముగా నాతనిరక్షింపుము.

నీతిహోత్రా! నేను పరోపకారార్థమై నిశ్చయమనంబుచే నాశరీరమును నీయందు బడవైవ నుద్యుక్తుఁడనైనది నిజమేని, భగవంతుఁడు ప్రపంచ మధర్మభూయిష్ఠమైనప్పుడవతరించి ధర్మపరిపాలనం బొనర్చుట నిక్కమేని, సత్యశయాక్షమాగుణంబులుగల మహనీయుఁ డవ్యయానందభద్ర

పదవినొంది శాశ్వతసుఖం బనువించుట నిక్కమేని, నామిత్రుం డైన శ్రీపాదుని శరీరమును భస్మంబొనరింపక సుఖముగా వతనిరక్షింపుము.

హావ్యవాహా! నాటకపుత్రవియోగ సంతాపముచే నిడుమలం బడుచున్న మాతల్లిదండ్రుల రక్షింపుము. వారికి మరల నొకపుత్రునొసంగి పున్నామనరకమునుండి తరింపంజేయుము. ప్రపంచోపద్రవకరుండైన భేండాభైరవుని సంహరించి యాతని గణంబుల ధ్వసంబుగావించి ప్రజకు హాయిగొల్పుము. పరోపకారపారీణుండైన బేతాళుని బంధవిముక్తుం గావింపుము.

శ్లో. 'యజ్ఞేశాచ్యుత గోవింద మాధవానంత కేశవా,
కృష్ణవిష్ణుహృషీకేశ వాసుదేవ నమోస్తుతే.'

అని ప్రార్థించుచు మూఁడవ ప్రదక్షిణనమస్కారము లొనర్చుచుండ, శ్రీపాదుఁడు మహాభక్తిచేఁ గరపుటములు నిటలతటంబునందు జేర్చి యజ్ఞేశ్వరునకు వలగొని, ''జాత వేదా! పరోపకారార్థమై ప్రాణములపై నాశవదలి యీవసుంధరుఁడు తన శరీరమును నరనారాయణప్రీతిగా నీయందుఁ బడవేయుచున్నాఁడు. ఇదే నాప్రార్థన యాలకింపుము. నీవు కరుణామూర్తివి. నిర్నిమిత్త మీతనిప్రాణంబులు గొనుట సర్వజగద్రక్షకులగు మీకు ధర్మము గాదని నేఁజెప్పఁదగదు. మాతల్లి పతివ్రతయై మాతండ్రి సత్యవంతుఁడైనది నిజమేని, నే ననవరత మగ్నికార్య మొనరించుచు నీ భక్తుఁడైనది నిజమేని, యాస్తికులు వాదించునట్లు భగవంతుఁడనువాఁ డొకఁ డుండి యాయన యాజ్ఞచే నీ ప్రపంచము సృష్టి స్థితిలయము లగుచుండుట నిజమేని, వేదములు శాస్త్రములు పంచభూత

ములు బ్రహ్మాండము శ్రీమదాదినారాయణ పరమాత్మ విరాట్స్వరూపంబగుట నిశ్చయమేని, అధర్మబాహుళ్యమై బహుజన సంతాపావృతమైన యీప్రపంచమునందు ధర్మస్థాపనమై పునరుద్ధారణమగుట నిజమేని యీవసుంధరుని తపోదైవతములు ప్రసన్నులై యాతనికోర్కె లొసంగుదురుగాక! ఇతని శరీర మగ్నియందుఁ బడవైచినను నపాయమొందక నూతన తేజోవిధవాతిశయుండై నీవలన వెలువడుఁగాక! ఈతనికిఁ బ్రాణాపాయము లేకుండుఁగాక!" యని ప్రార్థించి వసుంధరుని ప్రక్కన నిలువంబడిరి. వారిరువు రాచితి కానుకొని యున్న శిలపై నెక్కి యచంచలమనస్కులై మరల నమస్కరించి వారిరువురు,

మత్తేభపాదం:—శ్రీ—"నరనారాయణులార మీచరణకం
జంబుల్ మదిన్ గొల్చెదన్"

అని నమస్కరించి కన్నులు మూసికొని చేతులు జోడించుకొని కుప్పించి యా యగ్నికుండమునందు దుమికిరి. చితాగ్నియందు వారిరువురు పడుటకుమునుపే యాకాశమున నే నిరువురు మహర్షులు చనుదెంచి వారిరువురను జెరియొకరు దబ్బుకొని యగ్నియందు బడనివ్వక చితోపరి పరిశుద్ధభూమిపై డించిరి. అదిగని వసుంధర శ్రీపాదులు కన్నులు దెఱచిచూచి నిర్విణ్ణులై యేమియుఁ దోఁపకుండి మరల బ్రజ్ఞావంతులై యా మునీంద్రులకుఁ బ్రదక్షిణ నమస్కారంబు లొనర్చి లేవకున్న తమ బాహువులచే నాయిరువురి నెత్తి నిలువంబెట్టిరి. అపుడు నారాయణమహర్షి వసుంధరుంగాంచి "నాయనా! నీసాహసమునకును నీమనశ్శుద్ధికిని మెచ్చియున్నవారము. నీవెయ్యది గోరి మమ్ముఁ జేరితివో నీతలంపేదో యెఱింగింపుము. నీచే

నుపాసింపఁబడుచున్న నరనారాయణఋషుల మరుదెంచి యున్నవార" మనిన వసుంధరుఁ డత్యంత సంతోషముచే మైమఱచి యానందబాష్పంబులు వెల్లిగురియ మరలమరల నమస్కరించుచు గద్గద కంఠముచే,

మ. "వరదుల్ పూర్ణతపోనిధుల్ శుభులు విద్వద్వర్యులార్యుల్ గుణా
భరణుల్ శుద్ధులు శుభ్రబుద్ధచరితుల్ బాలార్కతేజుల్ సదా
కరుణాసాగరు లప్రమేయులు జగత్కల్యాణసంధాయులౌ
నరనారాయణులార! మీచరణకంజంబుల్ మదిల్ గొల్చెదన్

మ. పరమంబైన విరాట్స్వరూపమునమున్ బాలించివిశ్వంబున
ధ్వరవిధ్వంసకుఁడౌ సహస్రకవచధ్వంసంబుఁ గావింప ని
త్తెఱఁగున్ మూర్తులు జెందినర్థిలితి రుద్దీప్తాగ్ని తేజస్కులౌ
నరనారాయణులార! మీచరణకంజంబుల్ మదిన్ గొల్చెదన్

మ. నరహింసాధ్యుఁ డనార్యుఁ డుగ్రుఁ డలవిన్నధ్వగ్రావగంభీరదు
ర్ధరకాయుండగు భండభైరవు వధార్థంబై మిమున్ గోరితి
త్తెఱఁగున్ వానివధించుటట్లో కృపచేఁదెల్పందగున్ వేగశ్రీ
నరనారాయణులార! మీచరణకంజంబుల్ మదిన్ గొల్చెదన్.

ఏమహనీయు లనవరతం బీభరతఖండంబును రక్షించు చుందురో, యేతపోధనులు ద్వాపరంబునఁ గృష్ణార్జునులై జనియించి యఖిల భూభారహరణంబు గావించిరో, యే మనోహరమూర్తులు నాహృదయ కుహరంబు వసించియుందురో, యేజగద్రక్షకులు కించిద్జ్ఞుఁడైన నన్ననుగ్రహించి వరదానంబొసంగఁ బ్రత్యక్షంబై నాయెదుట నిలిచియున్నవారో యట్టి శ్రీనరనారాయణ మహర్షులకీ వసుంధరుఁడు నమస్కరించు

చున్నాఁ" డని మరల సాష్టాంగనమస్కారం బొనర్చి లేచి నిలిచిన మాత్రముననే యాజానులంబితంబులగు తమబాహువులచే వసుంధరుని గాఢాలింగనంబుగావించి శిరంబు దువ్వుచున్నవారలంగాంచి "దేవదేవులారా! పరమపునీతములై పంచోపనిషన్మయంబులైన మీశరీరస్పర్శయైన మాత్రముననే ప్రజ్ఞాప్రభావ ప్రతాపము లధికంబులై యున్నట్టు దోఁచుచున్నది. నూతనంబుగ నొక యఖండశక్తి నాయందుఁ బ్రవేశించి యీబ్రహ్మాండంబంతయు నాపిడికిలిలోనికిఁ జాలదను గర్వంబు వొడముచున్నది. నేను మీప్రియశిష్యుండ. మీరు నాకు గురుమూర్తులై యున్నవారు భేండాభైరవుండను దురాత్ముఁ డసాధ్యబలుఁడు, మంత్రప్రభావపరుఁడు, నరహింసాధికారియై జగత్కంటకుఁ డగుటచే నాతని వధియించి నిష్కంటకం బొనర్చెదనని ప్రతిజ్ఞ జేసియున్నవాఁడ. జగత్కల్యాణసంధాయకులైన మీరేది చెప్పిన నయ్యది యాచరించెద. జగదంతర్బహిర్మధ్య సంగతులగుటచే నామనోభీష్టములు మీ కెఱింగించుట చర్వితచర్వణంబుగాదే! కటాక్షింపుఁ" డనిన, "వత్సా! నీవు తొలినుండి మహర్షుల యాశ్రమముననే వర్ధిల్లి వారివలననే సర్వవిద్యాపారంగతుఁడవైతివి. కలాపగ్రామంబునందున మూలకరాజర్షియొద్ద ధనుర్విద్య నభ్యసించితివి. ఆనందవనమున భట్టపాదార్యులయొద్ద కవిత్వ జ్యోతిషతత్వముల నెఱింగితివి. గంగాద్వారమున కాళీభక్తునియొద్ద మంత్రశాస్త్రం బభ్యసించితివి. స్వయంప్రభాతపస్వినివలన రాజనీతిఁ దెలిసికొంటివి. ఇప్పుడద్భుతతత్త్వశక్తిచే మమ్ముం గెలిచితివి. ఇట్టి నీకెయ్యది యసాధ్యముగాదు. వినుము. భేండాభైరవుని ప్రతాపప్రభావములంతయు వీరసేనునిచే గుహామధ్యంబున

వినియున్న వాఁడవు. అతఁడు సామాన్యుఁడు గాఁడు. ఎంత ప్రయాసపడి మేము సహస్రకవచుని వధించితిమో యంతటి ప్రయత్న ప్రయాసలుపడి ఢేండాభైరవుని సంహరింపవలయు. ఇదే నీకక్షయశరధులొసంగి యున్న వారము. ఎపుడు మమ్ము ధ్యానింతువో యపు డీశరధులు నీసమీపమునందుండు సర్వాస్త్రశస్త్రములు ప్రబలతరమంత్ర ప్రయోగము లెడతెగక గుప్పించుచుండవలయు నేమఱకుము. ఇంకొక రహస్య మెఱిఁగించెద. విధి లేనప్పు డాయస్త్రమును బ్రయోగింపుము. నిర్నిమిత్తముగా బ్రయోగించితివేని జగత్సంహారం బౌనర్చు" నని చేరఁదీసి యాతని చెవిలో నేదియో యుపదేశ మొనరించి "యవియన్నియుఁ బ్రయోగాస్త్రములే. అందులో నెనిమిదవ యస్త్ర మప్పు డాపత్సమయమునం దుపయోగించుము. వానిని విధిక్రమముగాఁ బ్రయోగోపసంహారములయం దంగన్యాస కరన్యాసములను లోమవిలోమముగా వినియోగించు చుండుము. ఆయెనిమిదవయస్త్రమే యష్టముఖ గండభేరుండ జ్వాలా నారసింహము. అదియే తుదగలది. ప్రబలముగ ముఖాముఖియం దాతనితో యుద్ధమొనర్చునపుడు నీప్రతాప ప్రభావము లన్నియు నగుపఱచి నీకిష్టమైన సమయమం దా విధముగా ఖండింపుము. ఇందుపైన నీమేధాశక్తినంతయు విని యోగింపు"మని చెప్పుచుండ గుఱ్ఱములయొక్క హేషారవములును గాలిచప్పుడులును వినవచ్చె. అట్టేచూచుచుండ రెండుగుఱ్ఱములను శిష్యులచే బట్టించుకొని వామదేవమహర్షి చనుదెంచుచుండెె. అదిగాంచి "వసుంధరా! వామదేవమహర్షి యరుదెంచుచున్న వాఁడు. ప్రత్యుత్థానాదులొనర్పు" మని నంతనే యామహర్షి కెదురేగి సాష్టాంగదండప్రణామము

లొనర్చి చేతులు జోడించుకొని నిలువంబడి "మునీంద్రా! నేను ధన్యాత్ముఁడనైతి కృతకృత్యుండనైతి" నని స్తోత్ర మొనర్ప నుపక్రమించినంతనే "నాయనా! నీనిమిత్త మరుదెంచితిని. దుష్టనిగ్రహ మహాశక్తిగలవాఁడవై శిష్టుల రక్షింతువుగాక. ఆదిమునుల యనుగ్రహమునకుఁ బాత్రుఁడవైన నీకెయ్యదియు కొదవగల్గదు. ఇదే నాచెంత నాలుగు వారువములనాదిగా జరామరణంబులు లేకున్నవి. అందు రెండువారువములు నీకొఱకై తెచ్చియున్నాను. వీనికి వియద్గమనశక్తి గలదు. ఎవ్వరిచెంత నీహయరత్నంబు లుండునో యతని కష్టైశ్వర్యము లెడతెగక నిలిచియుండు. నీవు జగదుపకారార్థమై బహుబాధలనొంది తపంబాచరించిన ధృతిమంతుఁడవు. వీనిని నీకొసంగితిని గైకొనుము. ఇందులకు నీవేయర్హుఁడవు. తొల్లి కలుఁడనురాజు నావలన నీగుఱ్ఱముల మరల నిచ్చెదనని గైకొని జయమొంది గుఱ్ఱముల మరల నాకొసంగక నన్ను గారాగృహమున నుంచుట కుపక్రమించుటచే హుంకారమాత్రమున నాతని దగ్ధమొనర్చితిని. ఆతనిపుత్రుని స్తంభనం బొనర్చితిని గాని నీవు మరల నీ వారువంబుల నాకొసంగఁ బనిలేదు. ఖండాభైరవ సంహారోపాయములన్నియు నీ వెఱింగినవే. మరలఁ జెప్ప నిష్ప్రయోజనము. అయినను నీవు భగీరథ ప్రయత్నము జేయవలయు. ఆతని వధానంతర మొకసిద్ధపురుషుఁ డిమ్మహాత్ముల ప్రేరణచే నీచెంత కరుదెంచి నీకింకను గొన్ని రహస్యములు తెలియఁజేయును. నీప్రతిజ్ఞావధి యింక మూఁడు దినములే యున్నది. ఈహయంబులం గైకొనిజను" మనుచున్నంతనే శ్రీపాదుఁ డామహర్షుల మువ్వురికి నమస్కారము లొనర్చి,

శ్లో. "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ"

అని కరములు ముకుళించి "మహామునులారా! ఈ మహాపురుషుండైన వసుంధరుని మిత్రత్వముచే నలభ్యయోగముగా మిమ్ము దర్శించితి. నాకర్మబంధములు తొలంగె. నా పాపచయములు పలాయనమయ్యె. నాతపంబు ఫలియించె. నాజన్మము కడతేరె. ధన్యుండనైతి" నని పొగడుచున్న నాతనిం గాంచి, "శ్రీపాదా! నీవు మహోత్తమపురుషుండవు. ఈవసుంధరుం డగ్నిప్రవేశ మొనరించెద నన్నప్పుడు నీవు పడిన సంతాపమున కాచెంతనే యీతని మనశ్శక్తిని బరీక్షించుచున్న మాకే జాలిగల్గె. మిత్రత్వమును సార్థక మొందించితివి. ఇంతటి దయామయుండవగుట చేతనే నీకీమహాపురుషుని మిత్రత్వము తొలినుండి సమకూడినది. పుణ్యపురుషుండ వగుటచే మాదర్శన భాగ్యము లభించినది. ఇప్పటినుండియు నిరువది నాలుగు తరములవఱకు నీవంశం బఖండంబుగా వృద్ధియై యావల నశించు. ఇరువదిమూఁడవ పురుషుండు శ్రీహీరుండనియు నాతని పుత్రుండై నీవలన నిరువదినాల్గవ పురుషుండైన శ్రీహర్షుండు చింతామణీ మహామంత్రానుష్ఠాన సంభవాఖండ కవిత్వప్రభావయుతుండై జగదుపకారార్థము నైషధంబను మహాకావ్యము రచియించి నిస్సంతానుండై పరమపదముం జెందును. నీవు లౌకికవైదికవృత్తులయం దఖండవేదివగుటచే నీవసుంధరుని చెంత నమాత్యశస్త్రము ధరించి యుందువు. నీవంటి మేధాశాలి యింకెవ్వరు నుండరు! ఈవసుంధరునకుం దగుమంత్రివి నీవేయని దృఢముగాఁ జెప్పుచున్నాము. నాయనా! సిద్ధ పతిజ్ఞుండవై సత్యవాక్యపరిపాలనం బొనర్పుము. నీకాయురారోగ్యైశ్వర్య సామ్రాజ్య పుత్రపౌత్రాభివృద్ధి

యగును గాక'' యని దీవించి యామువ్వురు మహర్షు లంతర్ధాన మొందిరి. ప్రతిజ్ఞా పరిపాలనోద్దేశముచే వసుంధర శ్రీపాదులమ్మహర్షు లంతర్హితులైన దిశకు నమస్కరించుచు నాహయంబులపైఁ గూర్చుండి పూర్వదిశాభిముఖులై వెడలి పోయిరి.

---

# ౭ విమర్శా ప్రకరణము

గంగానది యామహానది శ్రీహరి త్రివిక్రమావతార కాలమున విశ్వరూపముచే నభోమండలము నాక్రమించెడి పాదవిజృంభణమున నఖాఘాతము బ్రహ్మాండావధికి బగుల్పుటచే తదూర్ధ్వబ్రహ్మాండస్థితి మహాసముద్రాంతరజలము చిన్నరంధ్రముమార్గముగా శ్రీహరిపాదంబులం దడుపుచు జఘన జారి బ్రహ్మనివాసమగు సత్యలోకమధ్యభాగమునకు బడి నాలుగుపాయలై నాలుగుదిశలకును నాలుగుభాగములయ్యె నొకభాగము బ్రహ్మపట్టణపు నుత్తరమహాద్వారమునుండి వెడలి వియన్మార్గముగాఁ జనుదెంచి భద్రానదీ యనుపేరుచే కుముదపర్వతమునకు బడి నీలశ్వేతాదిపర్వతాగ్రములపైఁ బ్రవహించుచు శృంగనగరమను పట్టణప్రాంత్యమున భూమియందుబడి యుత్తరకురుభూముల(అమెరికా)లో నుత్తరముగా బ్రవహించుచు నుత్తరలవణసముద్రమునకు బ్రవేశించు. మఱియొకశాఖ పరమేష్ఠినగరపూర్వద్వారమున నిర్గమించి మేరుపర్వత ముఖ్యశిఖరంబగు కేసరిశృంగమునకు బడి యటనుండి శీతనది యనుపేరున పూర్వదిశగాఁ గుముద కుకురాది పర్వతశిఖరంబులపైఁ బ్రవహించుచు గంధమాదనాద్రికిఁ జని అచ్చ

టనుండి భూమిం బడి భద్రాశ్వవర్షము (ఆసియా రుష్యాలో) తూర్పుగాఁ బాఱుచు పూర్వలవణసాగరములో గలియు చున్నది. మఱియొక భాగము నలువయిలు పడమటివాకిలి వెడలి చక్షూనది యను పేరుచే మాల్యవంతపర్వతముదాఁటి భూమిం బడి కేతుమాలవర్షము (యూరోప్ రుష్యా)లో ప్రవహించుచుఁ బడమటిసముద్రములో గలియుచున్నది. ఇంకొక శాఖ బ్రహ్మసదనదక్షిణద్వారమందు వెడలి అలకనందానది యను పేరుచే మహోన్నతములును యతిదుర్గమములునగు హేమకూటాదిపర్వతములు దాటి హిమత్పర్వతమునకు బ్రవహించి యటనుండి వసుధార యను పేరుచే పంచగజాయితము గా బిందుసరోవరంబునగు దుమికి గుప్తగామినియై గంగోత్తరి యందు బయలువడి ప్రవహించుచు నేడుపాయలై దక్షిణముఖ ముగాఁ బ్రవహించుచు బ్రహ్మకపాలసమీపమున నేడుపా యలుం గలసి యేకముఖముగా గాంగాద్వారము (హరిద్వా రము) చెంత జనావాసంబునంబడి మందాకిని యను పేరుచే మహావేగముగాఁ గర్మక్షేత్రంబగు భారతవర్షంబునంగలసి ఆర్యావర్తాంతర బ్రహ్మవర్తకుశావర్తంబులం దదుపుచు తూర్పుముఖముగా జగన్నాథము (బంగాళా కలకత్తా) చెంత లవణసముద్రము (బంగాళాఖాతము) నందు గలియుచున్నది. ఈమహానదియందు సుస్నాతులైనవార లనేకజన్మార్జితపాప ములనుండి విడువఁబడుదురు. ఈనదీమతల్లికి విష్ణుపాదము నుండి బయలువడుటచే విష్ణుపాదోద్భవ యనియు, దేవ లోకంబునం బ్రవహించుటచే సురనది, వియద్గంగ యనియు, ఇక్ష్వాకువంశోద్భవుఁడైన భగీరథమహారాజు తన తపోబలమున దేవలోకంబునుండి భూలోకమునకుఁ దీసికొని

వచ్చుటచే భాగీరథియనియుఁ, బ్రవహించునపుడు జహ్నుమహర్షి యాశ్రమమును ముంచుటచే నమ్మునిఁ గోపమునం ద్రావి భగీరథప్రార్థితుఁడై విడుచుటచే జాహ్నవియనియు మఱియు ననేక కారణముల ననేక పేరులచేఁ బరఁగి గంగానది యను ప్రధానాఖ్యచేఁ ద్రిలోకములవారిని దనవారిచేఁ బావనము సేయుచున్నది. ఈ గంగానదియందు స్నానం బాచరించి తీరంబున నొకరాత్రి నిదురించిన పుణ్యపురుషుఁడు వేయిమందిజీవుల కన్నదాన మాచరించిన నెంతపుణ్యము లభించునో యంతపుణ్య మనుభవించును. గంగానదికి నూరు యోజనముల దూరమందున్నవాఁడైనను గంగానది గంగానది యని స్మరించినమాత్రముననే సమస్తపాపములనుండి విడువఁబడి శ్రీమహావిష్ణులోకమునం బ్రవేశించి పుణ్యముల ననుభవించు. కర్మసాక్షియైన సూర్యభగవానుఁడు మకరరాశి సంచారకాలమునం దుమఃకాలముననే యీపావననదియందు స్నానమాచరించి తనశక్తికొలఁది భూతతృప్తి నేమహాసీయుఁ డొనర్చునో యతం డఖండమోక్షకాంతను యోగానందల హరీవిముగ్నుఁడగు. మూఁడుతెరములకు మునుపు కపిలమహామునికోపాగ్నిచే దహింపఁబడిన భస్మరాసులపై భగీరథప్రార్థనచేఁ బ్రవహించి వారలఁ బునీతుల నొనర్చినది యీగంగయే. పరమాత్మ తాపుసప్రధానంబగు శ్రీరుద్రావతారమున తను స్తవఁ నివారణముగా జటాజూటమున నటించుచు శంకరున కాప్యాయమాన మొనర్చుచున్నదీ భాగీరథియేగదా! యమున సరస్వతి తమస గోమతి ఫల్గుప సరయువు బ్రహ్మపుత్రాద్యప నదీసమేత యీత్రిపథగయేగదా! మహాకవులు పురాణ మునులు దేవేంద్రాదిసురలు త్రిమూర్తులు తమతమపాంశ

త్యము కొలఁది స్తుతియించినదీ మందాకినీమహానదీమతల్లి నే గదా! ఆహా! యఘోరతరపాపభంగ చలచ్చాల్యమానబృహత్తరతరంగ నిజగర్భసంభవజలజాంతర మరందపానమదవదిందిందిరఝుంకారారవ శ్రితానందసంగీతవిలాసతప్సరాంగ నాట్యగంగ యగు గంగం బొగడదరమే. తత్తీరంబునందుఁ గల పుణ్యపురములలోఁ గాశియను పట్టణం బద్భుతయాత్రాస్థలంబై యలరారు. ఆపురీమాహాత్మ్యంబు వర్ణింప పరమేష్ఠికైన నలవిగాదు. మహాపుణ్యరాశి కాశి. సమస్తపుణ్యజనావాసి కాశి. కుటిలజనవినాశి కాశి. ఈపురమునకు నుత్తరభాగమందు పడమరనుండి తూర్పునకు వరణానది ప్రవహించుచు గంగానదిఁ గలియును. దక్షిణమునం దసీనది పడమరనుండి తూర్పుముఖముగాఁ బ్రవేశించి గంగానదిం గలియును. తూర్పుదిశయందు దక్షిణమునుండి యుత్తరముఖముగా మన గంగానది ప్రవహించుచుండును. అది వారుణాసదీమధ్యమందుండుటచే యీపురమునకు (వారణాసి, వారాణసి) యని ప్రసిద్ధి. ఇచటఁ బరమేశ్వరుఁడు విశ్వేశ్వరాఖ్యచే సృష్ట్యాదిగా వసించియున్నవాఁడు. జగన్మాతయగు సర్వమంగళాదేవి అన్నపూర్ణాఖ్యచే భర్తకు సహాయకారిణియై వసియించియున్నద. ఈ పురమునందు మృతిచెందినవారల కీవిశ్వేశ్వరుఁడు రామతారక ముపదేశించుటచేఁ బునర్జన్మభీతిలేక మోక్షము నొందుచుందురు.

ఈపురిపరిమితి అయిదుపరువులు తన్మధ్యంబునందుండుటచే పంచక్రోశమని మఱియొక పేరు గలదు. ఈపంచక్రోశమధ్యముననే యనేకలక్షల శివలింగములు ప్రతిష్ఠకాఁబడియున్నవి. ఈపురి ప్రభావమును యిందలి శివలింగము లెవ్వ

రెవ్వరిచేఁ బ్రతిష్ఠ కాఁబడినదియు, కాశీఖండమునందు విమ ర్శింపఁబడియున్నది. ముప్పదిమూడుకోట్ల దేవతలు సప్తర్షులు అష్టవసువులు నవగ్రహములు యేకాదశరుద్రులు చతుర్దశ మనువులు అష్టదిక్పాలకులు యీపురమున లింగప్రతిష్ఠ రొనర్చిన ప్రభావముచే మహోన్నతపదవి నందియున్నవారు. ఈ పట్టణ మనాదియగుటచే యిందలి దేవాలయము గోపురములు చాలా పురాతనమై గాన్పడుచున్నవి. వీధులు విశాలములేదు ఒక్కొక్కచో వీధుల కిరుప్రక్కలనుండు గృహములు రెండవ యంతస్తునుండి నొకటినొకటి యానుకొని సూర్యరశ్మియే ప్రసరించుటకు వీలులేకున్నది. ఒకవీధియందు శాక్తేయులు, రొుకవీధియందు గాణాపత్యులు, రొుకవీధియందు బౌద్ధులు, రొుకవీధియందు సనాతనమతధర్మశ్రేష్ఠులు. ఇట్లనేక మతము లవారీపురమందు వాసము చేయుచున్నారు. యాత్రికులెల్ల పుడీపుణ్యక్షేత్రమునకు వేనవేలమంది వచ్చుచుందురు. ఇట్టి కాశీపట్టణమున అన్నపూర్ణాదేవి దేవాలయమునం దొక్క సుందరి పదునైదుసంవత్సరలు వయస్సుగల ముద్దియ ధూళి ధూసరాంగముతో సంస్కారహీనయై జడలు గట్టిన శిరోజ ములతో అనవరత బాష్పధారతో నేదో యోచించుచు దేవి కల్యాణమంటపమున నొకచో యావాసము కల్పించుకొని సేవ నొనరించుచుండె. భాద్రపదమాసము షోడశగౌరీవ్రత దినము మధ్యాహ్న సమయమందా దేవాలయమున యాత్రి కులు పురజనులు గౌరీదేవిని బ్రతిష్ఠించి కల్పోక్తప్రకారము వ్రతమొనర్చుచు వాయనదానములు చేయుచు దక్షిణతాం బూలము లిచ్చుచుండ మనచిన్నది యీపుణ్యాంగనల కుపచ రించుచు వ్రతకలాపములకు సహాయపడుచు నటునిటు తిరుగు

చుండె. వ్రతము లోనర్చుచున్నవారిలో నొక పుణ్యాంగన దురంతచింతాభరముచే నున్నట్లు ముఖలక్షణములవలన దెలియుచుండె. అపుడపు డాయాససూచకదీర్ఘోచ్ఛ్వాసము లొనర్చుచు యేదో యొక్కరీతి వ్రతమును ముగించి తన బీదతనమునకుఁ దగువాయనదానము గల్పించుకొని యుండుటచే నచ్చట నందఱికి నుపచరించుచు విరక్తభావముచే నున్న మన చిన్నదానింగని నావఁటబీదరా లీపడుచు నాస్వల్ప మూల్య వాయనం బీమెకొసంగెదనని యామెం బిలచి "అమ్మాయి వాయనదాన మిచ్చెద స్వీకరింపు"మని సంకోచించుచు నరిగె. "అమ్మా! నాకింకను వివాహములేదు. నేను వాయనంబు గొనుట కనర్హురాల"నని యె. వారిరువు రీరీతిఁ బ్రసంగించిరి.

పుణ్యాంగన:—అమ్మణ్ణీ! కూర్చొనుము. మీరు యాత్రికులా! యేవూర నుండువారా?

చిన్నది:—వుండ నునికియు పండబడకయు లేని నాకొక యూరుగలదా తల్లీ! యీయన్నపూర్ణాదేవి యాలయ మందే నాకాపురము.

పుణ్యా:—నీకు దల్లిదండ్రులు గలరా? యుండిన వారెందున్నారు?

చిన్నది:—(దుఃఖించుచు) నాకు దల్లిదండ్రులు గలరు. వారు ప్రయాగయందుండిరి. వారికిని నాకును పూర్వకర్మముచే వియోగము ప్రాప్తించినది. నావియోగముచే వారెందు దుఃఖించుచున్నవారో వారికథ నాకును నాసంగతి వారికిని దెలియకున్నది. లేకలేక మాతల్లికి నేను గర్భమునఁ బడినమాత్రముననే వారికి జీవనమునకు లోపమై స్థానభ్ర

ప్రత్వము గలిగె. జన్మించిన యనంతర మిట్టియిక్కట్టులచే వారును నేనును బరితపించుచున్నవారము.

అనుచుండఁగనే నాపుణ్యాంగనకు గద్గదస్వరమయ్యె. కన్నులయందు నీరు గారఁజొచ్చె. శరీరమెల్ల జుమ్మని మని మొ మాటలాడడమునకే బహుప్రయత్నము గావలసివచ్చె. ఇట్లు పరితపించుచు అమ్మాయి నీకిదినఁజను వివాహముగాని దెందుకు! చిన్నది:—ఆకథ యెందుకు? మాపితరులు నన్నొసంగ నిశ్చ యించియున్న పరమపుణ్యాత్ముఁడు, విద్యానిధి, నవయున్మ థుఁడు, బ్రాహ్మణబ్రహ్మచారి ననుగానమి వగచే నెందు న్నవాఁడో యని. అయ్యో ప్రాణేశ్వరా! శ్రీపాదా! నిను మరల గాంచుభాగ్యము నాకున్నదో లేదో యని యేడ్చె. శ్రీపాదా! యనినంతనే యాపుణ్యాంగన దుఃఖమునకు మేరయే లేదు. "అమ్మా! సుశీలా! కుమారీ! నివింకను సజీవ ముతో నున్నావని యనుకొనలేదు. నీజనకుడు నిను వెదకు చున్నాఁడు. వెడలినవా రీసరికి తిరిగి రాలేదు. పుత్రికవగు నిన్ను గాంచినప్పటినుండియు ననుమానించుచున్నా"నని దబ్బుకొని దుఃఖముపట్టలేమి భోరుమని యేడ్చె. నాచిన్న దియు దిక్కుదోఁచక "అమ్మ నీవే నేమే? మాతండ్రి నన్ను వెదకుచు నెందున్నవాఁడే నేను మహానిర్భాగ్యురాలను. నే జన్మించినదాదిగా మాకిట్టి యిక్కట్టులే వచ్చుచున్నవి" యని యొకరినొకరు దబ్బుకొని యేడ్చిరి. అచ్చటనున్న పుణ్యాంగనలు వారలంగాంచి యేవిషయమును దెలియక గుంపులు గుంపులుగాఁ జేరి వారింగాంచుచు నిలువఁబడిరి. "అమ్మా! ఆబ్రహ్మచారి శ్రీపాదశర్మ ప్రయాగయందే యున్నాఁడో, యీయూరికివచ్చి భట్టపాదాద్యులయొద్ద

విద్యనభ్యసించుచున్నాడో, లేక యెందైనా జనియున్నాఁడో చెప్పు'' మనిన కుమారీ! ఆనాఁడు నీవంతర్హితవైనంతనే నీవియోగ దుఃఖముచే మాకు దెలియక వెడలినవాఁడీసరికి యతని పొలుకువయే యగుపడలేదు. యెందున్నవాఁడో తెలియదనిన నాసుశీల హా శ్రీపాదా! యనినంతనే నచ్చట జనసమూహమునందున్న యొక బ్రాహ్మణుఁడు చనుదెంచి అమ్మాయి నీపేరు సుశీల యానాయని యడిగె. నామెయు కన్నుల నీరునించుచు క్రిందఁ జూచుచుండె. నామె చెంతనున్న యాపుణ్యాంగనను నిదానించి చూచి పూర్వమున్న పరిస్థితులు మారుటచే కొంతవఱకు నిదానించి తుదకు నిశ్చయించి యా బ్రాహ్మణుం డమ్మా! సునీతీ నీవిందేయున్నావు నీస్థితిని గాంచి గుర్తింపలేకపోయితిని. చెల్లెలివగు నిన్నే గుర్తింపలేని మందమతినైతినని దుఃఖించె. ఆమెయుఁ దనయన్న విశ్వావసుండని దెలిసికొని కన్నుల నీరునించి, అన్నా! నాస్థితి యింతవఱకు పరిణమించె. నీ కోడలే యీసుశీల. యీమెను మరలఁగాంచుట భూమియందిపుడు జన్మించినట్లైనది. మీబావగారీమెను వెదకుచుఁ జని యిరువదాఱునెలలైనది. ఈవఱకు వారి పొలుకువయే తెలియదు. నీవెందుకిచటికి వచ్చియుంటివి? అందఱు నెమ్మదిగా నున్నారా? భాస్కరుఁడు మీనాక్షి బాగుగా నున్నారు గదా? మీనాక్షి కింకను వివాహముచేయవో యని పలుమాటలచే సంతోషమును బట్టఁజాలక క్షేమములు విచారించె. ఆమె ప్రశ్నలకుఁ దగుజవాబులిచ్చి సునీతీ! మీయందఱి విషయములు మీబాధలు మీవియో

గములు అన్నియు శ్రీపాదునిచే వింటి నందుచేత నే నీపేరు సుశీలగదా యని యీమె నడుగుట యనియె. అంత వారందరీరీతి మాట్లాడుకొనిరి.

సుమతి:—అన్నా! ఆ శ్రీపాదశర్మ నెచ్చటం జూచితిరి? ఆతం డేమివచించెను?

విశ్వా:—నే నొక కార్యార్థినై యడవులలో సంచరించుచు వచ్చుచుంటి నచ్చట నీ శ్రీపాదుండు దిరుగాడుచు సుశీలా సుశీలా యని తదేకచిత్తుండై యున్మత్తునివలె నుండె. నా ప్రయత్నముచేఁ గొంత యూఱటఁజెంది తనకథయంతి యుం జెప్పి నా యాగత మడిగె. నాకథనంతయు వచించితి సాయంకాలమయ్యె. మేమిరువురము సంధ్యాకార్యములు నిర్వర్తించి యొక్క శిలాతలంబుపై శయనించితిమి. నా రాత్రియంతయు నిసుశీలా వియోగసంతాపముచే కలువ రింపుచుండె. నేను గొంతవఱకట్లనే యతని యవస్థ గాంచు చుండి నిద్రించితి. ఉదయమున నే లేచి శ్రీపాదా! నీవు బాలుఁడవు. నీతలిదండ్రు లెంతో దుఃఖించుచుందురు. మీసుశీల నరయువార లనేకమంది గలరు. నీవొకఁడ విట్లరణ్యముల పాలౌట పాడిగాదు కాశీనగరమునకు వెడ లుము. సుశీల సంగతి మీతలిదండ్రుల కేమైనా తెలిసి యున్నదో యేమో పొమ్ము. నేనును యీ కళాభానుని వెదకి యీసందేశము వినుపించి మాపట్టణమునకు వెళ్లెద. మరల నీ క్షేమమును విచారించుకొనెద. నే జనుమార్గమం దంతయు సుశీలను విచారించుకొనెద. నాకు మేనగోడలు గాదా నీ కేనా అంతటిశ్రద్ధ. యీవిచారము వదలి నిశ్చిం తగా నూరికి జనుమని యెంతో బుజ్జగించి కాశీమార్గముగా

గొంతదూర మరుగువఱకు వెన్నంటి సాగనంపించి మరల నేను కళాభానుని సుశీలను వెదకుచు నుత్తరదిశగా వెడలితి. యావల శ్రీపాదుఁ డెందరిగెనో తెలియదు. నేను నిన్నటియుదయమున కీయూరు చేరితిని. వచ్చినప్పటి నుండియు విచారించుచున్నాను. భట్టపాదాచార్యుల యాత్ర మమునకుం బోయి యుంటిని యాతని పొలుకువయే లేదు. అని చెప్పుచుండఁగా సువాసినీ జనమధ్యమునం దీకథ వినుచుండిన నొక వృద్ధాంగన సర్వమంగళవలె జనుదెంచి "అయ్యా బ్రాహ్మణోత్తమా! శ్రీపాదుఁడు ప్రాణముతో నున్నవాఁడా? మరల నేను జూడఁగలనా తండ్రీ? యతఁ డున్న చోటునకు నన్ను బిలుచుకొనిపొండు. లేక లేక యొకకొడుకు గలిగియుండియు బిడ్డలులేని వారిరీతిఁ బ్రలాపింపనైనది. భట్టపాదాచార్యులయొద్దఁ జదువుకొనుచున్నాఁడనియే మే మాతని విచారించుకొనలేదు. ప్రయాగనుండి వచ్చిన కొంతమంది యాత్రికులు గంగాఘట్టమున నీసుశీల కథయు, మా శ్రీపాదుని వృత్తాంతము మాటలాడుచుండ నేను విని నాఁటినుండియు నిట్లు దుఃఖించుచున్నదాన. మా వారు రాజకార్యార్థమై పాంచాలదేశమున మణిస్యందనమున కరిగినవా రింకను రారైరి మా శ్రీపాదుని వృత్తాంతము వారి కింకను దెలిసియున్నదియో లేదో నేనేమి సేయుదు? నాపాలిటికి మీరు శ్రీవిశ్వేశ్వరునివలె నున్నారు మా శ్రీపాదుని యునికిఁ జెప్పితిరి. మరల వాఁడెందేగెనో దెలియునా" యని యడిగె నంత సునీతి దుఃఖముచే తల్లీ! మీపుత్రున కింతటికష్టములు ప్రాప్తించుట మమ్ములనుండియేగదా వృద్ధాప్యమందు మీకు సంకటములు తట

సించినది. ఇదియంతయు పూర్వకృతము. దుఃఖింపక మన మందఱము మాయన్నగారి వెంట శ్రీపాదకర్ణయున్న చోటికిం జని యాతనిం దోడ్కొని వత్తము. ఇంక దుఃఖం చిన లాభములేదని అన్నా! మమ్ముల నాఁతడున్న స్థలము నకు దోడ్కొనిపోయి పుణ్యము గట్టుకొమ్ము. ఇంతమందికి మనస్సంతోషం బొనర్చిన పుణ్యము నీకు గల్గుననియె. విశ్వావసుఁడు తనచెల్లెలఁ గాంచి సునీతీ! మధ్యాన్నమయి నది. వ్రతమొనర్చుకొనియున్నారు. వాయనదానం బొనం గుము. ఈయన్నపూర్ణాదేవి వ్రతమున భోజనమొనర్చు కొని యావల నన్నిసంగతులు మాటలాడవచ్చుననిన, శ్రీదేవి వారలంగాంచి స్వామీ! మంచి వాక్యము సెల విచ్చితిరి, నేనీయూరనే యుండియు పట్టపండుగనాఁడు అన్నపూర్ణావ్రతమునకు భోజనమునకు బోవలయునే బాగాయె. మాయింటికి మీరందఱు దయచేయవలయు నమ్మా. మీకొమార్తెను బిలుచుకొనిరండు పోదాము పదండి. ఆవాయనము నాకిందు. అని చెప్పిన నట్లొనర్చి వ్రతము పూర్తిగావించుకొని కథవిని యందఱు శ్రీపా దుని మందిరమునకుం బోయి భుజించి యనంతరమున శ్రీ దేవి సునీతి సుశీలలం గూర్చుండఁబెట్టుకొని నాకథ వినుడు. ఆవల మీరిచటికి బిలుచుకొనిపొమ్మన్న నటకు దోడ్కొని పోయెద నట్లు శ్రీపాదుని కొంతదూరము కాశికి బొమ్మని సాగనంపి నేను వెనుకకుం దిరిగి యుత్తరాభిముఖుఁడనై కళాభాను నరయుచుఁ బోవుచుండఁ గొంతదూరమునుండి అయ్యా బ్రాహ్మణా! నిలిచి నాతో మాట్లాడిపొమ్మను నొక ధ్వని వినంబడియె. నలుప్రక్కలం గాంచితి నాకవ్వ

రగుపడరైరి. మరల నదేరీతి విననయ్యె. నశ్వత్థవృక్షంబుపైఁ జూతుంగదా తాటిమ్రాని పొడవున వికారాకారముతో నొక బ్రహ్మరాక్షసి కూర్చొనియుండఁ జూచితి. నాయొడలంతయు జడుపుపుట్టి నోట తడియారె. నడుగిడుటకే విధిలేకపోయె. ముందున కరుగుటకును వెనుకకు జరుగుటకును దిక్కుదోఁచక యట్టె నిలువఁబడితి. బ్రాహ్మణా! భయపడవలదు నీవెవరికొఱకు వెదకుచున్నాఁడవు? నీ వీయరణ్యమున నొంటిగా సంచరించుటకేమి కారణమనియె? నేనేమి చెప్పుటకు ధైర్యము లేక గ్రుక్కిళ్లుమ్రింగుచు గడగడవడఁకుచు నాతని జూచుచు నిలువంబడితి నంతలోయిరువదిమంది శబరార్భకు లాహారపదార్థమును నీరమును గైకొనివచ్చిరి. నాకు కొంచెము ధైర్యముగలిగె. నాశబరులలో నిద్దఱు ధైర్యవంతులాహారమును దీసికొని ఆయశ్వత్థవృక్షమెక్కి భూతమునకిచ్చిరి. మిగతవారు క్రిందనుండి యందిచ్చుచుండిరి. ఆ భూతముభుజియించి నీరము గ్రోలె. శబరార్భకులు మ్రానినుండి దిగి తమకుటీరములకుం జనుటకై వెడలిరి. నేనేమియుఁజెప్పక నిదేసందనుకొని వారివెంటనే యతివేగముగా శబరులయిండ్లకుఁ బోవుచుండఁగా నాభూతము నన్నుగాంచి కరుణారసములేనివాఁడవు. మనమును చిక్కపట్టుట కసమర్థుఁడవు. ధైర్యలక్ష్మిం గోల్పోయినవాఁడవిట్టిబ్రాహ్మణుఁడవు నీకు భయములేదని నేను బిలుచుచుండినను బోవుచున్నాఁడవు. నాకీబంధనములే లేకున్న నిన్నుపుడే యెత్తికొనిపోయి సముద్రములో ముంచుదును పొమ్ము బ్రతికికొనుమని యఱచుచుండె. నేను వెనుకకే

చూడలేదు. నాపుణ్యవశమున నీకు బంధనములు గలిగినవి నేను బ్రతికితి నభ్యాయనుకొని శబరులవెంట వారికుటీరములకుంబోయితి. వారివేషములు వారిభాషలుగాంచి నాకసహ్యమయ్యెనుగాని నన్ను వారధికముగా గౌరవించుచు దమమందిరములకుం దోడ్కొనిపోయి నాకథనంతయు విచారించిరి. నాకథవివరించుచుం కళాభానునికొఱకు వచ్చియున్నాననినమాత్రముననే నన్ను దేవునివలెం జూచుచు ఫలములును దేనెయును నొసంగి మీసందేశము మేమా మహాత్మున కొసంగుదుము. యాతండిపుడిచట లేడు యింక పదునైదుదినములలో జనుదెంచును. నీవిటనుండకుము. అనేక సింహవ్యాఘ్రసంచారభయంకర మీయరణ్యము. మీసందేశపత్రిక మాచే నొసంగి మీపురమునకుం జనుఁడు. మీయుపకారమున కమ్మహానీయునిచే ప్రతిఫలముం జెందెదరు పొందనిన మంచిదని సందేశపత్రిక వారిచే నొసంగెదనని నాయంగవస్త్రము ముడివిప్పిచూడ నాపత్రిక యెందో జారిపోయియుండె. భూతమునుజూచి భయపడినపుడు యెచ్చటనోపడిపోయినది. అందుచే బోఁగొట్టుకొన్నానని వారితోఁజెప్పితిని. వారిభాషతో నొకరికొకరు చెప్పుకొని నవ్వుకొని పోనిపొందు మేముచెప్పెదము. మీరు వెళ్లుడని చెప్పి యిరువదిమంది. శబరార్భకులొకరు మార్చి యొకరెత్తుకొని నన్నీ కాశీపురముం జేర్చి వెడలిరి. నే నిట కరుదెంచి రెండుదినములైనది శ్రీపాదుని విచారించితి యాతనిసంగతి యొకరైనం జెప్పరైరి. అది మిగుల భయంకరారణ్యము. క్రూరమృగములుగలవు. ఆభూతము గలదు కానిమ్మహాతము. ఆఁడువార లాయరణ్యమునం

దిరుగాడ సాధ్యమగునే నేడే రేపో రాకుందునే యోచింప కుండని సుశీలంగాంచి, అమ్మాయీ! పరిశుద్ధస్నాతవై యింటికివచ్చుచున్నపు డదృశ్యవైతివని చెప్పెదరే! అపుడు నీవెచ్చటికిపోయితివి? యిచ్చటనుండుట కేమికారణము? నీకథనంతయుఁ జెప్పుమనిన సుశీల తనకథ జెప్పుట కుపక్రమించె.

సుశీల:—అమ్మా! నావిపత్తును దలఁచుకొన్న గుండె నీరవుచున్నది. మరల మిమ్ములను జూతుననుకొనలేదు. అట్లింత రిహ్వాతనగుట మీకుదెలిసినవిషయమేగదా! నాకుఁ దెలివి లేకుండె. మఱికొంతసేపటికి కన్నులుదెఱచి చూతును గదా యొకక్రూరాకారునిభుజముపై గూర్చొని యాకాశ మార్గముగా నతివేగముగా బోవుచుంటిని, మఱికొంత దూరమరుగ గొప్పపర్వతములమధ్య భయంకరమగు కోనలో యాశ్రమమధ్యమున నొకవృక్షముచెంత నన్ను దించె. అచ్చట ననేకమంది వికారాకారము గలిగిన స్త్రీలుండిరి. వారిలోఁ గొందఱు దిగంబరులై మర్మస్థాన మునకుమాత్రము కౌపీనముధరించి స్తనములు వ్రేలాడ గవ్వలు గాజుపూసలుచేత శరీరమెల్ల నలంకరింపఁబడి తల వెంట్రుకలు విరియబోసికొని యుండిరి. మఱికొందఱు తలలు జోడించుకొని గొప్పగొప్పపండ్లు పెదవులుదాఁటి బైటికగుపడ నొకమలినచేలము స్తంభమునకుఁ జుట్టినరీతి దేహమెల్లజుట్టుకొని గొప్పత్రిశూలము చేతఁబట్టుకొని పలుమారు నాలుకచే పెదవులు దడవుకొనుచుండిరి. మఱి కొందఱికి వీపునగూన, ముఖముపైన నొకకన్ను దిగువ నొకకన్ను యేనుఁగుచెవులవంటిచెవులు, నల్లనిశరీరము,

మూర్ఛవాయువు తటస్థించినపుడు నోరొకపార్శ్వమున కెట్లుబోవునో ఆవిధి ప్రక్కకు కోరలతోను నోరు, భల్లూక మునకువలె దేహమెల్ల వెండ్రుకలు, మూటకట్టలువలె స్తనములు కత్తరింపఁబడి పైకిబోట్రిల్లుచుండుతల వెండ్రుకలు గలిగియుండిరి. కొందఱు మనుజకపాలములో నంజుడువైచికొని నోటితో నాలుకతో నంజుకొనుచు నొకచేతితో యఱకళముఁ బట్టుకొని యొకకునొకరు సరస మాడుచు కల్లుకుండ లొకరిపై నొకరు చల్లుకొనుచు యెగురుచు దుముకుచునుండిరి. ఇట్లనేకమంది వికారులు జూచి యిక నేను బ్రదుకుట లేదనుకొంటిని. వారందఱు నా చుట్టుముట్టుకొనిరి. నాకుదిక్కుదోచక యేడ్చితిని. వారం దరు అమ్మణీ! యేడువవద్దు. నీకిచ్చట బహుసౌఖ్యము జరు గును. బహుపుణ్యలోకములు కలుగును. మేమందఱము నీకు సేవచేసెదము. పూటపూటకు వేళనతిక్రమింపకుండా భోజనములు నిర్వర్తింతుము. భయపడకుమని బుజ్జగించి తలనువ్వుచు యొడలెల్ల నిమురుచు ప్రేమఁజూపుచుండిరి. వారిచెంత నొకవిధమయిన దుర్గంధము కడుపునఁ జేయి పెట్టి గలఁచినట్టుండె. యెటుగన్నను సురభాండములే, యెటుజూచినను మాంసమువైచియున్న తాళితోళ్లు, యెముకలు నెత్తురు నిండుకొని దుర్గంధమయమై యీఁగలు జుమ్మురమని ముసరుచుండె. కాకగృధ్రసృగాలములు తనివి దీర మాంసముందినని మదించి భయమొందక నటునిటు దిరుగుచుండె. శునకములు చాలినన్నిగలవు. ప్రతికుక్క మెడకు నెట్టనిపువ్వుహారము ముఖమున నెత్తురుబొట్టు పెట్టియుందురు. మనము గరుడపక్షిని జూచినపుడంతయు

నెట్లు నమస్కరించుచుందురో, వారు కుక్కను జూచి నపుడంతయు మ్రొక్కులు చెల్లించుచుందురు. యెచ్చటఁ జూచినను కోలాహలములే యెటుగన్నను యున్మత్త ప్రలాపములే, స్త్రీపురుషవిమర్శ చేయఁ గడునసాధ్యము, మఱికొంతసేపటికి అన్నాయనియు, అప్పాయనియు, గూఁతురాయనియు, గుమారాయనియు హోరుమని యేడుపుధ్వనులు వింటిని. వారెవ్వరో చూడవలెనను భ్రమ జనియించె నంతలో నొకవికారాంగి చనుదెంచి, అమ్మణీ! నీ కేమికావలెనని యడిగెను. నేను భయపడుచు నదే యేడ్పుధ్వని వినఁబడుచోటికిఁ బోవలెనని యడిగితిని. అమ్మణీ! నీ వచ్చోటికిఁ బోవుటకింకను వ్యవధి లేదు. నీ విపుడేగదా వచ్చినది! నాలుగుసోమవారములిందే యుండ వలయు. నైదవ సోమవారమునకులోగా ఆస్థానమునకుఁ బోయి యచట సుస్తసుఖము లనుభవించవలెను. అంత వఱకు నిన్నచ్చటికిఁ దీసుకొనిపోవుటకు మారాజాజ్ఞ లేద నిరి. మీరాజెవరని యడిగితిని ఛేండాభైరవుఁడనిరి. అతఁ డేమిచేయుచుండును? నన్నిచ్చటి కేమిటికిఁ దెచ్చితిరి? నావలన నుపయోగమేమంటిని? నీయుపయోగ మిది మొద లైదవసోమవారమునాఁడు నీకే దెలియును. మారాజిపుడు సమాధియందున్నవాడు. చాలించినంతట నిన్నాతనిసముఖ మునకుఁ దోడ్కొనిపోవుదుము. చూడు మాతనిమర్యాద, యాతని గర్వము. యాతనిభ్రమ. మావంశములో నట్టి మహానుభావుఁడింక జన్మింపఁడు. మీాపైననేగాదు మాపైన నెంతయో భ్రమ. మాకొక్కక్కల్లుకడవయంతయుఁ బ్రతి దినము నిచ్చుచుండును. మనుజకపాలములు మాకేయొసం

గును. స్త్రీవధ యైన దినముమాత్రము తానేదయో వప యుట. అదిమాత్రము హోమగుండములోవేసి మరల దీసి కొని అరటిపండులోబెట్టుకొని దిగమ్రింగును. అతఁడు కల్లు ద్రాగఁడు మాంసముదినఁడు. ఆహారములేదు. మీరు మనుష్యులెట్లు ఆచారముచేయుదురో అట్లనే మా రాజుం డును. బలియిచ్చినదినము మాత్రము కొంచెము రక్తపాన మొనర్చును. (అదియుఁ దీర్ఘమువలె స్వీకరించును) అని చెప్పినప్పటికి నాకేమియుఁ దోఁపక భయమొంది అమ్మా బలులని చెప్పితిరే బలియిచ్చువారెవరు? బలియొసంగు టెవ్వరిని యెవరికి బలియిచ్చెదరు? పురుషులబలి యెపుడు స్త్రీబలి యెపుడని యడిగితిని. వారేదియో చెప్పుచుండు నంతలో భేరీనినాదము ఘంటానినాదము వినవచ్చె. అదే మా రాజుగారు సమాధి జాలించియున్నవారు. అచ్చటికి బోవలయునని నన్నుదోడ్కొని యొక దేవాలయము చెంతకుఁ బోయిరి. అచ్చట జూతునుగదా పండ్రెండడుగుల యెత్తుగల నొకశిలావిగ్రహ మగపడియె. ఆవిగ్రహము దిగంబరముగానుండి యెనిమిది భుజములుగలిగి ప్రతిచేతి యందు నొక్కొక్కయాయుధముగలదిగానుండె. మనుజ కపాలములకు యెఱ్ఱనిరంగువేచి నాదేవాలయములో నలంకరించియుండిరి. విగ్రహమునకు వెండికోటులు వె ? కన్నులు బెట్టియుండిరి. ఎముకలహారము వేసియుండిరి. ఆవిగ్రహముయొక్క పాదములచెంత నొకరాతి తొట్టి గలదు. వారిమాటవల్ల నది రక్తతీర్థస్థానమఁట. దాని నిండుకు రక్తమేయుండె. ఆవిగ్రహముయొక్క సన్నిధిలో నెఱ్ఱశరీరము పొడుగైన వెంట్రుకలు రక్తవస్త్రధారణ

చేతియనామికమునందు దర్భపవిత్రము క్రింద పులితోలు పైన గజశిరముగలిగి పడమటముఖముగా కూర్చొని నా విగ్రహమును బూజచేయుచు నొకపూజారియుండె. ప్రక్క-నున్న యొక స్తంభమునకు ముప్పదియారు సంవత్సరములు గల యొక మనుజుని బంధించియుండిరి. ఆమనుజుఁడు స్మృతి దప్పియుండె. ఈపూజారియే మాంరాజని తత్పరిచారకులు నాకు దెలియునటుల జోహారులర్పించి నన్నుగుపఱచిరి. నాపేరు యూరు మా తండ్రిపేరు నొకపట్టికయందు వ్రాసికొని అమ్మాయి! భైరవదేవునకు బలికొఱకు నిన్ను దెచ్చియున్నవారు. ఇది మొదలైదవసోమవారము వఱకు నీవు సమస్తసౌఖ్యములనుభవించి యానాఁడు బలికి సిద్ధురాలవై యుండుమనిన మాత్రముననే నానెత్తిన పిడుగుపడినట్లయ్యె. కేరున కేక వేసి మూర్ఛిల్లితి. మఱికొంతసేపటికి స్మృతిగలిగె. ముందున్న స్థలమందే యుంటిని నావికారాంగన లెంతో ప్రేమచే నన్ను బోషించుచుండిరిగాని ప్రాణభీతిచే నాకేదియు రుచింపదయ్యె. అయిదవసోమవారము జనుదెంచె. ఆదిన ముదయమున నన్నభ్యంగస్నానమొనర్పుమని నిర్బంధపఱచిరి. నేను వలదంటిని వారే బలవంతమున నాకార్యమొనర్చి యెఱ్ఱనివస్త్రముగట్టి యెఱ్ఱనిపూలు నామెడకు వేసి తలకుఁజుట్టిరి. యెఱ్ఱనిగంధము నామోమునందుఁబెట్టి యెఱ్ఱనియక్షతలు మెత్తించిరి. ఆదినముదయమునుండి రాక్షసాంగనల పరిస్థితులుమాఱె. నన్నుగర్జించుచు భయపెట్టుచు యేడువవద్దనుచు నఱకెదమనుచు బహుభీషణములొనర్చిరి. నాకు ప్రాణములపై నిరాశ జనియించె. దుఃఖాతిశయముచేఁ బలుమాఱు

మూర్ఛదగిలి తెలివివచ్చుచునుండె. ఇద్దఱు రాక్షసాంగ
నలు నాయిరుప్రక్కల నిలిచి చెరియొక రెట్టబట్టుకొని బిర
బిర నడుగిడుమని తొందరపెట్టుచు నాహింసాలయము
చెంతకుఁ దోడ్కొనిపోవుచుండిరి. దేవాలయ మింక పదిగజ
ములదూరమున నుండె నంతలో భోరుమను నొకశబ్దము
వినుపించె నటునిటు బరికింపుచుండ నొకదీర్ఘ కాయుఁ
డాకాశమునుండి రివ్వున జనుదెంచి నాయిరుప్రక్కల
యందున్న రాక్షసాంగనల నరుపురిసి చెరియొక ప్రేటున
కూలదన్ని నన్నెత్తికొని వియన్మార్గమున కెగిరి మహావేగ
ముతోఁ బుణ్యరాశియైన నీకాశీపట్టణమున నన్నపూర్ణా
దేవి యాలయమందుంచి తా నంతర్హితుఁడయ్యె. నాసంత
సమునకు మేరయే లేదు. మరల ప్రజలంగంటిగదా యని
యుల్లాసముతో నరుదెంచి యెటుబోవుటకును దిక్కుదోచక
యీ దేవాలయముననే యునికిగల్పించుకొని అమ్మవారిసేవ
చేయుచునుంటిని. నాప్రాణదాన మొనర్చిన యమ్మహా
త్ముఁడు మనుజుఁడో గంధర్వుఁడో సిద్ధుఁడో యెవరో యత
నికి వందనములాచరించెద నాతని యభ్యుదయము గోరు
చుండెదనని నమస్కరించి తిదియే నాకథ. తక్కినసంగతి
మీరిపు డెఱింగినదియేగదా'' యనిచెప్పినప్పటికి అచ్చట
వారందఱు భయమొంది యాశ్చర్యమగ్నులైరి. శ్రీదే
వియు, సుమతియు, విశ్వావసుఁడును మహాదుఃఖము చెంది
యెంతకష్టపడి యున్నావమ్మా యని సుశీల నాలింగనము
జేసికొనిరి. అంత సుమతింగని చెల్లెలా! ప్రయాగవిడిచి
నీ వెపుడిచ్చటికి వచ్చితివి? నీకథఁ దెల్పుమనిన ''అన్నా!
సుశీలను వెదకుటకై మావారు వెడలునపుడు నాయుదర

పోషణ కేదియో కొంతపదార్థము గలిగియుండి దానితో నెలదినములు జరిగె నొకరాత్రి చోరులా ధర్మశాల ప్రవేశించి యున్న పదార్థమంతయు నపహరించిరి. ఉదయమున నుదరపోషణకే యత్నము లేకపోయె. ఆఁకలి దుఃఖమొకటి సుశీలాదుఃఖ మొకటి మావారు రానిదుఃఖమొకటి యొకటికొకటి ప్రబలమయ్యె దిక్కుఁదోఁచలేదు. ధర్మశాలవిడిచి ప్రయాగ మాధవస్వామి దేవాలయము చెంతకుం బోయితి. అచ్చట భగవంతునకు ఫలములే నైవేద్య మొనర్తురు. ఆఫలములన్నియు మాబోటి విదేశీయులకే యొసంగుచుండుటచే నేనచ్చటనే నివసించి నివేదనమైన యనంతరము వారిచ్చు కదళీ ఖర్జూర నారికేళ ద్రాక్ష బదరీ పనస బహుబీజ నారింజాదిఫలముల భక్షించుచు రెండుమాసములు జరిపితి. మరల నామనస్సునకు విసుగుజనించె. భాద్రపదమాసము సమీపించె. షోడశగౌరీ వ్రతమున కేమియు నాచెంత లేకున్నది. శ్రీపాదునియూరు కాశీపురముగదా అటకేగిన మాసుశీల సమాచారముఁ దెలిసికొనవచ్చును యాతఁడున్న యీవ్రతము నెట్లైనను నెఱవేర్పించుననుకొని కాశీపురమున కరుగుచున్న యాత్రికులవెంట మొన్నటిదినమిటకుఁ జనుదెంచితిగాని శ్రీపాదశర్మ సంగతియే చెప్పువారు లేరైరి. సుశీలా వృత్తాంతమన్న నదియుఁ జెప్పువారులేక నే జనుదెంచినది వృథా యనుకొని పతియాజ్ఞ లేక ప్రయాగవిడిచి కాశీపురమునకు వచ్చియున్నదానను. వారు మరల ప్రయాగకు జనుదెంచి నే గానరాకున్న నెంత యాయాసపడుదురో పతిహిత మొనర్పనిసతి నరకకూపమునందు వసించును. ఏకాంత

పతివ్రతయై యనుదినమును భర్తసేవఁ జేయుచుండునో, యేకాంత భర్త యూరలేనప్పుడు శీలవృత్తిచే సుఖముగా భర్తయింటికిఁ జనుదేరవలెనని గౌరీపూజ సేయుచుఁ బ్రార్థించుచుండునో, యేసతిపతికి సమ్మతమగు ధార్యాగ్ని ననవరతము శ్రద్ధచే రక్షించుచుండునో, యేసతి పతికి నూరాడక నాతని యిష్టానువృత్తి బంధువుల నాదరించుచు భిక్షుకుల దృప్తిపఱచుచు బరపురుషులతో బరిహాసోక్తులు అర్థాంతరోక్తులు నర్మగర్భోక్తులు నాడక గంభీరహృదయయై యన్యగృహంబుల కరుగక పిలువనిపేరఁటమున కేదురుచూడక జనకసుత సోదరులతోడనైనను మితభాషియై రహస్యగృహములందు భాషింపక వారితో నేక శయ్యాపైఁ గూర్చుండక సభలకేగి యుపన్యాసము లియ్యక పతివ్రతలైన పుణ్యసతులతో నవ్యోకాలములయందుఁ బతిహితచర్యలు శిశుపరిపోషణవృత్తులు వ్రతదానాది కృత్యములు పతివ్రతల చరితములు వినుచు భగవంతునిపై బాటలుపాడుచు వేళ యతిక్రమింపకనే భర్తకు భోజన పానము లమర్చుచుఁ బ్రతిదినమును బ్రహ్మామకాలమందు పతికన్నమునుపే లేచి పరిశుద్ధజలముల సుస్నాతయై శుభ్ర వస్త్రములు ధరించి హరిద్రాచూర్ణకుంకుమాక్షత లలంక రించుకొని పతిని మేల్కొల్పి యాతని పాదాభివందన మాచరించి స్నానసంధ్య దైవార్చాగ్న్యుపాసనంబులకుఁ బూజాహోమద్రవ్యంబు లందిచ్చుచు సంసారవృత్తుల రట్టొనర్పక పతికన్న మునుపు భుజియింపక యనృతంబులాడక చోరవృత్తిపర్జించి పరుషోక్తులాడక ప్రసన్నవదనయై ధారణాశక్తి గలిగి యేసతీమతల్లి వర్తించునో, సనాతన

ధర్మానుసారం జేసాధ్వీ గృహిణీధర్మము లేమఱక గురుజనుల గౌరవించుచు సపత్నులపై ప్రేమఁజూపుచు కర్యములకు గాలుద్రవ్వక సద్గుణాలంకారశోభితయై యుండునో యాసతి పుట్టినింటికిని మెట్టినింటికిని కీర్తియు సద్గతియుఁ గలుగఁజేయును. పతి పతితుఁడైనను సతి సువ్రతసూనృతములచేఁ బతిని సద్గతినొందించును. నేనట్లు భర్తయాజ్ఞ లేక యిటకరుదెంచితినిగదా యని దుఃఖించి మరల నన్నే నాశ్వసించుకొని విధిలేక వచ్చియున్నదానను. గౌరీవ్రతమేదో యొకతీరున నిచ్చటనే జరుపుకొని మరల యాత్రికులవెంట ప్రయాగకేగెద ననుకొని యాత్రికులోసంగు తాంబూలవాయనదక్షిణల సమకూర్చి వ్రతమునకు వలయు సామగ్రి సూక్ష్మముగా సవరించుకొని దేవీనిలయంబున నేఁడు వ్రతం బాచరించియున్నదాన. మిగత వృత్తాంతము మీరందఱెఱిఁగినదే'' యని చెప్పి యూరకుండె. శ్రీపాదునియందే మనసుండుటంబట్టి సుశీలకు మోమున వికాసము పుట్టకుండె. శ్రీదేవియు నారాత్రి వారందఱికి దగుసత్కారము లొనర్చి శ్రీపాదునియునికి దెలియు టెట్లో యని వగచుచుండ నామె నూఱడించుచు నారాత్రి గడపి వేకువనులేచి గంగాభవానియందు స్నానాది నిత్యకృత్యములు దీర్చుకొని సునీతియు సుశీలయు విభావసుండును ప్రయాగకుం జనిరి.

సీ. మోమునఁ జిఱునవ్వు మొలక లెత్తెడివాఁడు
పలుకుల మధురసం బొలుకువాఁడు
వలరాజు నదలించు వలపు గుల్కెడివాఁడు
భుజబలంబున వడముడికి జోడు

సర్వంబుఁ దనవలె సమత గాంచెడివాఁడు
పరతత్త్వసాధనాభ్యాసపరుఁడు
నమరేజ్యసమమహోత్తమవిద్య గలవాఁడు
భువనమోహనకళాభూషణుండు

గీ. భూసురోద్గీయనిజయశఃపూరితాష్ట
కాష్టవిసరుండు సత్యసంకల్పపరుఁడు
భానునామకళాద్యుండు ప్రాణవిభుఁడు
నేఁడు రాఁడో ధరిత్రి నున్నాఁడో లేఁడో.

మ. అలనాఁడా నదురేయి ఘోరవనిచోరగ్రాహియై కాయిడ
న్నిల జన్మించినరీతి వచ్చినను రక్షించెఁ మహాపూర్ణుఁడం
దులవాఁడో యెటకేగెనో యతనికిం జోతల్ సమర్పించెదన్
కలకాలంబుమహోన్నతాధికయశఃకామాయువుల్ వర్ధిలన్.

ఉ. ఈవర మెట్లుగోరెను మహీశ్వరుఁ డేగతి నీవొసంగితో
భావములోన నన్నధికబాధలు పెట్టఁ దలంచి క్రూరతన్
యీవిధిఁ బుట్టఁజేసితె మహీస్థలిలో నగచాట్లమారిగా
గోవులఁజంపి చెప్పులను గొమ్మని యిచ్చినయట్లు భారతీ.

సీ. ననుగానకను కాననములోన నడలూన
దిరుగాడి తండ్రి యేదిక్కుచనెనొ
కనరాక మనలేక తనశోక మెటుఁబోక
నడవఁగాఁ దల్లి యెంతడలుగనెనొ
తరులందు గిరులందు దరులందు జరియించి
మరులొంది చెలులెందు మడిసిరొక్కొ
అలనాఁడు బలువేడుకల చేడెలనుగూడి
క్రీడించు నాసౌఖ్య మేడజనెను

సీ. కాకఘూక శివారవాక్రాంతకాష్ఠ
దశభయంకరక్రవ్యాద దశనఘటన
బటపటాత్కారహుంకారభరితభేం
డ భైరవాశ్రమమంతమై పరఁగె నాకు.

అక్కటా! జననీజనకులారా! శుక్రవారమునాఁడు దేవీ పూజకై మీతో ననుజ్ఞ గొనుటయే కడచూపులాయెగదా! తల్లి యనియు దండ్రీ యనియు నిఁక మిము బిలుచువారెవరు? బహుధర్మదివ్యోపకార పారీణతగన్న మీకు వృద్ధదశ యందుఁ బుత్రికావియోగ మనుభవించి తుదకదే యాత్రచేఁ గడతేఱనాయెఁగదా! దేవీ భువనేశ్వరీ! మాపితరుల నెంతబాధ లకు గురిచేసితివి? నాపురాకృతము నే ననుభవింపక తీరదు. అందులకు నీ వేమిరొనర్తువు? చెలులారా! ఇఁక మిమ్ములం జూచుభాగ్య మీసిర్భాగ్యురాలి కలవడునే? ఉద్యానవనలత లారా! యిఁక మిమ్ముఁ బోషించువారెవరు? అని పలువిధ ముల నెన్నుకొనుచు భేండాభైరవాశ్రమం దొకకాంత యేడ్చుచుండ నొకవికారాంగన పులిచర్మమును గోపీనముగా ధరించినది. పిచండిలమైన కడుపు మర్మస్థానమున కడ్డగించి దిగఁబడియున్నది. లంబకుచచూచుకములు నాభిస్థానమును ముద్దుగొనుచు కుక్షిపై నాట్యము లాడుచున్నవి. మోకాళ్ల వఱకు పులితోలు చల్లడముగాఁ దొడిగియున్నది. పండ్లు పెద వులందాఁటి మూఁడువరుసలతో వెలుపలికి గనుపించుచుండె. కోరలు వ్యాఘ్రనఖములవలె వక్రములై కర్ణములకు సేవ రొనర్చుచుండె. నంజుడుగల తలపుఱ్ఱెను వామకరమున ధరించి యప్పటికప్పటికి నాలుకచే నంజుకొనుచుండె. కుడి చేతియందొక పెద్దత్రిశూలము ధరించియుండె. తలవెండ్రుకలం

ఖండింపఁబడి సూచీముఖాగ్రంబులై యూర్ధ్వలోకంబుపై నుండె. మధ్యపానమదోన్మత్తతచే దీనుపదార్థమందుఁ బ్రజ్ఞ లేమి చొంగలు గారుచుండె. నాకాంత చనుదెంచి "అమ్మణ్ణీ! భువనమోహినీ! నీ వీ యాశ్రమమునకుఁ దీసికొనిరాఁబడి మూఁడుసోమవారములైయెనను రేపు సోమవారమునకు వారాభైరవదేవునకు బలియొసంగుటకుఁ బట్టికలో నెవ్వరు స్త్రీలు లేకుండుటచే నిన్ను బలియొసంగెదరనియు నీవు నీయిష్టదైవమును బ్రార్థించుకొని రేపటియుదయము బలికి సర్వసిద్ధురాలవై యుండవలెననియు మహారాజుగారు నీకెఱుంగింపుమని చెప్పియున్నాను. ఇఁక నీయిష్ట"మని చెప్పి యాదాసవి వెడలిపోయె. అది రాత్రిసమయమగుటచేఁ దనచెంతనున్న రాక్షస స్త్రీలు కొందఱు నిదురించుచుండిరి. కొందఱు మధ్యపానమదోన్మత్తలై పొరలాడుచుండిరి. ఈసంగతి వినినంతనే భువనమోహిని కపుడే ప్రాణములు పోయెనో యనునంతటి పరిమితిలేని దుఃఖము భయము జనించె. తహతహలాడఁజొచ్చె నిలువున నీరై కరగినట్టయ్యెఁ గూలఁబడి చేతులు భూమికానించి యేడ్చుచు,

క. ఇది భానువారమగుటం,
   గదిసె మదీయాంత్యకాలఘడియలు నాకె
   య్యది దోఁపదు మది చెదరెను,
   బదపదమని కాలభటులు బదరెద రదియే.

చ. అడవిని జచ్చుచుంటి నపుడమ్మహనీయుఁడు రాకయుండినన్
   విడువక దెచ్చి రిచ్చటికి వీరలయో కడతేర్తురింక నా
   గడు విపుడేగుదెంచెడిని కాయము నిల్వదు ముల్లుదీసి కొ
   ఼ఱ్ఱడచినయట్టులయ్యె నకటా! మనుజేగతియానో దైవమా!

చ. అతనుని బోలుసుందరులు నద్భుతశౌర్యపరాక్రమాదితుల్
చతురులు నీతికోవిదులు శాంతులు శుద్ధులు సుప్రసిద్ధులా
కుతలమునందు గల్గు నృపకోటితనూజుల నిందచేసి స్వ
స్తుతి నొనరించుదుర్మతికి దుర్మరణంబు లభింపకుండునే?

ఉ. గాసిలి బిడ్డలన్ వెదుకఁగాఁ జనుదెంచి మదీయ ప్రార్థనం
ద్రోసి చనంగలేక యటు దుష్టులచే బలుతాపులొంది యా
యాసముఁ జెంది కట్టువడి యమ్మహనీయునిచేత ముక్తులై
భూసురు లెందుఁబోయిరొకొ పొక్కుచు నంగన కార్త్రి
దూలుచున్.

అయ్యో! నేనేమిటి కింక దుఃఖింపవలయు నాయంత్య కాలఘడియలు సమీపించునట్లు తెల్లవారుచున్నది. నేనేడ్చినం గాంచి కరుణించి రక్షించువా రెవ్వరైనం గలరా? పూర్వ జన్మకృతము లసాధ్యములగుటచే నెవరేమిచేయఁగలరు? ఈ పాపి ఖేండాభైరవునిచే నెంతమంది యబలలు కడతేఱియున్న వారో, యెంతమంది పితరు లేమిగతి బట్టియున్నవారో హా దురాత్మా! ఖేండాభైరవా! శీఘ్రమున నీవు ధ్వంసమగుదువు గాక! నీచే నర్చింపఁబడుచున్న భైరవవిగ్రహము సహస్రభిన్న ములై పోవునుగాక! నీభటులందఱు వినాశము జెందఁగా వారి పత్నులు విధవలై పలవింతురుగాక! నీయాశ్రమము ధూమ ధామమై భస్మమగుగాక!

పంచ. ధరన్ బతివ్రతాదిభూతి తథ్యమేని నేక ళా
ధరున్ మనంబునందు నెపుడు దాల్తునేని శీఘ్రుతన్
హరామరాదు లాచరించి యాశ్రమంబుఁ ద్రోచినన్
త్వరన్ శ్మశానమై దహించు భైరవాశ్రమం బొగిన్.

పంచ. దిశల్ ప్రశాంతి గాంచు నేని దివ్యధర్మసత్యముల్
విశాలమై చలించు నేని విష్ణుగీతవాక్యముల్
ప్రసిద్ధిఁ జెందు నేని ఖేండభైరవాశ్రమం బొగిన్
శ్మశానమై దహించుగాత! సత్వరంబ భూస్థలిన్.

ఇట్లు శపించి ప్రాణంబులపై యాశవదలి ప్రపంచ జ్ఞానమువిడచి నిర్మలచిత్తయై భగవంతుని ధ్యానించుచుండె. తెల్లవాఱి భైరవాలయమున భేరీముఖభయంకర ధ్వానములు బోరుకొనియె. భైరవవిగ్రహ మలంకరింపఁబడియె. నాఁడు సోమవారము కఠోరభైరవ నిర్యాణాశుచిం బాపుకొని ఖేండా భైరవుఁడు భైరవాలయమున కేతెంచుచుండె. ఒకప్రక్క రక్తఛత్రంబులు నొకప్రక్క చామరములు వీచుచుండిరి. కొందఱాతని ముందు గైవారములు చెప్పుచు నడచుచుండిరి. యతఁడు యేఁబదియైదు సంవత్సరములు వయస్సుగలిగి యుండె. పంచాననముఖము గొప్పచెవులు గుండ్రములై వెడల్పులయిన నేత్రములు కరుకుజుంజురు వెండ్రుకలు నల్లశరీరము పండ్రెండు అడుగులు పొడవు మేఘగంభీరకంఠధ్వని ఆజానులంబిత దీర్ఘబాహువులు ముఖమున విభూతిపట్టెపైన యెఱ్ఱగంధము మెడలో రుద్రాక్షమాలలు గల యాకార ముతో బహుమనుజశిరఃఖండనవిరాజితంబగు ఖడ్గంబు కేల నంది భైరవనామమును జపియించుచు నొకనూరుకుక్కుర ములు రక్తగంధాక్షతపుష్పమాలాలంకృతంబై భౌభౌయను భయంకరార్భటులచే నాతని పార్శ్వంబుల నడచుచుండ భైర వాలయంబున కరుదెంచె. పరిచారకు లొొదిగి వ్యాఘ్రాసనాదు లమర్చియుండిరి. ఖేండుఁడందుఁ గూర్చొని ప్రతాపభైరవ కాలభైరవ క్రూరభైరవ రురుభైరవ చండభైరవ లయభైరవ

కపాలభైరవ సృగాలభైరవాదులం బిలచి "భైరవులారా! మనకఠోరభైరవుఁడు నిర్యాణమైనందుకుఁ జింతిల్లుచున్నాను. కపాలభైరవుఁడు తప్పించుకొని వచ్చినందుకు సంతసించుచున్నాను. కాలభైరవునికి దక్షిణహస్త ఖండింపఁబడినది. యీకార్యములొనర్చి నాకు ప్రబలశత్రువైన యాదురాత్ముని సంహరించుటకు నాచేఁబంపఁబడిన ప్రత్యంగిరాశక్తి యాతెని నేవిధమునన్నైన సాధింపలేక యాతనిసుదర్శనాస్త్రాగ్నికి భయపడి పరాభవముఁ జెందివచ్చియున్నది. ఎన్నఁడుగాని నాప్రయుక్తాస్త్రము లిట్లు వృథయగుట నే నెఱుంగ నాతఁడు లోకపాల సరోవరంబునందున్న నామాతులుఁడైన స్థూలజంఘాసురుని నాతనిమిత్రులను మువ్వురిని సంహరించి యాసరోవంబున స్నానం బాచరించెనఁట నివి మహాప్రభావశక్తులని మనప్రత్యంగిర వందిజనంబులవలె నాయధమునిఁ బొగడుచున్నది. కపాలభైరవా! నన్ను జంపెదనని ప్రతిజ్ఞ చేసినవాఁ డాబాలుఁడేనా" యనిన "దేవా! యాబాలుఁడు గాదని నాకుఁ దోఁచుచున్నది. ప్రత్యంగిరాశక్తికిఁ దెలియనిదేమున్నది? ఆమెయు నాప్రతిజ్ఞాపురుషుం డగుపడలేదనియుఁ గఠోరభైరవుని సంహరించినపగకై యాబాలునిపై దాముపంపితిరనియు నాప్రతిజ్ఞాపురుషుండెందు నగపడలేదనియు మనవిచేసికొనుచున్నది" యనిన "కపాలభైరవా! పరుషములాడువాఁడు ప్రతాపవంతుఁడగునా? వాఁ డెవఁడో వృథాలాపుఁడు కానిమ్ము. ఆమనుజుఁడేమని ప్రతిజ్ఞఁ జేసినాఁడో మరలఁ జెప్పు" మనిన చిత్తమని,

"శా. రుద్రుం డడ్డమువచ్చిన న్నలసరోరుడ్గర్భుఁ డేతెంచిన౯
భూభ్రద్భేన్నముఖకాండమెల్ల ప్రళయాంభోరాశిలో గ్రుంకిన౯

సుద్రాఘిష్టకఠోరపాశముఖయుక్షుద్రాస్త్రిపాతంబునన్
నాద్రోహిన్ దలద్రెవ్వనేతు రణరంగంబందు భూతాధిపా"

"ఓరీ మానవద్రోహీ! ఖేండాభైరవా! నిన్ను నాబాణ జ్వాలలచే నేఁటికి ముప్పదియవదినంబున నిడే యశ్వత్థవృక్షంబునకు బలియిచ్చెద. యిట్లొనర్పనైతినేని మాతృద్రోహిగతికి బంచమహాపాతకంబు లొనర్చువారిగతికిఁ బోవువాఁడ. మఱియు నాయస్త్రశస్త్రంబులలోఁ జితి జేర్చుకొని యగ్నికాహార మయ్యెద"నని ప్రతిజ్ఞ చేసియున్నవాఁడఁట యని చెప్పినంతనే ఖేండాభైరవుఁ డట్టెలేచి హుంకరించి భుజాస్ఫాలన మాచరించి పటపటమని పండ్లుగీటి నేత్రకోశంబులం దగ్నికణంబులు వెలువడ "యోరీ మానవాధమా! హిందూఖండాఖండులరంద ఱరుదెంచి నాప్రచండ కోదండవిముక్తకాండములకు ఖండీభూతులైరి. ఇఁక నీవొక్కఁడవా నాప్రతాపాగ్నికి శలభమవు? భైరవులారా! నాప్రతిజ్ఞ వినుఁడు. ఈమానవాధముఁడుండనీ వీఁడా నాయెదుట నిలచువాఁడు..

శా. చండాంశుప్రముఖాదు లడ్డపడినన్ జక్రాంశుజాలంబులు
ద్దండంబై హరిబంపినన్ యముఁడె తా స్తంభించినన్ విద్విష
త్కాండంబంతయునాపయిన్ దొడరినన్ ఖండింపకున్నంతనన్
ఖేండాభైరవుడంచు బిల్వకుడు మీభృత్యుండుగాఁ జూడుఁడీ.

భైరవులారా! యాదురాత్ముని ప్రతిజ్ఞావాక్యంబు లిఁక మూఁడుదినంబులలోఁ జరగవలెఁగదా కానిమ్ము. నేఁడే గదా బేతాళుని నభిచారహోమమున మారణం బొందింపవలయు! కానిమ్ము. నేఁడు సోమవారముగదా స్త్రీబలిగావలయు. నేఁడు పదునైదుఘడియల కాభువనభూషణి యేమి! యని పట్టి

కంగాంచి భువనమోహిని యను స్త్రీని బలియొసంగి యావల బేతాళమారణహోమమున కుపక్రమించెద. కపాలభైరవా! సర్వాయుధసమన్వితంబుగా మనసైన్యము నాయత్తపఱచి వేయిమంది నాక్షేమోపరి పర్వతాగ్రంబులపై యేమఱకుం డున ట్లాజ్ఞ నొసంగుము. చార్వాకులను గాపాలికులను మున్నూరశ్వములతో సర్వాయుధసన్నద్ధులై యాశ్రమంబు చుట్టుం గాపుండ నియమింపుము. మహారథికులైన భైరవుల వేయిమంది నీదేవాలయసమీపమందు రథంబు లఱువదియును గార్దభంబులగట్టి ఘూకధ్వజంబు లెత్తించి మనుజకపాలము లలంకరించి శవధూమమున ధూపము వేయించి రథములకుఁ బైభాగమందు వరాహచర్మములచే నలంకరించి యాయత్త పఱచి రథికులై రక్షించుచుండునట్లు నియమింపుము. షట్చక్ర రథంబున కావిధియే యలంకరించి సర్వాయుధసమన్విత మొనర్చి, నాసమీపమున సారథిసమేతముగా నుంపుము. వేయి మంది బలపరాక్రమసంపన్నులైన భైరగణముల నాచుట్టు నుండునట్లు తెలియఁజేయుము. మనకుక్కురములు నూటికి, గొలుసులూడ్చి స్వేచ్ఛగా చరించున ట్లొనర్పుము. నీవును శిరోచితశిరస్త్రాణాదుల ధరించి సమస్తాయుధధారివై యొక్క రథంబునందారోహించి నాసమీపమందు నుండుమనిన "చిత్తము నేను దమచెంతనుండిన యాశ్రమాంతర్బహిస్సైన్యంబును నడుపువారెవ్వరు? కఠోరభైరవుఁడుండి నోచనైతి" మనిన "అవును నీవిటనుండకుము. సైన్యంబుల నరయుచు నప్రమత్తుఁడవై యుండుము కానిమ్ము. ఆదురాత్ముఁ డొక్కఁడు నన్నే మొనరించునో చూచెద" ననిన సర్వమును సమకూర్చి కఠోర భైరవుఁడు దివ్యరథంబునకు రెండశ్వంబులంగట్టి మువ్వది

కోదండములు గదాఖడ్గముసలాదిసాధనము లనేకములును శర
ములు వేనవేలును రథమున బదిలపఱచుకొని సింహపతాకం
బెత్తి పరిశుభ్రవస్త్రములు ధరించి కట్టాయితంబై యాత్ర
మంబునకు లోపలనున్న యాశ్వికగణంబుచెంత నిలిచియుండె.
పణవనిస్సాణాదిరణోచిత భైరవారావంబులు చెలరేఁగి ఛేండా
భైరవుండు భైరదేవు నర్చించుచుండె. అంత ప్రళయభైర
వారావంబునుంబోలు నొకశంఖారావం బేతెంచె. ధనుష్టం
కారము శ్రవణపుటములు ఛేదిల్లినట్లయ్యెనది విని ఛేండాభైర
వుఁడు పూజచాలించి యీధ్వనిబుట్టుట కేమిహేతువోయని
యోచించుచుండ నొకచారాశ్వికభటుఁడు పరుగుపరుగునవచ్చి
“దేవా! యెవ్వరో యిద్దఱుమానవులు రెండుగుఱ్ఱములపై
నెక్కి యాత్రమోపరిపర్వతాగ్రవాసులగు మనరాక్షసుల నద
లించుచున్నారు. అందులో నొకఁడు తనదేహకాంతుల
దిక్కులు నించుచున్నాఁడు. క్రోధనిరీక్షణములచే మనసైన్య
మును భస్మముచేయులాగున గాన్పించుచున్నాఁడు. తమకెఱుఁ
గించుటకై చనుదెంచితి” ననిన “భటాగ్రణీ! మనసైన్య
మును నిర్భయముగాఁ బోరుచుండుమని చెప్పుము. సైన్యముల
నారయుచుండునట్లు కపాలభైరవునితో నెచ్చరింపుము ఇరు
వుర కింతగావలయునా? నాతోఁ జెప్పవలయునా? పొందు. దేవ
తలకైనను భయంకరులగు మిమ్మానరాధముఁ డొకఁ డేమి
చేయగనవాఁడు? పొమ్ము. పొమ్ము. నేనిదే భైరవారాధన
మొనర్చి నేఁడు సోమవారమగుటచే స్త్రీబలినొసంగి వచ్చెద.
బేతాళుని మారణహోమము రేపొనరింపనగును మించినదే”
మని వానింబంపి బలియొసంగుటకు మధ్యాహ్నకాలము
నెదురుచూచుచుండె నట యశ్వంబులపై చనుదెంచి యున్న

వారు మనవసుంధర శ్రీపాదుఁడే. శ్రీపాదుఁ డొకగుఱ్ఱంబునం
దారోహించి కృపాణపాణియైన తానొకప్రక్క సన్నద్ధుండై
నిలిచిన వసుంధరుం దాతనింగాంచి "బ్రాహ్మణోత్తమా!
నీవూరకుండుము. నన్నుజూచుచు నాశాశీర్వచన మొసఁగు
చుండుము. నీవును సైన్యములోఁ బ్రవేశించితివేని నిన్ను రక్షిం
చుట యొకపనియు, సైన్యముతోఁ బోరుట మఱియొకపనియు
గలిగి భారమైయుండు" నని చెప్పి యాతని దూరమునం
దొకచో బయలునందు దిరుగాడఁజేసి తాను ధనుఃఖడ్గాదుల
సవరించుకొని బాణవేగమున హయంబు జనుదేర ఆశ్రమో
పరి పరిరక్షిత చార్వాకులమించి లోపల దూరంబ్రవేశించు
చుండ శ్రీపాదున కందందు దిరుగాడ నిష్టములేక తానును
సైంధవంబుతోడ వసుంధరుననుసరించె. చార్వాకు వేనూఱు
మంది యడ్డమునిలిచి నిలునిలుఁడని యదల్చి యనేకాస్త్రశస్త్ర
ములు ప్రయోగించిరి. యవియన్నియుఁ జిత్రగతులచేఁ
దప్పించుకొని శ్రీపాదు నొకకంట నరయుచు కరవాలముం
ద్రిప్పుచు గుఱ్ఱమునటునిటు దుమికించుచు శత్రుప్రయుక్త
బాణములు నివారించుచుండ నాసైన్యం బనర్గళప్రతాపముచే
నప్పడప్పటికి బాణములు వైచువారును ఖడ్గములచే విసరు
వారును శూలముచేఁ బొడుచువారును ముసలములచే మొత్తు
వారును నై విజృంభించి యొక్కమ్మడిం జుట్టుముట్టిరి. వసుం
ధరుఁ డాజ్యధారాప్రవర్ధితహుతాశనునివలె చెలరేఁగి భయం
కరమగు శంఖారావముచే నభోభాగం బగలించి యురుకరము
లందుర గరవారములం ద్రిప్పిత్రిప్పి హయంబులను గుప్పించి
సైన్యంబులలో దుమికించుచు శిరంబులం దరిగి కరంబుల
ఖండించి నడుములు సడలించి ప్రేవులంబయలుపఱచి ముసల

ముల భిందిపాలముల పరశువుల ముద్గరముల బాణములను జూర్ణంబునొందించె. నీసంరంభమునకుం జెలరేఁగి మన శ్రీపాదునిహయము సకిలించుచు సైన్యంబునందు దుమికి పాద తాడనములతోడను బదఘట్టనలతోడను విజృంభించి యేబది మంది భటులనుజంపె. శ్రీపాదుఁ డావేగమునకుఁ దట్టుకొన లేకపోయె. గుఱ్ఱముపై నడ్డముగాఁబరుండి "వసుంధరా! చచ్చితిఁ జచ్చితి" నని యఱచె. అధ్వనివిని యొకప్రవేటున శ్రీపాదుని చెంతకువచ్చి భయపడవలదని యాయశ్వవేగమును నివారించి నాతని తన వెనుకప్రక్కఁగూర్చుండ నియోగించి శ్రీపాదుఁ డధిష్ఠించియుండిన గుఱ్ఱంబు నూరకవదలె నదియు సైన్యబునందు దుముకుచు గుప్పించుచు విజృంభించుచు సైన్యంబును జంపుచుండె. వసుంధరుండాగ్రహోదగ్రుఁడై సింహనాదం బొనరించి తనకరవాలయుగళధారిచే మున్నూటఇరువది చార్వాకరాక్షసుల భూతలగతులం జేసి మరల శంఖారవం బాచరించి యాశ్రమంబులోపలం బ్రవేశించుట కుపక్రమించునంతలో నేనూరుచార్వాకభటులును మున్నూరు కాపాలికు లశ్వంబులపై నెక్కియు నడ్డగించిరి. అశ్వముల హేష లంబరముం బగుల్చుచుండె. పదఘట్టనలచే భూమి రజము వియన్మార్గ మావరించి యకాలసంధ్యారాగముం దోఁపించుచుండె. ఖడ్గదీధితులు కన్నులను మిఱుమిట్లు గొలుపుచుండె. వసుంధరునకు మూఁడుప్రక్కలం జుట్టుముట్టి వచ్చుచుండిరి. శ్రీపాదుని గుఱ్ఱము వెనుకప్రక్కల సకిలించుచు నెగురుచు దుముకుచు వచ్చుచుండె. వసుంధరుండా సైన్యమును యాశ్వికగణముం గాంచి చెలరేఁగి నేత్రంబుల నగ్నికణంబులు గ్రక్కుచుండ ఖడ్గంబుఝళిపించుచుఁ దత్క్షత్రయో

చిత్రధ్వజాదుల సవరించియున్న రథంబుపై నొక్క పురుషుండు వసుంధరాశ్వము చెంతకుం జనుదెంచుచుండె నదిగాంచి వసుంధరుం డాగ్రహోదగ్రుండై తనయశ్వం బాతనిపై దుముకుట కుపక్రమింప నచ్చటనుండియే సారథికుఁడు చేతులుజోడించుకొని "మహాపురుషా! నీనిమిత్త మీరథం బాయత్తపరచుకొని వచ్చియున్నవాఁడ. నేను వీరసేనుండ. మీకిదే నమస్కరించుచున్నాఁడ కటాక్షింపుఁ" డనియె అపుడు వసుంధరునకుగల్గిన సంతోషమున మేరయే లేదు. "ఔరా వీరసేనా! నీవు నత్యాదివిసుమా రారమ్ము. నీయశ్వంబులవిప్పి మిదేనాయుశ్వములు రెండును రథంబునకుంగట్టుము. నీవు సారథ్యము వహింతువా" యనిన "దేవా! నీకు రథసారథ్య మొనరింపవలయు ననియేగదా నాప్రార్థన" అనుచుండె. శ్రీపాద వసుంధరు లశ్వమునుండి దిగిరి శ్రీపాదునకు పెదవులాగి మాటలాడుటకే యత్నములేనిచందమున నుండె. వీరసేనుఁ డాగుఱ్ఱముల రెంటిని దనరథంబున బంధించి సారథ్యస్థాన మలంకరించె. వసుంధరుఁడు శ్రీపాదునిఁ దట్టుచు నిఁక నీబాధ నాకుఁ దొలంగినది రమ్మని యాతనిఁ దొలుత రథంబెక్కించి తాను రథారోహణం బాచరించె. ధనుస్సు కేలనంది నరనారాయణులను ధ్యానించినమాత్రనే యక్షయశరధులు సన్నిహితములయ్యె. నా కవదొనల వీఁపున బిగించుకొని కట్టాయితంబై నిలచి సారసారించి మరల శంఖంబొత్తె. శ్రీపాదుని ధ్వజదండమునకు మఱుగున కూర్చుండ నియోగింపఁబడియె. ఇట్లు సన్నద్ధుండైన వసుంధరుఁడు బాలభానునివలెఁ బ్రకాశించుచుండె నిది యంతయు నిమిషమాత్రమున జరిగె. వీరసేనుఁడు నమస్కరించి "మహాత్మా! పదునైదుఘడియలకులోగా మీ రాశ

మును బ్రవేశించి ఘంటాభైరవునిఁ దొడరవలయు. లేకున్న నేఁడు సోమవారమగుటచేఁ బదునైదుఘడియలకు భువనమోహినిం బలియిత్తురు. ఆవల బేతాళ మారణహోమమున కుపక్రమింతు రదే ప్రయత్నముతో ఘంటాభైరవుఁ డున్నవాఁడు. త్వరపడవలయు నిపుడు పదిగడియల ప్రొద్దయియున్నది. ఇఁక నైదుగడియలలో యీ యాశ్వికగణంబులం జయించి యాశ్రమములోఁ బ్రవేశించి యాశ్రమరక్షకులైన రాక్షసుల నఱువదిమంది. రథికులను దాఁటి భైరవాలయము చెంత కరుగవలయు'' ననిన మాత్రముననే వసుంధరునకు రౌద్రంబు రోమకూపములఁ బొంగ లెగసినట్టుండె. ''వీరసేనా! నీసారథ్యనైపుణ్యము నేఁడుగదా చూపవలయు'' ననియె. ''దేవా! నీచెంతనున్న నాకేమియు భయములేదు. ప్రత్యంగిరాశక్తి నీప్రతాపమంతయు ఘంటాభైరవునితోఁ దెల్పుచుండ వినియున్నాను.'' అనుచున్నంతనే యీరథం బీతని కెందుండి వచ్చెనని యాశ్వికసైన్యం బాశ్చర్యపడుచుండిరి. కపాలభైరవుఁడు క్షత్రియోచితవీరసేనాకృతిచే సారథియై యున్నందున తమవాఁడని గమనింపలేకపోయిరి. వసుంధరుం డధిజ్యశరాసనుండై యుగాంతకాలరుద్రునిగతిఁ దేరిచూడరాకుండె. వీరసేనుఁ డాతని మనోరథానువృత్తి రథము గడుపుచుండ కోదండముక్తసాయకము లఖండంబై రివ్వురివ్వున భైరవసైన్యంబుపైఁ బాఱుచుండె. నాయాశ్వికులును గాల్బలమును చెలరేఁగి ఖడ్గములు విసరువారును శూలములు గ్రుచ్చువారునునై వర్షధారలవలె వసుంధరునిపై ననేకాయుధంబులు ప్రయోగించి సింహనాదమొనర్చుచు నురువడించుచుండిరి. పటుతరబాణజ్వాలాభీలముచే వసుంధరుఁడు శత్రుప్రయుక్తా

యుధముల తుత్తుమురొనర్చి యఖండచండకాండముల గుప్పించుచు కొన్నిగుఱ్ఱముల శిరము లెగురమీటె. కొన్ని హయముల మోకాళ్లు విఱుగగొట్టె. కొన్ని సైంధవముల నడుములం ద్రెంచె. యాశ్వికుల నడుములు విఱిచె, శిరములు బగులగొట్టె శాహృవుల దహించె. చరణముల ఖండించె. నిట్లు హుంకరించి కోదండజ్యానినాదము నా గుహాంతరముల మ్రోయించుచును గల్పాంతకాలశూలిపోలిక మొనలం దూరుచుఁ బాయ లొనర్చుచు, గుప్పసేయుచు నొక్కొక్కపరి సవ్యసాచివలె భయంకరంబుగా ధనుర్ధరుండై పోరాడుచు, నొక్కొక్కపరి గాంగేయునివడువున నద్రులనైనం దూటాడించునంతటి ముష్టి జూపుచు, నొక్కొక్కపరి శ్రీరామచంద్రునిభాతి దూరాపథ ప్రయోగం బొనర్చుచు, నొక్కొక్కపరి సౌమిత్రి తెఱఁగున శరకరలాఘవము నొనర్చుచుఁ బ్రబలతరధనుర్విద్యాపాండిత్యంబు మెఱయ వేయిమంది చార్వాకకాపాలికుల నంతకాలయంబున కనిపి మండలీకృతకోదండుండై,

మ. పటుహుంకారకఠోరనాదవిసరబ్రహ్మాండభాండాంతర
స్ఫుటబాణాగ్నిఘటావికుంఠితసమిద్వ్యాభాగదిక్కుడ్యుఁడై
చటులాశ్వికగణంబు ద్రుంచెను ధనుర్జ్యారావతల్లాఘవో
ద్ఘటనం బెన్నుచునుండి రాసురవరుల్ కౌబేరయానంబులన్.

ఇట్లాశ్వికకాల్బలంబులం దెగటార్చిన నాయరదంబున కడ్డుపడువారు లేకుండుటచే యాశ్రమములోనికిం బ్రవేశించె నపుడు పదుమూఁడవనాడికయందు మార్తాండరథంబు ప్రయాణ మాచరించుచుండె నదిగాంచి వసుంధరున కాతురత కలిగె. "వీరసేనా! త్వరపడుము. రథం బాబైరవాశ్రమము

లోనికిం దోలు" మని యదలించుచుండ యాశ్రమరక్షకులఱువదిరథంబులవారును, యేనూఱు కాల్బలంబులు నడ్డగింప వసుంధరుఁడు వారితోఁ బోరుచుండె. నీవృత్తాంతము చారులచే దెలిసి భేండాభైరవుఁ డాగ్రహోదగ్రుఁడై పదునైదు ఘడియలరాక కెదురుచూచుచు బ్రొద్దుగాంచుచు దేహమును విదళించుచు భువనమోహినిం దేతెమ్మని చారులనంపె. వారక్కాంతను రక్తపుష్పవస్త్రగంధాక్షతలతో నలంకరించి యీడ్చుకొని వచ్చుచుండిరి. భువనమోహినికి స్మృతిదప్పె. మరలమరల రాక్షసాంగన లుద్బోధింప స్మృతిగల్గుచు దిక్కులం గాంచుచు రణభేరీనాదములు విని "యేమహాత్ములో యీదురాత్ములపై యుద్ధమొనరింప వచ్చుచున్నారు. వీరిం జంపి నన్ను రక్షింపరాదా! అయ్యో! యింకొక్క ఘడియకు నాయంతమవుచున్నదే దేవీ! భారతీ! నీవైనా వచ్చి రక్షింపరాదా! తండ్రీ! నీకేల దయగల్గదు! బ్రాహ్మణోత్తములారా! మీరైనఁ జనుదెంచి నన్నిటనుండి దప్పింపరాదా" యనుచు నేడ్చుచుఁ బ్రాణేశ్వరా యనుచుండ భైరవవిగ్రహముచెంత భేండాభైరవుని సమీపమున నిలువఁబెట్టిరి. యమధర్మరాజువలె నాభైరవుఁ డామెకుం దోఁచె. ప్రపంచభ్రాంతివదలె. ప్రాణముపై నిరాశఁజెందె. స్థాణువువలె స్మృతిలేక యచ్చటనే నిలువఁబడియుండె. భేండాభైరవుఁడా కాలనిరీక్షణంబుఁ జేయుచుండె. వసుంధరుం డాశ్రమరక్షక రాక్షసులతోఁ బోరాడి పోరాడి యాసైన్యము తరుగకుండుట కాశ్చర్యము వహించి పటపట పండ్లుగీటి శంఖంబొత్తి నారాయణాస్త్రము బ్రయోగించె నది యనర్గళవేగముచే జ్వాల లంబరమున కెగయ దిక్కుల నావరించుచు,

మ. శిరముల్ ద్రెంచె కరంబులం గెడపె విచ్ఛిన్నంబుగావించెబల్
చరణంబుల్ నరముల్ నడల్చె శిరముల్ చక్కాడె ఖడ్గంబులన్
దరిగెన్ శూలములం బగిల్చె దనువుల్ దప్పించె బాణాదులన్
శరఘోరాగ్ని పటుస్ఫులింగ గరిమన్ సైన్యంబు దైన్యంబునన్

పదునాల్గు గడియలయ్యె. నలువదిరథంబుల నారురువ డించి వసుంధరుపై దివ్యాస్త్రశస్త్రంబులు ప్రయోగించిరి. తెలిపి లేకుండె. వసుంధరుని యాతురత జెప్ప శక్యముకాదు. ముఖముపై క్రోధానలజ్వాలలు నిగుడుచుండె. పరివేషయుక్త ప్రచండమార్తాండునిపగిది వలయాకారకోదండంబునంది యస్త్రంబులం బఱపుచు,

సీ. ఖరదూషణ త్రిశిరాచరమదోద్రేక
నిర్భగ్నుఁడౌ రామభద్రురీతి
కాలకేయాది రాక్షసవంశనిర్మూల
పటుభుజోద్దండుఁడౌ పార్థురీతి
తారకశూరపద్మప్రతాపధ్వంస
భీషణుండైన షణ్ముఖునిరీతి
నక్షయాదిక రాక్షసక్షయవాలాగ్ని
భస్మితదశకంఠభవనురీతి

గీ. నొక్కఁడై భూతాగ్ని దిక్కుదిక్కు
లెక్కప్రళయోగ్ర రౌద్రపాలేక్షణాధి
కారహుంకారుఁడై భేండబైరవాశ్ర
మంబు విధ్వంస మొనరించె నద్భుతముగ.

పదునాలుగున్నరగడియ యయ్యె నలువది రథికులనంతంబు నొందించి తన్నడ్డగించువారు లేక లోపలం బోయిపోయి,

సీ. మనుజకపాల తోరణరాజియుక్తంబు
　　తద్రక్తసిక్తవస్త్రధ్వజంబు
తద్వపాప్లీహాభుగ్ధ్వానవీహుంకార
　　దంతఘుర్ఘణదశాశాంతరంబు
తత్కీకసాంతరద్వారసూత్రాబద్ధ
　　హారభూషితఘోరభైరవంబు
తత్పలలాస్వాదదారుణారవగృధ్ర
　　కాకజంబుకమహోలూకముఖంబు

గీ. ఖేండభైరవదుర్ఘోరమండలాగ్ర
ధారదర్పితతేజఃప్రధానగర్భ
మంటపాంతరవిగ్రహామర్త్యనిలయ
మైన హింసాలయము గాంచె నతఁడు వడిగ.

చూచి యసహ్యమై రోషంబు దోలుకాడ లోపలం బ్రవేశించుచుండె. పదునైదుగడియ లగుచువచ్చె. ఖేండాభైరవుఁడు చెలరేఁగి "కాంతా! రమ్ము రమ్ము నిన్ను భైరవ దేవునకు బలియొసఁగెద. నీవు పునరావర్తిరహిత శాశ్వత భైరవలోకనివాసం బొందెదవు ర"మ్మని చేయిపట్టి యీడ్చె నాకాంతయు హా యని కేకవేసి గట్టిగా నొరత్తి,

గీ. అఖిలరిపుసమవర్తి వేదాంతవర్తి
నిజయశశ్శ్వేతదిక్పూర్తి త్యాజమహార్తి
భానువిస్ఫూర్తి శ్రీకళాభానుమూర్తి
రావె రక్షింపవే వేగ ప్రాణమీవె.

అని యఱచె. పదునైదుగడియలయ్యె భైరవుఁడా కాంతను బట్టి లాగి "తరుణీ! నశ్వరంబైన యీప్రపంచ

సౌఖ్యముల నేమిప్రయోజనము? శాశ్వతలోకంబు నొందెద" నని చెప్పుచు భైరవవిగ్రహమున కెదుట నిలువఁబెట్టి వామ కరముచే గొప్పుబట్టుకొని వంచి "శ్రీ భైరవార్పణమస్తు" అని కత్తివేయ గమకించునంతలో యశనిపాతమో యను నంతటి దెబ్బ యాతని దక్షిణభుజంబుపై బడియె. నాపెట్టుచే భుజంబు విఱిగినను శంకచే భైరవుఁడు ఖడ్గమును జారవిడిచి నాతరుణికొప్పు వదలె. వసుంధరుఁ డాకాంతను తనచెంతకుం దీసి వామకరంబుచేఁ గౌఁగిలి నిఱుకించుకొనియె. భైరవుఁ డట్టె వెనుకలంజూడ మధ్యందినప్రచండకిరణప్రతప్త భూమండలుండగు మార్తాండునివలె దేఱిచూడరాక ప్రళయరుద్రా కారమున నున్న వసుంధరుంగాంచి ధైర్యం బవలంబించి "యోరీబాలకా! నివేనా నన్ను సంహరించెదనని బేతాళు నితో వృథాశపథం బొనర్చిన నరాధముఁడవు విడువుము. ఈ కాంతను విడువుము. భైరవదేవునకు బలియొసఁగుచున్న కాంతఁ దప్పించినందుకు నిఖిలభూతాధీశ్వరుండైన బేతాళుని గతి యేమైయున్నదో తెలిసికొనియున్నావా? త్రిజగద్భయం కరుండగు శ్రేండాభైరవుని కపకృతి గావించినవా రెవ్వరైనను నాయస్త్రములచే నామంత్రప్రయోగములచే నామాయచే నాభుజబలంబుచే భూమిపయిుం బ్రతికినవారు గలరా? బాలకా! యుక్తము యోచించి యీ కాంతను విడచిపెట్టుము. విడువు" మని పిడికిలిచే వసుంధరునిఁ బొడిచి యాతని గౌఁగిట నణఁగి యున్న కాంతను రెట్టబట్టి లాగుటచే నావసుంధరునకు రౌద్ర మున బ్రజ్ఞ లేక హుంకరించి విజృంభించి భైరవునివక్షంబుపై గ్రుద్ది యతని యా గమకమునుండి దప్పించి దురాత్మా! యింకను నీపోగరణఁగదా" యని భైరవరూపకంబగు శిలా

విగ్రహమునుబట్టి యాటాడించి పెకలించి యెత్తి గిరగిరం ద్రిప్పి విసరి, యాభేండాభైరవుని వక్షంబుపై వైచె. నా దెబ్బచే నాతండు మూర్ఛిల్లె. విగ్రహశిల యాతని కఠినవక్షంబునుదగిలి నూఱుశకలంబులై ధరంబడియె. భైరవుడు మూర్ఛదేఱునంతలో భువనమోహిని నత్తఱిని యొక్కలాఘవంబున వసుంధరుఁడు రథంబుపై కరిగి శ్రీపాదునిచెంతఁ గూర్చుండఁ బెట్టె నపు డాకాంతకు బ్రజ్ఞగలిగి కన్నులు దెఱచి యాతనిం గాంచి నన్నాయరణ్యమునఁ జోరులబారినుండి తప్పించి రక్షించిన మహానుభావుఁడే యిచటి కరుదెంచి రక్షించియున్నవాడని మితిమీఱిన సంతోషముచే నాతనికి నమస్కరించుచు శ్రీపాదున కనతిదూరంబునందుండె. వసుంధరుఁడు ధనువాదిటంకార మొనర్చి గిరికంధరములు ఘూర్ణిల్లునట్లు శంఖారవం బొనర్చి నిలువంబడి "వీరసేనా! సమయంబున కేతెంచి సారథ్య మొనరించి సత్యవాక్యపరిపాలన మొనర్చిన నీసద్గుణముల కెంతయు సంతసించి నీసౌఖ్యయశంబులం గోరుచుండెద" ననియె.

వీర:— దేవా! జగదేకప్రతాపతేజోదుర్నిరీక్షుఁడవగు నీకు రథ మెందులకు? సారథ్య మెందులకు? బాణము లేల? నేఁడు నీకున్న రౌద్రాకృతిం గాంచిన దేవతలైనఁ బాఱిపోవకుందురే! ఈదురాత్ముఁడు మూర్ఛదేఱి రథారోహణుడై యుద్ధమునకుఁ జనుదెంచును. కుక్కురంబులు నూఱును మీరభసమునకే బర్వెత్తిపోయినవి. యిఁక నైదునూర్లమంది భైరవానుచరులున్నవారు వారి భేండాభైరవుని యంగరక్షకులు. మహామాయోపాయములు గలవారు. వారును కయ్యమునకు జనుదెంతురు. బహుమానవాహార

శిలావిగ్రహామును నిపాత మొనర్చితిరి. చార్వాకుల కాపాలికుల భైరవానుచరుల యిరువదియైదునూఱుమందిని సంహారించితిరి. మూఁడునూఱు లక్ష్యముల నిర్మూలం బొనర్చితిరి. అఱువదిరథముల ధ్వంసముఁ జేసితిరి. ఈభయిరవుఁడు బహుమంత్రవేత్త. అనేక మాయోపాయములందు నేర్పరి గాన బహుజాగరూకతతో నాతనితో సంగరం బొనరింపవలయు నీతని ప్రతాపమును, అస్త్రవిద్యయును మీరే చూతురు లెండు.

వసుం:—వీరసేనా! యిఁక పదిదినములైనను యుద్ధమొనర్చెద. యీకాంతను వానిబారినుండి నీసహాయమువలన భగవంతుఁడు తప్పించియున్నవాఁడు నీవు యోచింపకుము ఇతఁడు మాయావంతుఁడే కానిమ్ము. మంత్రవేత్తయే కానిమ్ము ప్రతాపవంతుఁడే కానిమ్ము. నాఁడు బేతాళుని చెంతఁ జేసిన ప్రతిజ్ఞావాక్యములు మరల జెప్పుచున్నాను. వినుము.

శా. రుద్రుం డడ్డమువచ్చిన న్మతి సరోరుడ్గర్భుఁ డేతెంచినన్
భూద్రత్నోముఖకాండ మెల్ల ప్రళయాంభోరాశిలోఁగ్రుంకినన్
సుద్రాఘీష్టక ఠోర ఖడ్గముఖయుక్సుద్రాస్త్రఘాతంబుచే
యీద్రోహిందల ద్రెంపకున్న నిపుడేహంబునుం బల్కెన్ జూడుమా

అని భుజాస్ఫాలన మాచరించుచున్న వసుంధరుంజూచి వీరసేనుఁ డట్టెలేచి చేతులు జోడించుకొని "మహాపురుషా! నీవేనా యీదురాత్ముని సంహారించెదనని ప్రతిజ్ఞ జేసియున్నవాఁడవు. నాఁడు గుహాంతరమున నాకెఱింగింపక దాఁచితివే తండ్రీ! నీవు గాకున్న నింతటి యసాధ్యకార్య మొనర్చువా

రీకలికాలంబునం గలరే! జయా విజయీభవ. వసుంధరా! స్వస్తి'' యని నమస్కరించి కూర్చొనియె. ఖేండాభయిరవుం డును మూర్ఛదేఱి చూడ భయిరవవిగ్రహము శిథిలంబయి పడియుండె. రథారోహకుండై యాశ్రమోపరితలంబున నిలచి యున్న వసుంధరం గాంచి యాడుగఱచి నిజపరికరములచేఁ దనరథంబుం దెప్పించి యుద్ధంబునకై ధట్టించి నిలచె. నా యిరువురును రథంబులెక్కి బయలుప్రదేశములం దిరుగాడ నియమించుకొనిరి. ఇరువురు శంఖంబుల నొత్తిరి.

ఖేండా:—బాలకా! నీవంటిన రాధము లెందఱో నాపై చను దెంచి పలాయనులై యున్నవారు. నీవొకడవు. సైన్యము లేనివాఁడవు. బాలుఁడ వేమినిల్తువు? వలదు నాతో వైర మువలదు. నాప్రతాపము నీవెఱుంగవు. నాచే భయిరవ దేవునకు బలియొసంగుచున్న కాంతను మరల నిమ్ము. నన్ను శరణుచొరుము. నీప్రాణములను రక్షించెద.

వసుం:—మానవద్రోహీ! ఖేండాభయిరవా! నీప్రతాపంబే నెఱుంగనుగాని నాప్రతాపము నీవెఱుంగవో? నీభయిరవ రాజ్యామాత్యుఁడగు కఠోరభయిరవునిగతి యెఱుంగవా? మాశ్రీపాదు నెత్తుకొని వచ్చుచున్న మీకాలభయిరవుని భుజవికారముఁ జూచితివా? నీచేఁ బంపబడిన ప్రత్యంగిరా మాయాశక్తి పరాభవము దెలిసికొంటివా? నీచేఁ బరిపాలి తులై యాశ్రమంబు రక్షించుచున్న చార్వాక కాపాలిక భయిరవానుచరుల నాశనముం గంటివా? అవి యుండ నిమ్ము. నీచే బహుకాలారాధితంబయి బహుస్త్రీపురుషా హారముగొన్న దుష్టభయిరవశిల నీయెదుటనే యేమిగతిగా

నున్నదో యెన్నిశకలములైనదో కూర్చొని లెక్కింపుము. నిన్ను వధియించి నీచే వధింపఁబడిన స్త్రీపురుషుల యాత్మకు నీర క్తతర్పణముచే శాంతం బొనర్చెద. దురాత్మా! ద్రోహీ! నిన్ను త్వరగా సంహరింపఁగూడదు. నీ కాలుచేతులు ఘనపాశంబులం బంధించి మధ్యాహ్న మార్తాండమయూఖములచేఁ బరిత ప్తంబౌ విశాలశిలపై వెల్లకల పరుండఁబెట్టి ప్రత్యంగం బొక్కొక్కదినంబున ఖండించి లవణంబును మిరియపుపొడుమును గూరి కశాఘాతంబు లొనరించుచు పదియైదుదినములు బాధించి యటమీఁదట ఖండింపఁబడిన యంగములపై ప్రజ్వలించుచున్న యనలంబుచే కొంచెము కొంచెముగా గాల్చి నిన్ను దహింపఁ జేసెదనురా దురాత్మా! నీప్రతాపంబుఁ జెప్పి భయపెట్టెదవో చాలు యుద్ధమున కాయత్తపడుము.

భండా:—బాలుఁడవనియు యకృతాస్త్రుఁడవనియు నే నుపదేశించు వాక్యములు రోగికి పథ్యము రుచింపదన్నట్టున్నది గదా!

యని పర్వతాస్త్రము ప్రయోగించె నదియు జ్వాలాముఖీరూపకంబులై పటపటధ్వనులతో శిల లుప్పతిల్లుచు పిడుగులు వడువడువున వసుంధరనిపై వచ్చుచుండె. నదిగాంచి కులిశాస్త్రము సమంత్రకముగాఁ ప్రయోగించె. నదియును యశనిపాతరూపకంబులై ధగద్ధగాయమానంబగు విద్యుద్వల్లులచే కన్నులు మిఱుమిట్లు గొల్పుచుండ నరిగి భయిరవప్రయుక్తాస్త్రమును దహించె నంత భయిరవుఁ డొక్కమ్మడి బాలాస్త్రంబును బగశాస్త్రంబును శీతలాస్త్రంబును వారాహినామ

కంబును ద్రుమనామకంబును సమంత్రక సకీలకంబుగాఁ బ్రయోగించె నవియును,

చ. చిటచిటపావకధ్వనులచేఁ జెలరేఁగి నభోన్నతంబులై
నిటలతటంబులౌ నయననీరజముల్ జ్వలియింప దంతముల్
పటపట గీటికొంచు కరపట్టిసశూలకపాలపాణులై
వటుకముఖోగ్రశక్తులటు వర్ధిలివచ్చె నృపాలు ద్రుంపఁగన్.

ఆయస్త్రంబు లొక్కప్రక్క నగ్నిగురియుచుండె నొక ప్రక్క కాళరాత్రివలె నంధకారం బుప్పతిల్లఁ జేయుచుండె. నొకప్రక్క భూమ్యాకాశములు నిండఁ బొగలెగయించుచుండె. నొకప్రక్క పాశాంకుశాద్యాయుధములు వీచుచు గిర కంధరములవలె నోరుదెఱచి కోరలంజూపుచుఁ గ్రూరశక్తులరుదెంచుచుండె. నవన్నియు మహోద్దండముగాఁ జనుదెంచి వసుంధరుని రథంబావరించె. యెటుగన్నను మాయాశక్తులు వేనవే లగుపడుచుండె. వసుంధరుఁడు నిర్వ్యాకారుఁడై.

మ. తుతజాభేతుణుడై భుజస్ఫురితుఁడై జ్యానాదభిత్కాండుఁడై
ప్రతానర్గళభాసమానమగు క్రూరాస్త్రిం బరింబోసి శ్రీ
కృతవీర్యాత్మజమంత్రముంజదివి ఫట్ ఫేం దేవదత్తాదులన్
జతగావించి తదస్త్రిముస్వదలె సాక్షాత్కారరూపంబునన్

కార్తవీర్యనామక సుదర్శనాస్త్రంబు వసుంధరునిచే విడువంబడి బహుచక్రాకారంబులై సహస్రకరంబులై ప్రచండ మార్తాండమండలంబులై ఘుమఘుమధ్వానంబులై యాకాశంబున కెగసి మేఘాకారంబులై ఛటచ్ఛటవిస్ఫులింగములు గురియ జ్వలనాకారంబులై వైరప్రయుక్త మాయాశక్తి రూపకాస్త్రంబులపైఁ బాఱియుపసంహారంబు గావించి తనివి

నసక భైరవుని కేతనంబు దహించె. సారథింజంపె. గార్దభం బుల ప్రాణంబులం గొనియె. నదిగాంచి భైరవుం డహంకార మున కోదండంబుఁగైకొని భూమికి లంఘించి యనేకచండ కాండము లాయస్త్రముపై వదలె. నవి నిష్ఫలమయ్యె. కుంత ఛురికాదుల విసరెనవియును నిర్మూలంబులయ్యె. ననేకక్షుద్రా స్త్రంబులువదలె నవియును వృథయయ్యె. భైరవున కాగ్ర హంబు ద్విగుణీకరించె. పరశురామనామక భార్గవాస్త్రంబుఁ బ్రయోగించె నదియు ననేకపరశువులై బ్రాహ్మణాకార ములై గుబగుబశబ్దంబుచే నెటుగన్నం దిరుగుచు దోఁక చుక్కలవలె ఘోరున జనుదెంచి కృతవీర్యాస్త్రసంభూతమహా శక్తులంద్రుంచి వసుంధరునిపై నేతెంచుచుండ నమ్మహా త్ముండు శ్రీరామచంద్రుని ధ్యానించి యొక్క వాఁడిశరంబంది శ్రీరామబీజములం బొందుపఱచి ప్రయోగించి పరశురామా స్త్రంబు నుపసంహరించె. భైరవుఁడు యక్షరాక్షస పైశాచి కాస్త్రంబులు బ్రయోగించిన యవియన్నియు ఖండించి భైర వునిపై నేగుచున్న వసుంధరుండు శ్రీరామాస్త్ర ముపసంహ రించె నపుడు భైరవుఁడు నిర్వీర్యుఁడై "అహా! యిఁక బ్రయో జనములేదు. రావణాదిరాక్షసులను సంహరింప జనియించిన శ్రీరామాదులవలె నీమహాత్ముఁడు నన్ను వధించుటకే జని యించినట్లున్నది. ఈతని యస్త్రపాతముచేతను బ్రథమమునం దొనర్చిన భైరవవిగ్రహతాడనంబుచేతను నాసంధిబంధములు సడలి బలంబు క్షీణించుచున్నయది. నాయస్త్రంబులు నామా యాశక్తియు నిష్ఫలంబులై ప్రాణాపాయసమయంబై యున్నది. బేతాళు నిపుడుగాకున్న బ్రాణంబులుండనేని మఱి యొక్కతూరి మారణహోమం బొనరించెద. నాతనిపై నుంచి

యున్న శరభసాళ్వాస్త్రం బాతనినుండి మరల్చి, యీతనిపైఁ బ్రయోగించెద నంతటితో నీతనిపీడ వీడుచున్నది. బేతాళుని బంధములు విడిచినమాత్రముననే యతఁడు శుద్ధముక్తుఁ డగునా! యింక నెంతయో కావలయుఁగదా నంతవఱకు గాలు చేతులు లేనివానివలె నఘోరించుచు జీవావశిష్టుండై యుండ వలసినదే. యీతని సంహరించి యావల నభిచారపూర్వ కంబుగా మారణహోమంబానరించి బేతాళుని సంహరించెద" నని వీరశరభసాళ్వాస్త్రమును బేతాళునినుండి వదల్చి, వసుం ధరునిపై సమంత్రసబీజపల్లవంబుగా బ్రయోగించిన నాయస్త్ర ప్రభావముచే యంధకారము వొడమె. నాయంధకారమున నెటుగన్నను విద్యుచ్ఛక్తులు విజృంభించుచుండె. పిడుగులు పడునట్లు నిర్ఘోష ముప్పతిల్లె. నెటుగన్నను సింహాననంబులు గజముఖంబులు యెనిమిదిపాదంబులు పర్వతరూపకంబులగు శరభసాళ్వంబు లుప్పొంగి చనుదెంచుచుండె. ననేక బాణ ములు ముసలములు ఖడ్గములు పరశువులు శూలములు రివ్వు రివ్వున నొకదిశనుండి చనుదెంచుచుండె. నొకదిశనుండి హుంకారము లొనర్చుచుఁ గపాలహారములతోఁ గోఱలతో పదనగహ్వారంబులం దెఱచుకొని ప్రమథగణాకారంబులై ప్రచండజ్వాలనాకారంబులై శివశక్తు లేతెంచుచుండె. నొక దిక్కున బెటపెటయనియు, నొకప్రక్కన ధణధణయనియు నేదిశగన్నను వికారాకారములై చనుదెంచి వసుంధరునిరథం బావరించుకొనియె. నదిగాంచి యేమియుండోఁచక శ్రీపా దుఁడు భయంబంది యావికారంబును గనలేక కేరున కేక వైచి వసుంధరుం బట్టికొనియె. వీరసేనుఁడు సారథ్యం బొన రించుటకు దిక్కుదోఁచక నిర్విణ్ణుఁడై యుండె. భువన

మోహినిహృదయము తటతటలాడ గడగడ వణఁకి చివాలున లేచి వసుంధరుని చెంత కరుదెంచి నిలచె. వసుంధరుండదిగాంచి భయపడవలదని వారల బోధించి నరనారాయణుల ధ్యానించి నమస్కరించి వారిచే యొసంగఁబడిన అష్టముఖగండభేరుండ నృసింహాస్త్రంబును ధ్యానించి యొకబాణంబునం దామంత్రం బనుసంధించి పరమభక్తినియతుండై బీజపల్లవయుతంబుగాఁ బ్రయోగించె. నదియును సింహంబులై శరభంబులై వ్యాఘ్రం బులై భల్లూకములై గండభేరుండములై విద్యుల్లతలై యశని పాతంబులై శంఖచక్రగదాఖడ్గచతుర్భుజ పీతాంబరాలంకృతం బులగు ననేకవిష్ణుస్వరూపంబులై కరాళదంష్ట్రా లొప్పార యింద్రధ్వజోపమానంబులగు వాలంబులుదూఁగాడ రక్త ముఖంబులై యనేక హనుమంతులు చెలరేఁగ కాలదండ కాలపాశ కాలమృత్యు కరాళ కఠోర గదాద్యాయుధములు ధరించి యనేకయమధర్ములు విజృంభింపఁ బ్రళయపటపటా త్కారములు గజబృంహితములు గండభేరుండ భువనభయంకర రార్భటులు సింహగర్జనములు భూభాగ నభోభాగంబులు గ్రమ్మ, హుతాశనజ్వాల లెటుగన్న నెగయుచుండ బ్రహ్మాం డం బురలిపడుచున్నట్టు సాళ్వాస్త్రంబుపై బడి తదస్త్రసంభూత సర్వమాయాంధకారశక్తిజ్వాలల భస్మీభూతంబొనరించి భేండా భైరవునిపయిం గవిసె. నాయుత్పాతముజూడ శక్తిచాలక భైరవుఁడు తనప్రాణంబులపై నిరాశవహించి కన్నులు మోడ్చె. వసుంధరుం డాయస్త్రరాజము నుపసంహరించె. నంత సూర్యుం డస్తమింపఁ బోవుచుండె. భైరవుండు వెల వెలబోయె. నోరెండె. ధృతిదూలె. నేమియుఁదోఁచక యిట్లని దుఃఖించె.

"సీ. భైరవార్పితతపఃఫలసారసంభూత
భయదప్రభావంబు భస్మమయ్యె
విద్విషద్భేదనోద్యద్వీరభుజబలోన్నిద్ర
ప్రతాపంబు నీటఁ గలసె
బహుళమాయోద్రేకబ్రహ్మాండవిజిగీష
మంత్రప్రయోగముల్ మట్టుపడియె
మహదస్త్రశస్త్రసంపద్ధనుఃపాండిత్య
గర్వంబదెల్ల నేఁ డుర్విఁ గూలె
గీ. బాలుఁ డకృతాస్త్రుఁ డబలుఁ డేలీల గొలుచు
ననుచు నీతని నొకలెక్క గొనక గర్వ
వార్ధిలోఁ గ్రుంకి జడితి ప్రవాహరూప
కాలకర్మగతుల్ గాంచఁగలఁడె జగతి.

ఇంతటితో భేండాభైరవుఁడు హతమయ్యె ననుకొని మరల ధైర్యంబవలంబించి "ఛీ యెందులకీలీల భ్రమ జెందుచున్నాఁడ? వీరు లాపత్కాలముల ధైర్యము వదలనగునా? అస్త్రములు నిష్ఫలములయ్యె కానిమ్ము. నాభుజబలధనుర్విద్యాలవిత్రము చే నీతని గర్వలతాప్రతాపమును ఛేదించెద" నని హతశేషులగు భైరవానుచరులం బురికొల్పి తానొక్క రథంబాయత్తపఱచుకొని వచ్చుటకై వెడలె. నాచార్వాకు లంబరము పగుల నార్చుచు చెలరేఁగి వసుంధరునిపై నురువడించిన నమ్మహాత్ముఁ డనేకచండకాండములు, అర్ధచంద్రశిలీముఖములు, గజదండబాణములు, వత్సశృంగమార్గణములు, త్రిశూలశరములు ప్రయోగించి నాభైరవానుచరశిరఃకటజానుజఘన కరచరణంబుల ఖండించి మున్నాటయేఁ

బడి భైరవానుచరులంజంపి నిశ్శేషంబుగా సైన్యంబుం బరిసమాప్తినొందించి విలాస భాసమాన వదనారవిందుఁడై యున్న వసుంధరునిపై రథంబాయత్తపఱచుకొని వచ్చి యనేక దివ్యబాణంబులు ప్రయోగించి యాతనిసర్వాంగంబులు జర్ఝరితంబొనర్చి పటుప్రదరములచే సారథిని నొప్పించి కేతనంబూటాడించి ధనుస్సును ఖండించిన భైరవుంగాంచి వసుంధరుండు మఱియొకధనుస్సు కేలఁబూనినం గ్రుంచె. కృతాంతునిరీతి మండిపడి వసుంధరుం డొండొక్క విల్లుగొని యనేక శస్త్రంబు లాతనిముఖంబునను శిరంబున నేసి యాతని వజ్ర కవచంబును జించి చెండాడి శరీరము దూటాడించె. భయిరవుఁడాగ్రహోన్మత్తుఁడై మరల నాతనిధనుస్సుం దునిమె. మఱియొకవిల్లెత్తిన విదళించె. మఱియొకవిల్లందిఁ భేండాభయిరవుని రథంబులం గూలనేసి సారథిని మూర్ఛనొందించి యాతని ఫాలభాగంబు రక్తమయంబగునట్లొనర్చిన నతం డతిశీఘ్రమున వాజుల సవరించె. సూతుండును మూర్ఛదేరె. ననేక బాణంబులచే వసుంధరునిశరీరంబులచే గాడించి కోదండంబు ఖండించె. మఱియొకచాపంబందిన ఖండించె. నిట్లు ఇరువదియైదు కోదండములు తుండంబొనర్చుటచే వసుంధరుఁడు దుర్నిరీక్ష్యుఁడై కటిచేలము బిగించి భుజంబులప్పళించి తనరథంబు నుండి భయిరవునిరథంబులోనికిం గుప్పించి దుమికి యశనిపాతంబును తనముష్టిచే నాతనివక్షంబుపై గ్రుద్ది ధనుస్సు నతిలాఘువంబునలాగి త్రుంచివైచి మరల నాతనికపాల మఱచేతితో తాటించిన నాతాఁడున కోర్వలేక సోలుచున్న నాతనింబట్టి యెత్తి రథంబునుండి భూమిసింబడఁగ్రుక్కి తాను నాతనివక్షోభాగంబుపై దుమికి వామపాదంబునం దన్ని

దృఢపాశంబులచేఁ గట్టి యీడ్చుచు నఱచేతితాడనంబులచే నాతని గుఱ్ఱంబులు ముష్టిచే సారథినిం జంపి మహోగ్రభావమున నాథయిరవు నీడ్చుకొనుచు వచ్చి తనరథంబుపై నిలచి ప్రజ్ఞాహీనుండై ప్రళయభయిరవునివడువున వికారంబుగా నవ్వెను. భుజంబుల నప్పళించును రథంబునుండి కుప్పించి భూమికిం దుముకును. మరల నెగయును. దొడలందట్టును. మీసంబులందీటును, దిశలు మారుమ్రోఁగునట్లు గర్జించును. ఇట్లున్న యమ్మహాపురుషుని చెంతనుండుటకు వీరసేన శ్రీపాదులకు ధైర్యంబానక రథంబునుండి భూమికి నుఱికి యొకచో నిలువంబడిరి. భువనమోహినీదేవి వసుంధరుని చెంతఁజేరి "మహాత్మా! లోకద్రోహి నీచేత జిక్కియున్నవాఁడు. నీవీరీతి నతిరౌద్రాకారుండై మైమఱచియున్నందున శ్రీపాద వీర సేనులు భయపడుచున్నవారు. నీకోపం బుపసంహరింపుము. ఈయడవినుండి జనావాసంబునకుం బోవఁ బ్రయత్నింపుము. ఈయాశ్రమంబంతయు నిర్మానుష్యంబయియున్నది. ఇది బహుళతదియ యగుటచే నిఁక జంద్రుఁ డుదయించు నిపు డంధకార బంధురంబయియున్నది. ఉదయమునుండి యుద్ధం బేనుగాంచి బెదరుచుండి యీయడవిలో యీచీఁకటిలో యీరాత్రివేళ యీఘోరధ్వానములకు యీశివారవములకుఁ జిత్తంబు తత్తఱిల్లుచుండు నాకు ధైర్యంబు జెప్పక నీవిట్లు వీరావేశంబుం బొందియున్న మమ్మోదార్చువారెవరు? ఇచ్చట శత్రునిర్మూలంబయి యున్నది. ఇక నీపై జనుదెంచువారు లేరు. చార్వాకాంగనలు బ్రతిరాత్రికుటీరమందును, భర్తవియోగమునకును, సుతనిర్యాణమునకును, సోదరవినాశంబునకును నేడ్చుచున్నవారు. అదే రోదనధ్వాను లంబరంబును బగిలింపు

చున్నది. యుపశాంతింజెందు" మని ప్రార్థించుచున్నంత నాతం డుపశాంతుండై ప్రకృతిచూడ్కి గనుబఱచి శ్రీపాదా! యనియె. "బ్రతికితిమి బ్రతికితిమి. నీవింతమాత్రము బలుకరింపవనుకొనలేదు. మాకు నీభైరవులగతియే వ్రాసియున్నదని భయపడియుంటిమి. వసుంధరా! నీవీనాఁడు త్రిపురదహనము నాఁటి ఫాలనేత్రుఁడవో, మూలబలవిధ్వంసము నాఁటి శ్రీరామచంద్రుఁడవో, సైంధవవధనాఁటి యర్జునుఁడవో యనుకొనియుంటిమి. నీవింతటి భయంకరప్రతాపధురీణుఁడవని మేమనుకొనలేదు. మిత్రమా! యింతమాత్రము ప్రకృతిం జెంది మరల శ్రీపాదా యని బిలచితి విపుడు నావసుంధరుడవైతి విఁక నీచింత కరుడించెద" నని జెప్పుచు శ్రీపాదు వీరసేనులు మరల తేరెక్కి యాతని సన్నిధిం జేరిరి. వసుంధరుఁడు చిఱునవ్వుచే "వీరసేన శ్రీపాదులారా! మీరెందుల కింత భయపడి రథమునుండి దిగి దీనతం జూపుచున్నవారు! నేను మీవసుంధరుండను. మీమిత్రుఁడనుగానా? భయపడదగునా? క్షత్రియుల కిది యొకయెక్కువయా చూడుఁడు. అబలయయ్యును నీకాంత భయపడకున్న"దని చిఱునవ్వుచే భువనమోహినింగాంచె. నామెయు గంభీరహృదయమునఁ జేతులు జోడించుకొని నిలువఁబడియుండె. శ్రీపాదుఁడు వసుంధరుం గాంచి "వసుంధరా! పరమేశ్వరుఁ డెవ్వరెవ్వరి కేయేరీతి దాంపత్య మొనఁగూర్పవలెనో యారీతి జతగూర్చియే యుండును. ఈమె క్షత్రియాంగన నీచే వరింపఁబడెడికన్య. నీగుణానుసారిణియై యుండుట యొకయాశ్చర్యమా" యనె నంత భువనమోహిని ముఖంబు వెలవెలబోయి శ్రీపాదుని చురచురంజూచి యేమియో మాట్లాడనుంకించి యోదార్చు

కొని గ్రుక్కిళ్లు మింగి నిరుత్తరయై యొకచో గూర్చొనియె. అదిగాంచి శ్రీపాదుఁడు మిన్నకుండె. భేండాభైరవుఁడు మూర్ఛదేఱి లేచి విజృంభింపఁ బ్రయత్నించి బహుళవారుణ పాశబంధనములలో జిక్కి విడిపించుకొనలేక, "యోరీ మానవాధమా! అధర్మపరాయణా! యుద్ధధర్మం బెఱుఁగుదువే? మూర్ఛిల్లియున్నవారిని బంధించు క్షత్రియాపశదుల నే నెందును వినలేదు. విడువుము నాతో యుద్ధం బొనర్చి నన్ను గెల్వుము. లేక నాచేఁజావుము. విడువు" మనిన వసుంధరుడు నవ్వి "భూతద్రోహీ! భైరవా! నీకొక ధర్మముగలదటరా? పాపభీతులై విడుము విడువుమని పాదములకు నమస్కరించు వారిని, బ్రార్థించువారిని, దల్లిదండ్రుల బంధువుల సుతుల సోదరులం దలంచి మొత్తుకొనువారిని నీదుష్టభయిరవ శిలకు బలియిచ్చునపు డీధర్మం బెందుబోయెరా దుర్మార్గా? ఆత్మ సమత్వం బెఱుంగక భూతదయలేక తమదేహాభివర్ధనమే ముఖ్యమని తమయారోగ్యభాగ్యమే మహాభాగ్యమని యహంకారులై గోవుల వధించు చండాలమ్లేచ్ఛులవలె సర్వభూత హింస నొనర్చు జగద్ద్రోహులవలెఁ జిన్నతనమునుండి తమ బిడ్డలవలె రక్షించి చెంతకు రమ్మని చిటికవేసినంతనే పరువెత్తి వచ్చు కుక్కుటములను ఛాగములను నిష్కరుణాపరులై కఱకుకఱకున కంఠము ద్రెంచి యామాంసముచే తమ మాంసాభివృద్ధి నొనరించుకొను క్రూరనరకకూపవాసులవలెఁ గాక యెవ్వరికి బాధలొనర్పక తరువులందు వసించి నదుల యందు నీరుఁద్రావి తమ కులాయంబులనే సుఖమందుచున్న పక్షులను జంపు వంశనాశకులవలె హోమధర్మ గృహస్థధర్మ అర్చనధర్మములయందు సహాయకారియై సమోదధిఘృతత్ర

ముల నొసంగు ధేనువుం బెంచి మదించి యున్నపు డాధేనువు నాలుకం దెగఁగోసి పలువిధ వ్యంజనములను సృజించి తిని దేహంబును బెంచుకొను అధఃపతితులవలె మద్యపానమదో న్మత్తులై ప్రజ్ఞలేమి గురుంఘుధర్మంబు లెఱుంగక యిచ్చ కొలఁది వర్తించి జారచోరతలకు వెనుదీయక స్త్రీలను శిశువు లను హింసించి తమ యధర్మకార్యంబునకు నేయడ్డంబు లేక నిరాటంక మొనర్చుకొను సర్వలోకభ్రష్టులవలె వర్తించి ప్రాణులను హింసించి ప్రపంచమున నెందఱిని గోడుగుడిపించి తివో నీచా! చండాలా! క్రూరకర్మా! నిన్నింతటితో సంహ రింపను. భేతాళుఁడు బంధితుఁడై యున్న యశ్వత్థవృక్షము చెంతకు నిన్నీడ్చుకొనిపోయి యచ్చట నీకట్లు విప్పి భేతాళుడు చూచుచుండ మరల నీతో యుద్ధమొనర్చి తొలుత నేనన్నట్టు పదునైదుదినములకుఁ జచ్చునట్టు బాధించి నిన్ను గడతేర్చె దనురా పాపిష్ఠి! నీయందు నాకెంతమాత్రమును కరుణ జని యింపదు. యుద్ధధర్మోక్తులాడుటకు నీకు నోరెటులాడుచున్న దిరా సిగ్గులేదటరా" యని గర్జించి "వీరసేనా! యిపుడర్ధ రాత్రి సమయముకానున్నది. చంద్రభగవానుఁడు తనచల్లని కిరణములచే మనయుల్లములు రంజింపఁ జేయుచున్నాఁడు. మనరథం బిట్టే పశ్చిమాభిముఖముగా నీలోయందాఁటి యా మిట్టపై నిల్పుము. నీవంటి యాశ్రమశిష్యులైన మనవారల వేయిమంది నొకచో నిల్పియున్నానని చెప్పితివే వారందఱి సహాయముతో నీ వీ యాశ్రమకుటీరములలో బలికొఱకై తెచ్చి బంధితులై యున్న స్త్రీలను బురుషులను విడిపించి వారి వారియూళ్ళకు వారిని బోవునట్టు నియమింపుము. చార్వాక కాపాలిక భయిరవానుచరాంగనలఁ బాశములచే బంధించి

యీడ్చుకొనివచ్చి యీపరిసరవృక్షములకు గట్టివైచి యెందు కట్టియలం బ్రోదిచేసి యనలంబు సంధించి యీయాశ్రమ కుటీరములను భయిరవాలయమును హింసాలయమును గాల్చి భస్మమొనరించునట్లు మనవారలకు నాజ్ఞానతిం దెలియఁ జేయుము పొమ్ము. యీవల మనమందఱము బేతాళుని సమీపంబునకుం జని యీదురాత్ముని ఖండింత"మని గంభీరముగా నాజ్ఞ నొసంగె. నావాక్యములు భేండాభయిరవుఁడు విని "ఘోరీకపాలభయిరవా! నాసర్వసైన్యాధికారివై యుండియు నీవేనా యీనరాధమునకు సహాయమొనర్చి నీవంటియాశ్రమ శిష్యుల నందఱి నొకచోఁ జేర్చి యుద్ధమున కీతనిపైన రాని య్యక స్వామిద్రోహివై యున్నవాఁడవు? కార్యాంతరాసక్తిచే యుద్ధసంరంభముచే నిన్ను గుర్తింపలేకపోయితి. నేఁడుదయమునుండి యాశ్రమశిష్యులలో నొకరైనా నాకంటికగపడరైరి. యుద్ధమొనరించుచున్నారనియే యున్నాను. నమ్మించి ద్రోహమొనర్చితివి. ఈయపరాధమునకుఁ దగుఫల మందెదవు పో"మ్మనియె. "నీవొనర్చిన ప్రజాద్రోహములో నిది యే మాత్రమైనను యనుభవించుటకు సిద్ధుఁడనై యున్నాను. ఊరకప్రేలక నీభయిరదేవుని వేడుకొనుచుండుము. ఇఁక నన్ను గపాలభయిరవుఁ డనకుము. నీభయిరవము నీకేయిచ్చి యున్నవాఁడ. నీ కంత్యకాలఘడియలు సమీపించుచుండినను బౌరుషమును విడువకున్నావే చాలు నిఁక నోరుమూయు"మని నిరుత్తరువొనర్చి పశ్చిమాభిముఖముగా వెడలి లోయను దాఁటి మిట్టపై రథమునిల్పి వసుంధరు నాజ్ఞానిర్వాహకంబునకై వీరసేనుఁడు వెడలి బంధితపురుషుల నేఁబదిమందిని ముక్తుల గావించె. స్త్రీకుటీరమున బంధితు లెవ్వరు లేకుండిరి.

కాపాలికచార్వాకాంగనల రెండువేలమంది ముత్తుకొను చుండ వారందఱిం దగుసహాయముతో పాశములచే బంధించి యీడ్చుకొనివచ్చి వసుంధరు సమీపమునం దున్నతతరుశాఖలకు బంధించి యన్యోన్యసహాయ భయిరవాశ్రమమున కనలంబుఁ దగిల్చిన నదియును తొల్లి వాలానలజ్వాలలచే నాంజనేయుండు లంకాపురం బెట్లు కాల్చి భస్మమొనరించెనో యట్లు భయిరవాశ్రమంబు దగ్ధమయ్యె. నిర్ముక్తపురుష లేబదిమంది యరుదెంచి వసుంధరునకు నమస్కారమొనరించి "మహాత్మా! నీవు సత్యసంధుఁడవు. పరోపకారదీక్షాదక్షుఁడవు. ధర్మమూర్తివి. ఈదురాత్ముని బారినుండి మమ్ము దప్పించితివి. ఈయాశ్రమమును నిర్మూలం బొనర్చితివి. ఈఘోరుని బంధించి యితని యెదుటనే యీకార్యములన్నియు నొనర్చుటచే సర్వవిధదుఃఖములు నీభయిరవుఁడు కన్నులారఁజూచి యేడ్చి చచ్చుగాక!" యనుచు యాతని యనుమతిచే వారివారి దేశంబులకు వారు వెడలిపోయిరి. నాభయిరవాంగనలు బంధితులై వసుంధరునికి నమస్కరించి "మహాత్మా! మేము స్త్రీజనులము అస్వతంత్రులము. పురుషులాజ్ఞయొనర్చురీతి నుండువారము. మేము స్వబుద్ధిచేఁ బ్రజోపద్రవము లొనర్చువారము కాము. మమ్మింమకు బంధించియున్నవాడవు? పాశములు వదలింపుము నీయాజ్ఞాబద్ధులమై యుందుము. స్త్రీజనులకుయ్యాలించుట నీవంటి సత్యమూర్తికి సహజసుస్వభావముగదా" యని వేడుకొన్నవారలఁగాంచి మీరు క్రూరదేవతలు. మీరిచ్చటనుండి వెడలి చేర కేరళ కొంకణ పాండ్యమండలములయందున్న యడవులలో సంచరించుచు నెవ్వరికి నేయుపద్రవములుసేయక యుండుఁడు. మీ రేదియైనా బాధలు పెట్టినట్లు మాకు దెలిసి

నేని వెదకి వెదకి మిమ్ముం జంపింతు పొం" డని బంధములు వదల్చిన వారందఱు చెలరేఁగి యార్భటించుచు వసుంధరునికి నమస్కరించుచు బొగడుచు దక్షిణాభిముఖులై వెడలిపోయిరి వీరసేనాదులు భయిరవాశ్రమమును దహించివచ్చి విన్న వించిరి. ఆశ్రమశిష్యుల నందఱిని వారివారి దేశంబుల కరుగ నాజ్ఞాపించి బంధితుండైన ఖేండాభయిరవునితో శ్రీపాదునితో భువనమోహినితో రథారోహకుండై వీరసేనుఁడు రథంబు గడుపుచుండ వసుంధరుఁడు పశ్చిమదిశానుగంతుండై వెడలె గుఱ్ఱము లతివేగముగా రథము నీడ్చుకొనుచు బేతాళ బంధితాశ్వత్థవృక్షము చెంతకుంబోయి నిలచె. బేతాళుఁడా ముందు దినమునుండి ప్రబలబంధనములనుండి వదలి యటుయిటు తిరిగి చూచుటకు జేతులు పదము లాడించుటకు శక్తిగలిగి కొంచె మానందముఁ జెందుచు దిక్కులు చూచుచుండె. వసుంధరుఁడు రథమునుండి దిగి బేతాళుంగాంచె. వసుంధరుని గన్నంతనే బేతాళుని సంతోషమునకు మేరలేక "వచ్చితివా మహానుభావా!" యనియె. "బేతాళా! చూడు మీమానవ ద్రోహిని ఖేండాభయిరవు" నని రథమునుండి క్రిందబడునట్లీడ్చి కట్లువిప్పి భయిరవా! యిటరమ్ము. యుద్ధ మొనర్పుము. నీకేమి యాయుధము కావలెనో కోరికొను" మనిన ఖడ్గంబునుగోరె. యొసంగిన నిరువురు ఖడ్గధరులై యుద్ధమున కుపక్రమించిరి. వసుంధరుని ధర్మదయాళుత్వమునకు భయిరవుఁ డాశ్చర్యమొందె. వీరసేనాదులకు భయము నాశ్చర్యము నిర్విణ్ణతయు గలిగి చూచుచుండిరి. వారిరువురు చిత్రగతులచే ఖడ్గములం ద్రిప్పుచు మునువెనుకల పరుగులిడుచు హుంకరించుచు నొకచో లక్ష్యమిడి యొకచో మొత్తుచు మండలగతిగను

సంచరించుచు ఛటఛటశబ్దములచే ఖడ్గములం దగిలించుచు నిట్లు ఘోరయుద్ధము జేయుచున్న వసుంధరుఁడు చెలరేఁగి బాహుబలాధికుఁడై తన ఖడ్గముచే భయిరవుని ఖడ్గము విఱుగ గొట్టి మరల హుంకరించి ఖడ్గముచే విసరె నదియు నాతని కంఠ ప్రదేశమునఁ దగిలి రక్తంబు గారఁజొచ్చె. వసుంధరుఁడు తనఖడ్గమును బాఱవైచి ముష్టియుద్ధమున కుపక్రమించి గ్రుద్దుచు లేచుచు దుముకుచు దప్పించుకొనుచు రొప్పుచు మెచ్చికొనుచు దీర్ఘోచ్ఛ్వాసములు విడుచుచు నిలచుచు దరుగుచు నిట్లధిక భయానకముగాఁ బోరాడుచుండి భయిరవుని ముష్టిఘట్టన లధికముగుటచే వసుంధరుఁడు నొచ్చియు యతి లాఘవమున భయిరవుని కపాలము ముష్టిచేఁ దాటించె. నా తాఁపున కోర్వలేక నాతఁడు సొమ్మపోయి తెప్పిఱిల్లునంతలో వక్షంబుపై మోఁద ధరణికిం బడవైచి ఖడ్గంబు గైకొని "బేతాళా! యిదే చూడుము. నీప్రత్యర్థి నీయశ్వత్థమునకు బలియిచ్చుచున్నా" నని గంభీరముగాఁ జెప్పుచు "భయిరవా! నీ విట్లనేగదా స్త్రీలను బురుషులను భయిరవునకు బలియిచ్చుచుండిన" దని నొకవ్రేటువైచి కంఠంబు ఖండించె. నాతని కంఠరక్తమును దోసిలిచేఁబట్టి యశ్వత్థవృక్షముపైనున్న బేతాళునిపై జల్లుచుండె నంతట నాకసమున ననేకఘంటలు ఘణఘణధ్వనులచే నిండినట్లుండె. నేమియోయని యాకాశము వంక దృష్టినిడి చూడ దేదీప్యమానమై యొక అసమాన విమానము వచ్చుచుండె. నావిమానమున కిరుప్రక్కల రెండు రెక్కలుగలవు. సువర్ణమయంబై క్రిందపీఠమును పైన గోపురమునుం గలిగి చక్రహీనమైన తేరురీతిగా నొప్పారుచుండె సూర్యునివలెఁ బ్రకాశించుచు నతివేగముగాఁ జనుదెంచి

యశ్వత్థవృక్షము చెంత నంతరాళమునందు నిలచె. భేండా భయిరవుని శరీరమునుండి యద్భుతమైన తేజము జ్యోతిరూప కంబుగా వెడలి విమానంబునం బ్రవేశించె. నావెంటనే దివ్య రత్నమయమయిన కిరీటమకరకుండలహారనూపురాది భూష ణంబులు ధరియించి చతుర్భుజములొప్పార అఖండతర తేజో మయమైన హిరణ్మయస్వరూపముఁ దాల్చి యొక యాకృతి విమానమునందుండి మేఘగంభీరరవముచే "వసుంధరా! నీవు పుణ్యపురుషుఁడవు. తేజోమయదివ్యమూర్తివి. నిన్నుండి నాకు సద్గతులు గలిగె. బహుజన్మములెత్తి వివిధకష్టముల ననుభవించి నేఁడు నీచే వధింపఁబడుటచే యూర్ధ్వగమనుండ నైతి. నీకీర్తి ప్రతాపములం బొగడుచు నేను స్వర్గలోకము నకుం బోయెద మహాత్మా" యని పొగడె. భేతాళ శ్రీపాద వీరసేనులు చిత్రప్రతిమలవలె జూచుచుండిరి. వసుంధరుఁ డాశ్చర్యముచే "పుణ్యపురుషా! నీవెవ్వరు? భేండాభయిరవా కారమున నిట్టిక్రూరకార్యము లాచరించుచుండుట కేమి కారణము? నేఁడు నీ వీ విమానంబున హిరణ్మయస్వరూపము ధరించుట కెన్నఁడు సత్కార్యము లొనర్చియుంటివి? నీవృ త్తాంత మెఱింగింపు" మనిన, "దేవా! నేను తొల్లి రవివంశం బునం దయోధ్యాపట్టణంబున ఋతుపర్ణమహారాజునకు మను మండనై సుదాసుఁడను పేరుచే రాజ్యమేలుచుంటి. క్రూర మృగోపద్రవములచేఁ బ్రజలు బాధనొంది నన్ను బ్రార్థింప వేఁటకై యడవికిం జని మృగములను వధించుచుఁ బ్రజోప ద్రవకారకుండైన యొక రాక్షసుని జంపితి నతని తమ్ముని జంపక విడచితి. తనయన్నను జంపితి ననుచలముచే నతఁడు వంటలవాని రూపముగా జనుదెంచి నాయింట వంటలు జేయు

చుండె నది నేనెఱుంగనైతి. నొకానొకదినమున మాకుల గురుండైన వసిష్ఠమహర్షికి పాకమొనర్ప నాతని కాజ్ఞనిడితి. ఆదానవుఁడు పూర్వవైరమున మనుష్యమాంసముచే శాక పాకము లొనర్చి మహర్షికి వడ్డించె నది యెఱింగి నాయందు కోపించి "మనుష్యమాంసంబు బెట్టించితి వందుచే రాక్షసుండ వగు" మని యమ్ముని శపించె. నానిజస్థితిని దెలిసికొనక యాతురపడి నన్ను శపించి యున్నవాఁడుగదా యని నేను ప్రతిశాపంబిచ్చుటకు వార్చి జలముల కరపుటంబునందు దాల్చు నంతలో నాముని నానిరపరాధత దెలుసుకొని "పండ్రెండు సంవత్సరములు మాత్రము రాక్షసుండవై యుండు" మని శాపమును మరల సవరించె. అదియును నిష్కారణమే నని నేను శపించుటకు గమకింపగా నాభార్య చనుదెంచి గురువును శపించుట ధర్మము కాదని వారించుటచేతను నాకు మిత్ర సహుండను ఖ్యాతియొక్క పేరుండుటచేతను గోపము చాలించి శాప మొసంగక తజ్జలములం జల్లుట కెందుజూచినను జీవకోటి మయంబై యుండుటచే నాపాదములపైననే జల్లికొంటి. నా జలము పడుటచే నాపాదములు నల్లగా కములుకొని పోయె. నప్పటినుండియు నాకు కల్మాషపాదుండను ఖ్యాతియొక పేరు గలిగె. గురుశాపవశమున రాక్షసాకారమును రాక్షసభావం బును జనియించె. నాఁటనుండి యరణ్యములలో సంచరించు చుంటి. కొంత కాల మరుగ నొకానొకదినమున నేనున్న చోటు నకు సమీపమందున్న యరణ్యమార్గముగా నొకపుణ్యాత్ముఁ డైన బ్రాహ్మణుఁడును యమ్మహానీయుని భార్యయును మధ్యాహ్నసమయమై యున్నందున ఆఁకలిచేఁ దపించుచు జనుదెంచుచుండిరి. నేనును యాఁకలిచే బీడింపఁబడుచుంటిని.

యావిప్రమిథునమును జూచినంతనే తటాలునఁ జని యా బ్రాహ్మణుని బట్టుకొని తినుట కుపక్రమించితి నాతని భార్య మిత్తుకొనుచు యీవిధముగా నన్ను ప్రార్థించె.

శా. తండ్రీ మీకు దినేశవంశజులకున్ దైవంబగున్ బ్రాహ్మణుం
డండ్రామాటలు లేవె భూమిసుర గోహత్యాభిలాషంబుగై
కొండ్రే మీయటువంటిసాధువులు రక్షోభావమిట్లేల మీ
తండ్రింతాతల బూర్వులన్ దలఁపవే ధర్మంబునన్ బోగదే.

శా. అన్నా చెల్లెలి నయ్యెదన్ విడువు నీకన్నంబు వెట్టింతు నా
హృన్నాథున్ ద్విజు గంగికట్టి నకటా హింసింపనేలయ్య నీ
వెన్నం డింతులతోడఁబుట్టవె నిజం బిట్టైన ముఙ్ముట్ట నా
పన్నన్ నన్ను శిరంబుద్రుంచి మఱిమత్ప్రాణేశు భక్షింపవే.

(భాగ. నవమస్కంధము)

అని కరుణబుట్టునట్లు బహువిధముగా నన్ను బ్రార్థించి నను రాక్షసభావమున నున్నవాఁడ నగుటచేఁ గరుణలేక నా బ్రాహ్మణునిం బట్టి పులి పశువును దినురీతి భక్షించితి''ననిన (నారాయణ నారాయణ) యని వసుంధరాదులందఱు చెవులు మూసికొనిరి. మరల వినుఁడని నాదేవపురుషుఁ డిట్లనియె. ''నాసాధ్వి భర్తమరణమునకు దుఃఖించి నన్నుగని ''దురాత్మా! కామాంతురవై న నాపెనిమిటిని భక్షించితివిగాన నీ వాఁడు వారిం జేరి కూడినవేళయందు మరణం బొందుదువు. మఱియు నీవిప్రుని సంహరించుసదోషమున నీకు ప్రబలతరమైన నరకంబు ప్రాప్తించు యావల క్రిమి కీటక పశు పక్షి మృగాదుల జన్మం బులెత్తి యిదేవిధముగా మరణించి మరల నొకానొకరాక్ష

సుండవై శంబరాసురుని వంశమున జన్మించి భయిరవోపాస్తి చేయుచుఁ బ్రజోపద్రవకారణుండవై యుండి యొకపుణ్యపురుషునిచే సంహరింపఁబడి యాతని సముఖమున నీవు ప్రాణములు విడచెద వందుచే నీసమస్తకిల్బిషములు దొలంగి రాజవృత్తిచే నున్నప్పు డొనర్చిన దానధర్మపరోపకార పుణ్య ప్రభావముచే నీవు పుణ్యలోకము లనుభవించెద'' వని శపించి తన పతిశల్యములతో తా నగ్నిప్రవేశ మొనరించె నే నా దేహము విడచి యమపురమునం దింతింతని చెప్పరాని నరకానుభవించి యనేకయోనులయందుఁ బుట్టి బహుబాధల నొంది యారీతి జన్మించి నీదేహస్పర్శచేతను, నీసముఖముననే నీచేతనే వధింపఁబడుటచేతను సమస్తపాపములనుండి తొలంగి పుణ్యపురుషుండనై కడ తేఱితి. మహానుభావా! నిన్ను వొగడుచు దివంబున కరిగెద. మఱల నరనారాయణమహర్షుల ప్రేరేపణచే నొకసిద్ధపురుషుఁడు నీచెంత కరుదెంచి కొన్ని విషయములు నీకెఱింగించు నపుడన్నియును విమర్శయగును. నే నిదే పోయివచ్చెద. నిపుడు నీచే ఖండింపఁబడిన నాథే డాభయిరవ శరీరమునందున్న హృదయమాంసము నీఖడ్గముచే బయలుపఱచి నృసింహమంత్రముచే బేతాళుని ముఖమును నడుమును బాదములును దాఁకించినంతట యీబంధనములు వీడును. మరల వియన్నదియం దీతని గూర్చుండఁబెట్టి మూఁడుమార్లు రుద్రాభిషేకం బొనరించితివేని సర్వవిధములైన బంధములును వదలి తేజస్వియగును నేనిదే పోయివచ్చెద''నని యప్సరోగణసేవితుండగుచు నాపుణ్యపురుషుఁడు దివంబున కరిగె. వసుంధరుండు తనఖడ్గముచే భేండాభైరవుని శరీరముం జించినవా ప్లీహములు తనఖడ్గాగ్రమున నద్ది బేతాళుని శిర

మును నడుమును బాదములును దాఁకించినంతనే కట్లు వీడి మహాసంతోషముచే మానినుండి దబ్బున దుమికి వసుంధరుని చుట్టు దిరిగి ప్రదక్షిణనమస్కారం బాచరించి పలువిధముల స్తోత్రము లొనర్చె. వసుంధరుఁడు "శ్రీపాదా! ఈదేవనది యందు బేతాళుని గూర్చుండఁబెట్టి మూఁడుమార్లు రుద్రంబు జెప్పుచు నభిషేకం బాచరింపు" మనిన శ్రీపాదుఁడు నది లోపలం దిగి శుచిర్భూతుఁడై బేతాళుని గూర్చుండ బ్రార్థించి త్రివార రుద్రాభిషేకం బాచరించిన మాత్రముననే పూర్వపు రీతి మహాజవసత్వ మాయాప్రభావశక్తి సమన్వితుండై "జయ వసుంధరావనీశా! తపఃప్రభావధురంధరా! ఖండాఖైరవాంతకా! చార్వాకరాక్షసకులనిర్మూలనా! జయావిజయీభవ! దిగ్విజయీభవ!" యనుచు మరలమరల ప్రదక్షిణనమస్కారము లాచరించుచు చేతులు జోడించుకొని నిలువఁబడి యుండె. వసుంధరుఁ డాతని కరములు బట్టుకొని "భూతాధీశ్వరా! నీవింతగా నన్ను ప్రశంసింపవలయునా? నీవలననే గదా నేనొక్క మానవుండని గణుతింపఁబడితి. నేను మానవమాత్రుఁడను. నీవు దేవగణంబులలోనివాఁడవు. వందనీయుఁడవు. ప్రశంసార్హుఁడవు" అని చెప్పుచున్నంతనే హాహాహూహూరావములు నలుదిశలనుండి వినవచ్చె. భూత కూశ్మాండ వైనాయక పిశాచ మారీచ బ్రహ్మరాక్షసగణంబులు నలుదిక్కులనుండి జనుదెంచి వసుంధర బేతాళులంగాంచి చుట్టు దిరిగి నమస్కరించి నిలువంబడి "మహాత్ములారా! మీకు భద్రమగుగాక! మీవలన మే మానీచుని దాస్యము క్తులై మరల మీచెంత కరుదెంచితిమి. మమ్ము జేకొనుఁ"డని విన్నవించిన బేతాళుఁడు వసుంధరుంగాంచి "మహాత్మా! వీరందఱు

నీభృత్యులు. వీరిచే నేమికార్య మొనర్పింపవలెనో సెలవో సంగుఁ" డనిన "భేతాళా! వీరందఱు దమతమస్థానముల నుండవచ్చు. ఆవశ్యకమైనపుడు మనస్సునందు దలంచిన మాత్రముననే మనచెంత నుండున ట్లాజ్ఞాపింపుము. వారికి సెలవొసంగి యున్నవాఁడ" నని చెప్పుచు "భూతగణము లారా! మీకు సెలవొసంగి యున్నవాఁడ. మీ యథాస్థానములకు బొం"డనిన వారు సహాజ కహాకహా ధ్వనులొనర్చుచు వసుంధరుం గీర్తించుచు దమ యునికిపట్టులకుం బోయిరి. వాసుదేవదత్త గుఱ్ఱములం గాంచి "అశ్వరాజములారా! మీ సహాయమువలన నే నసాధ్యకార్యము నెఱవేర్చి జగంబున గీర్తి వహించితి. మరల నమ్మునీంద్రుని చెంతకుఁ జనుఁడు. నేనెప్పు డమ్మునీంద్రుని ధ్యానింతునో అప్పుడు మీరు నాచెంత నుండుఁడు. పోయిరం"డని తీడి తట్టి ముద్దుగొని చిటుక వేసిన మాత్రముననే నా హయరత్నములు మనోవేగ వాయువేగములుగాఁ బర్వెత్తుచు నెందో చనియె. వీరసేనుం జూచి "నీవు మహేంద్రవరమునకుం బోయి నరేంద్రచంద్ర మహారాజుగారి చెంత మరల సైన్యాధికారము స్వీకరించి సుఖమున నుండుము. నేను రమ్మనినపుడంతయు వచ్చి నేనొనర్చు కార్యములయందు సహాయ మొనరించుచుండుము. బహు మంచి సమయమునందు నాకు సహాయ మొనర్చి సత్యమును సాధించితివి. నీమేలు మఱువనుసుమీ!" యని యాతని చేతులుబట్టి యదుముకొని సమ్మతిఁబఱచె. నతండును వసుంధరుని గీర్తించుచు నటనుండి యాంధ్రదేశ మార్గముగా రథంబునందు గూర్చొని వెడలిపోయె. "భేతాళా! కురుక్షేత్రమునందు గల దేవాలయముచెంత నిరుపురు బ్రాహ్మణు లీ భువనమోహినీ

వియోగచింతాభరముచే నిడుమలు బడుచుందురు. నీవిక్కాంత నెత్తికొని యా బ్రాహ్మణులవద్దనుంచి రక్షించుచుండుము. నేనును శ్రీపాదుండును నా ప్రియమిత్రులగు శబరార్భకులం గాంచి దేవాలయము చెంత కరుదెంతుము. ఆవల యీ కాంతను వార తలిదండ్రులయొద్దఁ జేర్చెదము పొ''మ్మనిన మహాప్రసాదమని వసుంధరునకు నమస్కరించి భువనమోహినీ దేవి నెత్తికొని రెక్కలుగల పర్వత మాకాశమున కెగురు చందమునను, యమృతకలశముం దెచ్చు గరుత్మంతుని విధమునను భేతాళుఁడు వెడలిపోయె. శ్రీపాద వసుంధరులు శబరార్భకావలోకనాపేక్షచే నెందో చనిరి.

---

## ౯ పతన ప్రకరణము

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమం దొక విభీతకవృక్షము తాండ్రచెట్లచే నావరించుకొని ఘోరఘూకముల కావాసమై చూచుటకు భయంకరమై తోఁచుచుండె. నా చెట్టుక్రింద నొక పురుషవిగ్రహము దన పరితాపము వెలికిఁబుచ్చునట్లు నతి దీర్ఘోచ్ఛ్వాసములు నల్పుచు కాలుగాలిన పిల్లివలె నొకచో నుండక అటుయిటు దిరుగాడుచు తన యుడుపులు భూషణములు దీసి పాఱవైచుచు మరల ధరియించుకొనుచు ''అబ్బా! యింకేమి గతియో'' యనుచుండె నతఁ డెనిమి దడుగులు పొడుగుగల్గి బండికందెనవంటి చాయగల శరీరముతో నుండె. చండ్రనిప్పులవలె నాతనికన్నులార్ద్రానక్షత్రయుక్తుఁడైన యంగారక గ్రహమువలె దేజరిల్లుచుండె. నల్లని ముఖమునందు పండ్లు చంద్రకాంతపుమణులవలెఁ బ్రకాశించు

చుండె. ధగద్ధగాయమానంబై దివ్యమణి నిర్మితములగు తార హారము లురంబున దాండవిల్లుచుండె. పుష్యరాగ విరచితం బులగు కర్ణకుండలములు భాసిల్లుచుండె. స్వర్ణమయంబైన చిరుఘంట లేఁబది యాతని నడుమునఁ బ్రకాశించుచు ఘణ ఘణధ్వను లీనుచుండె. మెప్పదియబ్దములు వయసుగలవాని వలె నగపడుచుండె. నతఁడు తనయారాట మిట్లు తలపోయఁ దొడఁగె. "హా తండ్రీ! నన్నందుకు పుట్టించితివి? పుట్టించితివి పో నాకీ యధికార మెందుల కొసంగితివి? ఒసంగితివిపో నిరం కుశము లేక నేనన్న బహుజనములకు కంటగింపై యేవగించు కొని నన్నడుగంటఁ జేయఁ బ్రయత్నము లొనర్చుచుందురే! నా సహస్రశీతల కెక్కువ కాల మొసంగియున్నను వారు నిర ర్థ్యంతరముగా దమ యధికారము నెఱవేర్చుకొని యిష్టా గోష్ఠిచే నుందురు. నా కొసంగియున్న కాల మతిస్వల్పము. దాని కెన్నియో అడ్డువులు తప్పులు దిద్దుబాటులు బ్రహ్మ కమ్ములు. ఆహా! నా యధికార కాల మరుదెంచినప్పు డంతయు నీపాపి బ్రాహ్మణులు నన్ను భ్రష్టువట్టించుటకై యధిక ప్రయ త్నము లాచరించుచుందురు. రాకరాక యిప్పుడు నాకాలము వచ్చెగదా యని మహోల్లాసముచే తేలదూగుచుండ పరీ క్షిత్తుఁడను చంద్రవంశపురాజు చనుదెంచి నాపేరన్న సహిం పక నాకెందును యునికి గల్పింపక గొన్ని నీచస్థానము లొసంగె. నట్టి దురాత్ము లెంతకాల ముందురు? ఇట్టివారి నెందఱినో జూచియున్నాను నశించిపోయిరి. అప్పటినుండియు నా కెదురులేక ప్రతాపమంతయుఁ జూపితి. కసియంతయు దీర్చుకొంటి. ఇప్పుడు మరల నుత్పాతము లనేకములు పుట్టు చున్నవి. అదిగో మందమారుతములు వీచుచున్నవి. నను

ద్రుఁడు చెలరేఁగి మంగళతర తరంగములచే దనయందుగల రత్నముల నొక్కటొక్కటే గడ్డకు వైచుచున్నాఁడు. దివ్య పరిమళమిళిత సుగంధబంధురం బెల్లయెడల గుబాళించుచున్నది. దిక్కులన్నియు యావిరిబాసి స్వచ్ఛతరమై ప్రకాశించుచున్నవి. ఇట్టి యుపశకునము లింక ననేకములు బుట్టుచున్నవి. నేనెవరితో జెప్పికొందు'' నని తపించుచుండ నొక చామనిచాయగల దేహముగలవాఁడు, నెఱ్ఱవారిన నేత్రములు గలవాఁడు, తామ్రములై జడలుగట్టియున్న శిరోజములు గలవాఁడు. కనుబొమలు ముడివైచుకొన్నవాఁడు, భయంకరమైన త్రిశూలమును ధరియించుకొన్నవాఁడు, మోకాలివఱకు నెఱ్ఱనివస్త్రమును జుట్టుకొన్నవాఁ డొక పురుషవిగ్రహము చనుదెంచుచుండె. నతనిఁ బరికించి ''ద్వాపరా! నేఁడేల నింత యాలస్య మొనర్చితివి? వారిరువురిటకు రాలేదుగదా'' యనియె.

ద్వా:—కలీ! నాకిప్పు డేమిపనియును లేదు. వచ్చునపుడేదియో నా పట్టాభిషేకమునాఁటి ముచ్చటలు దలఁచుకొంటూ మైమఱచి యుండుటచే నాలస్యమైనది కాని నీవేల మిగుల సంతాపమొందుచున్నట్టు గనఁబడుచున్నావు?

కలి:—ద్వాపరా! మీరు రాజ్యమేలుకాలమున నేవిపత్తులును లేక నిరంకుశముగాఁ బరిపాలన మొనర్చుచుందురు. నేను బరిపాలించుకాలమునం బెన్ని యాటంకములో యెన్ని విపత్తులో తటస్థించుచుందును. నేనిందు కీ పట్టాధికారినై యుండవలయు. నూరకె మునులవలె నడవులందో గుహల

యందో తపం బాచరించుకొనుచుండుట మేలని దోఁచు చున్నది.

ద్వా:—ఇపు డేమివిపత్తులు తటస్థించి నీపరిపాలన కాటంక ములు జరుగుచున్నవి.

కలి:—నే నేమని చెప్పుదును! నా పట్టాభిషేకమైన తొలు దొలుతనే ప్రథమచుంబనమున దంతభగ్నమన్నట్లు పరీ క్షిత్తుఁ డనురాజుచేఁ జిక్కువడి మూర్ధాభిషిక్తుఁడనై యుండి యుండ నునికియుఁ బండఁబడకయు లేక నఘో రించి యిపుడిపు డేదియో పుటపుటమని యొకవిధమున నారాజ్యమే నేలుకొనుచుంటిని. మరల నంతకన్న నెక్కువ యైన విపత్తు మూఁడనున్నది. అందునకు నిదర్శనముగా నపశకునములు వేనవేలు వొడముచున్నవి.

ద్వా:—కలిరాజా! అప్పుడు పరీక్షిన్మహారాజుండె. నతఁడు నీచేఁతలు కొనసాగించియుండఁ డనుకొందు మిప్పుడట్టివాఁ డెవఁడు గలఁడు?

కలి:—చెప్పుటకే భయమగుచున్నది. వసుంధరుఁడను నొక బాలుఁడు నా ముఖ్యమిత్రుఁడై నా రాజ్యపరిపాలనయం దత్యంత సహాయకారియైయున్న ఖేండాభైరవుని సంహ రించె. కాపాలిక చార్వాకుల గర్వమణంచె. నిఁక క్షపణక పామండాది నా పరిగణముల నన్నిటిని మట్టుపెట్టి నన్నును గంటఁ జేయఁ బ్రయత్నించుచున్నాఁడే నే నేరితోఁ జెప్పు కొందును?

ద్వా:—యేమీ! ఖేండాభైరవుఁడు సంహరింపఁబడెనా? అంతటి యసాధ్యబలుని గడతేర్చిన పరాక్రమవంతుఁ

డింకెంతటి ప్రభావవంతుఁడై యుండునో నీవు చూచి యున్నావా?

కలి:—చూడవలయునని నాఁడే ప్రయత్నించితిగాని భయ మగుచున్నది.

ద్వాప:—కలీ! అట్లయిన కాల మొక్క-రీతి గడుపవలయు నను మానవోక్తులు వినవే! అట్టి మహాపురుషునిపై ద్వేషించి నీ ప్రతిభ నేల పోఁగొట్టుకొనియెదవు! ఆతుర పడిన నేమిలాభము? తొల్లి నలచక్రవర్తి నగచాట్లముంచి యాతనిచే నతనిభార్యచే శపింపఁబడియుంటివి. వేనుఁడను రాజుకాలమున నాతని నీ ముఖ్యమిత్రునిగాఁ గైకొని యతనిచే భూమ్యాకాశములు నిండునట్టుగా "యష్టవ్య మదాతవ్య మహోతవ్యం విప్రా" యనుచు డవిణగొట్టించి ప్రపంచ మధర్మమయము గావింప మహర్షులచేఁ బరా భవముఁ జెందితివి. యిపుడిపుడే పరీక్షిత్తుచే శాసింపఁ బడి తివి. ఇంకెందుకు నీ కాటంకము లేనప్పుడు నీ ప్రతాపముఁ జూపుచుండుము. అట్లుకలిగినా యేదోయొకరీతి కాలమును గడుపుచుండుము.

కలి:—కానీ యీ వసుంధరుఁ డేమి బ్రహ్మకల్పము పర్యం తము బ్రతికియుండునా? అందున నిప్పటివారు పూర్వికుల వలె లక్షలకొలఁది వేలకొలఁది యేండ్లు జీవింతురా? యితఁ డును నేఁబదియో అఱువదియో వర్షములు జీవించును. దేహముక్తుఁడగును నంతవఱకు తాళియుండి మరల నా ప్రతాపముఁ జూపించెద చూడుము.

ద్వా:—మిత్రమా! వసుంధరనిర్యాణానంతర మేవిధముగా నీవు రాజ్యమేలెదవో చెప్పుము?

కలి:—అదియంతయు నిపుడెందు కనుకొనవలయు? ఏమో కాని నీవడుగు చున్నాఁడవు నామనమునఁగలది చెప్పెద. ప్రపంచమునకు మూలప్రాయమైన యీ హిందూ దేశమును మొట్ట మొదట నగచాట్లయందు ముంచెద. నావల నితర దేశములు సర్వసాధారణము. వారెప్పుడును నాకింకరులే నా యాజ్ఞాపరిపాలితులే.

ద్వా:—ఛీ కలీ! మన మాతృభూమిపైననే తొలుత నీదాడి జూపించెదవా అదియేల?

కలి:—ద్వాపరా! యింటగెలిచిగదా రచ్చగెలువవలయు? ఈ హిందూదేశమునం దేదేశములో లేని వర్ణాశ్రమ ధర్మములు వేదచోదితమై యున్నవి. అందుల కగ్రేసరులు బ్రాహ్మణులు. ఆ పాపిబ్రాహ్మణులె నా రాజ్యమును బొత్తిగా నిరంకుశముగా సాగనియ్యరు. వారల నెన్ని చిక్కులు పెట్టినను దిన నన్నమును గట్టబట్టయును లేక మలమల మాడ్చినను వారి నియమమును వారు వర్జింపరు. నా మార్గమునకు రారు. ఏవిధముననైనను యీ దురాత్ములను నా కింకరులుఁగా నొనర్చికొంటినా యీవల మిగత వర్ణములవారి నొక క్షణమాత్రముననే నా మార్గము బట్టించెద.

ద్వా:—అట్లయిన నీకసాధ్యులగు బ్రాహ్మణుల నేవిధముగా దాసులుగా నొనర్చుకొనియెదవు?

కలి:—అదియే దోఁచకుండెను యోచించితి నొకయూహ పొడమినది. వర్ణాశ్రమాచారములు లేక నొకరీమత మనాదికాలమునుండి వర్తించుచున్న యితర దేశవాసుల నీ దేశంబునఁ బ్రవేశపెట్టుట కేదియో యొకవిధముగాఁ

బురికొల్పెద. తొల్లి నలునిపై వెడలునపుడు పుష్కరునికి దేవలుఁడను వానిరూపకముగా నెట్లు బల మొసంగితినో యట్లు నాకుగల సర్వశక్తులను వారి స్వాధీనమందుంచెద. నపుడు వారరుదెంచి యీదేశవర్ణాశ్రమములపైన దాడి జూపఁజేసి నిర్బంధపూర్వకముగా చాతుర్వర్ణములవారిని యొకేమతమున గలియునట్లు కట్టుదిట్టంబు లొనర్చి యవిధేయులయిన వారలకు శిరచ్ఛేదనం బొనర్పించెద. ఏయే వర్ణములవారి కేయేవిధముగా జీవనవృత్తులున్నవో యవి నిర్బంధమునఁ దప్పించెద. అందువలన భయపడి కొంతమట్టుకు సాధ్యమగును. ఆవల మఱియొక దేశీయులను మఱల మఱియొక్క జాతీయులను నీ దేశములోఁ జేర్చి తొలుత బ్రాహ్మణజీవనోపాయములను దప్పించి వారి నియమములు జరుపుకొనుట కవధిలేన ట్టొనరించి యుదర పోషణ కేమి మార్గమనే చింతయందే యీ పాపిబ్రాహ్మణులను ముంచెద. వివిధములయిన సమాజముల నేర్పఱచి యొకరిసన్మతి నొకరనుసరింపకుండ నొనర్చి వారికీ పాదు బ్రాహ్మణులనే యుగ్రవీర మధిష్టింపఁజేసి యచ్చటనుండి ద్రొబ్బి స్నానసంధ్యాదులను మఱపించెద. పితృకార్యములు నడుగంటించెద. దైవార్చనలు పూర్వపువారికే యొప్పించున ట్టొనరించెద. ఇతర దేశాచారములందును, యితర భాషావిశేషములందును యొక్కువరుస గల్పించి స్వమత స్వభాష దైవభాషలన్న నొకరించులాగు నొనర్చెద. కూటసాక్ష్యములకుఁ బ్రేరేపించెద. నిట్లాహితాగ్నికర్మనిష్ఠాగరిష్ఠులను భ్రష్టుబట్టించి యధికారములఁ గూర్చుండఁబెట్టితినేని బ్రాహ్మణులును దదాచారములును

నామావశిష్టములగును. ఆవల తక్కిన వర్ణములవారిని బ్రాహ్మణపీఠమునఁ గూర్చుండఁబెట్టి బ్రాహ్మణద్వేషముఁ గల్పించి సర్వవర్ణములు సమానమగుటకు గ్రొత్తక్రొత్తగా సమాజములు సంఘములు గల్పించి దర్శనస్పర్శనయోగ్యులుగాని చండాలపుల్కసాదులకు గ్రొత్త పేరులువెట్టి పూర్వపుపేరుల నడిగించి నవీనమత మొకటి యనుసరింపఁ జేసి తక్కిన వర్ణములవారితోఁ గలసిమెలసి భోజనపానాదుల జరిపించి విపరీతజ్ఞానము బుట్టించి వారిలో మతభేదములు గల్పించి దేవుఁడే లేఁడు ప్రపంచము తనంతటదాను బుట్టఁబోవుచున్నదను కలువాయి బ్రహ్మజ్ఞానమును దృఢపఱచి కొందఱను, క్షుద్రదైవతముల నర్చించుచు భూతబలి యొసంగి జీవహింస నొనర్చువారిగాఁ గొందఱను, విష్ణుఁడే దైవమనువారుగాఁ గొందఱను, శివుఁడే దైవమనువారుగాఁ గొందఱను, కోటచౌడేశ్వరియే దైవమనువారుగాఁ గొందఱను బ్రేరేపించి, వారికిని వీరికిని కలహములుపెట్టి యొకరిపై యొకరికి యీర్ష్యాసూయద్వేషములను గల్పించి గోవధ జీవహింసయే దైవప్రీతియను భేదబుద్ధి గల్పించి యజ్ఞయాగాదులను మరపించి యనావృష్టిదోషములచే బాధిల్లఁజేసి సంకర మొనర్చి యింక నెంత కావలయునో యంత యొనర్చి నా రాజ్యము పూజ్యముగాఁ బరిపాలించెద. ద్వాపరా! నీవడ్డగోడమీఁది పిల్లివలె నుండువాఁడవుసుమా! నీకన్నియు సమానములే. నామాటలు కొన్ని రుచించును గొన్ని రుచింపకుండును. అందుచే నా చేయఁబోవు కార్యముల నితరులతో నవకుము. ఇదియే నా యోచన.

ద్వా:—కలిరాజా! యేమేమియో చెప్పితివిగాని ప్రధానాంశ మును మఱచియున్నావే, అందులకేమి యొప్పుదువు?

కలి:—యేమియంశమో నాకు స్ఫురింపకున్నది. నీవె తెలిగింపుము.

ద్వాప:—ఈభరతఖండమున నున్న సతీమతల్లులు నీవునాకు నియట్టివారు వేనవేలుగుండి తమ ప్రతాపప్రభావములు చూపించి మోసగించినను దమసాధుత్వమును వదలు వారు కారు. వారి సత్యవ్రతములు కొనసాగుచునుండెనేని పురుషులవృత్తు లెట్లు పరిగణించినను క్షణమాత్రముస సనాతన మార్గములకు దీసి నిన్ను కుగంటు జేసెదరే.

కలి:—ఆహా! ద్వాపరమా! యిందుకుగదా స్నేహితుల నుండ వలయుననుట. మంచి సమాచారము జ్ఞాపకమగునట్లు చేసితివి కాని యీభారత యువతులను శీలాచారపాతి వ్రత్య సత్యవ్రతాదులనుండి తొలగించుటకు సాధ్యము కాదు. భారతాంగనలన్న దేవేంద్రాదులు సహా భయ మొంది వరము లిచ్చుచుందురు. ఇంక నేనెంతటివాడ! నాకెయ్యది దోచకున్నది. వారల నేగతి నామార్గము ద్రొక్కింపవలయునో నీకు దోచియున్న నాకెఱిగింపుము.

ద్వాప:—ఈవిద్యయందు నీకున్న మేధాశక్తి నాకు లేదు. మిత్రమా! కోపగించుకొనక నీవే యాలోచింపుము. అంశ ములు మఱువకుండునట్లు జ్ఞాపక మొనర్చుచుండెద.

కలి:—ద్వాపరమా! యిపుడు నాకొకటి దోచుచున్నది. అదియు పెద్దవారు చేసి చూపించి నేర్పించిన విద్యయే. అందుచే భారతయువతుల నందఱిని నామార్గములో జేర్చు నంతటిశక్తి చాలదు. వారు చేరరు. అంతసులభసాధ్యులు

కారు గాని కొందఱను మాత్రము నావలలో వేసికొనియెద
వని నమ్ముచున్నాను.

ద్వా:—నియోచన యేమియో నాకు నెఱింగింపుము. ఆయో
చన పెద్దవారెవరు చేసియుండిరో యదియుఁ జెప్పుము.

కలి:—తొల్లి చంద్రవంశోద్భవుండైన దివోదాసుండనురాజు
కాశీదేశం బతిధర్మంబుగాఁ బరిపాలించుచుండె. అతని
ధర్మప్రవర్తనచేఁ బ్రజలు దేవతల నర్థింప నగత్యమే
లేకుండె. కాశీక్షేత్రమందనవరత మావాసము గల్పించు
కొనియున్న విశ్వేశ్వరాది సమస్తదేవతలు తమ్మర్థించు
వారు నర్చించువారును లేక దేవతలు స్వర్గలోకమునకు
విశ్వేశ్వరుఁడు మందేహారుణద్వీపమునందున్న దధిమండ
పర్వతంబునకుం జనియె. మఱల వారందఱొకచో సభచేరి
యాదివోదాసునెట్లయిన రాజ్యమును వదలింపఁజేయవల
యునని యెన్నియో ప్రయత్నము లాచరించిరి. కొనసాగ
దయ్యె. నావల శ్రీమహావిష్ణువును మహాలక్ష్మియు
బౌద్ధవేషములతోఁ జనుదెంచి పురుషులకు విష్ణుండును
స్త్రీలకు లక్ష్మీదేవియు నధర్మోక్తులు బోధించిరి. అందున
స్త్రీలతిసత్యవ్రతలై యుండుటచే లక్ష్మీదేవి సిద్ధురాల
నియు, భోగురాలనియు ననేకపేర్లచేఁ బ్రతిస్త్రీచెంతను
నిలిచి బోధించి పాతివ్రత్యధర్మములను వర్జింపఁజేసి
యధర్మపరాయణలఁగా నొనర్చె. గణపతి దైవజ్ఞుఁడై
యారాజుచెంతఁజేరి యాయుత్పాతములు బోధించి
యుద్వాసనము గావించె. దివోదాసోద్వాసనమైన యనం
తరము ప్రజ లధర్మమయులై తమకోర్కెలు నెఱవేఱ

కున్న దేవతల నాళింపవలసివచ్చె నపుడు విశ్వేశ్వరాదులు కాశీపురిఁ జేరి తమయర్చనాదుల యథాస్థితిఁ గావించు కొనిరి. నేనును మాశ్వేష్ఠాదేవిని బహువిధావతారములు ధరించున ట్లాజ్ఞాపించెద. నట్లు ధరించి ప్రతిభారతాంగన చెంతను నల్లే సిద్ధురాలనియు జోగురాలనియుఁ బేర్ల చేఁ బ్రవేశించి వార్ల చెంత నాస్తికమతబోధ సేయించెద. పతి భక్తి దప్పించెద. అన్యపురుషుల స్నేహం బొనరింపఁ జేసెద. యితర దేశాంగనా ధర్మములలోఁ బ్రవేశపెట్టి తమదేశధర్మములను వర్జింపఁజేసెద. నితరదేశభామలచేఁ బరపురుషుల సభలలో నుపన్యాసము లొనరించులాగు నొనర్చెద. లజ్జావతులను మాట నిర్లజ్జావతులనిపించెద. తనకిష్టమైన యేసుందరుఁడగపడునో నతనితో కరగ్రహణాదు లొనర్చుటయే పాతివ్రత్యలక్షణంబని బోధించి వారి శీలాచారములు పాడొనరించి కంచుకోత్సవములనియు, శిష్యాంగనారతోత్సవములనియు, గురురేతఃపానోత్సవములనియు మహోత్సవములు గల్పించి వామాచారములందు బ్రవేశపించి మద్యమాంసాహారముల నొనర్చులాగునఁజేసి భ్రష్టుబట్టించి నామతములో నారాజ్యములోఁ జేర్చుకొని యానందోన్మత్తుఁడనై తలనాడించుచుండెద. నేనెన్నియు పాయము లొనర్చినను యీహిందూదేశమున బ్రాహ్మణులను సర్వవర్ణముల యువతీజనంబులను నామార్గములోఁ జేర్చుకొనుట దుస్తరము. నావలనగాదు ఫాలాక్షుఁ డేతెంచినను జరగనిపని యందులోఁ గొందఱిని నేనన్నట్లొనర్చి యేదో యొకరీతిని భరతఖండము నాస్వాధీనంబునందున్న దనిపించుకొనెద. మిగత దేశములవారి నొక్కక్షణమాత్ర

ములో నామార్గమునందు జేర్చికొనియెద. నాకవి యొక లెక్కగాదు. ఇది విక్రమార్క శకాంతముగదా యిక శాలివాహనశక మేతెంచునదియే గదా నా ప్రాణపత కము. ఆ శక మేగదా నాకు కన్నతల్లివలె నుండునుగాని యిపుడేదో యొకరీతి కాలముం ద్రొబ్బెద.

అని పాషండాలాపములచే గలిద్వాపరములు మాట్లా డుచుండ నాచెట్లసందుననుండి యొక తేజం బఖండంబై వారికి మెఱుపువలె గోచరంబయ్యె నదియేమాయని చూచుచుండ ధగద్ధగాయమానంబైన ఖడ్గమును ధరించి యొకమంగళా కారము గాననయ్యె. ఆయాకృతి మన వసుంధరబింబంబై యుండె. నతం డీప్రసంగము తొలినుండి వినుచుండుటచేఁ గ్రోధమున హుంకరించి "దురాత్ములారా! యధర్మమార్గావ లంబనులగు మిమ్ము ఖండించివైచెద" నని యొక్కుమ్మడిగ వేటున వారిచెంతకు లంఘించిన మాత్రముననే కలిద్వాపరములు దిక్కుదోఁచక యట్టె నిలువంబడి చేతులు జోడించుకొని "నిన్ను గన్న ప్రచండమార్తాండునివలె నగపడుచున్నావు. భేండాభైరవాది క్రూరుల నంతంబొందించిన వసుంధరమూర్తిం బోలియున్నవాఁడవు. మమ్ము రక్షింపుము. మాధర్మమెట్లో యట్లు మే మాచరింపవలయును గదా! అది భగవన్మతము. అందులకు మమ్ము శాసించిన మే మేమిరోయనర్తు"మని ప్రార్థిం చిరి. "ఎవ్వరిమతమైన నేమి ధర్మమతమే సర్వసమ్మతము. పాషండమతము శిక్షాపాత్రమైనదే మీరు పాషండమతోద్ఘా టకులై యధర్మాలాపము లొనర్చుచున్నవారు మిమ్ములను ఖండించివైచెద. యధర్మాచరణుల నంతం బొనర్చెదనని నేను ప్రతిజ్ఞఁజేసి యున్నవాఁడ" ననిన వారిరువు రేమియు వచింప

లేక శక్తి చాలక నాతని దివ్య తేజంబునకు శలభప్రాయులై చేతులు జోడించుకొని వెలవెలఁబోవుచున్నంగాంచి "పాండు మిమ్మిప్పుడు రక్షించియున్నవాఁడ. మీయునికిపట్టుల విడిచి నిరంకుశముగాఁ బ్రవర్తింపకుఁడు. అట్లు ప్రవర్తించితిరేని శిక్షింతు"నని చెప్పె. చిత్తమని కలిద్వాపరు లంతర్హితులైరి. వసుంధరుం డటనుండి దక్షిణాభిముఖుండై వచ్చుచుండ నాతని కెదురుగా మహావేగముగా గత్తిఁబట్టుకొని ప్రజ్ఞ లేక యొక వ్యక్తి పరువెత్తివచ్చుచుండె. సమీపమునకుం జనుదెంచె. పరికింపఁగా వీరుని తాపులకోర్వలేక పరువెత్తిపోయిన మన లోమకేశస్వామివారే వచ్చి వసుంధరునిం గాంచె.

వసు:—ఓహో! లోమకేశరాజా! నీ వెందుకిట్లు పర్వెత్తి పోవుచున్నావు? బ్రాహ్మణులు భువనమోహినీదేవాలయం బునం దున్నవారా? మఱల వారలకేమియు విపత్తు తటస్థించలేదుగదా?

లో:—అయ్యా వారందఱు క్షేమముగానే యుండిరి. యా చోరు లరుదెంచి భువనమోహిని నెత్తికొనిపోవుట కుపక్రమించుచుండ నదాటున నే నచటికరుదెంచితిని. వారలకును నాకును గొంతమట్టుకు సమరమయ్యె నొకని మూర్ఛనొందించితి. మిగత యిరువురు నాదెబ్బల కోర్వలేక పరువెత్తి పోవుచున్నారు వారిం దరుముకొని వచ్చుచున్నాఁడ.

వసు:—ఎట్లు పర్వెత్తిరి? యేదిశగాఁ బోవుచున్నారు?

లో:—ఇదో యాపశ్చిమోత్తర దిశయందుగల పెద్దపర్వత పఙ్క్తిలో డాఁగికొనుటకై పోవుచున్నారు. శీఘ్రముగా నేను బోవలయు నిపుడు మాటలాడుట కవకాశము లేదని పర్వెత్తుచుండె.

వసు:—అట్లయిన వారిద్వారు నీవొకఁడవు. వారిచేఁ జిక్కిన నీ కేమివిపత్తు తటస్థించునో యిదో నేనును జనుదెంచెద.

అని యాతనివెంట ధనుఃఖడ్గాదులు సవరించుకొనుచుఁ బర్వెత్తుచుండ నాతఁ డడుగిడినపుడెల్లను భూమి గడగడవడఁకుచుండె. ఆమార్గమునందుగల సన్నసన్న పాషాణములన్నియుఁ జూర్ణములై పోవుచుండె. నాతని యూరువేగముచేఁ బార్శ్వములనందు గల వృక్షములు పెళపెళధ్వనులచే విఱుగుచుండె. నాధ్వని నపుడపుడు వెనుక జూచి దిగులొందుచు నాపర్వతములలోనికిఁ బ్రవేశించె. వసుంధరుఁ డాతని వెన్నంటి పరుగిడుచు "నాకాంతను దేవాలయముచెంతనునిచి నీవు రక్షించుచుండుమని బేతాళుని కనుజ్ఞనిచ్చితినిగదా యతం డేమిచేయుచుండెను? లేకున్న మరల నిట్టివిపత్తు తటస్థించుట కేమి యాస్పదముగలదు? ఎంత మిత్రత్వముండినను దేవతలు రాజసముగలవారు. పూర్తిగాఁ గంతగతముగువఱకు వారు రక్షించుటకుఁ బ్రయత్నింపరు. అది యొకదుర్గుణము వారియందు గలదు. కానిమ్ము "యాజ్ఞోల్లంఘన మొనర్చియున్న బేతాళుఁ డెట్లు నాప్రశ్నలకు జబాబొసంగునో చూచెద. నన్నుతక లిగి యపరాధము నొప్పుకొని క్షమాపణ వేడుకున్న సరి. లేనంతట భండాభైరవ నిర్మూలనాభీలంబగు శర మిదే నీ కెదురుచూచుచున్నదని చెప్పెద. వాఁడెవఁడైన నేమి" యనుచు రోష మంతకంతకు కనుగొనలం దోఁపించుచుండ వెఱ్ఱియెత్తినవానివలె నాతని వెనుకం బర్విడుచుండ లోమకేశుఁడు పర్వెత్తుచు యదే యటఁ బోవుచున్నారని మఱల నొకసన్నగుట్ట నెక్కి చూచి యిదే యీలోయలోనికి దిగుట కుపక్రమించుచున్నారని మఱి యొకప్రక్క దారిదీసి వడివడిగాఁ బోవుచుండె. మనవసుంధరు

డాతని వెంట బర్విడుచుండెనుగాని చోరు లెందుబోవుచున్నది
పరికింపలేదు. అతం డామార్గముగాఁ బర్వెత్తి పర్వెత్తి,

మ. పటునీరంధ్రకుజావిజృంభితముబిభ్యత్స్ఫూర్తకృత వ్యాళముఁ
యటవీసంచరితాట్టహాసగజఘీంకారార వాకీర్ణముఁ
కిటిసంఘోద్భటఘుర్ఘురధ్వనిఘటాక్రూరంబునుఁ వానరీ
పటలీసంవృతఘోరకంటకయుతంబౌ గహ్వరంబుంగనెఁ.

"అదే చూడుము మహాత్మా! లోయలో దిగుచున్న
వారు యీశిలారోహణ మొనర్చినఁ జక్కగా నగపడుదురని
తానాశిల నెక్కి చూడుము చూడుము త్వరపడుము. నీబాణ
జ్వాలలచేఁ జూర్ణంబు గావింపు"మని త్వరపెట్టిన నమ్మహాత్ము
నకు వారగపడకున్న నామహోన్నతశిల నధిష్ఠించె. లోమ
కేశుం "డదే యాచెట్లచాటున నున్నవారు చూడు మిదే
యాపొదరింటిదాపున కిపుడు బోవుచున్నారు చూడు మిపు
డొకబండపైనఁ గూర్చున్నారు చూడు"మని చెప్పుచుండ
వసుంధరుం డామహోన్నతశిలనుండి తొంగితొంగి చూచు
చుండె. లోమకేశుం డొక్కయేటున రెండుచేతులంబట్టి
యాభయంకరమైన జరతలోని కమ్మహాపురుషునిం ద్రోచ్చె.
"హా! పరమపురుషా!" యని లోయలోనం బడియె.

"పొమ్ము చావుము. పీడవీడిన దిఁక భువనమోహిని
నాకుఁ గరతలామలకముగదా! యీతఁడుండెనేని భువన
మోహిని రొప్పుకుండనను బలవంతముననైనను నితఁడు సంగ్ర
హించియుండును. నాకు నిశ్చింతమైన"దని తన్నపుడు బ్రదికిన
వానిగాఁ దలంచి మహానందముచే లోమకేశుం డాపర్వతము
నుండి దిగి శరవేగమున దేవాలయమార్గముగా వచ్చుచు దివ్య
ద్రుమలతావిసరంబగు నొక సుందరారామమునుం గాంచె.

తన్మధ్యంబునం దొక పొదరిల్లు గపడియె. నా పొదరింటి మాటున వాయుచలితంబై యొకదివ్యస్త్రీ చేలచెఱంగు పటపటధ్వనులచే మెఱుపువలెఁ గనుపించె. నిందెవ్వరో సుందరి గలదనుకొనుచుఁ బొదరింటి సమీపంబునకుం జని యచట,

సీ. కులుకుచును చిలుకకలపలుకు తెలమిగ గఱపి
ఫలములందిచ్చుచు మెలఁగు దాని
కనుగొనలఁ గనుచుఁ దనమనమునను ముదమొదవ
కితలతాంతంబులఁ జిదుముదాని
సరిగెవలె బిగి సడల చనుగవలు వెలి దెలియ
కుందగుచ్ఛంబుల నందుదాని
వపులపితసురభికము వలపు లొలుకగ నడల
రాయంచ నదలించు రతులదాని

గీ. నఖశిఖావధిస్వర్ణ శృంగారసరణి
జఘనతలనాట్యవేణికంజాతపాణి
మృదుతరానందభాషిణీ మెలతలమణి
భువనమోహినిఁ గాంచె నబ్బురముగాఁగ.

చూచి ఔరా! యీకాంత చోరులచేఁ బట్టువడి దేవాలయప్రాంత్యమునందున్న దీవనంబున కెందుకుఁ జనుదెంచెనో యనుకొనుచు సమీపించి "కాంతా! నీవిపుడు చోరులచేఁ బట్టువడి దేవాలయముచెంత శోకమే రూపముగానుంటివే నీకీవిలాస మెందుండి గలిగె? ఈసుకం బెచ్చట లభించె? ఇచ్చటి కెపుడు వచ్చితివి? భూసురలను విడనాడి యొంటరివై యున్నదానవే. రమణీ! స్వప్నమున భర్తగా వరించితినని నీవన్నరీతి నిపు డొంటరివైయె యీవనదేవతాసమక్షమున గాంధర్వవిధిగా నన్ను వరింపుము. మందహాసవదనముచేఁ బ్రసన్నదృష్టిం

గాంచి మృదుమధురసధారలొలుక నొకపలుకు పలుకుము. ఎన్నిదినములనుండియో నీయాలింగనసౌఖ్యం బభిలషించు చున్న నన్నుఁ గరుణింపరాదా? దేవీ! నీచరణసేవకుఁడనై యుండెద. నీమధురాధరసుధారసంబిమ్ము. నీ సనమధ్యవిరాజి తంబగు పత్రభంగరేఖలు నాపక్షముపై ముద్రింపుము.'' అని విభ్రాంతుఁడై పలుకుచున్న యతనిఁగని ''దేవా! యిదివఱకు నీపైననున్నదంతయు బ్రణయకోపమేగాని యత్యాగ్రహము గాదు. యోగ్యమైన పురుషుఁడైన వసుంధరుని వరియింపవలెనని యుంటి నది యుక్తముగా దోఁచలేదు. కళాభానుఁడు నామా వశిష్టుఁడయ్యె. నిన్న దేవాలయములో నేఁజెప్పినరీతి నాస్వప్న ములో నిన్ను వరించియుంటి నది నిశ్చయమైనపథ. స్వప్నమునం దొనర్చుకొన్న యాయుపచారము లిపుడు నాయందు గనఁ బడుచున్నవి. యోచింపఁగా నున కిద్దఱకుఁ బ్రేమానుబంధ రూపమగు నీత్రాడు త్రెంచినను దెగకయున్నది. కాన బ్రేమ లతాబంధనముచే నిన్నుఁ గట్టివైచెద. అనంగకదనమున నిన్ను హతము గావించెద. మోహశోకరాశివదనముచే నిన్ను గబళించెద. గాంధర్వరూపకముననో పైశాచికరూపకము ననో నీదేహగ్రహణం బాచరించెద. ఈయరణ్యము నూతన వధూవరులు సంచరింప యోగ్యమైనది కాదు. మనము త్వరగా నిందుండి వెడలుద మిపుడే నీవొకపిశాచమువలె నాకంటి కగ పడుచున్నవాఁడవు. నాకొఱ కింతటియవస్థ పడుచున్నాఁడవని నీనిమిత్తమే యాబ్రాహ్మణుల మొరఁగించి యొంటరినై యెదురుచూచుచున్నాను. ఇందుఁడిన నింక విశేషము లేమి తటస్థించునో'' యనిన లోమకేశునకు సంతోషము మించి దేహముపై బ్రజ్ఞ లేక ''దేవీ! నీకీనాఁటికి నాపైన దయగలిగె

గదా” యని మరల భువనమోహినిం గాంచె. తలపాగా సరిగ మరలమరల సవరించె ఖడ్గమును జేతినుండి వదల్చి వరలోనుంచు కొనియె. మెల్ల మెల్లన రాగంబులు దీయదొడగె. నిరుకరము లచే రెండుతొడలపై మృదంగధ్వనులం దాటించె. నిట్లు వికారపు చేష్టలు చేయుచున్న లోమకేశుంగని “ప్రాణేశ్వరా! యిక వెళ్లుద మావృక్షశాఖయందొక పరిపక్వఫలముగలదు చిలుక కాటుకర ముసంగవలయుc దెచ్చియి”మ్మనిన నది యెంతపనియని లోమకేశు డాచెట్టునెక్కి పండుపెఱికి “ఇదిగో ఫలము దిగువcబడిన నలcగిపోవును. పడc బట్టుము వైచెద” ననియె. “నాథా! పడియందువలదు నోరుదెఱచెద. నోట దప్పక వేయుము. నీలక్ష్యశుద్ధి కనుగొందు” మని నోరుదెఱచి కరాళదంష్ట్రలతో భయతరజ్వాలలతో అఘోరవదనముతో నొక పెద్దపిశాచమురీతి గాన్పించె. నదిగని “అయ్యో! భూతము భూత”మని యఱచుచు నాతడదరి మానినుండి దబ్బున దిగువ బడియె. అందుచే నాతని సంధిబంధములన్నియు సడలె. అది గాంచి “ప్రాణేశ్వరా! యెందుకింతటిభయము ది కేక వేసితిరి. నేనిందేయుండcగా మీకేమి భయము? అయ్యో! యిది పాడరణ్యము. ఇచ్చోటువిడిచి పోవక పాపి మామిడిపండునకై మీకెంత ప్రయాస గలిగించితి. ప్రాణేశ్వరా! అయ్యో! నేనెందున్నను దుఃఖమే తటస్థించుచున్నదే” యని దేహమునివిరె. ముండ్లతో నిమిరినందున లోమకేశునికి స్మృతిగలిగి “కాంతా! అతికోమలమృణాళసదృశమగు నీపాణిపల్లవ మేలకో కఠోర కంటకసదృశముగా నున్న”దనిన “ప్రాణేశ్వరా! నన్ను గాంధర్వవిధిగా పరింతువు లె”మ్మని రెట్టcబట్టి లేవనెత్తి యతని యెదుట నిలిచి తలయూచి కన్నుల్దప్పి నోరుదెఱచి

నాలుకల్లాడించి హుంకార మొనరించె. "అయ్యో! చచ్చితిఁ జచ్చితి" నని యఱచుచు నతఁడు నేలఁబడియె. నదిగాంచి "నాథా! యిపుడే యింతకలవరపాటైన నీకు ముందెట్లుజరుగ వలయు! ప్రాణేశా! లెమ్ము లె"మ్మని తలపై నొక్కపోటు బొడిచి యాతని సన్నటెముకలు విఱుగునట్లు కాలిచేఁ దన్ని పాదములు రెండును బంధించి యొకవృక్షశాఖకు దల్క్రిందుగా వ్రేలఁదీసి భువనమోహిని కనఁబడక నెచ్చటికో పోయె.

---

# ౧౦ హేమ ప్రకరణము

సీ. కాననికానలో గానరాకున్నావు
కలవారో లేవారో గాసియయ్యె
చోరులో క్రూరులో ఘోరమృగంబులో
నఱకిరో మెసవెనో వెఱపుగల్గె
అఱచితో వెఱచితో చఱచువేళ
కఠోరతరవారకరవాలధార చెదరి
బ్రోచిరో యెవరైనఁ జూచిరో యావేళఁ
జూడలేదేమొ నీజాడలేదె

గీ. అకట పుత్రిక నింకెందు నరయువాఁడ
నుండుదారి నెఱుంగ నోరెండె నాళ
దీరె తాపంబు మీఱెను దృఢము జారె
భువనమోహిని యింకెందుబోదునమ్మ.

క. నెలపై పదిదినములు చనె, నలసితి నడుకాన నరసితమ్మా
యిటు నీ, పాలకువయే దెలియదుగా, కలగని మేల్కాన్న
రీతి గాన్పించె నయో.

మన్మథ మోహినీ దేవతలంబోలు నా దేవేరు లిరువురు పుత్రికావియోగంబుచే శోక దేవతలంబలె గాన్పించుచుండిరి. వారిదివఱ కేమిగతి బట్టయున్నవారో వెదకుటకై చనిన దుశ్శీలాదులు రాక తడసిరి. యెందుగన్న నగపడలేదని సైన్యాధిపతి వచించె. పదిదినములనుండియు వెదకి వెదకి వృథాప్రయాసఁ జెందుచున్నాను యేమిసేయుదునని యేడ్చుచు నొకపురుషుఁ డొక్క గుఱ్ఱముపై నధిష్ఠించి కత్తిఁబట్టుకొని హిమాలయారణ్యములలో వచ్చుచుండ నాతని కేదియో ధ్వని వినుపించె. వెనుకం దిరిగిచూడ నొకపురుషుఁ డరుదెంచుచుండె. నతనికి నలుబదియైదు సం॥లు వయస్సు మీరియుండె. కనుబొమ లెపుడును ముడివైచుకొని యుండుటచే నతఁడు సహజక్రూరస్వభావుఁడని చెప్పక చెప్పుచుండును. అతఁడు గొప్పయింటితనము గలవాఁడని దుస్తులవలనను ముఖలక్షణముల వలనను యాభరణముల వలనను దెలియుచుండె. ఆతని నేత్రము లెఱ్ఱవారియుండుటచేతను నడచునపుడటుయిటు నూగాడుటచేతను మద్యపానమదోన్మత్తుఁడని దోఁచుచుండు నా పురుషునిఁ జూచినంతనే మన యశ్వారోహకుఁడు గుఱ్ఱమునుండి దబ్బునదుమికి "తమ్ముఁడా దుశ్శీలా! నీ యన్వేషణయు వృథయేనా? లేక యెందైనను నా పుత్రిక యగపడెనో చెప్పుమని యడిగె.

దుశ్శీ:—రాజేంద్రా! నాఁడు మీతో విన్నవించుకొని భువనమోహిని నరయుటకై వెడలినది మొదలీవఱకు నెన్నియో పర్వతములు చూచితి. నదులు పరికించితి. సరోవరములు గాంచితి. గుహలు పరిశీలించితి. లతాగృహములఁ బరీక్షించితి వృథమయ్యె. ఆమె భూమియందున్నదనుమాట

వదలవలసినదే. నేను నిరాశ చేసికొన్నాను. మీ మనం బెట్లున్నదో నేఁ జెప్పఁజాల.

విభా:—తమ్ముఁడా! నే నూరువెడలునప్పు డమోఘమైన శుభసూచకము లగపడియె. నింకను నా కూఁతురు జీవ వంతురాలై యున్నదనుకొన్నాను. వెదకవలయు నింత టితో చాలించుకొనుట తగనిపని. శంబరవర్మ యులూక సేనలెంౘెందు వెదకుచున్నారో పాపము.

దుశ్శీ:—లేదులేదు వారు నిన్న సాయంతనమున నుత్తర దిశ నుండి చనుదెంచిరి. యెందు నగపడలేదనిచెప్పి యిం దేదియో యొక పాడుదేవాలయము గలదనియు చూచి వచ్చెదమనియు పోయియున్నవా రీవఱకు రాలేదు.

విభా:—ఇంతటి క్రూరకార్య మొనర్చిన దురాత్ము లెవ్వరో వారెందరిగిరో తెలియలేదుగదా?

దుశ్శీ:—ఈ యడవిలో ముప్వురుపురుషు లపుడపుడొక్కొక చోట గూర్చొనుచుండుటయు మేము గన్నప్పుడు మరుగు పడుటయు తటస్థించుచున్నది. ఆ దురాత్ము లీకార్య మొనర్చియుందురని సంశయించుచున్నాను.

విభా:-చోరు లామెనెత్తుకొనివచ్చి యేమియొనర్చి యుందురు?

దు:—చంపి సొత్తులు గైకొని యుందురు.

విభా:—జగన్మోహనావతారము చేనున్న నాపుత్రికను జంపుట కెంతటి కఠినుఁడైనను బ్రయత్నింపఁడు. సొత్తులపై యాశగలవారు సొత్తు లపహరించి యామె నెందెందైనా విడిచి పోయియుందురు.

దు:—ఆశ బలీయమైయున్నప్పుడు సౌందర్యమును బాంధవ్య మును లెక్కింౘుతురా? చంపియే యుందురు. చంపకుండిరేని

ప్రపంచమున నున్నప్పుడెప్పుడైనను గుర్తించి తగు శిక్షలకు గురియైన ధూరని దుష్కార్యములు చేసియే యుందురు.

విభా:—నీకుమారులు నిన్న సాయంతనమునం దిం దేదియో దేవాలయమున్నది చూచివచ్చెదమని పోయినారని చెప్పితివే, అచ్చటికి మనమును వెళ్ళి చూచివత్తము రమ్ము.

గు:—నా బిడ్డలను గోల్పోయినవారివలె నీ యడవిలో వెదకి వెదకి విసుగుజనియించినది. మన అదృష్టవశమున భువనమోహిని యగపడెనేని నీ కోర్కెప్రకార మా భువనమోహిని లోమ కేశునకొసంగి యర్ధరాజ్య మొసంగుము. నీకు పుత్రులు లేరు. నీ కెన్నిసారులు చెప్పినను మనసుకు రాకున్నది. పుత్రులు లేనివారికి పున్నామనరకమును దరియించుటకు వీలుండదు. నా రెండవకొమారుని దత్తు తీసుకొనుము. మిగత అర్ధరాజ్య మతనికొసంగుము. వంశానుగతమైన మన రాజ్యము నితరులపాలొనర్చుట ధర్మమగునే యోచింపుము.

విశ్వా—సుశీలా! నా కేమియు దోచదు. నా పూర్వపుణ్యఫల విశేషముచే నా కూంతు రగపడెనేని నీసుతుని దత్తు తీసికొనినను దీసికొనకున్నను అర్ధరాజ్యము నీకొసంగుదును. మీరుమాత్రము రాజ్యార్హులుగారా?

అని మాటలాడుచు దేవాలయసమీపమునకుం జనిరంత రాజు భువనమోహిని యని యఱచె. 'లోపలనున్న బ్రాహ్మణులును భువనమోహినియు పరువెత్తుకొనివచ్చిరి. యామెను గన్నమాత్రముననే విభావసుండు గుఱ్ఱము నటు వదలి 'అమ్మాయీ నాతల్లీ! ప్రాణముతో నున్నదానవా'' యని దబ్బుకొని యేడ్చె. ''తండ్రీ! మిమ్ముఁ గనుభాగ్యము

గంటిని. మా తల్లి యెంత దుఃఖించుచున్నదో" యని భువన మోహినియు దుఃఖించె. నంత దుశ్శీలుఁ డామెనుగాంచి "కూఁతురా! మా పుణ్యవశమున నిన్ను గనుభాగ్యము గంటిమి. చోరులచేఁ జిక్కినది మొదలు లీవలకు నీనిమిత్తమే నేనును మాశంబరవర్మయును లూకసేనుఁడును దిరిగితిరిగి యవస్థపడుచున్నవారము. నేఁటికి మా యవస్థలన్నియుఁ గట్టెక్కిన" వనిన "పిన్నప్పా! నానిమిత్తమై మీరెంత కష్ట పడితిరో మాయన్నగారెందెందు వెదకుచున్నారో మీ రొనర్చిన సహాయమునకు మీకు మేలుచేయవలెనని భగ వంతుని గోరుచుండెద. మా యన్నగా రెందుబోయినది తెలియదుగదా?

దు—నిన్న సాయంత్రమునసే వారి దేవాలయము చెంత నెవరో గలరు చూచివచ్చెదమని యిటకు వచ్చిరి. మఱల వారి వఱకు నాచెంతకు రాలేదు.

భు—నిన్న సాయంత్రసమున నిచ్చటికి మా యన్నగారు రాలేదు. ఆ చోరులు ముప్పుఁ రరుదెంచి యుండిరి లోమ కేశుఁడు వారిం దరుముకొని యొకని మూర్ఛనొందించె. మఱియొకని తాపులకోర్వలేక పరువెత్తె. నీ బ్రాహ్మణులు నేనును నన్నుఁ బట్టుకొనియున్న మఱియొక చోరుని లోమ కేశునిచే మూర్ఛనొందిన వానినిబట్టి కాలుచేతులు బంధించి పాడుగుంతలలో ద్రొబ్బి వచ్చియున్నవారము.

విభావ—వారున్నచోటు యిచటి కెంతదూరము గలదు? యిపుడేపోయి చూచిరావలయుననిన వారందఱు సమ్మ తించి యచ్చటికిం బోయి చూడ నచ్చట నెవ్వరును లేకుండిరి. అందుల కా బ్రాహ్మణులు యోచించి సరిసరి

రోమకేశుం దరుముకొనిపోయిన మఱియొక చోరుఁడే వీరి కట్లువిప్పి తప్పించుకొని పోయియుండుననిరి అందులకు దుశ్శీలాదులు నిక్కమట్లే జరిగియుండునని యనుకొనిరి. దేవాలయముచెంత కరుదెంచి యొకచో నుపవిష్టులై వారందఱీరీతి ప్రసంగము గావించిరి.

దుశ్శీ—అన్నా! మనమనుకొన్నరీతి భువనమోహిని లభించి నది యిది సంతోషకాలము. మన భువనమోహినీ వివాహమును మీ [illegible]త్రపుత్రుని రాజ్యాభిషేకము నొనర్చుటకు మీ యభిప్రాయమేమి?

విభా—దుశ్శీలా! తొందరపడియెద వేల? మణిస్యందనమునకుం జని మీ వదినెగారికీ భువనమోహిని నొసఁగి వారి మనస్సు సమ్మతియొనర్చి యావల శుభముహూర్తము పొందుపఱచి రెండుకార్యము లొకేతూరి యొనర్పవలయు. నింతకు మన యులూకసేనుఁడు రాలేదు. రోమకేశుఁ డెచటికో పాఱిపోయియున్నాఁడు.

భువ—అప్పా! మా పినతండ్రిగారు నా నిమిత్తమై బహు ప్రయాసపడియున్నవారు. మా యన్నగారు నట్లే యీ యరణ్యములో దిరిగితిరిగి తుదకు దమయిష్టము నెఱవేఱక ప్రయాసపడుచున్నవారు. ఇపుడు వారందఱి యిష్టము సఫలమగునట్లు నేను లభించియున్నాను. వారలం బిలిపించి యులూకసేనుని మీరు దత్తుతీసికొని మీ వాక్యానుసారం బర్ధరాజ్యము పట్టాభిషేక మొనర్పుఁడు. మిగత యర్ధరాజ్యము మాకుండినం జాలు. వారి యిష్టమునకు వేఱుగా యోచింపఁగూడదు.

విభా—మీయందఱి యిష్ట మట్లుండునపుడు నాకును సమ్మ

విన్నవించుకొన్నాను. మా పితరులయిష్టమట్లనే యున్నది. నే నన్యథా యోచించుట తగనిపని. మా తండ్రిగారి కేది సమ్మతమో నేను నదియే సమ్మతించుచున్నాను.

సూ—నీవైన నమ్మహాత్మునం దరుదెంచువఱకు నిదానించుట మంచిదనకపోయితి వింతశీఘ్రమున నాతని మఱచిపోవుట తగదని మే మనుకొన్నాము.

భు—ఆ వసుంధరుం డరుదెంచిన మాచే గౌరవింపంబడును. నా వివాహమున కాతం డుండియే తీరవలయు ననునంతటి నిర్బంధమేమి?

సు—అనాండు లోమకేశు నంతగా దిరస్కరించి యింత శీఘ్రముగా మఱల నాతనినే వరియించితివి. నీబుద్ధి శుద్ధ బాల్యచాపల్యంబున నున్నదని దృఢపఱచుచున్నది.

భు—స్వామీ! మీరిట్లు న న్నధిక్షేపింపంగూడదు. సూక్ష్మ మెఱింగి యూరకుండవలయు. స్త్రీ లతి చపలులనుమాట మీరు వినినదేగదా! అనాం డావిధముగా మనసుండె. నేం డీవిధముగా మాఱియున్నది. మనసు నడ్డుపెట్టువారెవ్వరు! జ్ఞానము కలుగవలయు. నట్టి జ్ఞానధారణాశక్తి నాకు బాల దండుచే మా తండ్రిగారి యిష్టమునే నెఱవేర్పవలయు ననుకొని యున్నదాన నింక నూట్లాడకుండు మా తండ్రి గారికి కోపమువచ్చును.

సు—మీయిష్టము మాకేందుకా భ్రమత? మీ సుశీలా శ్రీపాదులగతి యేమయ్యెనో యని యనుకొనుచున్నం తలో వెలుపలనుండి,

“క. శీలాచారసుశీలా,

బాలా బాలేందుఫాల పలుక విడేలా

యేలాగైతి వోగద నా,
మాలిమి వీడకను జూచి మయిలల లలనా."

అని వినుపించె. బ్రాహ్మణు లిరువురు తటాలున లేచి బైటకరుదెంచి చూడ మన శ్రీపాదుఁడును, విశ్వావసుండు నగ పడిరి. వారలం గన్న మాత్రముననే సంతోషపరవశులై హెచ్చి "నాయనా! శ్రీపాదా! ప్రాణములతో నున్నవాఁడవా నాతండ్రీ! నేఁడు నా పూర్వపుణ్యవశమున నిన్ను మరలఁ గను గొంటిని" అని యాలింగనము చేసుకొని యానందబాష్ప ములు రాలుచుండ స్తబ్ధుఁడై కొంతదడ వట్లనే సూర్యనారా యణశాస్త్రి నిలచియుండె. శ్రీపాదుఁడు విశ్వావసుఁడు సుబ్ర హ్మణ్యశర్మకు నమస్కరించి నిలచిరి. "నాయనా శ్రీపాదా! నా కూఁతురు సుశీల నీ కగపడలేదా? ఆమె సంగతి నీ వేమైనఁ దెలిసికొని యున్నావా? నీ వృత్తాంతమేమి? విశ్వావసుం డరుదెంచియున్నవాఁడు నాగతి యీవిధమైనది." "బావా! నీ వెందుండి చనుదెంచితివి? నీ మేనగోడలి సమాచారము నీ కే మైనఁ దెలిసెనా? తుదకు మాగతి యిట్లయ్యె" నని సుబ్ర హ్మణ్యశర్మ యేడ్చె. బావమరఁదు లిరువురు నొకరినొకరు దబ్బుకొని యేడ్చి రంత శ్రీపాదునింగాంచి "నాయనా! నీకథ నంతయు భువనమోహినీదేవివలన వింటిని. సుశీల వృత్తాంత మేమైనఁ దెలిసియుండినఁ జెప్పు" మనియె. నంత విభావసుడు "బావా! మనసుశీల కాశీనగరమునందుండె. నేనె దోడ్కొని వచ్చి ప్రయాగయందు మాయక్కగారియొద్ద విడిచితి నామె సుఖముగానుండె. మూఁడవదినమున నందఱు నిద్రించుచుం డఁగా మఱల కనఁబడుకున్న దదియేమి మాయయో యా వృత్తాంత మెఱింగి యా శ్రీపాదుఁడు ప్రయాగకరుదెంచె.

నామె కనబడలేదని మేము యోచించుచుండి యీతనికిం దెలియఁజేసితి మపుడే యీ దేవాలయము చెంత కరుగవలయు నని ప్రయాణమయ్యె. నొంటిగా వెడలుట బాగులేదని నేను నీతనివెంటఁ జనుదెంచితి. నిదియే మాకథ'' యనిన సుబ్రహ్మణ్యశర్మ దుఃఖ మధికమైన భువనమోహినీదేవి యాతనిం గాంచి ''స్వామీ! దుఃఖింపకుఁడు. ఆదురాత్ముఁడైన భేండాభైరవుఁడు నిర్యాణమైయున్నవాఁడింక నట్టిక్రూర కార్యములొనర్చువారెవ్వరునుండరు? ఆమె యెందుండినను సుఖపడుచుండును. గష్టకాలము గడచనినది. కాఁగలకార్యములు కాకమానవు. మీరు విద్వాంసులై యుండియు నిటు చింతించిన లాభముండదు. అన్నియు భగవంతుని యాజ్ఞానుసారమే జరుగును యూరకుండుఁ'' డని యూరడఁ బల్కుచుండఁగాఁ దెల్లవారె. జగద్బాంధవుఁ డఖండ తేజఃప్రభాపటలిచే బ్రహ్మాండమంతయు నిండుకొనిన యంధకారము నడుగంటఁ జేయుచుండె. యాజ్ఞీకమునకు వలయు సంభారములు సమకూర్చుకొని దుర్శీల శంబరవర్మ యులూకసేనాదులు లోమకేశుం దోడ్కొని వచ్చుచుండిరి రాజు వారలంగాంచె. లోమకేశుండు ఖిన్నుఁడై తలవాల్చియుండె కారణంబెయ్యది యని విచారింప దుర్శీలుఁ డిట్లనియె.

''రాజేంద్రా! మేమీ సామగ్రి సవరించుకొని వచ్చుచుండ నీతం డొకప్రమాని కొమ్మను వ్రేలఁదీయఁబడి యేడ్చుచు నుండె మే మీతనిం గాంచి కట్లువిప్పి కొమ్మనుండి దించుకొని యితనికథ నెంత విచారించినను చెప్పఁడయ్యె. మీచెంతకు దోడ్కొని వచ్చియున్నాము. విచారింపవలయు'' ననిన యాతని దీనదశంగాంచి రాజు పరితాపముచే ''లోమకేశా!

యెందుకింతటి ఖిన్నుఁడవై యున్నవాఁడవు! నిన్నట్లు వ్రేలఁ దీసినవారెవ''రనిన రాజునకు నమస్కరించి తననిజస్థితిని జెప్పుటకు నేమేమియో యోచించి "మామా! మన భువన మోహినీ యుపకారకులగు చోరులు నిన్నసాయంతనమునం దగపడుటచే వారితో గయ్యమొనర్చి వీరందఱియెదుటనే యొకనిని మూర్ఛనొందించితి. మఱియొకనితాపుల కోర్వలేక పరువెత్తితి. నతఁడు నన్ను దరిమిపట్టుకొనియె. యోపినంత పోరాడి తుదకు వానిచే జిక్కితి నన్ను కాలుచేతులు బంధించి మ్రానికొమ్మకు వ్రేలఁదీసి వెడలిపోయె నప్పటినుండియు బాధ నొంది తుదకు ప్రాణనాళములలోని రక్తమంతయు కంఠగతమై యూపిరివిడుచుటకు సిద్ధుఁడనై యుంటి నిపుడు వీరరుదెంచి నన్ను బంధవిముక్తునిజేసి మీరు వచ్చినారని చెప్పిరి. నేనిట కరుదెంచితి'' ననియె. నప్పుడు రాజు దుఃఖించి "అయ్యో! నాకూఁతురు కొఱకై మీరందఱెంత బాధనొంది యున్నవా'' రని పశ్చాత్తాపముతోఁ గొంతదడవుండె. హోమమునకు నలువురు బ్రాహ్మణు లొకచోఁ జేరినందులకు దుశ్శీలాదులు పరమసంతోషమందిరి. హోమకుండంబు త్రవ్వబడియె సమిధేధ్మదర్భాజ్యాహుతిస్రుక్స్రువకలశవస్త్రపరిస్తరణ పాత్రలాజ మధుదధిక్షీరద్రాక్షాగుడ శర్కరఖర్జూరాదిద్రవ్యంబులు హోమకుండంబుచుట్టు నలంకరించిరి. విభావసునానతి లోమకేశాదులు మంగళస్నానం బొనరించిరి. శ్రీపాద సుబ్రహ్మణ్యశర్మ సూర్యనారాయణశాస్త్రి విశ్వావసు శర్మాదులు ఋత్విక్కరణంబులు గైకొనిరి. అపుడు రాజు లోమకేశుంగాంచి "నాయనా! నాకొమార్తె భువనమోహిని నొసంగి నీకర్ధరాజ్యమిచ్చెద. దుశ్శీలుని రెండవకొమారుఁడైన యులూకసేనుని

వత్తు గైకొని మిగతయర్ధరాజ్య మతని కొసంగెద. నిందులకు మీరందఱు సమ్మతింపవలయు"నని లోమకేశుఁడు మంగళ స్నాతయై యలంకరించుకొనుచున్న భువనమోహినిం గాంచె. నామెయు మందహాసముచే నోరగంట నాతనిం గాంచుచుండె నదిగాంచి లోమకేశునకు నాయాసమంతయు నెచటికోపోయి దేహ ముప్పొంగి "రాజేంద్రా! నావివాహమునకు మాచిన్న యత్తగారు వచ్చియుండిన బాగుండు" ననియె. దుశ్శీలుఁ డేతెంచి "యీపుత్రస్వీకారమునకు మాపెద్దవదినెగారు వచ్చి యుండిన సర్వసమ్మతముగా నుండు" ననియె. రాజు యోచించి "అమ్మా భువనమోహినీ! నీవివాహమునకు మీతల్లిగారు రావలెనో వలదో చెప్పుము. నీయిష్టానుసార మాచరించెద" ననియె. భువనమోహినియు దలవంచి కనుబొమలు ముడివైచి కోపమునఁ దలఁద్రిప్పుచుండె చెప్పుము చెప్పుమని యందఱు బాధించిరి. వారి బలవంతమునకుఁ దట్టుకొనలేక "జరుగు కార్యములకు యొకరేల రావలయు? రాకున్న నిలచునే? కార్యానంతర మచ్చటికిఁ బోఁగూడదో వారుసంతోషింపరో అన్ని కార్యములకు నాలస్యమేల? వారేమి యీమహోత్సవము నకు రావలసిన యగత్యము లేదు. ప్రపంచమున వివాహ ములు దత్తస్వీకారములు జరుగుట యపరూపమా? లగ్నము సమీపమగుచున్న దేవోమాటలచేఁ గాలహరణమేల? జరుగ వచ్చు"నని యూరక నేలఁజూచుచు నిలచియుండె. మరల రా జామెంగాంచి "తల్లీ! లోమకేశుని పెండ్లియాడుట నీకు సమ్మ తమేనా" యని యడిగిన చిఱునగవుతో సిగ్గునం దలవాంచి వచ్చియు రానిస్వరమున ఊయని యూకొట్టె. అపుడందఱు "శుభమస్తు యిఁక లగ్నము సమీపించుచున్నది రం"డని

విభావసు నులూకసేన దుశ్శీలుర నొకప్రక్కను భువనమోహిని లోమకేశుల నొకప్రక్కను గూర్చుండ నియమించి భూసురులు వేదమంత్రములు జదువుచు నాందీ స్వస్తివాచనము లాచరించి తొలుత దత్తహోమము జరగవలెనని సుక్స్రువములచే నాజ్యహోమం బాచరించుటకై బ్రాహ్మణు "లగ్నయే స్వాహా అగ్నయయిదం నమమ" అని చెప్పుచుండ రాజు వారలంగాంచి "బ్రాహ్మణోత్తములారా! ఇట్టి సమయము లందు జరుగు మాపద్ధతులు మాపౌరోహితులకే తెలియును. ఇతరులకుం దెలియదు. మాపౌరోహితులు గారేదు. నాకను భవముగల దామంత్రములు నేనే జెప్పి నేనే యాహుతు లొసంగెద" నని చెప్పి "అగ్నయేస్వాహా! అగ్నయ ఇదం నమమ" అని యగ్నిలో నాజ్యాహుతివేసి తనప్రక్కన గూర్చొనియున్న యులూకసేనుని చేయింబట్టి లేవఁదీసి యూతని కేశములం బట్టుకొని మూఁడుగ్రుద్దులు గ్రుద్ది "యులూకసేనాయస్వాహా" అని యెత్తి నోటిలో వేసికొని పటపటమని కపాలముబగుల నమలి చప్పరించి "శంబరవర్మాయేదం" అని శంబరవర్మను వామపాదముచేఁదన్ని అగ్నికుండములో ద్రొబ్బి త్రేపె. నదిగాంచి భువనమోహిని చివాలునలేచి "లోమ కేశాస్వాహా" యని భయంకరముగా నోరుదెఱచి లోమ కేశుని దలకొఱికి నమలి దేహము నగ్నికుండములోకి ద్రొబ్బె నదిగాంచి అయ్యో! అయ్యో! యని యఱచుచు దుశ్శీలుఁడు పరువెత్తుచున్నఁ దరిమి పట్టుకొని "దుశ్శీలాయేదన్నమమ" యని భయంకరత్రిశూలమున నాతనిం గ్రుచ్చి కేలీకరాళభయ కరదంష్ట్రిజ్వాలలతో కాళికాశక్తివలెనున్న గాంచి బ్రాహ్మణులదర "ఖట్ఫడ్జహి ఛి దీ భిందీ హందీ ఫట్" యను వేద

మంత్రముల నుచ్చరించుచు భయపడియున్న వారలం గాంచి "బ్రాహ్మణోత్తములారా! మీరు భయపడకుఁ"డని చెప్పుచు వికారముగా నవ్వి యరణ్యము ప్రతిధ్వను లిచ్చునట్లు ఆర్భటించి తనచేతనున్న ఖడ్గము ఝుళిపించుటచే గొప్పమెఱుపు గలిగినట్లయ్యె. శ్రీపాదులు దిగ్భ్రమనొంది కన్నులు మోడ్చిరి. అందఱు అదృశ్యులైరి. అస్థలము బయలయ్యె.

---

# ౧౧ వరాహ ప్రకరణము

పరమపురుషా! యని పర్వతాగ్రమునుండి వసుంధరుఁడు జరతలోనికిం బడియె నపుడాతని కేదో చేయూత గలిగి నట్లును తన్ను బట్టుకొని మెల్లన నిసుకదిబ్బపైఁ బరుండఁబెట్టి నట్లును దోఁచె నందుచే నాశ్చర్యమును సంతోషమును భక్తియు విశేషించి భగవంతుని ధ్యానించి "యానాఁడు, గుహాయందు రక్షించిన పరమేశ్వరుఁ డీనాఁడును రక్షించి యున్నవాఁడు లేకున్న యగాధమైన జరతంబడి యేమాత్రమును బాధలేకుండుటకుఁ గారణమేమి? హాపరమపురుషా!" యని తూర్పుదిశగా నిలువంబడి చేతులు జోడించుకొని,

"శ్లో. శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం,
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందేవిష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం"

అని నమస్కరించి మరల "ఆహా! యీలోమకేశుని కేమి దుర్బుద్ధియో నేనుండిన భువనమోని దన్ను వరింపదని

యు నన్ను సంహరించినఁ దనకు నిరర్థ్యతరమనియు నీమోసకృత్య మొనరించి యున్నవాఁడు. "అయ్యో పామరుఁడా! యింతటి ఘోరకార్య మొనర్పవలయునా? నాకు వలదని యకాలాంతను దనకే యిప్పించుటకు బ్రయత్న మొనర్తునే కానిమ్ము. విధికృతమును దప్పించువారెవరున్నారు? ఆనాఁడా దురాత్ములైన చోరులు తమ ప్రయత్నమునకు విఫలముగా నకాలాంతం దప్పించితినని కోపముచే నన్ను సంహరింప నుద్యమించి మోసముచేసి యీ భయంకర గుహలో (అబ్బా ఆ గుహాయన్న నాగుండెలు నీరగుచున్నది) ప్రవేశింపఁజేసి కోపగించిరి. అన్నియు దైవకృత్యములే. తప్పించినదియు దైవకృత్యమే. అస్వతంత్రుఁడగు దేహధారి యత్న మేమిజరగు" ననుకొనుచు నలుప్రక్కలం గాంచినను వెడలుటకు దారియే యగపడదయ్యె. చుట్టు మహోన్నతపర్వతములే యగపడుచున్నవి. యెందుగన్నను ఘూకధ్వానములు చెలరేఁగుచుండె. వరాహములు ఘుర్ఘుంధ్వనుల నీనుచుండె. మత్తేభములు బృంహితము లొనర్చుచుండె. సింహములు గర్జించుచుండె. ఏ దారిగాంచినను శిగిపొదలు, పరికికంపలు, రేణిముండ్లు ప్రబలుకొని యొకటిపై నొకటి విజృంభించియుండె నపుడు వసుంధరున కేమియుందోఁపక "మహా విపత్తులయందు రక్షించిన పరమేశ్వరుఁ డిపుడుమాత్రము రక్షింపఁడో కానిమ్ము. ఈ వెన్నెలయుం దేదియో యొకసందు గల్పించుకొని పోయెద" ననుకొని యా రాత్రివేళలోనే పూర్వాభిముఖుఁడై చెట్లక్రింద దూరుచు శిగిపొదలం దప్పించుకొనుచుఁ బోవుచుండ పర్వతమునందు గలబండసరికెలనుండి నీటికాలువ వచ్చి లోయలోనికి దుముకుచు డనా ప్రవాహము చెంతఁజేరి

తిన యుడుపులుదీసి యొక బండపైఁ బెట్టి పరిశుద్ధజలములం దాయాసపరిశ్రాంతి యగునట్లు స్నానంబొనర్చి నిర్మలోదకం బులం గ్రోలి "యీ రాత్రి యీ బండపైననే పరుండి యుద యమున వెళ్ళెద" ననుకొని యచ్చటనే శయనించి ప్రత్యూ షంబున లేచి కాల్యకృత్యములఁ దీర్చికొని యలంకరించుకొని ధనుఃఖడ్గతూణీరములు సవరించి యానీటికాల్వ కానుకొని దక్షిణదిశయందుగల మిట్టప్రదేశముపై మార్గము కల్పించు కొని "యీజరత యెంతవఱకున్నదో దీని ననుసరించియే పోయెద" ననుకొని పోయిపోయి యచ్చట నొక మున్యా శ్రమంబుఁ గనియె. నా యాశ్రమమున పలువిధ పుష్పసుక రందముం ద్రావిఝుంకృతు లొనరించుచున్న తుమ్మెదల చేతను, రసాలకిసలయంబుల మెసవి కుహూకారమొనర్చు కోకిలచేతను, బరిపక్వఫలరసముం గ్రోలి మనోహరంబుగఁ బలుకుచిలుకలచేతను, నవతృణపురోడాశాదులం దిని శృంగ ములు తరుమూలములకు రాయుచు రింగురింగున నెగసి దుముకుచున్న మృగములచేతను, సహజవైరంబుగల మార్జాల మూషకములును గజకేసరంబులును నకులపన్నగంబులును శ్యేనకపోతంబులును నతిమైత్రి మెలఁగుచు నొకటితో నొకటి క్రీడసల్పునంతటి శాంతప్రధానంబగు తపఃప్రభావంబుచేతను బ్రకాశించుచుండె. కొందఱు శిష్యులు సమిధలు దర్భలు పుష్పములు గోయుచుండిరి. కొందఱు తైత్తిరీయంబున నారాయణంబు వల్లె వేయుచుండిరి. కొందఱు మహాన్యా సంబును, కొంద ఱారుణమహాసౌరంబులును పఠించుచుండిరి. ఇట్టి పరమపావనమైన మున్యాశ్రమముం బ్రవేశించి చూడ తన్మధ్యంబునం దఖండబ్రహ్మతేజోనిధియై పరమ నిష్ఠా

గరిష్ఠుండై నిమీలితనేత్రుండై పూర్వాభిముఖుండై కుశద ర్భాస్తరణుండై దండకమండలము లొప్పార రుద్రాక్షమాల లురమునందు మెఱయ భూతిపూఁతచే దేహంబంతయు ప్రాలే యావృత హేమకూటపర్వతంబురీతి నుండ నచలమనంబుతో సాక్షాచ్ఛంకరునింబోలి తపమాచరించుచున్న యొక్కమునీం ద్రుంగనియె. నమ్మునీంద్రుఁడు సమాధియం దచలుండై యుండుటచే మాటలాడింపక చేతులు జోడించుకొని ప్రదక్షిణ నమస్కారం బొనర్చి యాశ్రమశిష్యులొసఁగు కందమూలా దులు భక్షించి తృప్తిఁజెంది సమాధియందున్న వారల మేల్కొల్పరాదనుకొనుచు నా యాశ్రమంబు వాసి పూర్వాభి ముఖముగా నట్లనే జనుచుండ కదళికారణ్యంబొండు గాన నయ్యె. తన్మధ్యంబునం దమృతసరోవరంబులు రెండు ప్రకా శించుచుండె నదిగాంచి కదళీఫలములు భక్షించి సరోవరంబున నీరుద్రావి కొంత యాయాస మపనయించుకొని యాయరఁటి తోఁపును దాఁటి కొంతదూరం బరుగ నచ్చట పలువిధ మణు లచేఁ దాపింపఁబడిన బంగారుగోడలచేతను జంద్రకాంత సోపానములచేతను నింద్రనీలమణి పరికల్పిత ద్వారముల తోడను స్ఫటికశిలలచే నొనర్పఁబడిన గవాక్షద్వారముల తోడను బగడంపు దూలములతోడను బ్రకాశించుచున్న యొక్క దివ్యభవనంబును గాంచె. ఆసౌధమునకు నలుదశల యందును గదళీతరువులే యొప్పారుచుండె. నా కదళీవనమునకు దక్షిణదిశయందొక యుద్యానవనము విలసిల్లుచుండె. నందు కేళాకూళులును బూవుటీరములును జలయంత్రములును వట్టి వేళ్ళ చప్పరములును గృతకాచలంబులును గలవు. అచ్చ టచ్చట వరుసవరుసలుగా యారకూటపాత్రంబులయం దనేక

విధ పుష్పలతలును విదేశీయతరువులును నెలకొల్పియుండిరి. ఒక్కొక్కచో జలయంత్రములకుఁ జుట్టు మనోభిరామంబుగా వర్తులాకారముగా సాలగ్రామశిలలఁ బొందుపఱచి తన్మధ్యంబునం దేడాకులరఁటిచెట్టులఁ శోభించియుండిరి. మఱికొన్నిచోట్ల చంద్రకాంత శిలలచేఁ జతుష్కాష్టకోణంబులం దీర్చి యందు ననేకములైన పూలచెట్ల నాటియుండిరి. కొన్నిచోట్ల యవధులు గల్పించి యందుల కొకద్వారంబు నేర్పఱచి యా ద్వారములకు బుష్పలతల నల్లించి యుండిరి. కనుల పరిమళవిలసిత నిర్మలోదకంబులగు కాసారంబులు గలవు. కొన్ని పెద్దపెద్దవృక్షములు గలవు. కొన్నిచోట్ల కేతకీపుష్ప విరాజితంబై యుండె. కొన్నిచోట్ల సంపంగితరువులు ప్రకాశించుచుండె. కొన్నిచోట్ల పొన్నలు పొగడలు గలవు. రుద్రాక్షతరుల కల్పించి పందిళ్ళువైచిన ద్రాక్షతీఁగె లల్లిబిల్లిగొని యేలకితీఁగెలతోఁ బెనఁగి హృదయంగమంబై గన్పట్టుచుండె. గుజ్జుమామిడులు కపిత్థవృక్షములు జంబీర మహీరుహములు బహుబీజద్రుమములు నారింజలు కాదులు నారికేళములు గొల్లలుగానిండి యింద్రుని నందనమో కుబేరునిచైత్రరథమో శ్రీకృష్ణుని బృందావనమో యనఁ బ్రకాశించుచుండె. మనవసుంధరున కాసౌధముకన్న నుద్యానవనమే కడురమ్యమై తోఁచిచూడ నభిలాషవొడమి వనంబునం బ్రవేశించి పుష్పసౌరభముల కానందమొందె. ఫలవిశేషములకుఁ దృప్తివహించె పక్షుల కలకలధ్వనులకు విరాళిచేఁ దహతహపడియె. మందమారుత మల్లనల్లన వీఁచె. "ఆహా! యిట్టివనంబులందు విహరించుట కొక్క కాంతయుండవలదా! మానవజన్మసౌఖ్యం బనుభవింపవలెనన్న తరుణియేగదా స్వర్గ

సోపానము. భార్యయేగదా సమస్తకష్టలతాలవిత్రము. పౌలం
తియే గదా వంశాభివృద్ధికి మూలము. సతియేగదా మోక్ష
గతులకు ఘంటాపథము. నఖిలవిద్య నభ్యసించితి. ధనుర్వి
ద్యయం దసమానుండనైతి. మహర్షులదయకుం బాత్రుండ
నైతి. నిదివఱకు బాల్యావస్థయందు వర్తిల్లితి. పరమపావన
మైన శరీరంబను యుద్యానవనసహకారవృక్షమునకు యౌవనం
బను వసంత ఋతుధర్మం బావహిల్లియున్నది. ఈ రామణీయ
కంబును యీ సౌఖ్యంబు ననుభవించుట కంగనాసమేతులయిన
పుణ్యపురుషులకు స్వర్గమేల? జీవహింసాపరాయణములగు
యజ్ఞాదు లొనరించి దేహాంతమందు రంభాద్యప్సరసాసంగమం
బాశించు టేల? సర్వలక్షణసమన్వితయుం బతివ్రతాశిరో
మణియు దానధర్మపరోపకార దయాదాక్షిణ్యాది సద్గుణ
పట్టభద్రయు నిరవధికయౌవనారంభసంరంభతనూవిలాసయు
నగు నొక్క కాంతాకరగ్రహణానందలహరీనిమగ్నుండై
గృహస్థాశ్రమం బవలంబించిన ఘనుండే నరకద్వారబంధి
తుండు. గృహమేదియే స్వర్గమోక్షద్వార విపాటితుండు.
అట్టివానిదే జన్మము. వాఁడే కృతార్థుఁడు. గృహస్థాశ్ర
మంబునకు సమమైన యాశ్రమముగలదా? అతిథుల నభ్యా
గతుల నాదరింపవచ్చు. సర్వ ఋణములం దీర్పవచ్చు. షోడశ
మహాదానంబు లొనరింపవచ్చు. భార్యతో సమస్తేంద్రియ
సుఖంబు లనుభవింపవచ్చు. పరమాత్మతత్వం బెఱుంగవచ్చు
నిట్టి వర్ణనీయమైనదగుటచే శ్రీకృష్ణభగవానుఁడు ''ఆశ్ర
మాణాంగృహస్థోఽస్మి'' అని చెప్పియున్నాఁడు. నేనీ బ్రహ్మ
చర్యంబున నవివాహితుండనై దిరుగాడిన నా యౌవనమును
నా సౌందర్యమును వృథయేగదా? సర్వవిధముల నాచే రక్షిత

మైన భువనమోహిని గాంచ నుఱ్ఱూతలూఁగుచు నా దేవా లయమున కరఁగుచుండ నీదురాత్ముఁడిట్టిమోసం బొనరించి యున్నవాఁడు. హా భువనమోహినీ! నీ కరగ్రహణభాగ్యము నాకుఁ గలదా? మరుఁడు రువడించి విరిశరముల నాయురముసఁ గురిఁ జేయుచున్నావాఁ" డనుకొనుచు నొక్క లతాభవన మున జంద్రకాంత వేదికయందు గూర్చొని మనశ్చాపల్య మానుండై యీ యమరావతీసన్నిభ రామణీయకంబగు సౌధం బెవ్వరిదియో యిందుండు వా రెవరో యీ యుద్యాన వనం బేదేవేంద్ర విహారయోగ్యమో యీ సౌధంబునం దెవ్వరుగలరో పరికింపక యీ యారామ సౌరభ్యముల కానందమొంద చూచుటకై చనుదెంచితినని విరహోజ్వలము లగు యోచన లేమేమియో సేయుచుండ నచ్చటనుండియో,

క. వలమై కుంకుమగంధో,
జ్వలమై హారిద్రచూర్ణ సౌరభ్యంబై
పలువిధ గంధావిలమై,
మలయానిలుఁ డపుడు వీచె మనమటు దూలన్.

ఆ సుగంధమున కానందమొంది పచ్చకర్పూర కస్తూరీ పుష్పాదులతాదు లీవనంబునం దుండుననియే హారిద్రాచూర్ణ కుంకుమగంధం బేతెంచుచున్న దిందులకుఁ గారణం బెయ్య దియో యిం దెవ్వరయినా దివ్యాంగనలో కిన్నరమాన వతులో యక్షకామినులో మనుజభామినులో యుండవలయు. లేకున్న నీ సర్వగంధసంకీర్ణంబగు హారిద్రాచూర్ణకుంకుమ గంధం బేతెంచుటకు కారణం బుండదని యోచించుచుండ మదవతు లిరువు లాయారామంబున మాటలాడుచున్నట్టు దోఁచె. "ఔరా! నేననుకొన్నట్టులే యిందెవ్వరో సుందరు

లున్నవారు చూడనభిలాష వొడముచున్నది. ఇపుడు మనం బును జిక్కబట్ట నసాధ్యంబై యున్నది. పోయిచూచిననేమి! చూచివచ్చెద"నని నట్టెలేచి చంద్రకాంత శిలయందు బ్రతి ఫలించుచున్న తనమూర్తిం బరికించి యుత్తరీయాదులు సవరించి యాభరణములఁ బొందుపఱచి వడివడిగా దక్షిణాభి ముఖుండై యావనంబుననే పోయిపోయి, యొక్క సరోవర పూర్వభాగంబున గొజ్జంగి మానవులనీడయం దింద్రనీలమణి వితానంబుపై నల్లిబిల్లిగొన్న లతామంటపాంతరంబునం దాసీనలైయున్న తరుణుల నిద్దరం గాంచి "యాహా! యీ కాంతలసితపక్షంబునం దంబరంబు విడిచి ధరణింజరియించి నీరజారికలలో జగజ్జగీషచ్ఛచే బుఁజికిలిచేసి విలాసార్థం బిందుంచియున్న పుష్పబాణుసాయకములో, కలకాలం బంబు దంబులదండ నుండ వేసటయై ధరణిని మెఱయుచున్న విద్యు ల్లతలో యీతనూ విలాసంబుల నెన్నదరమే" యని యుర్వీభర్త్రం జని లతాగృహపార్శ్వంబునందు నిలచి వేరేమి సంభాషించెదరో వీరెవ్వరో వీరిమాటలవలన నెఱుంగ వలయు నేనిందే మఱుగుననుండి వినుచుండెద ననుకొని తరులతాచ్ఛాదితుండై యందు నిలచియుండె. నా తరుణు లీరీతి సంభాషించుచుండిరి.

౧:—అయితే నావలెనే నీవును పాపి ఖేండాభైరవునివాతపడి యున్నావే!

౨:—నీ వాహింసాలయములోనికిం బోకనే తప్పింపఁ బడితివి. నాగతి యట్లుగాదు. నాకొప్పుబట్టుకొని వంచి కత్తిపై కత్తి నఱుకుచున్నప్పు డమ్మహానుభావుఁడువచ్చి నన్ను రక్షించె. నాకు దేహముపై బ్రజ్ఞయే లేకుండె. అట్టి వేళలో రక్షించిన

మహాత్మున కభ్యుదయము గల్గవలెనని భగవంతుని ప్రార్థించుచున్నదాన.

౧:—మావారినిసహ రక్షించెనని చెప్పితివిగదా యా వసుంధర భూపాలుఁ డెందఱి ప్రాణసంరక్షణ చేసియున్నాఁడు?

౨:—అప్రతాపము ఆ దయారసము యా తేజస్సు చెప్ప నలవియైనదికాదు. రెండవ కళాభానుఁ డనుపించుచుండె.

౧:—నన్ను రక్షించినందుకు బేతాళుని బంధించిన యా దుర్మార్గుఁ డెంత సాహసపరుఁడో యెట్లు సంహరించెనో అబ్బా యేమి ఆ వసుంధరుని ప్రతాపము.

౨:—సుశీలా! ఆ భేండాభైరవునిం బట్టి కట్టునపు డాతనిం గాంచిన యెంతటివారికైనను గుండె నీరగుచుండును. ప్రళయకాలము నాఁటి రుద్రుఁ డేమైనా యిందు జనిం చెనా యనుకొంటిని. మీయజమానుఁడు, వీరసేనుఁడు దిగులుపడి రథమునుండి దూఁకి యాతని చెంత నుండుటకు భయపడి పర్విత్తిరి. నేనుమాత్రము ప్రాణములఁ జిక్కబట్టికొని చెంతనే నిలచియుంటిని.

సుశీ:—భువనమోహినీదేవీ! నీవుఁ చెప్పినట్టు మాతండ్రి యింకను ఆదేవాలయములోనే యుండునో లేక మా యూరికిఁ బోయియుండునో నీకు దెలియదా?

భువ:—తొలుత నేను దొంగలచే జిక్కినపుడుమాత్ర మందే యుండిరి. బేతాళుని బంధవిముక్తియైనపుడు మరల దేవా లయముచెంతకు నన్ను దెచ్చియుండిరిగాని అపుడు నేను వారిని జూడలేదు.

సుశీల:—మఱల నెందెందు వెదకుచున్నాఁడో మనగతి యెపుడు నీలాగు దుఃఖంచవలసినదిగా వ్రాసియున్నది.

ఇచ్చటనుండి మనవారిచెంత కెపుడుపోదుమో సంతో షము నెపు డనుభవింతుమో యిచ్చటికి మనల దెచ్చినవా రెవరో యిది యేలోకమో నాకేమియుఁ దోఁచకున్నది.

అని యొకరికొకరు తలపోసికొనుచుండ మఱుఁగున నున్న మన వసుంధరునకు మనసు నిల్వకపోయెను. దానను కొన్న భువనమోహిని యిందెందుకు జనుదెంచెనో యీమె మాత్రిపాదుని సుశీలయయి యుండవలయు. ఎన్నఁడును లేని విరహతాపము నాకీదినమందు గలుగుటేమి? దేవాలయము చెంతకుఁ బోవుచున్న నన్ను మోసపుచ్చి లోము కేశుఁడు జర తలోఁ బడఁద్రోయడమేమి? నాకేమియు బాధగల్గకుండునట్లు పరమేశ్వరుఁడు రక్షించుటేమి? యీదివ్యోద్యానమునం దీ భువనమోహినిం గాంచుటేమి? ఆహా! అఘటనాఘటనచాతు ర్యశక్తి గల పరమేశ్వరుని నే నెంతని కొనియాడుదు? నిఁక మనము స్థిరపెట్టఁజాలఁ బోయి చూచెద ననుకొని వారున్న లతాగృహద్వారకోష్ఠంబునందు నిలువంబడియె. వారును నాతనింజూచి తటాలున లేచి నిలువంబడిరి. యొకకాంత వెను కలకొదిగి నిలచె. మఱియొకకాంత మహాదాశ్చర్యపరవశు రాలై చేతులు జోడించుకొని యాతని చెంతకు రెండడుగులిడి "మహాపురుషపుంగవా! ఆర్తరక్షాపరాయణా!

సీ. అలనాడు ఘోరచోరగ్రాహియై యున్న
నన్ను బ్రోచిన నరనాథుఁడీవె
క్రూరరాక్షసఖేండభైరవాశ్రమమందు
ఖండింపనీయని ఘనుఁడవీవె
చండభేండాసురోద్దండంబు ఖండించి
బేలాను రక్షించు వీరుఁడీవె

మనుజహింసాపరాయణులైన చార్వాక
బృందంబు ద్రుంచిన విభుఁడవీవె
గీ. ఆర్తులను దీర్చు సద్గుణస్ఫూర్తివీవె
బహుళతపఃఫలసామ్రాజ్యభర్తవీవె
దైవతాంశప్రభూతసద్భావుఁడీవె
శ్రీవసుంధరదివ్యమూర్తీ నమస్తే."

యని నమస్కరించి నిలువంబడియున్న భువనమోహినిం గాంచి వసుంధరుఁడు కేమియుం దోఁపక సంతోషమునకు మేర లేక యానందమును బట్టఁజాలక విరహవేదనకుఁ దాళక "తరుణీ! పరిమితిలేని మోహోన్మాదంబునందున్న నాకు రసాయనంబై తోఁచి నిం దగపడుచున్నదానవు. బేతాళునిచే యామహాటవియందు దేవాలయంబునం దుంచఁబడియున్న నీవిమనోహరోద్యానవనంబున కెటుచనుదెంచితివి? ఈభోగవతీసమానసౌధంబు చెంతనుండుటకుఁ గతంబెయ్యది? నీచెంతనున్న యికాంతావతంసంబును గన్న సోదరీభావం బుజ్జూతలూఁగుచున్నది. ఈ సతీమతల్లి నామాతురంబు లెయ్యవి? మీకిరువురకు సంతోషంబు గలుగుటెట్లు? నిక్కముగా నీవు భువనమోహినివో లేక నామనఃపద్మసంచరితమోహినీదేవతవో నేను నిక్కముగా వసుంధరుఁడనో కానో యిది భూలోకమో పాతాళలోకమో తెలియకున్నవాఁడ నీకథ వివరింపుము."

భు:—పురుషోత్తమా! బేతాళబంధమోక్షణానంతరము నన్నుఁగొని దేవాలయంబునం దుంచునట్లు తమచే నియమింపఁబడిన బేతాళుఁడు నన్నా దేవాలయము చెంతకుఁ గైకొనిచని యందునిల్పి యావల తానెందో చనియె. అందెవ్వరును లేకుండిరి. భూసురు లగపడలేదు. కొంతదడ వున్నంత

నాకు నిద్రవచ్చె. మేల్కాంచునరి కిందున్నదాన. యిది యేలోకమో నన్నిచటికిం దెచ్చినవారెవ్వరో యెఱువచ్చి తినో నే నీమేడయందు మేల్కాంచిచూడ యాభూసురాం గన దుఃఖించుచు నొక్కశయ్యాతలంబుపైఁ గూర్చొని యుండె. నీమెను విచారించితి మన సుబ్రహ్మణ్యశర్మగారి కూఁతురు సుశీల యీమెయేనఁట. మన శ్రీపాద బ్రహ్మ చారి యీమెకొఱకు యిడుములంబడి మీచే రక్షింపఁబడి యున్నవాఁడు. నేనును యీసాధ్వియుఁ బాపి ఛేండాభైర వుని బారింబడి మీవంటి మహానుభావులచే రక్షింప నైతిమి. ఇదియే నాసమాచారము.

అనిన, వసుంధరుఁడు యోచించి "యౌరా లోమ కేశా! నీయుద్దేశ్యము పూర్తిగా నన్ను సంహరింపవలెనని నేవచ్చు మార్గమునఁ గనిపెట్టియుండి యుక్తిపన్ని యట్లొనర్చి యున్నవాడవు కానిమ్ము. దైవయోగము దప్పింప నెవరితర" మనుకొనియున్న యాతనింగాంచి "దేవా! యెన్నిదినము లిట్లు మాతలిదండ్రులం జూడకుండ చలయు? యీయరణ్యము నందే నాజన్మకాలంబంతయు గడుపవలసియున్నదే? యిఁక నన్ను మాతలిదండ్రులకడం జేర్చి కీర్తిఁబొందుదురని ప్రార్థిం చుచున్నదాన" ననిన వసుంధరుఁడు సుశీలంగాంచి "సోదరీ! నీవిచటికెట్లువచ్చితి" వనిన, "నన్నానాఁడు భైరవాశ్రమము నుండి తప్పించి కొనివచ్చిన యమ్మహాత్ముఁడు కాశిలో నన్న పూర్ణాదేవాలయంబునందుండి తానెచటికో చనియె. కొన్ని నెలలు జరిగిన యనంతరము మాతల్లి వెంటఁ బ్రయాగ కేతెంచియుంటిని. నాల్గుదినములపుడు మాతల్లి చెంగట పరుండి నిద్రించి మేల్కాంచునరి కీసౌధమునందుంటి నిందెవ్వ

రును లేరు. నేఁజను దెంచిన కొంతతడవునకు నీభువనమోహినీ దేవి నాకగపడియె. నిదియే నారాకకు గారణము. మహాత్మా! నన్ను మఱల నాతలిదండ్రులచెంతఁ జేర్పుము. శ్రీపాదులవా రెన్నియిడుమలకో పాల్పడి నానిమిత్త మగచాట్లయందు మునిఁగియుండి యార్తరక్షాపరాయణులైన మీవలన రక్షింప బడియున్నవారని యామెవలన నంతయు వింటిని. నాకదియే కావలయుఁ బరమపుణ్యాత్ముండవైన నీవాయురారోగ్యపుత్ర పౌత్రైశ్వర్యాదులచే వర్ధిల్లునట్లు గోరుచు భగవంతుని బ్రార్థించుచుండెద” ననుచు వసుంధరుఁడు భువనమోహినిని మోహ దృష్టులచేఁ జూచుచుండుటయు నామెతలవాంచి చేతులు జోడించుకొని నిలువఁబడియుండుటయుఁ గాంచి, సుశీల యేదియో యొకనెపముగా నాలతామంటపంబు దాఁటి యమృతసరోవరంబు చెంతకుం జనియె నాయొంటిపాటున వసుంధరునకు మనంబు తత్తరిల్లె. “రమణీ! పరమభక్తిచే వైరాగ్య వీక్షణంబుల నిరీక్షించుచున్నదానవు. సంపూర్ణయౌవనావసర మునం దిట్టి వైరాగ్యము నీకెందుండి యలవడియె.”

భువ:—మహాత్మా! నూతన వైరాగ్య మలవడియుండలేదు. సహజస్వభావమే యట్లుగలదు.

వసుం:—అటుగాదు. తరుణీ! మన్మథవికార సూచకంబులగు కడగంటిచూపుల నెచట మఱచితివి? ప్రణయకలహాంకురంబులగు భ్రూభంగముల నెందు డాచితివి? యానందరస నిమగ్నంబులగు నఱగంటిచూపుల నెక్కడవైచితివి? భర్తాగమనోత్సవసంభూతములగు ప్రసన్నదృష్టుల నేమిరొయిన ర్భితి నవియన్నియు వదలి తురీయునివలె వైరాగ్యవీక్షణంబు లగపఱచెదవు. నీయపాంగదృష్టిచే నిరీక్షింపుము.

అతఁడని తాఁపులచేతను దాపం బధిగమించి విభ్రమ మొందుచున్నవాఁడ మాటలాడక యూరక భూమిం జూచుచుండుట ధర్మమగునే?

భువ:—పురుషశ్రేష్ఠా! నీవాక్యంబులుగన్న కాముకీ కాముకుల మార్గముఁ దెల్పుచున్నది. నే నబల నమాయిక నన న్యగతికురాల. నిట్టి నేనొంటరినైయెనందున సర్వధర్మవిచారణదక్షులైన మీరు కామవికారములగు వాక్యములచే నాహృదయమును నొప్పించుట న్యాయము కాదని విన్నవించుచున్నాను.

వసుం:—మన కిరువుర కిదివఱకు వివాహము లేదు. ఉత్తమ క్షత్రియవంశోద్భవులము. తరుణవయస్కుల మిట్టి మన మొకరినొకరు ప్రేమించుట సహజధర్మమైయుండియు నన్నాదరణ చేయుచున్నదాన వేల?

భు:—నే నవివాహితనగుట సత్యమేగాని నామనమునం దఖిల సతీజన కామాంధకారభానుండగు కళాభానుండను రాజకుమారుని వరించియున్నదాన నందుచేఁ బరసతినై యున్నదాన నఖిలధర్మశాస్త్రకళాకలాపుండవై యిట్లు ప్రాకృతునివలెఁ బరేంగితంబెఱుంగక నింద్రియానుసరుండవగుట న్యాయముగాదని నమస్కరించి వేఁడుకొనుదాన.

వసుం:—మానవతీ! యుక్తాయుక్తవివేచనలేని బాల్యంబునందు జాపల్యవశమున ననేకయూహ లలవడినమాత్రమున నే యవివాహితయుఁ గట్టుబాటుగా నుండనగునా? కళాభానుండను రాజపుత్రుఁడు ప్రపంచమునం దున్నవాఁడో లేఁడో నీవెఱుంగుదువా? చూడనివాని నీవెట్లు వరియించితివి? చూచియు నీవొప్పక యున్న లోమకేశుని

వరియించెద నంటివో వరియింపుము. నామనంబును నా మోహపాశంబులను వెనుకకు లాగి యపచారంబని ప్రాయశ్చిత్తార్హుఁడనయ్యెద.

భు:—దేవా! ఆకళాభానుభూవరుఁడు భూమియందే జన్మింప కున్నఁ బ్రపంచమంతయు డవిణగొట్టినలాగున నాతని ప్రతాపప్రభావములు వర్ణింపఁబడుచుండు టేల! లోకులు పనిలేక బొగడుచుండిరా! యావిశ్వావసుండను భూసురున కేనేమి యపరాధ మొనర్చియున్నదాన! పుడమియందు లేనివాని కేదిరో యొక కళాభానుసంజ్ఞ నొసంగి నాచెంత నాతని తేజఃప్రతాపదయాధర్మంబు లుగ్గడించి నామనం బాతనిపైఁ ద్రిప్పఁజేసి నాచే సందేశలేఖ గైకొని పోయి యున్నవాఁడా! ఉండనీ మీమాటయే నమ్మి యమ్మహాను భావుఁడే లేదనుకొందము. కళాభానుఁడు చంద్రుడనుకొని నామనంబును ఆశబ్దార్థమును మార్చికొని భగవంతుం డైన యాయమృతకరుని ధ్యానింపుచు దేహావసానపర్యం తము బ్రహ్మచర్యం బాచరించుచుండెద. వేయేల! నిక్క మాకళాభానుభూవిభుఁడే నాప్రాణనాథుఁడు. అమ్మహాని యునకే నేను భార్యనగుదు. ఈ కామవికారోక్తులచే నన్నేల వేధించెదరు? ఆరాత్రి చోరుల బారిఁబడిన నన్ను దప్పించి ఛేండాశైరవుని ఖడ్గపాతమునకు గురికాకుండునట్లు రక్షించితివి. మహోపకార మొనర్చిన నిన్ను మఱచి కృత ఘ్నురాలనై యుండను శ్రీరామకృష్ణాదులవలె నిన్నొక యవతారపూరుషునిగా దైవముగా భావించి యర్చించు కొందును. నీ కాయురారోగ్యైశ్వర్యపుత్రపౌత్రాభివృద్ధి గలుగునట్లుగా భగవంతుని బ్రార్థించుచుందును. మహా

త్మా! అపుడట్లు ప్రాణరక్షణం బొనర్చిన దిపుడిట్లు బాధ పెట్టుటకా? నీకోర్కె వృథాయొనర్చితినని కోపమున్న అదియే నీఖడ్గము. ఇదియే నామ స్తకము. నీయిచ్చవచ్చిన ట్లొనర్పుము. వలదనుదానను గాను.

వసుం:—రమణీ! సకలవిద్యాపారంగతురాలవయ్యును శుద్ధ ముగ్ధాలాపము లాడెదవు. పట్టినపట్టు వదలననుమాట గట్టిగాఁ బట్టుకొని షోడశకళాపరిపూర్ణమైన చంద్రబింబమువోలె నతిసంపూర్ణవిరాజితంబై యున్న నీయౌవనమును వృథాయొనర్ప నూహించుచున్నదానవు. లోమకేశుని దిరస్కరించియున్నదానవు. ఆకళాభానుఁ డెందెందు వెదకినను గానరాక నామావశిష్టుఁడై యున్నవాడని, నీసందేశలేఖఁ గొనివచ్చిన భూసురుఁడు చెప్పెనని శ్రీపాదుఁడు నాతోఁ జెప్పియున్నవాఁడు. వృథాగా మూర్ఖపుపట్టేల? అందుచే జరుగని సంకల్పమేల? అందుచే ఆజన్మబ్రహ్మచర్యమేల? కళాభానుఁడె భూమియందుండుట నిక్కమనుకొందము. చోరుల వారినుండి రక్షింపుమనియు, భైరవునిచే బలిగాకుండ రక్షింపుమనియు యార్తవై నోరెత్తి బిలచితివే వచ్చి రక్షించెనో యాకళాభానుఁడు. నేను గదా వచ్చి రక్షించినది. అదియైనను దలంపరాదా? తరుణీ! వేయిమాటలేల?

ఉ. ఆనదురేయి నీకరము నంటితి నప్పుడె సింహమూర్తిగాఁ
బూని కవుంగిలించితివి పొక్కుచునుండెడినిన్ను గ్రుంపఁగా
బూనిన భైరవుం దరిమి పొందిక నక్కునఁ జేర్చికొంటి నీ
పూనికలన్నియుఁ వదలి పొమ్మన న్యాయమె నీకు మానినీ.
చాలుచాలు నీమూర్ఖము చాలింపుము. లెమ్ము.

సీ. అదె చూతమా చూతబదరీఫలగ్రాస
కీరదాంపత్యవిహార మతివ
యిదె గాంత మాకాంతమదిరారసోన్మత్త
శబరీధురాలాపసౌహార్దంబు
అటఁబోవుదమె సుమాత్యంతసౌరభ్యా
నుషంగమనోజ్ఞాధిరంగమునకు
యిటనుండుదమె లతాగృహామధ్య
శశికాంత పాషాణవేదికాపటలియందు
గీ. కేళికాస్థానమునకో మృగీమదార్ద్ర
సిక్తసైకతశీమకో శింశుపాది
శాఖముల నీడకో బోవజాలి తబల
కేళికాసక్తమనముచే జాలి చెపుమ."

అనుచున్న వసుంధరునకు భువనమోహిని యేదియో ప్రత్యుత్తరం బొసంగ నుంకించుచున్న నాసమయముననే నైరృతిమూలనుండి "హాప్రాణేశ్వరా! నన్నీ వ్యాఘ్రము దఱుముకొని వచ్చుచున్నది. సమాధియందుండకున్న వచ్చి రక్షింపుము రక్షింపు"మను స్త్రీయార్తారావంబు విననయ్యె. వసుంధరుం డాదిశఁగాంచి యేదో స్త్రీ యార్తారావంబు వినఁబడుచున్నదని వరనున్న ఖడ్గమును దూసి నాదిశంబట్టి చనుచుండ యిదియేమో చూడవలయు ననుయాశచే భువనమోహినియును గాసారతీరంబునందున్న సుశీలయు నాతని వెన్నంటిరి. వసుంధరుం డొక్కదాఁటున కా స్థలము చెంతకు లంఘించి తరుముకొని వచ్చుచున్న వ్యాఘ్రము నొక్కవ్రేటున ఖండించి యామెవైపుఁ జూడ మూర్తీభవించిన పాతివ్రత్యదేవతంబోలె నొక్క వృద్ధతపస్విని యదరుచు పదములు తడఁబడ నిలచి

యుండె. ఆమె నారచీరలు గట్టికొని ఫాలమున కుంకుమ రేఖయు భ్రూమధ్యంబునం దక్షతలు నొప్పార నలుబదియైదు సం॥లు వయస్సుగలిగి తలవెంట్రుకలు జడలుకట్టియుండ ప్రసన్నవదనముతో సమిధలును దర్భయును బూవులును గైకొని యుత్తరాభిముఖయై యున్న యామెనుగాంచి "తల్లీ! యీ భయదారణ్యమున నొంటిగానుండుట కేమికారణము? యీ పుష్పఫలంబు లెందుకు? "సమాధియం దుండకున్న వచ్చి యీ క్రూరవ్యాఘ్రమునుండి తప్పింపుము ప్రాణేశ్వరా" యని యఱచితివే తల్లీ! నీ వెంత సాధ్వీతిలకంబవో నీ ప్రాణము కన్నను భర్తృతపంబే ముఖ్యమని భావించితివో? యిట్టి సాధ్వీ తిలకంబులీ పృథివియందుండుటం బట్టియే సృష్టిస్థితి లయంబుల కాస్పదంబైన కాలధర్మములు జరుగుచున్నవి. మీ వృత్తాంతం బెఱింగింపవలయు" నన్న "నాయనా! నీవు పుణ్యపురుషుండవు; ఆ యాశ్రమమున నా భర్తయైన ఋషీంద్రుం డున్నవాఁడు. మా కథనంతయు నతఁడు సమగ్రమముగా వివరింపఁగలఁడు. తండ్రీ! నీవు బాలుండవయ్యును గుణవృద్ధుండవు. నీ వరుదెంచుటం బట్టి నేను బ్రదికితిని. నా ప్రాణసంరక్షణం బొనరించితివి. ఆ కాంత లెవరో వారును నీవును మా యాశ్రమం బీ సమీపమునందే గల దచటికి రావలయు" నని యామె ముందును వీరందఱు వెనుకలను యాశ్రమంబుఁ బ్రవేశించి చూడఁగాఁ దా నంతకు మునుపు మార్గవశంబునందున్న యాశ్రమమే యనియు నపుడు సమాధియందున్న దీ ఋషీంద్రుఁడేననియు వసుంధరుండు యోచించుచు సమాధిఁ జాలించి దర్భాస్తరణంబుపైఁ గూర్చొని శంకరుం బోలియున్న యాతనికి నమస్కరించె. సుశీలా భువనమోహిను లిరువురు నా

వృద్ధదంపతులకు నమస్కరించి రొకచో నిలువంబడిరి. వసుంధరుం డమ్మునీంద్రునిచే దీవనలంది యాతని నియమానుసారముగా నొకచోఁ గూర్చుండెఁ. నా తరుణు లిరువు రొకచో విధేయతం జూపుచు నుపవిష్టలైరి. వృద్ధాంగన ఋషీంద్రుం గాంచి "ప్రాణేశ్వరా! తమయానతి దేవపూజా ద్రవ్యంబులం గొనివచ్చుచుండ నన్నొక క్రూరవ్యాఘ్రము దఱిమిన నపుడా ర్తనై మిమ్ముఁ బిలిచితి నీకుమారుండు చనుదెంచి వ్యాఘ్రమును సంహరించి నన్ను రక్షించి మనవృత్తాంతం బడిగె. మీ చెంతకుం బిలుచుకొనివచ్చితి నితని యభ్యుదయంబు గోరి మీ రాశీర్వదింపుఁ" డని చెప్పుచు నాసాధ్వి భర్తచెంగట నొకచోఁ గూర్చుండెఁ. ఋషీంద్రుఁడు వసుంధరుం జూచి "నాయనా! నీ తేజంబు గన్న బాలభానుం బురుడించుచున్నది. సర్వసర్వంసహా భారధౌరంధర ధైర్యలక్షణములు నీయందు గానఁబడుచున్నది. ఇంత చిఱుతప్రాయముననే సుగుణములకుఁ బట్టభద్రుఁడవై యున్నవాఁడవు మా వృత్తాంతము వినుము. ఈ భరతఖండముననే గోదావరీతీరమున మహేంద్రవరంబను నగరము గలదు. అందు నరేంద్రచంద్రుఁ డను రాజుగలఁ డాతనిచెంత వీరసేనుం డనువాఁడు సైన్యాధిపతియును గాళీభద్రుఁ డనువాఁడు మంత్రియును గలరు. ఆతని యొద్ద సుబ్రహ్మణ్యశర్మయను పౌరోహితుఁడు గలఁడు. యామహారాజుభార్య శ్యామలాదేవి యనుపేరుచేఁ బరమసాధ్వియైయుండ నతండు ధర్మముదప్పక ప్రజలఁ దనబిడ్డలవలెఁ జూచుచుండెఁ. నతనికి సంతానములేదు. అందుచే రాజ్యాది భోగములపై విసుగు జనియించి దేవతాప్రసాదము వడసి సంతానభాగ్యం బొందవలయునని తానును దనభార్యయును

దపమునకై వెడలుచు రాజ్యమును మంత్రియాధీనమొనర్చి నైమిశారణ్యమునకు వెడలి రచ్చట మహర్షుల యనుగ్రహంబు పొంది వారి యనుమతిచే సత్యనారాయణవ్రత మతి నియమముచే నొక సంవత్సరం బొనర్చినంత నాతనిభార్య గర్భవతి యయ్యె. నవమాసములు నిండె. వసంతఋతువునఁ జతుర్గ్రహోచ్చ వృషభలగ్నమునం దొక్క కుమారుం డుద్భవించె. యావల జాతకర్మ నామకరణాది శాంతులొనర్చి తలిదండ్రులు వసుంధరుండని పేరిడిరి. యా శిశువుయొక్క కళాప్రకాశము లరణ్యంబంతయుఁ దేజరిల్లుచుండ మునులు సంతసిల్లి కళాభానుండని మఱియొక పేరు పెట్టిరి. అప్పటినుండియు ఋషులిడిన పేరే వ్యవహరింపఁబడుచుండె. పాలనలాలనాదులయందు భ్రాంతిగలిగి తలిదండ్రు లరణ్యముననే ఋషులచెంత నిలిచి యుండిరి. విద్యాభ్యాసము నుపనయన మా ఋషులే మహాప్రీతితో నొనర్చిరి. కళాభానుం డనుపేరుతోడనే విద్యయందు మిక్కిలి ప్రసిద్ధి వహించె. ఉపనయనానంతర మధ్యయనము నేర్పుచుండిరి. బాలు నచ్చటనే నిలిపి రాజేంద్రుఁడు మహేంద్రపరమునకుం బోయె" ననుచుండఁగా నాచెంతఁ గూర్చొని వినుచున్న భువనమోహినీదేవికి మనంబున నొకవిధమగు భయమును మోహంబును గగుర్పాటును సంతోషమును బొడమ వసుంధరునిమో మట్టె చూచుచు సిగ్గునఁ దల వాంచుచుఁ దహతహపడుచుండె. నామెకు వసుంధరునిపై మోహం బంకురించె. నంత నా ఋషీంద్రుం డిట్లని చెప్పఁ దొడఁగె. "ఆ రాజు మరల తనరాజ్యమున కేగువఱకు బహుకాలమయినందున రాజ్యప్రకృతి మారియుండె. మంత్రి కారాగృహముచుండి తప్పించుకొని పోయియున్నాఁడని ప్రజ లను

కొనుచుండిరి. విజయనగ రాధీశ్వరుల ధ్వజము నెలకొల్పఁబడి యుండె. నాతఁ డాపురంబునం దిరువదిదినంబు లుండినను రాజభయముచేతనో లేక జ్ఞాపకము లేకనో తన్ను మాట లాడించువారు లేక తహతహపడి తన ప్రీతిపాత్రుఁడైన సుబ్రహ్మణ్యశర్మ మంత్రి దౌర్జన్యముచే పలాయనంబై యున్న వాఁడని విని కారణము లచ్చటచ్చట విచారించె. సైన్యాధిపతి యైన వీరసేనుఁడు ఖండాభైరవుఁడను రాక్షసునిచేఁ జెఱఁ జిక్కి భైరవునకు బలియయ్యెనని యనుకొనుచుండిరి. పూర్వ రాజగౌరవమున కొంతమంది భూసురులా రాజును దమ మందిరంబులందు నిల్పికొని గౌరవముతోఁ గాపాడుచు "రాజేంద్రా! మీరిటనుండి సంతానార్థమై తపంబున కరుగుచు రాజ్య మంతయు మంత్రికరగతం బొనర్చి వెళ్లిపోయితిరి. ఆ మంత్రి తాము వెడలిన కొన్ని దినములకే మహాక్రూరత్వము వహించి స్వలాభపరుఁడై ప్రజలకు దండధరుఁడై బహుహింసల నొనర్చుచుఁ దమ ప్రీతిపాత్రుఁడైన సుబ్రహ్మణ్యశర్మయొక్క సర్వస్వము నపహరించి కట్టుబట్టలతో భార్యతో నిల్లువిడిచి దేశాంతరములకుఁ బలాయనం బొలాగు చేసె. నతం డిపుడు ప్రయాగ యందున్నవాఁడని వినుచున్నామని చెప్పిరని యతఁ డనుచున్నంతలో నచ్చట వినుచున్న సుశీలాదేవి కేమియో యూహలు జనించి లేచి నిలిచి మాటలాడఁబోయి మఱల సిగ్గుచేఁ దలవంచి యూరక కూర్చొనియె. అంత నా ఋషీంద్రుఁడో బాలకా! ఇట్లు భూసురు లమ్మహారాజునకుం జెప్పి మఱియు నిట్లని చెప్పఁదొడఁగిరి. "రాజా! ఈరీతిని బహు క్రూరదండనలచేఁ బ్రజలను బాధించుచున్న మంత్రిపై విసిగి ప్రజలంద ఱాతనిఁబట్టి కట్టవలయునని యత్నించుచుండఁగా

ఖండాభైరవుఁడను రాక్షసునిదాడి విపరీతమై దేశదేశముల వారు తమబిడ్డలను సోదరులను జెల్లెండ్రను దండ్రులను గానక పోఁగొట్టుకొని కొంతమందిరాజు లేకమై యాతనిపై యుద్ధమున కరుగుచు సి మంత్రిగారినిసహా సహాయము రమ్మనుటచే సర్వసైన్యసమేతుఁడై వీరసేనసహాయముతో వెడలిపోయె. నా సమయము గనిపెట్టి ప్రజలు తమనిమిత్తమై యెందెందో వెదకి గానక విజయనగరాధీశ్వరులచెంత కరిగి వారిం బ్రార్థించి దోడ్కొనివచ్చి రాజ్యంబొసంగి యున్నవారు. అట యుద్ధమున కరిగినవారంద ఱాభైరవుని ప్రతాపాగ్నికి శలభప్రాయులై చచ్చియుఁ బర్వెత్తియుఁ జిక్కియు నానావిధములై యొకరిగతి యొకరికిఁ దెలియక యథాయథలై యున్నవారు. మనమంత్రి తప్పించుకొని కొన్నిదినముల కీయూరు సేరఁగా రాజున కెఱింగించి ప్రజాసమ్మతిచే నాతనిబట్టి కారాగారంబునం దుంచి తన మందిరంబునందున్న ద్రవ్యమంతయు రాజభండారమునం జేర్చి రాతం డిపు డొక నెలదినములపు డేదియో యుపాయముచేఁ జెఱసాలనుండి తప్పించుకొని పోయి యున్నవాఁడు. యుద్ధమునకుఁ బోయినపుడు వీరసేనుఁ డందే పట్టుబడి బలియై యున్నవాఁడని కింవదంతి. యారాజులుసహా తొలుదొల్త యిష్టములేక యీదేశములోఁ బ్రవేశించి యిపుడిపుడు మరాళకు లోనై యున్నవారని చెప్పి రపు డారాజేంద్రున కేమియుం దోఁచక యెవ్వరెవ్వరియోగ మెంతెంత కాలము జరుగవలెనో యటులజరుగక తీర దనుకొని మఱల భార్యాయుతుఁడై నైమిశారణ్యమునకు జనుదెంచె. నచట ఋషులుగాని తనకో మారుఁడు కళాభానుఁడుగాని లేకుండుటచే వెదకి వెదకి వేసరిల్లి సర్వవిధములైన కష్టములకు లోనై

దుఃఖించి యిడుమలుపడుచు నిఁక ప్రపంచవిషయములయందు మమత వీడి తపం బొనరించి భగవత్సాయుజ్యముఁ జెంద వలయునని యీ గహనంబునం దాశ్రమము గల్పించుకొని తపం బొనర్చుచున్నవాఁడ. ఆ నరేంద్రచంద్రుఁడే నేను. ఆతనిభార్యయే నీచే రక్షింపఁబడిన యీ వృద్ధాంగన" యను వఱకు వసుంధరుఁ డట్టె నిర్విణ్ణుఁడై కన్నుల నీరిడి "మహానుభావా! మీ కౌమారునికొఱ కెంతకష్టము లనుభవించియున్నవారు! తుదకు రాజ్యమే గోల్పోయి ఘోరారణ్యముల మునివృత్తి నుండవలసివచ్చెగదా! పుత్రులు గలుగవలెనని దుఃఖించుట లెందులకు? పుత్రులుగలవారి కెపుడును గష్టములే ప్రాప్తించుచుండును. తల్లిదండ్రుల గష్టముల నరయక వారి సౌఖ్యంబును గోరక వారి స్థితిగతులు విచారింపకున్నఁ బుత్రుఁడు వంశలతాలవిత్రుఁడేగాని పుత్రుఁడవునే? మహాత్మా! మీపుత్రుని నే వెదకించెద. మీరాజ్యమును సాధించి మఱల నాంధ్రరాజ్య సింహాసనంబుపై మిమ్మధిష్ఠింపఁ జేసెద. మీ పుత్రుఁడు తెలియువఱకు నేను మీ పుత్రుఁడనై యుండెద. నంతవఱకు మీ రీ యాశ్రమమునందే నిర్భయులై యుండుఁడు. మీకు వలయు సమిత్కుశాహారాదులు నేఁదెచ్చియిచ్చెద నిఁక మీరు దుఃఖింపకుఁడు. మీపుత్రుఁడు మీచెంతనే యున్నవాఁ డనుకొనుఁడు. నేనీ ప్రాంత్యమునఁగల సౌధంబు నందుండి మీకష్టసుఖములు ప్రతిదినము విచారించుచుండెద" నని చెప్పి వారికి సాష్టాంగనమస్కారము లొనర్చి యాశ్రమంబు వెడలి తనమనంబున పశ్చాత్తాపపడుచుఁ బోవుచుండ నాకాంత లిద్దఱు వృద్ధదంపతులకు నమస్కరించి వారి యానతి నాతనివెంటం జనిరి.

# ౧౨ ఆజ్ఞా ప్రకరణము

హిమాచల ద్రోణులయందుఁ గల కపాలపురమునం దొకానొకదినంబున బేతాళమహారాజు కొలువుండె. భూతములు ఛత్రములు బట్టియుండిరి. శాకినులు చామరములు వీఁచుచుండిరి. కూశ్మాండములు జయజయధ్వనులు బల్కుచుండిరి. వైనాయకాదులు కైవారంబు లొనర్చుచుండిరి. గుహాండును బ్రహ్మరాక్షసులును మంత్రస్థానంబునందుండి మంతనము లాడుచుండిరి. పిశాచములు సభామంటపముచుట్టును ఖడ్గపాణులై కాఁపుండిరి. మారీచులు సేవకావృత్తిచే నాని యాజ్ఞలు నెఱవేర్చుచుండిరి. అప్పు డందఱింగాంచి "భూతగణములారా! చతుర్దశ భువనంబులందు నాయట్టి ప్రతాపవంతుఁడును నావంటి సర్వవిద్యాగరిష్ఠుండును మాయాప్రవీణుండును ధనుర్విద్యాధికుండును గలఁడే! మిమ్ముల నందఱిని రక్షించుటకుఁగదా పరమేశ్వరుఁడు నన్ను సృష్టియొనర్చి నాకీ యధికారమును యట్టిప్రతాపమును నొసంగియున్నాఁడు. ఇట్టి జగజ్జేగీయమానుండనైన నాగర్వం బణంచి తనప్రతాపముచే కట్టివైచి యవమానము లధికపరితాప మొందునట్టి గోడు గుడుపించిన ఘండాభైరవాసురుఁ డింకెంతటి ప్రభావవంతుఁడో నిర్ణయించుటకు సాధ్యముగాకున్నది. అట్టి ప్రతాపవంతుని భైరవానుచరుల వేయుమందిని జార్వకుల వేయుమందిని గాపాలికుల వేయుమందిని నలువది రథంబులవారిని మూఁడువందలాశ్వికుల నైదుఘడియలలోఁ దానొక్కఁడే సంహరించి భైరవునకు బలియొసఁగుచున్న పురుషులను స్త్రీలను బ్రదికించి

భైరవశిల నూఱుశకలంబులొనర్చి యా యాశ్రమంబుఁ గాల్చి భస్మంబొనర్చి నన్ను బంధవిముక్తునిగా నొనర్చి నాకొఱకై ప్రాణాపాయకరమైన యవస్థలం జెంది మహోపకారం బొనరించిన యా కళాభానువసుంధరున కేనేమి ప్రత్యుపకారం బొనర్చినను ప్రచండాతపమధ్యనిక్షిప్త కర్పూరదీపకళికం బోలియుండునేగాని వేఱుగాదు. అందుచే నమ్మహాత్ము డీ భూలోకంబునం దెంతకాలముండునో యంతవఱకు నే నాతని భృత్యుఁడనై యుండెద. నా భృత్యులైన మీఱంద రమ్మహాత్ముని దాసులై యాతఁ డేచిపంచిన నయ్యది యొనర్చుచుండుఁడు. మనపురమున కొక్కయోజన దూరమం దిదే కోనయం దొకమున్యాశ్రమంబు గల దందొకమహర్షి యుఁ దపస్వినియు నున్నవారు. వారలకుఁ బ్రతిదినమును గందమూలములు సమిధలు దర్భలు పుష్పములు గైకొనిపోయి శబరార్భకులవలె నొసంగుచుండుఁడు. వారికేవిధమయిన క్రూరమృగోపద్రవములు లేకుండున ట్టిరువదిమంది యహర్నిశలయందును ఖడ్గపాణులై కాపాడుచుండుఁడు. రెండులక్షల భూతములు యీ భరతఖండంబునం గల యేబదినాలుగు దేశములలో పాంచాల ఆంధ్రదేశములు తప్ప మిగత యేఁబది రెండు దేశాధీశ్వరులచెంతకు మానవాకారముచే ననేకాయుధధరులై పోయి పట్టణములు ముట్టడించి తొలుత నీ యాజ్ఞాపత్రికం జదివి వినుపింపుఁడు. ఇదే యాజ్ఞాపత్రికం జదివెద వినుఁడు:—"భూపతులారా! కళాభానుసార్వభౌముఁడు మీకంతఱకును దెలియఁజేయుమన్న యాజ్ఞ యేమనఁగా యిదే మాసైన్యమును మీదేశములపై దిగ్జయార్థమై పంపియున్నవాఁడ. మీకు యిష్టమున్న యుద్ధమొనర్పుఁడు. లేక దాసోహ

మనియు, జిల్లో ఒకస్సి యనియుఁ జెప్పి కానుకలు సమర్పింపుఁడు. యిప్పటినుండియు,

శా. దానజ్ఞాన జపక్షమా శమ దమ ధ్యానాది శుద్ధాత్ముఁడున్
దీనాధారుఁడు ఘోరశైరవ హారోద్దీప్తుండు భూతేశస్వ
స్థానస్థాప్యుఁ డజేయుఁ డద్భుతమహాత్వప్రాజ్ఞుఁడౌ శ్రీకళా
ధానుండీభర తాఖ్యభూ డసవిభుఁడౌ భద్రంబుసత్యంబికన్.

శ్రీపాదశర్మ,

ప్రధానామాత్య శస్త్రధారి.

వారొప్పుకొని కానుక లర్పించిన సరి లేకున్న యుద్ధ మొనరించి జయించి యారాజులను బంధించి తీసికొనిరండు. ఇరువదియైదువేల భూతములు మానవాకారములతో సమ స్తాయుధసమేతులై యాంధ్రదేశమున గోదావరీనదీతీరమునం దున్న మహేంద్రవరముచెంతకుఁ జని యా పట్టణమును ముట్ట డించి యా రాజేంద్రుని సభలోని యాజ్ఞాపత్రికం జదువుఁడు– "విజయనగరేశా! అరాజక సమయంబునం దాంధ్రదేశము ప్రజాసమ్మతిచే మీ కైవసంబుగొని నాఁడాదిగాఁ బరిపాలించు చుండి ప్రజోపకార మొనర్చితి రందులకు సంతసించితి. నిప్పు డా నరేంద్రచంద్రభూపాలుఁ డరుదెంచి మఱలఁ దనరాజ్య మొసంగవలసినదని సందేశ మంపియుండినను దిరస్కార భావము సూచింపుచు దురాశాపిశాచగ్రస్తులై మదోద్రేక మున నున్నవారనియు నా రాజేంద్రుఁడు తనపుత్రు నరయుచు మఱల హిమాలయారణ్యముల కరిగియున్నవాఁ డనియుఁ దెలియుచున్నది. మీరీ క్షణమందే సమస్తరాజ్యపాలనా సాధనంబులు విడిచి కట్టుబట్టలతో మీ విజయనగరంబునకుం

జనుఁడు. అటు కాదేని వినుఁడు. జగద్భయంకర భేండాభైరవ చార్వాక భైరవానుచర కంఠనాళ నిర్మూల నాభీలం బగు కరవాల మిదే మీ కంఠనాళములపైఁ గ్రీడింప నుంకించుచున్నది. అట్లానర్ప నాకు సమ్మతి లేమి నీ సామవాక్యముల మీకు సందేశ మంపియున్న వాఁడఁ దిరస్కరించితి రేని యీ మహేంద్ర వరమునుండి యుద్యోగమగుటయే గాక మీ వంశానుగతం బగు విజయనగరంబునుం గోల్పోయెద రిదియే మదీయాజ్ఞ."

కళాభానువసుంధర, భారతవర్ష సార్వభౌమ.

వారొప్పి విడిచి చని రేని సరి యటులేకున్న నారాజును విజయనగరంబునందున్న యాతని ప్రతినిధిని జయించి పట్టి యా పట్టణములు రక్షించుట కిరువదివేలమంది నిలచి తక్కిన యైదువేలమంది వారిని బంధించి గైకొని రండు. రెండుకోట్ల భూతములు యీ యాజ్ఞాపత్రికలం గొని చని ప్రతి యూరు నందును బ్రతి పట్టణమందును బ్రతి పల్లెయందును బహిరంగ మందుంచి భేరీధ్వానముతో నందఱికి దెలియునటుల యుచ్చైస్స్వరమునం జదివి వినుపించి రండు. ఇదే యాజ్ఞాపత్రికం జదివెద వినుఁడు:— "సర్వవర్ణాశ్రమాచార ధర్మనిపుణులగు ప్రజోత్తములారా! మీకు నుపదేశపూర్వకముగా నొక యాజ్ఞ నొసర్చెద మీరిటుల వర్తింతురేని యిహమందుఁ గీర్తియును బరమందు సద్గతియును జెందుదురు. ఇప్పటి నుండియు నేను మీ యేలికనై మీకు దగువసతుల నేర్పఱచి సత్యమార్గముగా మిమ్ములను బరిపాలించెద నాయాజ్ఞ వినుఁడు. సర్వజన్మములలో నుత్తమమైనది మానవజన్మము. ఈ జన్మమందే పునరావర్తిరహిత మహాపథము నొందుమార్గ మెఱుంగ

వలయును. తదితరజన్మములయం దామార్గ మెఱుంగుట దుర్ల భము. మీరు మీ దేహావసానపర్యంతమం దెప్పుడైనను నబద్ధంబు లాడకుఁడు. సత్యమే పల్కుచుండుఁడు. జీవహింస యొనర్పకుఁడు. సర్వభూతములందును సమభావంబుంచుఁడు. మీ మనమునందు గామక్రోధాదులకుఁ జోటియ్యకుఁడు. దీన జనులయందుఁ గరుణ వహింపుఁడు. పరస్త్రీలను దల్లులవలెఁ జూడుఁడు. పరద్రవ్యములపై నాశ వదలి మీకృషి వాణిజ్యా దులచేఁ బరమేశ్వరుఁడు మీకెంతమాత్రము లాభ మొసంగునో యంతటితోఁ దృప్తిఁజెందుఁడు. అనవరతము ధర్మ కార్యములయందే మీమనము లుంచుఁడు. పరుషముగాఁ బరులహృదయము నొచ్చునటుల మాటలాడకుఁడు. నిర్నిమి త్తముగా నొకరిపాత్తునకై వాదులాడి కయ్యములకుఁ గాలుద్రవ్వి, వ్యవహారముల నొనర్చి యపరాధిస్థానము లందు నిలచి న్యాయవాదుల కెక్కువద్రవ్య మొసంగి తుదకు విఫలప్రయత్నులై నష్టద్రవ్యులై భ్రష్టుబట్టి దుఃఖింప కుఁడు. ప్రతియూరునందును సమస్తసద్గుణ సార్వభౌముం డగు నొకయార్యునిఁ బెద్దగా నియమించుకొని యాతని వాక్యానుసారము వర్తిల్లుచుండుఁడు. పరులకున్న సంపదలం జూచి యసూయపడకుఁడు. పూర్వజన్మమునం దొనర్చిన సుకృతమునకు ఫలితముగా వారైశ్వర్యవంతులై యుందు రందుచే మీరు దుఃఖించినంత మీ కా పదవి లభింపదు. మీ దేశాచారము లెవ్వియో మీ దేశీయులు ధరించు దుస్తు లెవ్వియో యవియే ప్రాధాన్యముగా నెంచుకొని యనుభ వింపుఁడు. పరదేశ వస్తువిశేషము లెంతటి స్వల్పమూల్యమున కబ్బిన నుపయోగింపకుఁడు. చండాల కిరాత నిషాద బురుడ

కాది నిమ్న జాతీయులయందు బహుదయారసంబుంచి వారికి జీవనోపాయముల నేర్పఱచి కాపాడుఁడు. మద్యపాన మొన రింపకుఁడు. మాంసాహారమును విడిచిపెట్టుఁడు. పెద్దలను గన్నపుడు వినయముం జూపుఁడు. బ్రాహ్మణజాతీయులై, బ్రాహ్మణాచారపరాయణులై వేదాధ్యయనసంపన్నులై సత్య వాక్య నిష్ఠాగరిష్ఠులై వ్రతదాన జ్ఞానదైవోపాసనాపరులై యున్న యగ్రజన్ములకు బ్రత్యహంబును వందనం బొనరింపుఁడు. వారి యాశీర్వచనములం బొందుచుండుఁడు. తల్లిదండ్రుల కన్నను వేఱు దైవములు లేరు గాన వారిమనములు రంజింపఁ జేయుచు బహుభక్తిఁ జూపుచుండుఁడు. మీమీయోగ్య తానుసారము మీకెట్టి యధికారము లభించియుండినను న్యాయపరిపాలన మొనరింతురు గాని లంచములుగొని న్యాయ ములను విచారింపక పక్షపాతముగా నాజ్ఞ చేయకుఁడు. బ్రాహ్మణుఁడై యుండియుఁ దన ధర్మములు తా నాచరింపక న్యాయాన్యాయములు యోచింపక తల్లిదండ్రుల నర్చింపక సహధర్మచారిణియగు భార్య నాదరింపక పితృకార్యములు విడిచి దైవోపాసన విడనాడి శూద్రప్రాయులై యితరవర్ణముల వారితోఁ గలసి భోజనపానాదు లొనర్చుచుఁ గర్మభ్రష్టులై దుష్కృత్యములకు లోనై, స్వధర్మబాధక ధర్మానుసారులైన బ్రాహ్మణబ్రువులం గాంచి గౌరవింపకుఁడు. దర్శనస్పర్శములకు యోగ్యతలేని చండాలునికన్నను హీనునిగాఁ జూచు చుండుఁడు. ఎట్టి శ్వపచునకైనను నన్నదానం బొనర్పుఁడు. జాతిని చండాలురై యితరమతములవారి బోధనలకు లోనై పుట్టిన పదియవనాఁడు ప్రత్యక్షదైవతములగు తల్లిదండ్రు లిడిన పేరులు విసర్జించి క్రొత్తపేరుల నుంచుకొని తాము మత

భ్రష్టులై తమకున్నది పోక లేనిది రాక దరిద్రము పీడక యైశ్వర్యము లభింపక దేవుఁడగపడక ప్రాఁగుటమానక యుభయభ్రష్టులైన వారిని మీ చెంతఁ జేర్పకుఁడు. వారి పూర్వజన్మకృత దుష్కర్మానుసారము వారి కానీచజన్మము భగవన్నియామకమై లభించియుండు నందుచే మీరు విపరీత జ్ఞానములు కుదుర్చుకొని వారితోఁ గలసిమెలసి భ్రష్టు బట్టకుఁడు. కేవల ధర్మమార్గమున యితరులకుఁ బ్రాణాపాయ మయ్యెడి కాలములందు ధర్మసూక్ష్మ మనుసరింపుఁడు. జారచోరవృత్తుల మానుఁడు. మీ భార్యలపై లేనిపోని యపరాధములను స్థాపించి మీ లోపములను గనుఁగొనింపక వారిని భ్రష్టుబట్టింపకుఁడు. భగవంతునిపై భక్తి వదలకుఁడు. ఇంద్రియములను జయింపుఁడు. స్వామికార్యములయందు దప్ప మత్తులై యుండుఁడు. బ్రాహ్మణులై పూర్వాపరక్రియలయందు ద్రవ్యలోపంబని మంత్రక్రియాలోపము లొనర్చి కర్మను నశింపఁ జేయకుఁడు. దానవ్రత యాత్రాది పుణ్యకార్యము లొనర్చి తత్ఫలము భగవత్ప్రీతిఁ జేయుచుండుఁడు. అహంకారమున భేదబుద్ధి గలిగి పునర్జన్మమునకు విత్తనము నాటకుఁడు. సర్వజంతుగణముల కాశ్రితభూతమైనది మానవ జన్మముగాన వాని పరిపాలనయం దుదాసీనతవహింపకుఁడు. పాపములేదు. పుణ్యములేదు. జన్మములేదు. కర్మలేదు. అను నాస్తికమతములను విశ్వసింపకుఁడు. వేదచోదిత ధర్మములను వేదవాక్యములను బ్రమాణముగా నెఱుంగుఁడు కృత్రిమాధర్మోక్తుల ననుసరింపకుఁడు. మనోనిశ్చయము గలిగి యుండుఁడు. భారతయోషామ తల్లులారా! మీకొక విజ్ఞప్తి.

శా. పాతివ్రత్య సమగ్ర వైభవలు నిష్పాపాత్మలుఁ రుక్మిణీ
సీతారుంధతి గౌరి భైమిసతి శ్రీసీమంతినీ సన్నిభల్
మాతో శ్రీలగు మీ రెఱుంగని స్వధర్మం బెద్దియైనన్ భవ
చ్ఛేతంబుల్ శ్రుతిధర్మసంగతిని సుశ్రీలొందగాఁ జేయరే.

ఇట్లానర్పక యెవ్వరేని మదీయాజ్ఞాతిక్రమణం బొనర్చితిరేని మిమ్ములను శిక్షించుటకు శిక్షాదండ నీతియను స్మృతులు చాలవు. ఇంకను అధికమగు దండనలు విధియించెద. ప్రజలు రాజాజ్ఞానుసారులు రాజులు ప్రజాసౌకర్య దాయకులు. రాజును ప్రజయును జీవదేహన్యాయముగా వర్తించుట విధి. రాజు రక్షించవలయు. ప్రజలు రాజు నర్పించవలయు. పక్షపాతి యొనర్చి స్వలాభపరుఁడై ప్రజోపయోగ కార్యములకై లాభనష్టములను యోచించుచు వ్యాపార విధిగాఁ బరిపాలించు భూపాలుఁడు నిక్కముగా మహీపాలుఁ డౌనే! ప్రజలపాలిటి లయకాలుఁడు, మహా పాపలతాలవాలుఁడు, ప్రబలతర చండాలుఁడు. అట్టి దురాత్ముని స్మరణ యేటికి? నింతటితో విరమించెద. మహాజనులారా! యిదే వందనము లర్పించెద.''

కళాభానువసుంధర,

భరతఖండ సార్వభౌమ.

ఇదియే యాజ్ఞాపత్రికయని యొసంగిన భూతగణములు మానవాకారముతో ననేకాయుధసమన్వితులై యార్భటించుచు వారివారి కార్యములకై వారు చనిరి. బేతాళుఁడు సభ చాలించె.

# ౧౩ పట్టాభిషేక ప్రకరణము

నరేంద్రచంద్రాశ్రమము విడిచి వసుంధరుఁడు యుద్యానాభిముఖుఁడై పోవుచుండ సుశీలా భువనమోహినులాతని వెంటఁ గొంతదూరం బరిగి యావల సౌధంబులోని కరిగి వారి వారి యునికిపట్టుల వారు నివసించిరి. భువనమోహినీదేవికి తనుతాప మధికమయ్యె. భయమును దొట్రుపాటును బొడమె విరహ మతిక్రమించి "యక్కటా! నేనెంతటి యవివేకురాలనో యుక్తాయుక్తము విచారింప కమ్మహాత్ముఁడే కళాభానుఁడై యుండియుఁ దెలిసికొనక బాల్యచాపల్యంబున నేమేమియో మాటలాడితి. ప్రాణరక్షాపరాయణుండైన యమ్మహాత్ముని మనసు నొప్పించితి. అతఁడే కళాభానుభూవిభుఁడు గాకున్న నీ మహోద్దండప్రతాపమును నీ యసహాయతయును నీ మకరాంకసౌందర్యమును నీ ధర్మగుణంబును నీ తేజం బుండునే! అతఁ డధర్మచారియౌనే! తాను కళాభానువిభుండను ధైర్యమున నే నేను తన్ను వరియించియున్న దాన నని నాలేఖవలన నామనోభావం బెఱింగినవా డగుటచేత నే నేనెంత వేడికొన్నను నని లెక్కింపక నాకళాస్థానములయందే చూడ్కియు మోహాతిక్రమణాలాపములను విచ్చలవిడి రొనర్చె. ననేకజన్మముల యం దాతని దాస్యవృత్తి యొనర్చినను ఋణము తీర్చుకొన లేను. అట్టి ప్రాణరక్షాపరాయణుని కుత్సాహభంగ మగు నటుల మాటలాడితి నక్కటా! యమ్మహాత్మునకే నెటుల మోము గాన్పింతు. నెటులఁ బల్కరింతు. నామమత నేగతి వెల్వరింతు నతం డిఁక నన్ను బల్కరింపఁడు. నామోమైనం

గాంచెడు. అతులితనవయౌవ్వన ప్రాదుర్భావమై యుండియు నతిసమీపవంతులమై యుండియు సపచారదోషమున నిట్లు వికలత జెందగల్గెనై ననేమి? యమ్మహాత్మునియందు నాకధిక స్వతంత్రముగల దాయుద్యానమునకుం జనియెద" నని యువ్విళ్లూరుచుఁ బోయిన యాదరింపఁడో యని జంకుచు కాని మాతమని యుంకించుచున్న సమయమున సోపానమార్గమున టపటపమని కాలిచప్పుడు విననయ్యె. నట్టే చూచుచుండ మన వసుంధరమూర్తి లోనం బ్రవేశించె. నక్కాంత దిగ్గన లేచి పదములు తొట్రిల్ల మనమున దిగులుబొడమ మోమున జిఱుచెమట గ్రమ్మ, చేతులు జోడించుకొని నిలువంబడియె. వసుంధరుఁ డామెం జూడక నాయంతఃపుర వైచిత్ర్యమునుం గాంచుచు అటునిటు బోవుచుండె. తన్ను పలుకరించునేమో యని భువనమోహిని యువ్విళ్లూరుచుండె. ధీరమానసుండగుట చేతను సాధువిశేషంబులు దిలకించు గమనంబుచేతను మాటాడక మౌనం బవలంబించె. నారాజపుత్రిక యతనినిం గాంచి "మహాత్మా! నాయపరాధమేమి పలుకరింప కటునిటు బరికించుచున్నవాఁడవే" యని భయసంభ్రమముల విన్నవించుకొనియె. ప్రత్యుత్తరము లేదు. రాజకుమారా యనియె. జబాబు లేదు. ప్రాణరక్షాపరాయణా! యనియె. మాటాడ లేదు. ఆర్తజనరక్షా దీక్షాధురంధరా! సహస్రాసమతేజో దుర్నిరీక్షణా! జగద్గరిత భేండాభైరవాది యాతుధానవ్రాత నిర్మూలనా! పలుకవేల? యని పలుమరు నాతని వెంట మంజీర ఝుళంఝుళధ్వను లుప్పతిల్ల మందగమనంబునఁ జనుచు పలుకరింపఁదొడఁగె. వసుంధరుఁ డామెను జూడకయే పరపురుషులతోఁ బరాంగనలు విచ్చలవిడి పలుమారు పలుకరించుట

న్యాయమగునే! బాలా! నీవే యోచింపుమనియె. అంత వారిరువు రీరీతి సంభాషణం బొనర్చిరి.

భువ:—ప్రాణరక్షాపరాయణులై సర్వధర్మజ్ఞులగు మీవంటి సత్పురుషులు పరులైనను స్వకీయులైనను బలుకరించుటచే న్యాయవిరుద్ధముగాదని పలుకరించితి నిం దపరాధమెందు గలదేని మన్నింప వేడుకొనియెద.

వసుం:—సహజసాధ్వీ ధర్మపాండిత్యంబుగల నీవే పలుమరు బల్కరించుచు యీసౌధశృంగారం బారయ చనుదెంచిన నాయుద్యమమున కేటి కంతరాయము గల్పించెద? వింతలోనవే నీశీలత్వం బెందుచనినది?

భువ:—పరపురుషులతోఁ బలుకరింపకుండుట గదా మీకు సమ్మతి యిచ్చట పరపురుషు లెవరున్నవారు?

వసుం:—ఏల నేను బరపురుషుఁడను గానా? నీమనోధవుఁడైన కళాభానుఁడుగాక మిగతవారందఱు పరపురుషులే నని నే వివరింపవలెనా?

భువ:—నామనోధవునితోడనే నేను బలుకరించుచున్నదాన నందుచే నేవిధమైన శీలముం గోల్పోవుట లేదని నిశ్చయముగా నమ్మియున్నదాన.

వసుం:—అందుకే స్త్రీ లతిచపలలనుమాట స్థిరపడియుండుట. యింతకుమునుపు నీవన్నదియే గదా యింతలో నింత మార్పు గలుగుట కేమి కారణము? ఇచ్చట నీమనోవిభుఁ డెందున్నవాఁడు?

భువ:—దేవా! యీరాజర్షీంద్రుని స్వీయచరిత్ర విమర్శనలో నీవే కళాభానువిభుఁడని గ్రహించియున్నదాన. లేకున్న యీయసహాయప్రతాపము నీయమేయసౌందర్యము నీ

యద్భుతకరుణారసము నీయఖండ తేజం బితరులయందు గలుగునే మహాత్మా!

వసుం:—పలుపోకలం బోకుము. ఆఖుషేంద్రుఁడు తనకథయుఁ దనపుత్రుని కథయుఁ జెప్పికొనియెఁగాని నేను దనపుత్రుఁడైన కళాభానుఁడని వివరించెనా! యింతలో దొందరపడి వీరపురుషుండైన నన్ను మనఃప్రియుం డనుకొనుటచే నిక్కముగా శీలము గోల్పోయెదవని నమ్మియున్నవాఁడ.

భువ:—మహాత్మా! ఇఁకెంత మరుగుపెట్టినను బ్రయోజన ముండదు. నామనఃప్రీతికరుండవు, నాప్రాణంతకుండవు నిక్కముగా సత్యముగా కళాభానుభూవిభుఁడు నీవేనని యున్నాను. నన్ను మన్నింపుము.

వసుం:—తరుణీ! రమణీయ సరోజమరందపానానందమదవ దిందిందిర ఝుంకారాలంకృతసరోవరతీరలతా మంటపాంత రంబునం దనంగమార్గణపరికంపితుండనై నీచెంతకుఁ జను దెంచి వేఁడికొంటి నన్నన్యుంగా నెంచిఁగితివి. తిరస్కరించి తివి. వైరాగ్యము వహించితి వింక నాజోలి నీకేల!

మ. అవివాహాంగన రాజపుత్రిక ప్రపంచాతీత సౌందర్యకా
మవశైకాతురమత్తచిత్తధవసంపత్కారులై యుండుటన్
నవకామాతురతన్ స్వతంత్రగరిమన్ బద్మాక్షునిన్ వేడగా
నవివేకుం బలె త్రోసిపైచితివి నీవారీతి యోచింపకన్.

నీకిష్టమగువరు నరసికొనుము. నాచెంత నీభువనమో హనాకారంబునకుఁ దగు సుందరంబుండవలదా! నీసమస్త విద్యాపాండిత్యమునకుఁ దగురసజ్ఞత నాచెంతనుండవలదా! ఉత్తమ క్షత్రియాంగనవగు నీక్షాత్రంబునకుఁ దగు తేజంబు నాచెంత నుండవలదా! వలదు వల దూరకుండుము. నీసౌధంబు

గాంచి వెడలిపోయెద. నీయాజ్ఞ లేక యీసౌధంబునం బ్రవేశించుటచే నపచారం బొనర్చినవాఁడ నైతినేని మన్నింపు మిప్పుడే వెడలిపోయెద.

ఉ. "భారతదేశకామినులపద్ధతులున్ వ్రతముల్ తపంబులున్
మీరలెఱుంగరో హృదయమే సకలంబనుకొంచరో సదా
కోరినవాని వీకి మఱి గోల్పడి యన్యులు మేలుచేసి రం
చూరటజెంది యొప్పికొనయుక్తమె దెల్పుము ప్రాణరక్షకా"

అని పలువిధముల సమాధానంబులు చెప్పినను కేవల వైరాగ్యభావముచే నుండుట గనుంగొని భీతిల్లి దక్కుదోచక వదనము వెలవెలబార గద్గదకంఠయై చేతులు ముకుళించి,

ఉ. "పేరుమొఱుంగు పెట్టుకొని పెక్కుఱంగుల నిందచేసి నా
నేరము లుగ్గడించి మదినిర్మలతత్త్వ మెఱుంగ కిట్లు బల్
వైరము బూనినాఁడ విదె వందనమంది నిజంబెఱింగి నన్
బారగఁద్రోయఁబూనకుము ప్రాణధవా యనియేడ్చె దీనయై"

ఆకాంత పరితాపంబు గని కళాభానునకు మనంబు దిక్కుపట్టుట కసాధ్యమయ్యె. కఠినమానసం బార్ద్రత వహించె. మోహం బంకురించె. తమకం బతిశయించె. చిఱునవ్వు నవ్వుచు "ప్రాణేశ్వరీ! దుఃఖంపకుము. దుఃఖంపకు" మని యతివేగముగా నాసతిసమీపమున కరిగి గాఢాలింగన మాచరించి తనయంగవస్త్రముచే గన్నుల నీరుం దుడిచి మోహోన్మాదమున గళాస్థానములంటుచు ముద్దుపెట్టుకొని "కామినీ! నీపాతివ్రత్యంబునకును నీమనశ్శుద్ధికిని సంతసించితి" నని చెప్పుచు దదీయాలింగనసౌఖ్యమున కదియే బ్రహ్మానంద మువలె మైమఱచి కొంతతడ వట్లే నిలువంబడియుండ భువనమోహినీదేవికి పరితాపంబుడిగె. సిగ్గు వొడమె. నాతని

కాఁగిలియందే తాఁ(?)(వాల్చి యణఁగియుండె. వారిరువురిపై నొక్క పుష్పహారము పడియె నిది యెందుండెనని మీఁదఁదిల కింప నాసౌధంబునం దలంకరింపఁబడియున్న పుష్పమాలలు వాయుచలితంబై తమపైఁబడియున్నట్టు గ్రహించి యిదియొక పరమేశ్వరలీల యనుకొని వారిరువు రొక్కచో నాసీనులరై యున్నంతలో నొకశబ్దము వినవచ్చె. అది యేమియో యని యాలకింపఁగా,

సీ. "యమునానదీతీరరమణీయసైకత
స్థలియందు నర్మముల్ వలికినాఁడ
ధర్మశాలాంతరద్వారంబునందున్న
మరలుప్పతిల్లి మైమరసినాఁడ
తలిదండ్రులటుపోవ చెలరేఁగి నిన్ జేరి
ముద్దిడి తిలకంబు దిద్దినాఁడ
నొంటిమై కురులార్చుచుంట గనుంగొని
యంగుళిచే కుచం బంటినాఁడ

గీ. నట్టివేళల బొమముడివెట్టి సూచి
యూరకుండుఁడు మీరు మావారు చూతు
రనుచు చిఱునవ్వు నవ్వి నాయాత్మఁగొన్న
కాంత నింకెందుగందు వనాంతమందు."

అని వినుపించె. "ఆహా! అదే మన శ్రీపాదుని ధ్వని వినఁబడుచున్నది. నీవు సుశీలం దోడ్కొని యుద్యానారామ ముచెంత కరుగు మతండు చూచునట్టుగా మీరిరువురు నటు నిటు సంచరించుచుండుఁడు. వారిరువు రొకరినొకరు గుర్తించిన యనంతరము నీసౌధమునకే తేరుము. నేనిదే మాజననీజనకు లకు తగు పరిచర్య లొనర్చి ఫలపుష్పాదులు సమకూర్చి చను

డెంచెద" నని కళాభానుం డనియె. భువనమోహినియు నవ్వుచు నిపుడైనను మాజననీజనకులని యమ్మహనీయులను సమ్మతించితిరిగదా! వారండపుత్రవియోగముచే దుఃఖించుచుండుట ప్రత్యక్షముగాఁ గాంచియు నేనే మీపుత్త్రుఁడనని చెప్పి వారి దుఃఖోపశమనం బొనరింపకుంటి రందున కేమి కారణమో వివరింపవలెనని విన్నవించుదాన.

కళా:- దేవీ! యమ్మహాత్ములు మహేంద్రవైభవముచే మహేంద్రవరమున తులఁదూగుచుండి యీనిర్భాగ్యునికొఱకు రాజ్యము గోల్పోయి యడవుల నిడుమలు పడుచుండఁగా అంగనాసమేతుఁడనై మీకొమారుఁడనని నే నేమని చెప్పికొందును! అమ్మహాత్ములను మరల నాంధ్రరాజ్య సింహాసనంబునఁ గూర్చుండఁబెట్టినపుడు నేనే మీకొమారుఁడ ననుటకు నోరాడును. సర్వజనులకు సమ్మతియైయుండు నందుచేత వివరింపకున్నవాఁడ. నిదెపోయి సపర్యలొనర్చి చనుదెంచెద నేఁజెప్పిన ట్లొనరింపుము.

అని కళాభానుం డాశ్రమమార్గముగా వెడలిపోయె. భువనమోహిని సుశీలావాసముచెంత కరిగి "బాలా! మనము యుద్యానవనమునకుం బోయివత్తము రమ్ము. అనవరత మిట్లొకవిధమున చింతిల్లుచున్న దేహయాత్ర బహుదుష్కరముగాదే లెమ్ము. లె" మ్మనియె. సుశీలయు గన్నులనుండి వెడలు నీరును దుడిచికొని వేడినిట్టూర్పుచే లేచి "అమ్మా! నేనేమియు జింతిల్లలేదు. శీఘ్రముగా మాతాపితరులసన్నిధికో లేక శ్రీపాదశర్మవారి సమీపమునకో తుదకు దేహము కైన యముని సమీపమునకో యింకను బోవకున్నదాననే! యీ క్రూరాత్మురా లుండిననేమి లేకుండిననేమి యనుకొను

చున్నదాన నింతియే” యనుచు భువనమోహినీసమీపమున కేతెంచె. నొకరిచేయి నొకరుపట్టుకొని యుద్యానవనముం బ్రవేశించి యటునిటుఁ బరికింపుచు లతలం బొందికపఱచుచు లతాంతములం జిదుముచు చిగుళ్లు గిల్లుచు బత్తులం దోలుచు విహారముచేయుచుండ,

“క. శీలాచారసుశీలా,
బాలా బాలేందుఫాల పలుక విదేలా
యేలాగ్రైతివోగద నా,
మాలిమి వీడకను జూచి మయిలలలలనా.”

అని వారలకు వినంబడియె. సుశీల దిగ్భ్రమవహించి యాదిశనేచూచుచు నిలువంబడియె. మఱలనదియే వినుపించె. యెవ్వరో నన్ను బిలచుచున్నారమ్మా యని సుశీల యనియె. పోయిచూడుము నేనిదే సరోవరంబున కరిగి జలపానం బాచరించెదనని సరోవరతీరమున కరిగి యటనుండి మఱల భువనమోహిని సౌధంబునకుం జనియె. సుశీలయు నాధ్వని వినుపించుచున్నదిశ కరిగి కదళీతరుమూలమునం దాసీనుఁడై మహాయాసముచే నిట్టూర్పువిడచుచున్నవాని, నడవులలో నిడుమలబడి సంచరించునపుడు కంటకపాషాణంబులు దగులుటచే నచ్చటచ్చటం జీరులుగల పాదములవాని, రతీదేవితో పుఱుడించి యలిగి నిజరూపముతో వచ్చి కూర్చున్న మన్మథుం బోలియున్నవాని శ్రీపాదునింగాంచి పరమసంతోషముచే మైమఱచి నిలువంబడియె. అతం డేదియో వ్యక్తి తనకెదుట నిలచియున్నదిగదా యనుజ్ఞానము వదలి యెందో ధ్యానించుచుండి యదాటున బ్రజ్ఞగలిగి యెదుటనున్న కాంతాలలామం గని హాసుశీలా! సుశీలా యని యఱచుచుం బోయి గాఢాలింగన

మాచరించి యానందముచే మైమఱచి నిలువంబడియె. సుశీలయు నాతని కౌఁగిలించుకొని యుండఁగ కన్నుల నీరువిడచుచు నాతని యెదపై నొఱిగియుండె. శ్రీపాదునకు మఱల స్మృతికలిగె. సుశీల యాతని కౌఁగిలి విడిపించుకొని చేతులు జోడించుకొని నిలువంబడియె. శ్రీపాదుఁ డానందముచే "బాలా! నీవానాఁడంత ర్హితవైనది మొదలిదివఱకు నీయందలి మమతచేఁ దిరిగి తిరిగి ప్రాణాపాయమైయున్న నోర్చుకొని మహానుభావునిచే రక్షింపఁబడి మఱల నిన్నుగంటి. నీకథయంతయు మాజననీదేవతవలన వింటి. నీకొఱకై ప్రయాగ కరుదెంచితి. మఱల నీవగపడకుండుటకు గారణం బెఱుంగక నేనును మీమేనమామయు నడవిలో దేవాలయము చెంత కరుదెంచి మాతండ్రిని మీజనకునిం జూచి దైవయోగముచే నీలోయలో నుంటిని. మాతండ్రియు మీతండ్రియు మీమేనమామయు మరల నెందు చనిరో గానఁబడలేదు. నీయందే మరులుగొని యున్నవాఁడ నగుటచే యీమార్గముగా నడుచుచు నిన్ను బిలుచుచు వచ్చి తనివిదీరం జూచితి. నేఁక ధన్యుఁడనైతి. నాకష్టమంతయు ఫలియించె"నను చున్నంతలో "దేవా! మీవృత్తాంతమంతయు మామేనమామగారివలనను భువనమోహినీదేవివలనను దెలిసికొనియున్నదాన.

ఉ. నేనల ఖేందుబారిఁబడి నిక్కము దక్కితి భూతినాథుచేఁ
గాననమందు భైరవని కాయముచేఁ బడి యార్య శ్రీకళా
భానువిభుండు ప్రోచెమిముభద్రముగంటిమియున్మహామహుల్
మాననికీర్తిసంపదల మందురుగాత చిరాయురున్నతిన్."

అని చెప్పి మఱల నేమియో చెప్పఁబోవుచున్నంతనే శ్రీపాదుఁ డాతురముచే "యేమీసుశీలా! నన్ను రక్షించినది

కళాభానుఁడా వసుంధరుఁడా పొరపడుచున్నావా? నిక్క-
మెవ్వరు నన్ను రక్షించినవారో మఱలం దెల్పుము"

సుశీల:—కళాభానువసుంధరుఁడే నిక్కముగా మిమ్ము రక్షిం
చినది.

శ్రీ:—రెండా దెదవే కళాభానుఁడనియెదవు. వసుంధరుఁడని
యెదవు.

సుశీల:—స్త్రీ ఆరెండు పేరు లమ్మహానుభావునికే యమరి
యున్నవి. వారి జననీజనకు లిడినపేరు వసుంధరుండనియు,
మహర్షు లిడినపేరు కళాభానుండనియు నే వినియున్నదాన
భువనమోహినిసహా ఎనియున్నది. అతం డిందే యున్న
వాఁడు భువనమోహినియుం నిందే యున్నది.

శ్రీపా:—తరుణీ! సంతోషసమయం బలవడినపుడొకటొకటి
సంతోషసమాచారములు తెరలుతెరలై వచ్చుచుండును.
ఇపుడు నాయానందమునకు మేరయే లేకున్నది. తొల్లి వేద
పురుషుఁడు మనుష్యానందమునుండి వల్లించుచుం బోయి
బ్రహ్మానందమునం బడి చూచుటకు వీలులేక నూహించు
టకు మనముచాలక వర్ణించుటకు సాధ్యముగాక తనశక్తి
కొలఁది నాయానందసాగరమున నోలలాడి మఱల వెను
దిరిగినరీతి నేను నట్టి యానందమున జ్ఞప్తిలేకున్నవాఁడ.
నన్ను రక్షించిన వసుంధరుడే కళాభానుడగుటయు, మఱల
నిన్ను జూచుటయు నమ్మహాదేవియైన భువనమోహినీ
సహితుఁడై కళాభానుఁ డిందున్నవాఁడనుటచేతను నేను
ధన్యుఁడనైతి. ఆహాతరుణీ! వసుంధరుఁడు కళాభానుఁడగు
టచేతనే యాప్రతిభ యాప్రతాపము యాకరుణ భీండా
భైరవాశ్రమమునందుఁ బ్రవేశించి భైరవానుచరులను

జార్వాకగణములను గాపాలికగణములను తుదకు భేండా భైరవుని దానొకడే సంహరించె. నబలా నేనేమని చెప్పుదు నాయుద్ధసమయమున నన్మహాత్ముని జూచుటకును బల్క రించుటకును భయపడి యేవేళ కేమిబుట్టునో యని నా ప్రాణములను బిడికిలించియుంటిని తరుణీ! నాయానందము నకు మేర లేకున్నది. నీవే నాసంతోషదాయకవు. నీవే నాసంసారసౌఖ్యభూమికవు. నీవే నాతపఃఫలసారదేవతవు. నీవే యష్టయాష్టైశ్వర్యసంధాయకవు.

అనుచు మితిమీఱినతమి మీఱి నామెచెంత కరిగి మరల కౌఁగిలించుకొని కొంతవడి నదేరీతి నిలువంబడియె. నామెయు ప్రార్థనోక్తులచే గరంబు విడిపించుకొని "మహాత్మా! మన బ్రాహ్మణధర్మమును యోచింపుఁడు. పితరుల యనుజ్ఞచే నగ్నిసన్నిధి బ్రాహ్మవిధిగా పాణిగ్రహణమహోత్సవంబగుట వఱకు" నని సిగ్గుచేఁ దలనంచి యూరక నిలువంబడియె. శ్రీ పాదునకు ప్రజ్ఞవోడమి "నామిత్రుఁగళాభానువసుంధరుని జూపింపుము. భువనమోహినీదేవి నగపఱచు"మనియె. వా రిరువు రాయుద్యానవనముననే భువనమోహినిని వెదకిరి. కానరాదయ్యె. సౌధమునకుం జని రందు గౌరీపూజకై, పూజాద్రవ్యముల సమకూర్చుచున్న భువనమోహినీదేవిం గాంచిరి. భువనమోహినియు చిఱునవ్వున నూతన వధూవరు లిరువురు వచ్చితిరే సుశీలా యనియె.

సుశీల:—నూతన వధూవరుల దర్శనమునకై నూతనవధూ వరు లరుదెంచినారని చెప్పుచు నొకచో నిలువంబడియె. శ్రీపాదుఁ డామెనుగాంచి "తల్లీ! వసుంధరుఁడు కళాభా

నుఁడు కళాభానువసుంధరుఁడు నాప్రాణరక్షకుఁ డెందరిగ"
ననియె.

భువ:—అయ్యా యిచ్చటనే సమీపమునందున్న మునిదంప
తులను దర్శించి వచ్చుటకై వెళ్ళియున్నవారు కూర్చొ
నుఁడు.

శ్రీపా:—నేనును యమ్మునీంద్రుని దర్శించి నాప్రాణరక్షకుం
గూడి చనుదెంచెదను.

అని లేచి వెడల నుపక్రమించె. సుశీలయు నాతని వెంట
నంటె. వారి ప్రేమానుబంధమునుగాంచి భువనమోహిని
యానందమొందె. అంతలో వసుంధరుడును జనుదెంచె.
శ్రీపాదుఁ డాతనింగాంచి డబ్బుకొని "దేవా! బాల్యాది
మిత్రుడనై సహాధ్యాపకుండనై యుండియు నిన్ను గళాభాను
డని గుర్తింపలేకపోయితి నాయపరాధమును మన్నింపుము"

కళా:—శ్రీపాదా! నేనే కళాభానుఁడని నాచెల్లెలగు సుశీలా
దేవివలన దెలిసికొనియుందువు కానిమ్ము. ఇందు నీయప
రాధమేమిగలదు? ఆనాఁ డాయడవిలో నీవు నన్నుఁ గళా
భానుఁడననియే యర్థమౌనట్లు ధ్వని గల్గించితివి. నేనేయా
భావము తప్పించితి నందుచే నపరాధము నాయదిగాని
నీయం దణుమాత్రము లేదు. నన్ను మన్నింపుము.

శ్రీపా:—ప్రాణరక్షకా! నీకొక యపరాధముగలదా? జగజ్జీ
వనహేతుభూతుండగు శ్రీమదాదినారాయణాపరావతా
రునివలె నున్నవాఁడవే. జగదరిష్ట భీండాభైరవ నిర్మూ
లనం బొనరించి నాకోటియార్తుల ప్రాణభీతుల వేలకొలది
ప్రాణదానం బొనర్చిన కరుణామయుండవే. భైరవాను
చరుల ఖండించునపుడు కోదండధరుండవైన నీవు దండ

ధరుని వడువున మహాట్టహాసముచే వర్తించుచుఁ జూచు టకే యసాధ్యమై మామనము భయమందుచుండ భువన మోహినీ ప్రార్థితుండవై మమ్ము దయారసంబునం గాంచి తివే. నరనారాయణ మహర్షులదయకుఁ బాత్రుండవై యద్వితీయాస్త్రశస్త్రప్రతిభాప్రభావము లెఱింగిన ధీరుం డవే. జగన్మోహనానందసుందరాకారమునందున్న ప్రత్యం గిరామోహపాశంబులకుం జిక్కని నిక్కపుజితేంద్రియుం డవే శ్రీరామచంద్రునివలె నొక్కబాణంబుననే ఘోర వానచరుని శిక్షించి నన్ను రక్షించిన కోదండపండితుఁ డవే. దుష్టరాక్షసచతుష్టయమును శిక్షించి లోకపాలసరో వరము నిష్కంటకం బొనర్చిన ప్రజోపకారివే. యెంతని పొగడుదు! నిట్టి మహాత్ముఁడవగు నీకొక యుపచారము గలదా తండ్రీ! యని సరసములాడుచుండఁగా నొక దీర్ఘ కాయుఁ డరుదెంచి "దేవా! సభయంతయు సమకూడి యున్నది. మీనిమిత్త మెదురుచూచుచున్నవారు. శీఘ్ర ముగా మిమ్ము దోడ్కొనిరమ్మని మాసభాధ్యక్షుడు మిమ్ము లను వేడుకొనుచున్నాఁడు. దయచేయువలయు"నని విన్న వించి వెడలిపోయె. శశిభానునకేమియు దోపక "శ్రీపాదా! సభ జరుగునదెచ్చట! మనల నాహ్వానించిన సభాధ్యక్షుఁ డెవఁడు? నాకేదియుఁ దోఁపకున్నది. యిదిగాక నాశ్ర మము చెంత కరిగి సమిత్కుశాదులఁ గైకొనిపోయి యొసంగ నాఋషీంద్రుఁడు నన్ను గాంచి 'నాయనా! నీచే నియమింపఁబడిన కొందఱు శబరార్భకులు మాకు వలయు పూజాద్రవ్యంబులును గంధమాలాదుల నొసంగి రాత్రివేళల మా యాశ్రమముచుట్టు గావలియుందురు.

మఱల నీవెందుకు బ్రయాసపడి వచ్చితివి'' అని చెప్పి
నా కేమియుఁదోఁపక వారితో నేమియుఁజెప్పక వెడలివచ్చి
తినే నెవ్వరికిని జెప్పలేదు. నామిత్రులగు శబరార్భకు
లీకోనయందు లేరు. ఇది మేమి మాయమా యనుకొని
యుంటి నంతలో మఱల నిదియొక చిత్రము వినుచున్నాము.
భువనమోహినీ సుశీలరాకయు నటువంటిదే. నీ విం దఱు
దెంచుటయు యోచింపఁదగినదే. యీ విషయము లెట్లు
జరుగుచున్నదో నీ కేమయినా స్ఫురించుచున్నాదా''
యనియె. ''దేవా! సర్వజ్ఞులైనతమకే స్ఫురింపకున్న
కించిద్జ్ఞుఁడగు నే నెఱుంగుదునే కానిమ్ము. చూచుచుండ
నింకేమి జరుగునో'' యనుచుండ భేరీభాంకారములు
గుఱ్ఱముల హేషారవంబులు యేనుఁగుల ఘీంకారములు
జనముల కలకలధ్వనులు తూర్పుదిశనుండి వీతెంచె.
శ్రీపాదవసుంధరు లట్టె చూచుచుండఁగాఁ బడమరనుండి
పర్వతోపమానమగు నొక గజంబునకు బంగారుచే
నిర్మింపఁబడిన యంబారి యమర్పఁబడియుండె. ఘంటలు
ఘణఘణధ్వను లీనుచుండె. ముఖమునకు బంగారుపట్ట
మలంకరించి యుండిరి. అంబారిపై నొక శ్వేతచ్ఛత్ర
మొప్పారుచుండె. యీ గజముపై నిరువురు ఋషిదంప
తులు గూర్చొని వచ్చుచుండిరి. వెనుక ముందర యిరువది
జనులు బల్లెములు ఖడ్గములు పట్టుకొని వచ్చుచుండిరి.
పరికింపఁగా వసుంధరుని పితరులే నా యేనుఁగపైనున్న
వారు. ఆ యేనుఁగ వచ్చివచ్చి సౌధమునకు సమీపమున
నిలువఁబడియె. నంతలో దూర్పుదిశయందుగల విపరీత
ధ్వనులు సమీపించె. ఐరావతోపమానమగు నొక గజ

మునకు రాజోచితాలంకారము లొనర్పంబడియుండిరి. మఱియొక మత్తేభమునకు బ్రాహ్మణోచితయలంకారములు సవరింపఁబడియుండె నూఱుగుఱ్ఱములపై యాశ్వికులు ముప్పది రెండాయుధములు ధరించి బారులు దీరి వచ్చుచుండిరి. వారివెనుక నొక విధమయిన బూరుగధ్వములతో గగ్గరకట్టెలతో ధ్వజదండములతో మకరతోరణములతో నెఱ్ఱనిదుస్తులు గలవారు కొందరు నీ విధముగా బారులుదీఱి వచ్చుచుండిరి. వారివెనుకల యుచ్చైశ్శ్రవోపమానంబగు నొక యశ్వంబుపై నల్లనియంగరకాయ పసరుశిరోవేష్టమును నడుమునకుఁ ర్మనిర్మితమైన పట్టెడయు ధరించి ఖడ్గముఁ బట్టుకొని యొక పురుషుఁడు చనుదెంచుచుండె. నతఁడు సౌధముచెంత కరుదెంచి యశ్వంబునుండి దిగి లోపలఁ జనుదెంచి వసుంధరునకు నమస్కరించి "మహాత్మా! సభయంతయు తమకొఱకై వేచియున్నది. యీ ప్రధానగజంబుపైఁ దాము మఱియొక్క గజంబుపై శ్రీపాదకర్ణియును వధూసమేతముగా నారోహించి దయ చేయవలయు"నని ప్రార్థించె. కళాభానుఁడు నిర్విణ్ణుఁ డయ్యె. శ్రీపాదుఁడు దిగ్భ్రమవహించె. సుశీలా భువన మోహినులు వెరగందిరి. పడమరనుండి జనుదెంచు యేనుఁగవచ్చి సౌధద్వారమందు నిలచె. వసుంధరుఁడు తటాలున నా గజరాజముచెంత కరిగి నమస్కరించి నిలువఁబడియె. "నాయనా! యిందెందో సభజరుగుననియు నా సభకు నీవుగూడా జనుదెంతువనియు మమ్ములను రమ్మని బలవంతపఱచి యీ భటగణము లీ యేనుఁగ నెక్కఁ బ్రార్థించిరి. అచ్చట కేమయినా మా కుమారుఁడు

చనుదెంచునేమో యను నాశచే వచ్చుచున్నా''మనిరి. వసుంధరుఁడు చిత్తమని నమస్కార మొనరింప నా ప్రధానాశ్వారోహకుఁడు పలువిధముల గజారోహణ మొనర్పుమని ప్రార్థించెఁ గాని యీ విశేషమేమో చూత మని వసుంధర శ్రీపాదులు గజంబులపై నెక్కిరి. భువన మోహినీదేవియు సుశీలయు వారిచెంత నుపవిష్టలైరి. భేరీప్రముఖ మంగళవాద్యములును వందిమాగధులకై వారములును జెలరేఁగె. మాండేనుఁగులు మహావైభ వముచేఁ దూర్పుదిశగా మరలె. ఋషిదంపతులా గజమున కుభయపార్శ్వములయందును వసుంధర శ్రీపాదులగజము లేతెంచుచుండ నదిగాంచి యా వృద్ధదంపతు ''లాహా! యీ కుమారుం డెవ్వరో యిరువదియైదు సం॥లు గల వయస్సున కీగుణనిధి యింత ప్రసిద్ధపూర్షుఁడై యింత వైభవవంతుఁడై యున్నవాఁడే కానీ సభజరుగునుగదా! అందేమి విశేషములుండునో యీ కుమారుని నామమేమో విచారింపనగు'' ననుకొని సంతోషించుచుఁ దమ పుత్రుఁ డగపడనందుకు బశ్చాత్తాపముఁ జెందుచు వచ్చుచుండిరి. సర్వవైభవసమేతముగా పూర్వాదిశాభిముఖులై పోవు చుండ నొకపట్టణ మగపడియె. నా పట్టణపుగోపురము లాకాశమున కొరయుచున్నవి. మహాద్వార మత్యున్న తంబై యేకాదశకవాటయుక్తంబై శుద్ధస్ఫటిక శిలా వినిర్మితగోపురముచేఁ బ్రకాశించుచుండె. సప్తభౌమాష్టభౌ మాంతఃపురము లనేకములుగలవు. మణిఖచితకవాటములు గలవు వేయేల! యనేకామరావతీపట్టణముల వైభవ మంతియుఁ దెచ్చి యొకచోట బ్రహ్మదేవుఁడు సృజించి

నట్లుండె. ఆ పట్టణమునకు దక్షిణభాగమున మహాదున్న తేంద్రనీలమణి పరికల్పిత వప్రావృతంబై యంధకార బంధురంబై యొక క్రోశమాత్ర విశాలంబుగల్గి వాయువు కైనను బ్రవేశింప నలవిగాని గొప్పభవనము వెలుఁగు చుండె. నా పురముచుట్టు శ్రీమన్నారాయణస్మరణ సేయుచు భక్తులు గుంపులుగుంపులుగా నుండిరి. అవి యంతయుఁ గాంచి వసుంధర శ్రీపాద నరేంద్రచంద్రులు రోమాంచకంచుకితశరీరులైరి. పురంబునఁ బ్రవేశించి నంతనే మహాద్వారంబునందున్న పెద్దఘంట తనంతట తానే ఘణఘణధ్వనులు సల్పె. భేరిమ్రోఁగె. పురవీధు లలోఁ బ్రతిగృహాంగణంబునందును "మహాపురుషా! స్వాగతము స్వాగత"మని పటములు వ్రాసియుంచి యుండిరి. మనవారల కేమియుఁ దోఁపక తుదకొక మహామంటపంబు జూచిరి. ఆ మంటపమధ్యమున ధగద్ధ గాయమానంబైన యగ్నికుండమున నొక సింహాసనం బలంకరింపఁ బడియుండె. నందుపై గదాదండం బొక్క చేతను భయంకరత్రిశూల మొక్కచేతను ధరియించి నల్లనిశరీరకాంతి యొప్పార ననర్ఘరత్నఖచిత కిరీటకుండల హారనూపురాదిభూషణములు వెలుగొందనొకపాద మగ్ని యందును మఱియొక పాదము క్షీరభాండమునందు నుంచుకొని పర్వతాకారమున దంష్ట్రికరాళభయదా కారంబుచే నొక దివ్యమూర్తి కూర్చొనియుండె. అతని శిరంబుపై పెద్దయినుపగుదియ వ్రేల గట్టఁబడియుండె. ఇరుపార్శ్వములయందు పెద్ద సింహాసనములు రెం డమర్పఁబడియుండె. ఇరువు రనేక తాళపత్ర పుస్తకములు

దొంతరలుగాఁదీర్చి ముందుభాగమునఁ గూర్చొనియుండిరి. నాలుగు వర్ణములవారును సభ నలంకరించి యుండిరి. స్త్రీలకు ప్రత్యేకముగా నొక స్థానం బమర్చబడియుండె. నదియంతయుఁ గాంచి పరమానందభరితులై యా మువ్వురు వధూసమేతముగా గజములనుండి దిగి మంటప సోపానము లెక్కుచుండ నా సభాధ్యక్షుఁడు "మహా పురుషులారా! స్వాగతము. ఈ సింహాసనంబుల నలంక రింపవలయు" నని చెప్పుచుండ సభలోనుండి మువ్వురు పురుషు లెదురేగి కైదండ యొసఁగి నరేంద్రచంద్ర వసుం ధరుల నా సభాధ్యక్షుని కిరుపార్శ్వంబులందున్న యాసన ములపైనను, శ్రీపాదుని బ్రాహ్మణ జనాగ్రాసంబునందును గూర్చుండఁ బ్రార్థించిరి. సతీమతల్లులు స్త్రీజనోచిత సింహాసనంబులయం దధిష్ఠింపవలయు ననుచుండ గంధ ర్వాంగనలం బోలు సుందరులు మువ్వురా వృద్ధాంగ నాదులఁ దోడ్కొనివచ్చి బహుమానపూర్వకముగాఁ గూర్చుండ నియోగించిరి. సభయంతయుఁ జంద్రోదయ సమయంబున ఘూర్ణమానం బగు మహోదధివలెనుండె. నపుడు కొందఱు వేత్రహస్తు లరుదెంచి నా సభాధ్యక్షుని కెదుర నిలువంబడి "మహాత్మా! మార్తాండనందనా! జగ జ్జనధర్మకర్మ విచారణదక్షా! యమధర్మరాజా! బహు పరా"క్కని కైవారములొనర్చి యొకచోఁ గూర్చొనిరి. సభ్యులందఱు దమ మనంబుల పట్టలేని సంతోషమున నాహా! మాభాగ్యమే భాగ్యము సజీవులై యమసభం గాంచితిమిగదా! యిచ్చట సమవర్తి పరిపాలనం బేరీతి జరగునో చూడవలయుఁ బాతకుల విచారణలు వినవలయు

ననుకొనుచుండిరి. వసుంధరుఁ డాశ్చర్య మొందియుండె. సభయంతయు నిశ్శబ్దముగా నుండె. నా సభాధ్యక్షుఁ డైన యముండు లేచి సభకు నమస్కరించి యిట్లని యుపన్యసించె. "సభ్యులారా! సతీమతల్లులారా! పరమేశ్వరుఁడు నాకీ యధికార మొసంగియున్నవాఁడు. యీ యధికారమున నేదేని యధర్మమో పక్షపాతమో యొనర్చితినా యీ సింహాసనంబు క్రిందనున్న సంకర్షణ నామకమైన కాలాగ్ని నన్ను దహించివేయును. పైన వ్రేలఁదీసియున్న యినుపగుదియ బడి నా తల పగులును. ఇపుడు నాయాజ్ఞ నొనర్చుచున్న యీ కాలదండమే యీ కాలపాశమే యీ మృత్యుదేవతయే నన్ను హతమొనర్చును. ఇది పరమేశ్వరుని చండశాసనము. ఏమాత్రము ధర్మలోప మాచరింపఁగూడదు. ప్రపంచంబునందు గల సమస్తజీవుల ధర్మకర్మంబులం జూచుచున్న యీ కర్మసాక్షి యీ సూర్యభగవానుఁడే నా ధర్మపరిపాలనకొక సాక్షి. ప్రతిదినంబును సర్వలోకములు మనోవేగముతో సంచరించి ప్రతి ప్రాణియొక్క పుణ్యపాపము లెఱింగి దెల్పుచుండెడి శ్రవణదేవత లొక సాక్షి. మృత్యురూపకమైన ప్రతి దేహధారియొక్క ఛాయయే యీ దేహ ప్రత్యహంబొనర్చు సుకృత దుష్కృతముల మా గణకులైన చిత్రగుప్తులయొద్దకే తెంచి వ్రాయించుచుండుటచే నదియొకసాక్షి. పుణ్యపాపముల తారతమ్యము నారసి సమమైన దండనలు విధించుచుండుటం జేసియే నాకు సమవర్తి యనియు, యముఁడనియు ధర్మరాజనియుఁ బలువిధము లయిన పేరులు గల్గినవి.

ఈ దినమున మహావిచిత్రకరమైన పాపంబు లొనర్చిన ప్రాణు లనేకమంది విచారింపఁబడుదురు. నా పుణ్యోదయ వశమున భూలోకమునఁగల మహాపురుషులందఱు వారివారి కార్యంబులకొఱకు వచ్చి యీ లోకమున నీ స్థానమున నీ సభ నలంకరించియున్నవారు. ప్రజల నతి ధర్మమార్గముగాఁ బరి పాలించు మను నిభులైన రాజచంద్రులును నిరతాహితాగ్ని పరులును బరమేశ్వరధ్యాన మానసులును బరోపకార పారీ ణులు నగు బ్రాహ్మణోత్తములును విచ్చేసియున్నవారు. ఈ మహాపురుషుఁ డీసభ నలంకరించుట శ్రీమదాది నారాయణ మూర్తి ప్రేరణయేగాని వేరులేదు. అనుజ్ఞ యొసంగితిరేని ప్రేతల రావించి విచారించెద" ననిన సభ్యులందఱు నానంద మొంది మంచిదనిరి. "దూతలారా! నేఁడు దో డ్తెచ్చియున్న ప్రేతల నొకరొక్కరినే తీసుకొని రం"డనిన మాత్రముననే యా సభయంతయు భయముచెందునంతటి హుంకారములచే నిరువురు క్రూరాకారు లొకపురుషు నీడ్చుకొని గ్రుద్దుచు లోనఁ బ్రవేశించి సమవర్తికెదుట నిలువంబెట్టిరి. యాప్రేతను జూచినమాత్రముననే యా సభలోనున్న యొక బ్రాహ్మణుఁడు కనురెప్ప వ్రాల్పక యాతని నెగాదిగఁ జూచి యేమియో మాట్లాడ నుంకించి మిన్నకుండెను. ఋషివైయున్న నరేంద్ర చంద్రమహారాజును యాతెనిం గాంచి యేదియో భ్రమ చెందుచుండెను. నంత "చిత్రగుప్తా! యీప్రేతయొక్క వృత్తాంత మీ సభవారికి వినుపింపుఁ" డనిన మహాప్రసాదమని చదువుట కుపక్రమించెను. ఇతఁడు గోదావరీనదీతీరమున మహేంద్రవర మను పట్టణమున నరేంద్రచంద్రమహారాజు చెంత మంత్రివై యుండెను. నీతనిపేరు కాళీభద్రుఁడు. ఆ రాజేంద్రునకు బిడ్డలు

లేక నైమిశారణ్యమునకు దపంబొనర్ప నేగుచు రాజ్యభార మీతనియందు నిల్పి వెడలె. నితఁడు బహుక్రూరుఁడును దురాశాపరుఁడు నగుటచే మఱికొన్ని దినములకే ప్రజలకు దండధరుఁడై దోఁచుచుండె. దైవోత్సవములు నిల్పివైచె. బ్రాహ్మణవృత్తులకు బన్నులు విధించె. దేవాలయములు పడగొట్టించి రాజ్యాంగవిషయిక స్థానములం గావించె. పలు విధములైన పన్నులచేఁ బ్రజలను వేధింపఁదొడఁగె. యే మనుజుఁడేని పన్నొసంగుట కాలస్య మొనర్చెనేని యమునిగతి యనుబాధయే మేలనుపించుచుండె. బ్రాహ్మణులన్న యీ దురాత్మునికి మహాద్వేషము. ప్రజోపయోగకార్యము లొక్కటియు సల్పఁడయ్యె. ధర్మాలయములు నన్నసత్రములు నిల్పివేసె. పరగణములకును మండలములకును దేశములకును దనవారి కధికారంబు లొసంగె. అదే యధికారమునందున్న తనవారికి వితరులకు నెలవేతనములందుఁ బక్షపాత మొనర్చె. వర్ణాశ్రమాదులు చక్కఁగా విచారింపఁడయ్యె. జారులు చోరులు ప్రబలిరి. వారిబాధచేఁ బ్రజలెంత మొత్తుకొనినను నిశ్చయమును విచారింపక బలవంతుఁడై యెవ్వరు ద్రవ్య మొసంగెదరో వారికే మేలొనర్చు నధికారులను నియమించి వారియోగ్యత తాను బరిశీలింపక ప్రజాద్రోహ మొనర్చె. కాపురము లొనర్చుటే కష్టమయ్యె. క్షామ కాలమున బీదల కన్నవసతు లొనర్పక ప్రజలకు పన్నులసౌకర్యము గూర్పక యెంత వేడుకొన్నను నప్పులియ్యక సర్వులను గోడు గుడుపించె. ప్రజలచేఁ బలువిధములు లాగిన ద్రవ్యమంతయు వేతనములు మొదలగు సెలవులుపోను నికరలాభమును రాజభాండారమునం దుంపక తన స్వగృహంబున నిలువ

గల్పించె. నా ద్రవ్యమును స్వకార్యములకును బ్రజలకు సంబంధములేని కార్యములకును వ్యయపఱచుచుండె. తా నెచ్చటనో యెవ్వరికిఁ గానరాక మహాంతఃపురములో జేరు కొని తన వైభవములయందే తన విలాసములయందే ప్రొద్దుపుచ్చుచు ప్రజలు తమ కష్టసుఖములు చెప్పుకొనుటకే వీలులేనట్లును బహుప్రయత్నముల నతని జూచునంతటి ముఖ్యకార్యమైనయెడల నాతని సర్వస్వమును విక్రయించినను యాతని దర్శనమున కయ్యెడి కిలవులకు చాలనంతటి నిర్బంధములు నేర్పఱచి క్రూరుఁడై వర్తిల్లె. ఆరాజేంద్రునిమిత్రుడైన సుబ్రహ్మణ్యశర్మయొక్క సర్వస్వము నపహరించి కట్టుబట్టలతో భార్యతో పలాయనమగునట్లు క్రూరశాసనమొనర్చె. దినమున కొక శాసనము నేర్పఱచి మునుపున్న శాసనాను సారము లభించియుండు ప్రజలయొక్క హక్కుల కంతరాయములు గల్పించె. నాసుబ్రహ్మణ్యశర్మ యిపుడు ప్రయాగయందున్నవాఁ" డనుచున్నంతనే నాసభలోనున్న యొక బ్రాహ్మణుఁడు లేచి "దురాత్మా! ద్రోహీ! నన్ను భ్రష్టుభట్టించితివి గదరా పాపాత్మా!" యని యఱచుచు "అయ్యా సూర్యనారాయణశాస్త్రిగారు యీవిధ వేనయ్యా మాదేశపుమంత్రి" యనిన నందఱు చిత్రప్రతిమలవలెఁ జూచుచుండిరి. వసుంధరుఁడా బ్రాహ్మణునిగాంచి "ఓహో తామేనా? సుబ్రహ్మణ్యశాస్త్రిగారూ మీకేనా యీతఁ డింతబాధపెట్టుట" యనిన "మహాత్మా! తామచ్చటనే యున్నవారా తమనిమిత్తమై యీయడవియందు మేమెందెందో వెదకితిమి మీరగపడరైతి" రనుచున్నంతనే నరేంద్రచంద్రమహారాజుగారు "అయ్యా బ్రాహ్మణోత్తమా! సుబ్రహ్మణ్యశాస్త్రి నాప్రియమిత్రమా

వందనములు. నేను మిత్రఘాతకుడను నాయందు కటాక్షింపు" మని దిగ్గున లేచె. నతని గాంచి యాబ్రాహ్మణుఁడు గుర్తించ లేక "మునీంద్రా! తామెవ్వరో గుర్తింపలేకయున్నాను. మీ కంఠధ్వనిమాత్రము నారాజేంద్రుని బోలియున్నది" అనిన "మిత్రమా! ఆనరేంద్రచంద్రుఁడే యీద్రోహి" యనియె. సుబ్రహ్మణ్యశాస్త్రి యానంద మొంది బిరబిర నందలిని ద్రొబ్బుకొనుచు జనుదెంచి రాజు నాలింగనము గావించుకొని "రాజేంద్రా! నీ కీవేషమేమి? సామంతరాజులు కానుక లొసంగుచుండ పేరోలగమున దేవేంద్రవైభవమున నుండెడు నీ కీ దర్భ భస్మ రుద్రాక్ష జటావల్కలములు లలవడియున్నవా హాత విధీ! యెంతటివాని నేమిగతిబట్టించితి"వని దుఃఖించుచుండె. నపరాధిస్థానమందున్న కాళీభద్రు డచ్చటినుండియే "రాజేంద్రా! నరేంద్రచంద్రా! యీద్రోహి యీనీచుఁడు నీకు వందనం బొనరించుచున్నవాఁడు. నేజేసిన ప్రజాద్రోహమున కెడ తెగనిబాధ లనుభవించుచున్నాను. బ్రాహ్మణోత్తమా! నాకు గర్వభంగంబయిన దింకను నీకు నాపై ద్వేషమేని శాపంబొసంగుము. దగ్ధమయ్యెద" ననిన నాబ్రాహ్మణుఁడును రాజును నావల నూరకుండిరి. వారింగాంచి సభయందు గూర్చొనియున్న మఱియొక పురుషుఁడు లేచి "రాజేంద్రా! మీదాసుఁడు వీరసేనుఁ డభివందన మొసర్చుచున్నాఁడు కరుణింపు" మనిన "యోహో సైన్యాధిపతీ! భేండాభైరవ యుద్ధమందు నీవు వారిచేఁ జిక్కి భైరవునకు బలియైతివని కింవదంతి. క్షేమముగా నున్నవాఁడవుగదా" యనిన "మహాత్మా! నా కథనంతయుఁ జెప్పతరము కాదు. తమదర్శనమైనందుకు సంతసించుచున్నా" ననుచున్నంతనే సద్దు సద్దని యమభటులచే

వారింపఁబడియె. ధర్మరాజు భటులంజూచి "యీద్రోహిని స్తంభమునకుఁ గట్టివేసి మఱియొకద్రేతను దీసికొనిరం"డని యాజ్ఞాపించె. ముప్పురు పురుషులను పాశములచే బంధించి ఘోరాకారులగు దూతలు వారిని గ్రుద్దుచు బాదుచుచు వారు కుయ్యో మొఱ్ఱోయని మొత్తుకొనుచుండ సభలోఁ బ్రవేశపెట్టిరి. వారింగాంచి ధర్మరా జధికరౌద్రాకారమున గన్నుల నిప్పులురుల పటపటమని పండ్లుగొఱికి హుంకరించి నంతనే సభయంతయు భయమొంది నిర్విణ్ణులైరి. "చిత్ర గుప్తా! వీరి వృత్తాంతమేమో చదువు" మనిన చిత్తమని చదువు చున్నాఁడు. "భూమండలమున పాంచాలదేశమందు మణి స్యందనమను పట్టణమున విభావసుండను రాజుకలఁ డాతనికి భువనమోహినీదేవి యనఁగల యొక తెయే కుమార్త. పుత్రులు లేరు. ఆతని పినతండ్రి కొమారుఁడు దుశ్శీలుఁడనువాఁ డితఁడు. ఇతని పెద్దకొమారుఁడు శంబరవర్మ. ఇతని చిన్న కొమారుఁ డులూకసేనుఁడనువాఁడు మఱియొకఁడు" అను చుండగానే సుబ్రహ్మణ్యశర్మ సూర్యనారాయణశాస్త్రి దిగ్గున లేచి "అయ్యో వీరాయరణ్యములోనే చచ్చిపోయిరే. మఱల నిచ్చటికెట్లు వచ్చిరని మరల యోహో యిది యమలోకము గదా" యని సిగ్గుచేఁ గూర్చుండిరి. మఱల సద్దు సద్దని భటుల కరతాళధ్వను లుప్పతిల్లె. చిత్రగుప్తుఁ డిట్లు చదివె. "ఆరాజు నకు బుత్రులు లేనందున దుశ్శీలుఁడు ప్రతిదినము రాజుచెంత కరిగి రాజేంద్రా! మీకు పుత్రులు లేరు. పుత్రులు లేనివార లకు గతులు లేవని శాస్త్రములు ఘోషించుచున్నవి. దత్త పుత్రునైనను స్వీకరింపవలెను. ఇదో నారెండవ కొమారుఁ డులూకసేనుని నీకు దత్తోసంగెదఁ గైకొనుమని చెప్పుచుండె.

నారాజేంద్రునకు దత్తుగొనుట యిష్టములేదు. ఈతఁడీప్రస్తా
వన దెచ్చినపుడంతయు దుశ్శీలా! నా కేకపుత్రిక నే నాబిడను
బాసియుండఁజాల యెవఁడైనా తగుమైన వరునకొసఁగి యీ
రాజ్యమిచ్చి యింటనే నిల్పుకొనియెద. నావల వారి కొక
పుత్రుఁడు గలిగెనేని వాఁడే వంశకర్తయగునని చెప్పుచుండెను.
దుశ్శీలునకు రాజ్యాపేక్షచే నామాటలు రుచింపలేదు. ఒక
దినము తనకొడుకును దాను గలసి యీభువనమోహిని
భూమియందుండుటచేఁ గదా దత్తుతీసికొనుటకు రాజొప్పక
యున్నాఁడు. ఈమెను సంహరించితిమేని విధిలేక అపుడు
దత్తుతీసికొనును గనుక ఆమెను సంహరింతమని సమయము
వేచియుండిరి. ఆభువనమోహినీదేవి ప్రతిశుక్రవారమునాడును
భువనేశ్వరీదేవికి బూజలొనర్పఁ వచ్చుచుండుట వాడుక. ఒక
దినమునం దట్లు పూజించి వచ్చుచుండ నీముప్వురు తమవేష
ముల మార్చుకొని వికారాకారముతో దుశ్శీలుఁడు వీరుఁ
డనియు, శంబరవర్మ శకుంతుఁడనియు, నులూకసేనుఁడు
కాళికుఁడనియును మారుపేర్లు పెట్టుకొని చోరులవలె నామెను
సంహరించుటకు నోటబట్టలు దురిగి, కాలుచేతులు బిగియఁ
గట్టి హిమాలయారణ్యములోని కెత్తుకొనిపోయి యడవియం
దొక పాడుదేవాలయమునందుంచి చంపుదమా వలదా యని
యోచించుచుండఁగా యీసభయందున్న సుబ్రహ్మణ్యశర్మ
సూర్యనారాయణశాస్త్రిగారు వీరలవలనఁ గొంతయాలస్య
మగుచుండె" ననుసరికి సభయందు గూర్చొనియున్న యొక
రాజపురుషుఁడు లేచి "ఆహాదురాత్ములారా! దుశ్శీల శంబర
వర్మ యులూకసేనులారా! పాపాత్ములారా! మీరేనా నా
బిడ్డను యడవులపాలొనర్చి చంపివేసితిరి. అయ్యో నాచెంత

నుండి నాబిడ్డలను వెదకువారివలె నెంతో పశ్చాత్తాప మొందుచు నెంతటి కపటనాటకమును జూపుచుండిరిరా ద్రోహులారా" యని యఱచుచున్నంతనే స్త్రీజనమధ్యమున నున్న భువనమోహినిదేవి లేచి "అప్పా! క్షేమముగా నున్నావా? నేనిందేయున్నా" ననియె. నారాజునకు దిక్కు-దోచక యిదియేమోనని స్త్రీజనముతట్టు చూచె. భువనమోహినీదేవి లేచి నిలచియుండె. నామెనుగాంచి యింతింతని చెప్ప శక్యముగాని యానందముచే "తల్లీ సుఖముగా నున్నావా? నేను ధన్యాత్ముఁడను. ప్రాణవంతురాలవై యున్నావు గదా! యీదురాత్ములు నీకెంత కష్టములు గలిగించిరో? హా పరమపురుషా! నారాయణా! నాబిడ్డను మఱల నాకొసంగితివే తండ్రీ నీవెంతకరుణామయుఁడవో" ననుచున్నంత వసుంధరుఁడు తనమనమున "నోహో యీమహానుభావుఁడు మా భువనమోహిని తండ్రి విభావసుమహారాజై యుండవలయు నిమ్మహనీయుఁ డీలోకమున కెట్లు చనుదెంచెనో యీసుబ్రహ్మణ్యశర్మ సూర్యనారాయణశాస్త్రిగా రెట్లువచ్చిరో యీ సభ పూర్తియైన పిమ్మట విచారింపవలయు. చోరులరూపకముగా నీదురాత్ములు దాయాదిమచ్చరము చూపించి యున్నారు. వీరు చోరులు కారు యేదియో దురుద్దేశ్యపరులై యీకాంతను జంపుటకుఁ దెచ్చియుండవలయునని నేనానాఁ డనుకొన్నట్టే యయియున్న" దని యోచించుచుండఁగా మఱల సద్దు సద్దను భటులకరధ్వనులచే సభ నిశ్శబ్దమయ్యె. అంత చిత్రగుప్తుఁడు మఱల చదువుట కుపక్రమించె. "ఈ దురాత్ములా బ్రాహ్మణులను బాధించి స్తంభములకు కట్టివేసి చంపడమునకు నీడ్చుకొని పోవుచుండ నాయరణ్యమంతయు

మారుప్రోఁగునట్లు ప్రాణముపై యాశవదలి యఱచుచున్న భువనమోహినీదేవి యా ర్తధ్వని విని శేతాళుని బంధవిముక్తి గొలుపును, భేండాభైరవ సంహారముఁ గొలుపును బ్రతిజ్ఞ యొనర్చి బదరికారణ్యమునకుఁ బోవుచున్న శ్రీకళాభానువసుంధరుం డతివేగముగాఁ జనుదెంచి వీరిని దన్ని యామెను దేవాల యమునందున్న బ్రాహ్మణులను గట్లు విడిపించి యీముఖ్వురి ప్రాణసంరక్షణ మొనర్చె" ననుసరికి సుబ్రహ్మణ్యశర్మ మఱల లేచి "మహానుభావా! మహాపురుషా! వసుంధరా! నీవేనా కళాభానువసుంధరుండవు. మారాజకుమారుఁడైన నీవలన మేమందఱు రక్షింపఁబడియున్నను. నిన్ను దెలిసికోలేమైతిమే తండ్రీ నేను యోచించితి నీప్రతాపము, నీవిద్యానైపుణ్యము, నీదయారసము. ఈకాలమున వసుంధరుఁ డనువాఁడు గలఁడా యని యుంటిమి. ఇపుడు నామనస్సందేహము తీరియున్నది. నాయనా యెంతమందిని ప్రాణాపాయమునుండి తప్పించి యున్నావు. ఎట్టి దుర్మార్గులను మట్టుబెట్టియున్నావు. ఇరువది యైదు సంవత్సరముల కెంతటి ప్రతిష్ఠావంతుఁడవై యున్నా" వని పొగడుచున్న నరేంద్రచంద్రమహారాజునకు సంతోష మున బ్రజ్ఞ లేక కొంతవఱకు స్తబ్ధుఁడై యుండి దిగ్గున లేచి, "అయ్యో కుమారా! నీవేనా కళాభానుఁడవు. చిన్నతనమందు ఋషులచెంత విద్యాభ్యాసమునకు విడిచినదాదిగా నిన్ను జూడకుండినందున గు ర్తింపలేకపోయితి. తండ్రీ తగుసమయ ముననే వచ్చి మీతల్లిని పెద్దపులిబారినుండి తప్పించి, మాతృ ఋణము దీర్చుకొంటివి. ఎంతటివాఁడవైతివప్పా" యని కళా భానుని గట్టిగా నాలింగనము చేసికొని నిలువఁబడియె. స్త్రీ జనములయందున్న ప్రియంవదాదేవి లేచి "కుమారా! కళా

భాను! వసుంధరా! నా ప్రాణదాతా! తండ్రీ! మఱల నిన్నినాటికి జూడగంటి. యేదీ యిచ్చటికరుదెంచి నాకొక ముద్దొసంగి పొమ్ము కుమారా'' యనిన తండ్రి బాహువులలో నాలింగితుఁడై యుండ విడిపించుకొని తండ్రికి నమస్కరించి, తల్లి కచ్చటనుండియే వందనం బాచరించి నిలువంబడియె. సభ్యులందఱు కన్నుల నీరునించిరి. భువనమోహినీదేవి తనదండ్రిని గన్నందు కానందపరవశయై తనభర్తయశస్సునకు ద్విగుణీకృతానందవతియయ్యె. సుబ్రహ్మణ్యశర్మ ప్రియంవదాదేవితో గుశల ప్రశ్నలాడె. తామందఱు మఱల నొకచోఁ జేరినందులకు శ్రీపాదుఁడు మైమఱచియుండె. ఆవెంటనే విభావసు మహారాజుగారు లేచి ''కళాభానువసుంధరా! నీకు జయమగుగాక! నాబిడ్డను బ్రతికించి పుణ్యము గట్టికొంటివి తండ్రీ'' యనుచున్నంత ''రాజుగారూ! యీమహానుభావు డాచోరుల బారినుండి తప్పించుట యొక యెక్కువగాదు. ఇంకను మహాయసాధ్యకార్య మొనర్చి నీపుత్రికను రక్షించియున్నవాఁడు. నీపుత్రికనే గాదు ప్రపంచమునం దెందఱి ప్రాణములో రక్షించియున్నవాఁడు వినుమని శ్రీపాదుఁ డిట్లనియె, చోరుల బారినుండి రక్షించి యీపాడుదేవాలయమునందుంచె. ప్రభాతంబగుటయు నిత్యకృత్యములకై యందఱు వెడలిరి. మీసుత యొకతెయే యుండుటగాంచి భేండాభైరవభటు లెత్తుకొని పోయిరి'' యనఁగానే అయ్యో అని రొమ్ముమోదుకొని విభావసుఁడు దబ్బున నేలకు బడియె. మఱల నాతని గూర్చుండ బెట్టి జరిగినకథ చెప్పెద. మీరు భయపడక వినవలయునని సేదదేర్చి'' అట్లెత్తుకొనిపోయియున్న సమాచార మెఱింగి అంతకుమునుపే బేతాళునికొఱకు ప్రతిజ్ఞ చేసి యున్నవాఁడగు

టచే నరనారాయణాశ్రమంబునఁ దపంబాచరించి వారిని మెప్పించి వారివలన ననేకాస్త్రశస్త్రములం బడసి వామదేవ మహర్షి వలన హయరత్నములు రెంటిని సంపాదించి భైరవాశ్రమమున కరిగి, వేయిమంది చార్వాకుల వేయిమంది భైరవానుచరుల మూఁడునూర్ల గుఱ్ఱముల నఱువదిరథికులను దానొక్కఁడే యొకగడియలలో ధ్వంసమొనరించి భైరవ శిలను నూఱుశకలంబు లగునట్లు పగులఁగొట్టి ఖేండాభైరవుని సంహరించి మీసుతను బలిగాకుండా ప్రాణసంరక్షణమొనర్చి నాప్రాణరక్షణమొనర్చి బేతాళునికట్లు విడిపించి మహోపకారం బొనర్చిన మహానుభావుఁ డీతఁడే''నని చెప్పిన మాత్రముననే విభావసునకు నరేంద్రచంద్రునకు దిగులువొడమి, ''ఆహా! ఖేండాభైరవుఁడు సంహారమాయెనా యాయాశ్రమ మంతమైనదా'' యని దిగ్భ్రమఁజెంది కళాభానుని జూచుటకే భయపడిరి. నరేంద్రచంద్రునకు నాపుత్రుఁ డింతటి ప్రతాప ప్రభావవంతుఁడయ్యెఁగదా యని సంతసము పట్టఁజాలకుండె. విభావసుఁడు కళాభానుని వేయివిధములఁ బొగడుచుండగా సద్దు సద్దు యను భటుల కోలాహలములు వినుపించె నంత మఱలఁ జిత్రగుప్తుఁ డిట్లు చదివె. ''భువనమోహినిని దయ్యాలనుండి తప్పించెనను రోషముచే మోసగించి కళాభానుని చంపవలెనని యొక భయంకరమగు గుహలో ద్రొబ్బి ద్వారములను బలమైనశిలల పొందుపఱచి వచ్చిన దురాత్ములు వీ'' రనునంతనే యీదురాత్ముల నచట కట్టివేసి మఱియొక ప్రేతను దీసికొనిరమ్మని యముఁ డాజ్ఞాపించె. దూత లొక పురుషుని బట్టుకొనివచ్చి యాతని యెదుట నిలువంబెట్టిరి. చిత్రగుప్తా! యితని పాపములేవో చదువమన్న ''యితఁడు

లగ్నికుండమునందు ద్రోబ్బిన ట్లగుపఱచి యచ్చటినుండి యీడ్చుకొనివచ్చి నాఁటనుండి వీరి తప్పిదములకు దగుప్రాయశ్చిత్తముగా యమదండనయే మేలనుపించునంతటి బాధలు పెట్టుచుండి మిమ్ముందఱిని యీసభచేర్చి వీరి దుర్మార్గములు బయలుబెట్టినవాఁడను నేనే. ఈమహాపురుషుఁడు జరతలోఁ బడుచుండ నీతనింబట్టుకొని యిసుకతిన్నెపై పరుండఁబెట్టి యే విధమైన బాధలేకుండున ట్లొనరించి, ఆవల లోమకేశునికి భువనమోహినీ స్వరూపంబున బాధలుపెట్టి తలక్రిందుగా వ్రేలదీసినవాఁడను నేనే. శేండాభైరవసంహారమైనంతనే యీతని యాజ్ఞచే భువనమోహినీదేవి నాదేవాలయమందుంచక యీ నాలోకంబునం దుద్యానవన సౌధంబునందుంపఁ దొల్లి నాచే రక్షింపఁబడిన సుశీలాదేవిని సహా దెచ్చి యిచట జేర్చి మీకన్యోన్యసందర్శనం బొనరించి యీమహానుభావుని మనస్సంతోషం బొనరింపఁ బ్రయత్నించినవాఁడను నేనే. ఆహా! యీసహాయము లిమ్మహాత్మున కేమాత్రమో యితం డొనర్చిన జగదద్భుతాద్వితీయప్రతాప సహాయమున నిది చెప్ప నాకు సిగ్గగుచున్న''దని చెప్పుచున్నంతనే నరేంద్రచంద్రుఁడు కుమారుని దేజఃప్రతాపముల కానందమొంది తనకు త్రైలోక్యసింహాసనాధిపత్యము వచ్చినంతటి సంతోషమున నుబ్బి దిగ్గునలేచి కుమారుని కౌఁగలించుకొని యావల చేతా ఖంగాంచి ''భూతాధిశా! నాపుత్రుని రక్షించి మరల నేను భూమియందుండున ట్లొనర్చిన పుణ్యమూర్తివని పొగడి కూర్చొనియె. సుబ్రహ్మణ్యశర్మ లేచి ''భూతరాజా! నాకూతురు నాశేండాభైరవుని బారినుండి రక్షించి నామనస్సంతోష పెట్టితివి మహాత్మా'' యని పొగడి కూర్చొనియె. సూర్యనారా

యణశాస్త్రియు, విభావసుండును లేచి "కళాభానువసుంధరా! మాబిడ్డలను రక్షించి భూతరాజుం గాపాడి శాశ్వతయశంబుఁ జెందితివి. నీయట్టి కరుణామయుని మేమెందును గానలే"దని పొగడి కూర్చుండిరి. బంధితులు నలువురు బహుబాధల నొందినవారగుటచే దట్టుకొనలేక, లజ్జచే దలవ్రాల్చియే "మహాత్మా! వసుంధరా! మే మపరాధులము. మాతప్పిదమునకుఁ దగు దండన యీభూతరాజే యొనర్చియున్నవాఁడు. ఇఁక తట్టుకొనలేము. ఇష్టమున్న మమ్ము విడచిపెట్టుము. అటులేకున్న నొకటేతూరి మాశిరంబులం ద్రుంపుము. నీవు కరుణామయుండవు. బహుమందిని రక్షించిన క్షత్రియోత్తమునకు మమ్ము రక్షించు టొక యెక్కువగాదు. శరణ్యుండవు. తేజోమూర్తివి. కల్యాణభూయిష్ఠుండవు. పుణ్యపురుషా! ఇదే వందనశత మర్పించెద" మని వేఁడుకొన్న వారి ప్రార్థనవిని వసుంధరుఁడు జేతాళుంగాంచి "భూతాధిపా! ఈయపరాధులకుఁ దగుశిక్ష యొనర్చియున్నవాఁడ విఁక వీరికి బంధనమో విముక్తియో మనకు సంబంధించినదిగాదు. విభావసుమహారాజుగారికిని వారి పుత్రికకును సంబంధించియున్నది. వారల కిష్టమున్న విడిచి పెట్టనగును. లేకున్న ఖండింపనగునని చెప్పుచు, అపాంగ వీక్షణముల భువనమోహినింగాంచి చిఱునవ్వుచే నూరకుండె. "సర్వస్వతంత్రులైన మీరు మాకప్పగించుట న్యాయము గాదు. మీ రెయ్యది యొనర్చినను మాకు సమ్మతమే" నని చెప్పి వారిర్వురు మిన్నకుండిరి. వారంద ఱీరీతి మరల ప్రసంగించుట కుపక్రమించిరి.

కళా:— సుబ్రహ్మణ్యశర్మగారూ! కాళీభద్రునివిషయమైన మీ రేమి చెప్పిన నట్లొనరింపనగును. మీయభిప్రాయ మేమి?

సుబ్ర:—బ్రాహ్మణులు తమకుఁ దెలిసిన వేదచోదిత ధర్మము లింతకుమునుపే స్మృతులుగా వ్రాసియున్నవారు. యేయప రాధికిఁ దగుదండనం బెయ్యదియో విమర్శించిన నందే యగపడును. అందున నీకుఁ దెలియనిధర్మములు, ధర్మ సూక్ష్మములు గలవే! నాపైన నీదురాత్ముని శిక్షావిధి వేయకుము. నీయిష్టము.

నరేంద్ర:—భూతేశా! బ్రాహ్మణోత్తములారా! నాకోకు శోఁచుచున్నది. మీరందఱు సమ్మతింతు రేని విమర్శించు చున్నవాఁడ.

అందఱు:—అహా! స్వర్ణమునకు సుగంధమబ్బినట్టేగదా మహానుభావా! సత్యమూర్తీ! నీ తీర్మానమును గాంచి దేవేంద్రాదులైనను దృప్తిఁజెందుదురే మేమెంతవారము! యీశిక్షావిధి మీరే విమర్శింపవలయు.

నరేం:—కాళీభద్రుఁడు బహుకాలమునుండి నాచెంత మంత్రి పదవియందుండియు నీతని దుర్గుణములు వెల్లడించకుండుటం బట్టియో లేక నేను గమనించకుపేక్ష సేయకుండుటం బట్టియో కుములుచుండిన అగ్ని మండినది. అట్టి దుర్గుణ ములను విచారించకుండుటచేఁ బ్రథమతప్పిదము నాయం దలవడియున్నది. మఱియు రాజప్రజాద్రోహియై స్వలా భపరుఁడై నిరంకుశమును వహించి పరిపాలించినేని అట్టి దురాత్ముఁడు అట్టి చండాలుఁడు అట్టి వంశనాశకుఁడు శరీరమును విడిచి యమలోకమున దమిస్ర అంధతామిస్ర రౌరవాది మహానరకములఁ బహురోమాయుతవత్సరములు యాతనలం జెందుచుండునుగాన నీతఁ డొనరించిన గొప్ప

తప్పిదమునకు మన మెంతటిక్రూరదండన విధించినను స్వల్పమే. రాజదండన నొందువారికి యమదండనలేదని చెప్పుదు రందుచే నితనికి మన మేవిధమైన దండన యొన ర్పక విడిచిపెట్టనగును. లోమకేశుఁడు నాకుమారున కెక్కువ కీడొనర్చి యున్నవాఁడైనను నేను సహించితిని. నాపుత్రుఁడు ప్రతాపభాస్కరుఁడై యశఃపూరితుఁడై నేఁడు నాకగపడుట యిది నాకు సంతోషకాలము. ఈతని కేవిధమైన దండన యొనర్చినను విభావసుమహారాజుగారు సమ్మతించినను వారి దేవేరికి సంతాపకరముగా నుండును. భువనమోహినీదేవికో ఆకై యడవులలో నిడుమలు బడి యున్నవాఁడగుటచే నాతని శిక్షింపక విడచిపెట్టుటయే ధర్మము. వారి వారి పాపకృత్యములకు దగుదండన యమ లోకములో ననుభవింపఁగలరు. ఇఁక దుశ్శీల శంబరవర్మ యులూకసేను లొనర్చిన యపరాధ మపారమైనది. ఇందున కెంతటి కఠిన దండనయుఁ జాలదు. వీరు విభావసుమహా రాజుగారికి ముఖ్యజ్ఞాతులై యున్నవారు. వీరిని ఖండించి నంతట పుత్రికాలాభసంతోషసాగరనిమగ్నుండైన యమ్మ హారాజున కశుచి నాచరింపవలసివచ్చును. వారి వారి ఘోరకృత్యములకుఁ బశ్చాత్తాపముచే వారే నశింతురు గాక! మనమేటికి సంతోషకాలమున నిట్టి కాఠిన్యం బవ లంబింపవలయు నిదియే నాయభిప్రాయము.

అనినమాత్రముననే సభవారును భూతరాజును మహా సంతోషమొంది యిట్టి కరుణాసముద్రునిగన్న కడు పింకెట్టి దయారసము వెల్లిగురియుచున్నదో గణియింపఁగలమే!

ధర్మము, సత్యము, సాధువాదము జయము, స్వస్తి యని పలువిధములచేఁ బొగడిరి. కళాభానుఁడు బేతాళునితో,

కళా:—బేతాళా! నామిత్రులు, సర్వశస్త్రాస్త్రకోవిదులు, నాకై యెంతటిపనికైనను వెనుదీయనివారు, నాప్రతిజ్ఞ పరిపూర్ణవేళలయందు బంధితుఁడైయున్న నీ కాహార మొసంగుచున్న పుణ్యాత్ములైన శబరార్భకుల నిరువది యైనువేలమందిని యిచ్చటికిం దోడ్తెర భూతముల కాజ్ఞ నిడుము.

విశ్వా:—ఆహా! అనాఁడడవియందు దశ్వత్థవృక్షంబుపై బంధింపఁబడి శబరార్భకులచే నాహారము గొనుచుండిన భూతము నీవే ననుకొన్నాను. నీవు పిలుచుచుండినను భయముచేఁ బర్వెత్తిపోయితిని. బేతాళరాజా! నన్ను మన్నింపుము.

బేతా:—నిదానించిచూచి హోయో తామా స్వామివారూ! బహుధైర్యశాలురు. నేను బిలచుచుండినను భయములేదని చెప్పుచుండినను నాకు బదులుచెప్పక మాటాడక తిరిగిచూడక గోచియూడిపోవుచుండ జుట్టువీడిపోవుచుండ యొకపత్రిక జారి క్రిందఁ బడిపోవ బరువెత్తిన విశ్వావసు శర్మగారు తామేగదా! నేనంత మంత్రపాశములచే బంధింపబడి బాధనొందుచుండినను యీబ్రాహ్మణుని యవస్థ చూచి నాకు విపరీతము నవ్వువచ్చినది. కళాభానువసుంధరా! భువనమోహినీదేవి యీతనివెంటనే నీకు సందేశవార్త నంపియుండినది, నన్నుగాంచి భయపడి జారి పోఁగొట్టుకొన్న యీకమ్మ మన శ్రీపాదశర్మ సుశీల నన్వే

షించుచు వచ్చి యచ్చటచ్చటఁ బడియుండినఁ గైకొని బదరికారణ్యమున నీకు గాన్పించె. నితఁ డామార్గముగాఁ బోవుచుండుట నేఁ గాంచితినిగాని పలుకరించిన నితఁడేమి గతి బట్టునో యని యూరకుంటి. ఈవిశ్వావసుశర్మగారి యవస్థ తలఁచుకొన్నప్పుడంతయు నాకు నవ్వువచ్చు చున్నది.

కళా:—బ్రాహ్మణుఁడు పాప మాతఁడే మటువంటిబాధల ననుభవించి యున్నవాఁడు. ఇతఁడు ధైర్యశాలి యనియే చెప్పనగుఁగాని విశ్వావసుశర్మగారూ నాఁడు హారిద్వారము నందు జూచియుంటిని. మఱల మిమ్ముఁ జూడలే దాపశ్వాసముచే నాకొఱకై బహుబాధల నొందియున్నవారు. మీఋణము నే నెపుడు దీర్చుకొనవలయు.

విశ్వా:—మహాత్మా! భువనమోహినీదేవి పాణిగ్రహణమహోత్సవసమయ మేతెంచుచున్నది. ఇఁక నాఋణము దీరుట కెంతయోకాలము కావలయునా? శ్రీపాదా! ఆజ్ఞ యేది? చదివెద ననిన కళాభానుఁడు వలదని సైగచేసె. భువనమోహిని ప్రసన్నవదనయయ్యె:—అపుడు బేతాళుఁడు, "మహాత్మా! శబరార్భకుల నేఁటికిచటికి రప్పింపవలయు."

కళా:—నే నిచ్చటనుండియే దిగ్విజయార్థ మరుగవలయు. వారిచే గొన్ని యాజ్ఞాపత్రికలు మునుముందుగా దేశాధీశ్వరుల కొసంగింపవలయు బ్రజల నాజ్ఞాపింపవలయు నందుకొఱకు.

బేతా:—మహాత్మా! కొన్ని యాజ్ఞాపత్రముల ప్రతులు నా చెంతనున్నవి యవి విమర్శింపనగును. యాపత్రములు శ్రీపాదశర్మ చదువవలయు.

అని మూఁడుపత్రము లొసంగె నవియన్నియుఁ గ్రమముగా జదివి శ్రీపాదుఁడు చాలించి యూరకుండె. "భూతేశా! నాహృదయములో నెయ్యది యాచరింపవలెనని సంకల్పించి యుంటినో అవియన్నియు నొనర్చియున్నవాఁడవు. ఇంతటి మహాత్ముఁడై యుండియు నానీచునిచే నెట్లు బంధింపఁబడితివో యిట్టి భావికాలగతు లెఱింగిన నీవానాఁడు నీబంధవిముక్తోపాయమును మార్గమునందు నాకు రాఁబోవు గుహాప్రవేశాదు లెఱింగింపవైతివేల? అని కళాభానుండనియె.

బేతా:—దేవా నేనేమి చెప్పుదు? ఆపాపి మంత్రపాశములు నన్ను బంధించుటచే నాకెయ్యదియు స్ఫురింపకుండె. మేధాశక్తి లేకుండె. ఆఁకలియు బాధయు అఱచుటయు నీమూఁడును దెలియుచుండె. నెంతయో సాహసమున బదరికారణ్యమున కేగి నరనారాయణుల నాశ్రయింపుమని కొన్ని సంగతులు మాత్రము చెప్పితి ననుచుండఁగా నా పట్టణమునకు నాల్గుదిశలనుండియు గహకహార్భటులు సముద్రమువలె ఘోషింపనయ్యె. అదియేమో యని చూచుచుండగా లక్షలకొలఁది భూతము లాసభాభవనము ప్రవేశించి బేతాళ కళాభానులకు వందనము లొనర్చిరి. వారినిగాంచి యేమి సమాచారమని బేతాళుఁ డడిగె. కొందఱు దేవా! తమయానతి నాంధ్రదేశమున కేగి యాజ్ఞాపత్రిక నారాజుచెంత చదివితిమి. అతఁ డొకలెక్కగొనక తిరస్కరించె. నాతనితో యుద్ధమొనర్చి సైన్యమును బంధించి విజయనగరంబునందున్న ప్రతినిధిని నారాజును బట్టికొని వచ్చియున్నాము. వీరే వారని చూపించిరి.

మరికొందఱు: దేవా! తమయానతి నాజ్ఞాపత్రికలు గైకొనిపోయి ప్రతిభూపాలునకుం జూపించితిమి. ఖండాభైరవుని సంహరించి బేతాళుని రక్షించియున్నవాఁడని విని కళాభానువసుంధరు నాజ్ఞాపత్రిక యన్నమాత్రముననే యాజ్ఞను శిరసావహించి యభివాదపత్రికలు వ్రాయుచుఁ గానుకలు సమర్పించియున్నవారు. రాజులందఱొసగిన ద్రవ్యమంతయు నాంధ్రదేశమున మహేంద్రనరమున రాజభాండాగారముల, రాచనగరియందును వేయేలి కోటకు లోపలిభాగమంతయు నించి వచ్చియున్నవారము. హరిద్వారభూపాలుఁ డాజ్ఞాపత్రము ప్పక మాతో యుద్ధమొనరించి నెట్టుకొనలేక యరణ్యములకుఁ బర్వెత్తె. మే మాపట్టణమును స్వాధీనమందుంచుకొని కొన్ని భూతముల నచటను గొన్నిభూతముల నాంధ్రదేశమునకుఁ గాఁపుంచి వచ్చియున్నవారము. మీయానతి మేరకు పాంచాలదేశము జోలికిఁ బోవ కరుదెంచితి మనిరి,

కొందఱు:—రాజోత్తమా! మీ యాజ్ఞాపత్రములు గైకొని ప్రతిపల్లెయందును ప్రతియూరునందును భేరీధ్వానములో నందఱికిం దెలియులాగు వినుపించితి మందఱు కళాభానువసుంధరుఁడు దమకు సార్వభౌముఁడని సంతోషించుచున్న వారు. కొన్ని దేశములయందు ధనుర్ధారియైన కళాభానుని ప్రతిమను శిలలయందు జెక్కించి జ్యోతులు మోయుచు దేవుఁడని భావించి మ్రొక్కులు చెల్లించుచున్నవారు. కొన్ని పాండవులమిట్టలపై గల గుళ్ళకు ముందుపార్శ్వముల నా శిలలనాటి ప్రార్థనలు చెల్లించి పూజించుచున్న వారు. ఇండ్లయందు గళాభానుపటమును వ్రాయించుకొని

యర్చించుచున్నవారు. కొందఱాపటములను మహావైభవముతో మహాదుత్సవము సేయుచున్నవారు. ఇదియే మావృత్తాంతము.

అనునంతలో ఘంటలు ఘణఘణ మ్రోయుచుండఁగా నొకవిమానము వియన్మార్గముననుండి వచ్చి యాసభామధ్యమునం దంతరాళముగా నిలువఁబడియె. అందొక సిద్ధపురుషుఁడు కూర్చొనియుండె. నాతనిం గాంచి సభ్యులందఱు సాష్టాంగ నమస్కారము లొనరించిరి. కళాభానుండును నమస్కరించి నిలువఁబడియుండ నాసిద్ధపురుషుం డిట్లనియె. "కళాభానువసుంధరా! నీవు పుణ్యపురుషుండవు. అవతారపురుషుండవు. ఛండాభైరవచార్వాకాది ప్రపంచద్రోహులను సంహరించి ధర్మస్థాపన మొనర్చుటకై శ్రీమహావిష్ణు కళాంశమున జన్మించి యున్నవాఁడవు. విష్ణుకళచే జన్మించి భానుప్రభచేఁ బ్రకాశించుచుండుటచే మహర్షులు నీకు కళాభానుం డని నామకరణం బొనర్చిరి. ఇంకను నిన్ను లోకైకవీరుం డనియు, సకలవిద్యాభోజుండనియు, వసుంధరుండనియు, ఛండాభైరవాంతకుండవనియుఁ బ్రజలు పొగడుచుందురు. నీవు కొంతకాలము రాజ్యపరిపాలనం బొనర్చి, యావల నీపుత్రుల నభిషిక్తులగాఁ జేసి కలాపగ్రామంబున మాలకరాజాదులంగూడి తపం బాచరించుచుండుము. కలికాలము గాన అపుడపుడు దుర్మార్గులను సంహరించి సన్మార్గులను రక్షించి ధర్మస్థాపనం బొనర్చెదవని దేవతల వేడికోలు నీకు విన్నవించియున్నవాఁడ. నీవంశంబున మహాధర్మశీలురైన రాజులు జనియించి ప్రజాపరిపాలనం బొనరింతురు. నీకు

సార్వభౌమాభిషేకం బొనరించి రమ్మని సర్వనదీ సముద్రో దకముల నీకలశంబునం జేర్చి దేవత లొసంగియున్నవా''రనిన మాత్రముననే సభవారందఱు సమ్మతించిరి. విజయనగరేశ్వర దుశ్శీలాదులకు గట్లు విడిపింపఁబడియె. సుబ్రహ్మణ్యశర్మ, సూర్యనారాయణశాస్త్రి, విశ్వావసుశర్మాదులు సిద్ధపురుషు నానతిచేఁ బట్టాభిషేకసుముహూర్తము నిశ్చయించి మంత్ర ములం జెప్పుచుండ నరేంద్రచంద్రుఁడు తనకుమారునకు యువ రాజ్య లాంఛనంబగు స్వర్ణపట్టిక ముఖంబునంగట్టె. సిద్ధ పురుషుం డభిషేకించి స్వర్ణరత్నవిరాజమానంబైన కిరీట మకరకుండలాంగదాదులు శిరఃకర్ణభుజభాగంబుల నలంకరించె సుశీలా సహాయముచే ప్రియంవదాదేవి మంగళాక్షత లొసంగె భూసురులు ఆశీర్వచనంబు లొనర్చిరి. విభావసు నరేంద్ర చంద్రాది వృద్ధరాజులు దీవించిరి. భేరీభాంకారాది మంగళ ధ్వనులు చెలరేఁగె. నిట్లు మహావైభవమున సార్వభౌమ రాజ్యాభిషేకంబైన యనంతర మందఱు వినునట్లుగా శ్రీపాదుని చెంతనున్న జాబుఁ గైకొని విశ్వావసుశర్మ లేచి ''మహాపురుషులారా! ఇది మహోత్సవసమయము. భువన మోహినీదేవిగారిమ్మహాత్ముని కొసంగిన సందేశలేఖం జదివెద వినుఁడు.

''శ్రీకళాభానుభూపాలా,

శా. శ్రీరంజిల్ల పసిండిచాయగల నీశృంగారరూపంబునుఁ
సారోదారదిశావిజృంభితయశస్సామ్రాజ్యభాగ్యంబునుఁ
గ్రూరారీంధనహవ్యవాహసమశక్తిస్ఫారశౌర్యంబు నో
ధీరా భూసురవర్యుఁడెన్నఁగను నేనుత్సాహినై యెప్పుడుఁ,

శా. నీపాదాబ్జమరందగంధవతినై నీధ్యానమానాత్మనై
నీపారాయణసువ్రతప్రతిధనై నేనుందు నిక్కంబుగా
భూపాలాత్మజ శీఘ్రయానమున సంపూర్ణాదరాయత్తతన్
గాపాడంగదె రాగదే దయ సదాకళ్యాణసంధాయకా.

సీ. వేవ నాసందేశభావంబు మరువక
నెప్పుడు వచ్చెదో యిందువంశ
వచ్చి కాదనక నన్వరియించి కళ్యాణ
మెప్పుడు జెందెదో యిందువంశ
చెంది సద్గతిమార్గసిద్ధపూర్ణార్థముల్
యెప్పుడు గాంచెదో యిందువంశ
గాంచి దివ్యానందకైవల్యసామ్రాజ్య
మెప్పుడు వడసెదో యిందువంశ

గీ. గాన నీయాన నామనఃప్రాణదాన
మేను మేనుయుతంబుగ మీకొసంగి
నాను నానోము సఫలంబుగా నొనర్చి
భార్యగాఁ గొను మోకళాభానుభూపా!''

(స్వ స్త్య స్తు)

భువనమోహినీదేవి.

చదివి ఫలమంత్రాక్షతలు గైకొని పత్రికాసమేతముగా కళాభానున కొసంగె. సిద్ధపురుషుఁ డిట్లనియె. ''వసుంధర సార్వభౌమా! యీభువనమోహినీదేవి మహాలక్ష్మీయంశముచే భువనేశ్వరీవరప్రసాదమున మహాసత్యసంధుఁడైన విభావసు మహారాజునకుం జనియించె. అట్టి పరదేవతాస్వరూపిణి నితర

రాజపుత్రులకు లోమకేశున కొసంగఁ బ్రయత్నించిన యామె వరించునే? యిట్లని యామెకు స్ఫురింపలేదుగాని విద్యామేధాశక్తిచే నండతివలె దనకుఁ దగు రూపయౌవనప్రజ్ఞైశ్వర్యవిద్యావంతుఁడు వరుఁడు కావలెనని కోరుచుండె నీక నీమహాదేవిని పాణిగ్రహణం బాచరింపుము. శ్రీపాదశర్మ సుశీలలకు వివాహ మొనరింపుఁ''డని యతం డంతర్హితుండయ్యె. బేతాళాదులతో సర్వజనులును పాంచాలదేశమున మణిస్యందనముం బ్రవేశించిరి. కాశీప్రయాగలనుండి శ్రీదేవి సునీతులను బిలిపించిరి. వీరసేనుఁ డెప్పటియట్లు సర్వసైన్యాధిపత్యశస్త్రంబును స్వీకరించి తనరాజునకే తాను సహాయం బొనరించితినని సంతోషమున మైమఱచియుండె. శబరార్భకులను రప్పించిరి. నైమిశారణ్యమహర్షుల యనుమతిచే వివాహముహూర్తము నిశ్చయించిరి. లోమకేశునకు రాజవంశంబునకుం జేరిన యొక కన్యకను సమకూర్చిరి. దుశ్శీలాదుల కారాజ్యమున నేదియో గొప్పయధికార మొసంగఁబడియె. వారలు తమయపరాధమునకుఁ బశ్చాత్తాప మొందుచు రాజునకు భక్తులై కళాభానునకు దాసులై బేతాళునకు భయపడుచు శబరార్భకులకు జంకుచు నిష్కపటతచేఁ దమయధికారములు నెఱవేర్చుచుండిరి. ముహూర్తసమయ మరుదెంచె. మహావైభవముచేఁ గళాభాను భువనమోహినీదేవి వివాహమొకచోటను, శ్రీపాద సుశీలా వివాహ మొకచోటను, లోమకేశ వివాహ మొకచోటను జరగంబడియె. తగువైభవములతో మహేంద్రవరమునకుం జనిరి. యాంధ్రరాజ్యసింహాసనారూఢుఁడైన తమ తండ్రికి నమస్కరించి తానును యువరాజ్యపట్టభద్రుఁడై శ్రీపాదుని మంత్రిత్వముతో వీరసేనుని సైన్యాధిపత్యము

(శేరాళు మిత్రత్వముతో భూతములతో రాజ్యం చేలుచుండి నరేంద్రచంద్రుఁడు సహాయముతో) తపోవనంబున కరిగె. కళాభానువసుంధరుఁ డతిధర్మముగా రాజ్యపరిపాలన మాచరించుచు భువనమోహినీదేవితో యిష్టోపభోగము లొందుచుండ నిరువురు పుత్రు లుద్భవిల్లిరి. వారిలో రెండవవాఁడైన భానుమంతుఁడు మాతామహగోత్రంబునకు వంశకర్తగా నొసంగంబడియె. జ్యేష్ఠపుత్రుఁడైన రాజనరేంద్రుఁడు తండ్రి చెంత సకలధర్మంబు లెఱింగి వర్ధిల్లుచుండె.

కళాభాను విజయము

సంపూర్ణము

మంగళం

స్వస్త్యస్తు

శాంతిః. శాంతిః. శాంతిః.

ఉ. ప్రాకటయుల్బకమ్మయను బ్రాహ్మణుఁడర్క వరపంచరత్నసు
శ్లోకమహార్ణవాబ్జుఁడగు సూరపపుత్రుఁడ సుబ్బరామపా
ఖ్యాకలితుండ శౌనకసమర్క శుభగోత్రయజుర్మహాగమ
కరుఁడే నొసంగెదను జేకొనుమీ సుమమాంధ్రభారతీ.

శ్రీ ఎల్. వి. ప్రెస్, మద్రాసు-1

# భట్టి విక్రమాదిత్యుని కథ

దీనిలో భోజరాజు జననము మొదలుకొని విక్రమాదిత్యుడు ముప్పదిరెండు సింహాసన మెక్కినది. అడవియందారు నెలలు గడపినదియు, భేతాళుడు చెప్పిన ఇరువదినాలుగు కథలున్ను, ప్రతిమలు చెప్పిన ముప్పదినాలుగు కథలున్ను, చాలా కాలము రాజ్యముచేసిన విధమును గలవు. ప్రతికథయు బహు విచిత్రముగా జెప్పబడియున్నది. ఒక్కొక కథకు తగినట్లు చిత్రమైన పటములతో అచ్చొత్తింపబడియున్నది. ముఖ్యముగా ప్రతియింటియందుండుటకు తగిన గొప్పకథ పుస్తకము. దీనిని చదివినవారు మరి యేకథల పుస్తకమును చదువుటకు యిష్టపడరనుట సత్యము. నాణ్యమైన క్యాలికోబైండు. అందమైన త్రివర్ణ జాకెట్టుతో 530 పేజీలు గలవి. 3-8-0

# గారడి వినోద రహస్యము

ప్రపంచమునందు అందరును గోరునది యానందము. పలువురు కూడినచోట అందరును ఆనందమయులై యుండరు. అట్టిచో అందరిని ఆనందింపజేయుటకు ఒకరికి సాధ్యముకాదు ఒకవేళ అందరిని ఆనందింపజేయవలెనన్న ఒకే మార్గము కలదు. అదేమనగా మాచే ప్రకటింపబడిన గారడి వినోద రహస్యముల దెలిసికొనియుండినచో అందరిని యానందింపజేసి వారి ప్రేమకు పాత్రులు కావచ్చును. ఇందు అనేక ఇంద్ర మహేంద్రజాలముల జూపబడినవి. మీరీ జాలవిద్యను మీ మిత్రుల యెదుట ప్రదర్శించినచో సెబాస్! అని మెచ్చి గౌరవింపగలరు. ధర 1-4-0

# వస్తుగుణపాఠము (గుణపాఠము)

ఈ గ్రంథము చాల ప్రాచీనమయినది. దీనిని శ్రీరంగ పట్నం గుజరాతి జయకృష్ణదాసుగారు రచించిరి. ఇది చాలా ప్రచారమును పొందినది. ఈ గ్రంథములో మన దేశములో ప్రతి గృహములోను ప్రతిదినము వాడుకొనుచున్నట్టి వస్తువులను యే యేవిధముగ వాడవలెనో, అటుల వాడిన దానివలన కలుగు గుణము లేవేవియో చక్కగా విశదము చేయబడినది. ఇవియేగాక మూలికలను గూర్చియు, మనము ధరించునట్టి ఆభరణములను గూర్చియు, ఆ యాభరణధారణమువలన కలుగునట్టి గుణములను గూర్చియు ఫలరస, తైలములగూర్చియు చక్కని తెలుగులో విశదము చేయుబడినది. నిత్యము భోజన పదార్థముగ వాడునట్టి సమస్త వస్తుగుణములను గూర్చియు, పాలు పెరుగు నేయి మున్నగువాటిని గూర్చియు గుణవిశేషములు తెలుపబడినది. ఆయుర్వేద గ్రంథములలోగల వస్తుగుణములను తెలుపునట్టి శ్లోకములను ఒకచో గూర్చి వాటికి తెలుగు తాత్పర్యములను గ్రంథకర్త చక్కని శైలిలో వ్రాసియున్నారు.

మూలికల గుణములను తెలుపునట్టి సందర్భమున ఆకుల గుణము, కాడలగుణము, వేరుగుణము, సమూలము గుణము యిటుల విభాగించి ప్రతిమూలికకు వివరించియున్నారు. అటులే వస్తువుల గుణము. యే యే వస్తువులు యే యే వస్తువులతో చేర్చిన నెట్టిగుణము యేర్పడునో ఆ వివరములుకూడా వివరింపబడినవి. దాదాపు వెయ్యి మూలికలు, వేయి వస్తువుల గుణములు ప్రత్యేక ప్రత్యేకముగ వివరింపబడినవి. (410 పేజీలు గలవి. వెల 5-0-0

# స్త్రీ భక్త విజయము

ఇందు మహాపతివ్రతల కథలు మృదుమధురముగ వ్రాయబడియుండెను. ఇట్టి మహాపతివ్రతల కథలు చదువుట వలన దుష్ప్రవర్తనులైనవారు కూడ తమ తమ చెడ్డ ప్రవర్తనలను వదలి ధర్మమార్గముల ననుసరించి సంచరింతురని చెప్పుటకు ఎట్టి సందేహమును లేదు.

మహా నిశ్చలభక్తురాండ్రైన పతివ్రతల కథలు చదువ చదువ శరీరము భక్తితో తన్మయత్వము జెంది పులకాంకురిత మగుచుండును. ఈ గ్రంథము నిజముగ భక్తుల పాలిటి కల్పతరువువంటిది. దైవము లేదని వాదించువారుకూడ ఈకథలు చదివినంతమాత్రముననే తమ అభిప్రాయములను మార్చుకొని భక్తుల ప్రభావములను తెలిసికొనుచు ఆశ్చర్యమును జెందుచుందురు. ఈ గ్రంథము భక్తుల హృదయములు రంజింపజేయు ననుటలో ఎట్టి సందేహమును లేదు. గ్రంథముయొక్క పేరును బట్టియే గ్రంథమునందలి విశేషములను తెలుసుకొనవచ్చును. భక్తుల ప్రభావములు ఈగ్రంథములో విపులముగ తెలుపబడియుండెను.

భక్తిరసమును కురిపించు విషయములు, ఆనందమును కలిగించు చక్కని శైలిగల వ్రాతలు, ఆశ్చర్యమును కలిగించు చక్కని శైలిగల వ్రాతలు, ఆశ్చర్యకరములైన ఘట్టములు చదువువారి హృదయములకు ఆహ్లాదమును కలిగించును భక్తి లేని జీవితము నిరర్థకము, భక్తిని వృద్ధిపరచుకొనుటకు యిట్టి గ్రంథములే ఆధారములు, నిజముగ ఈ గ్రంథము భక్తుల పాలిటి రత్నమువంటిది. 1-8-0

సి. వి. కృష్ణా బుక్ డిపో, పి. బి. నెం. 1805 మదరాసు-1

# అత్యద్భుత మాయాజాల మర్మశాస్త్రము

కర్త: మంత్ర విద్యాప్రవీణ శ్రీ కృష్ణ
(సుమారు 40 చిత్రములతో కూడినది)

ఇది అత్యద్భుత గ్రంథరాజము. ఇట్టిది యిదివరకు వెలువడలేదు. మంత్రశాస్త్రము, పాశ్చాత్యదేశములలో ఎక్కువ ప్రచారముగల మెస్మరిజమునకు సంబంధించిన అనేక ఉద్గ్రంథముల ఆధారంతో ఇది వ్రాయబడినది.

ఈ పుస్తకములోని విషయములు సంభ్రమాశ్చర్యములను కలిగించును. దీని సహాయముతో ఐంద్రజాలికులు తమ విద్యను అభివృద్ధి చేసికొనవచ్చును. ఇతరులు ఈ శాస్త్రము నభ్యసించి ప్రదర్శనలిచ్చి తమ మిత్రులను సంతోషపరచవచ్చును. లేక ఈ విద్యను వృత్తిగ జేసికొని ధనార్జన చేయవచ్చును. ఇంద్రజాల, మహేంద్రజాలములకు సంబంధించిన అనేక విషయములు తేట తెనుగున వివరింపబడినది. హస్తలాఘవము, దృష్టిప్రసరణములతో చేయదగిన జాలములు, తంత్ర, మంత్ర, యంత్ర, తైల, అంజనముల సహాయముతో ప్రదర్శించునట్టి జాలములు, సుమారు రెండువేలకు పైగ వ్రాయబడినది. 420 పేజీలు గ్రంథము.

విషయములు కొన్ని: ఏనుగతలను అంతరిక్షమున నిలుపుట, పాములు, తేళ్లు మున్నగు విషజంతువులను అప్పటికప్పుడు సృష్టించుట, గచ్చకాయల యుద్ధము, వశ్యవిధానము, కుక్కను సింహము చేయుట, మండుచున్న దీప మెగురునటుల చేయుట, బీడునేలలో నందనోద్యానవనమును సృష్టించుట, నీరునిండిన తటాకమును యెండజేయుట, నిప్పులేకనే అన్నము వండుట, సింహ, శార్దూలములను ఎప్పటికప్పుడు సృష్టించుట,

కనుకట్టు విద్యలు ఇటువంటి మహాద్భుత జాలములు విదేశము లలో ప్రచారములోగల ఎన్నియో వింతజాలములు గలవు.

వెల 4-0-0

# శరీర మర్మశాస్త్రము

ఒక అమూల్యమైన మానవశారీరమర్మ గ్రంథరాజము

అనేక చిత్రపటములతో గలది

నీకు కావలసినదియు, నీవు చూడవలసినదియు

చాల రోజులు వెదకిన శాస్త్ర మిదియే

ఆంధ్రదేశమంతటను సుప్రసిద్ధిచెందిన కవీశ్వరులగు బ్రహ్మశ్రీ పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులవారిచే పరిశోధింపబడినది. దీనిని చదువ జదువ సంతోషించుదురు.

ఇందు స్త్రీ పురుష లక్షణములు, వారి అవయవములు పొందికయున్ను, వాటి అమూల్యమైన వుపయోగములున్ను, సాంసారిక సుఖము, కుటుంబ రహస్యం, సరససల్లాపములు, ఆరోగ్యశాస్త్రము గర్భరక్షణ, శిశురక్షణములు మొదలగునవియు, స్త్రీ పురుష సార శరీరమున గల్గు రోగములును, వాటిని నిర్మూలించు చికిత్సలున్ను, మహామునులు మర్మముగా పూర్వకాలమున వ్రాయించిన గృహస్థాశ్రమ సుఖములు, వివాహితులకున్ను, వివాహము ముందుగానుండు, బాలబాలికలుకు అవశ్యకమైనవి. వీటిని విరివిగా చదివి తనివితీర్చుకోగలరు. ఇట్టి అమూల్యమైన గ్రంథము. ప్రతి కుటుంబమున తప్పని సరిగా వుండదగినది. 3-0-0

---

# కుట్టుపని

ఇది నూతన యుగము. ఈ దినము చూచినది రేపు మరియొకవిధముగ మారియుండును. అటులనే మనము ధరించు ఉడుపులలో ప్రతిదినము క్రొత్తరకములు బయలుదేరుచున్నవి. అందులకని మేము ఈనాగరిక స్త్రీ పురుష లోకమునకు దగినట్లు విదేశ స్వదేశములలోని క్రొత్త పద్ధతుల ననుసరించి కుట్టుయంత్రములమీద తామే స్వయముగ గుడ్డను కత్తిరించుటను, కుట్టుటను నేర్చుకొనుటకు "కుట్టుపని" అను పేరుతో పై గ్రంథమును ముద్రించి ప్రచురించితిమి. ఈ గ్రంథమును జాగ్రత్తగ చదివినచో జాకెట్లు, షర్టు, కోట్లు, పాంట్లు మిలిటరీ యూనిఫారమ్స్, బాడీలు, బనియనులు మున్నగువానిని స్వయముగ తయారు చేసికొనవచ్చును. వేయేల ఒకరికింద సేవకావృత్తి చేయుటకంటె మా కుట్టుపని గ్రంథమును, ఒక కుట్టుయంత్రమును కొని దినము 1-కి కనీసము రు 3-0-0 లు సంపాదించి స్వతంత్ర జీవనము చేయవచ్చును. 1-4-0

## ఉత్తర రామాయణము (పద్యకావ్యము)

శ్రీ కంకంటి పాపరాజకవి, విరచితంబైన శ్రీమద్రామాయణమునందలి ఉత్తరకాండము! ఇందు రావణాదుల జననము రావణుని చర్యలు, సీతవనవాసము, కుశలవుల పట్టాభిషేకము మొదలగు అనేక ఘట్టములు కల్గిన ఈ గ్రంథమును రాయల ప్రాంతములోని బాలబాలికలకు పఠనగ్రంథముగా నేర్పబడుటచే పాఠకుల కనువగునటుల అతి శుభ్రమైన గ్లేజు కాగితముల మీదుగా అచ్చొత్తించినారము. పూర్తి క్యాలికో బైండు పైన శృంగారమైన జాకెటు కవరు ఇటువంటి మేలైన యుత్కృష్టమైన పుస్తకము. వెల 6-0-0

---

సి. పి. కృష్ణా బుక్ డిపో, పి. బి. నెం. 1805 మదరాసు-1

# శ్రీ మహాభారత నాటకము

రచయిత పూర్వకవి కొత్తూరు రామలింగార్య ప్రణీతము

ఇందు మహాభారతమంతయు వీధినాటక రూపమున వ్రాయబడినది. ఈ గ్రంథము విశేష ప్రసిద్ధిని పొందియున్నది. ఈవిధముగ మహాభారతమంత వీధినాటకరూపములో ఇది వరలో ఎవ్వరిచేతను వ్రాయబడియుండలేదు. ముద్దులమూటగట్టు పద్యములతోను, కందార్థములతోను, ద్విపదలతోను, చక్కని చమువులతోను, చోపుదారులతోను, చక్కని సంవాదములతోను, మద్యమద్య చక్కని వచనములతోను, సీసార్థ, కందార్థ దరువులతోను, వృత్తములతోను, మాలిని వృత్తములతోను వ్రాయబడియుండెను. ఈవిధముగ వ్రాయబడిన గ్రంథము వేరొకటిలేదు. ఇందు ఆది, సభాపర్వములు లగాయితు సమస్త పర్వములు పైన చెప్పబడిన విధముగ వ్రాయబడియుండెను. మహాభారతమునందలి కథను ఏమాత్రమును మార్పులేదు. చదువుటకు యింపైన పద్యములు ఉత్పలమాలికలు చంపకమాలికలు విశేషములుగ గలవు.

ప్రతిదానికిని రాగం, తాళం విశదంబుగ తెలుపబడియుండెను. ఇది ఒక ప్రాచీనమైన గ్రంథము. 330 పేజీలు పెద్దసైజు చక్కని అట్టబైండు. వెల 2-12-0

## ఇంగ్లీషు విద్యాబోధిని

తెలుగు తెలిసినవారు ఆంగ్లమును స్వయముగా నేర్చుకొనవచ్చును. ఇందులో ఆంగ్లము మాట్లాడుటకును, ఆంగ్లములో వుత్తరములు వ్రాయుటకు చాల విమర్శగా తెలియపరచియున్నది. ప్రతి ఇంగ్లీషు పదమునకు తెలుగు అర్థమును యున్నది. వెల 1-0-0

# శ్రీగరుడపురాణము-వచనము

ఈ పురాణంలో అనేక రహస్యమయిన విషయములు వివరింపబడియున్నవి. శ్రీ గరుత్మంతునకు శ్రీమన్నారాయణ మూర్తి ఉపదేశించిన పురాణగ్రంథమిది. దీనిలో మానవుడు మరణించిన తర్వాత ఆ ప్రాణవాయువు వాయు శరీరధారియై, యమలోకము చేరునట్టి విధము, వాని వాని పాపపుణ్యా ఫలితములను యేరూపంలో అనుభవించడం, వైవస్వతపట్టణమునకు పోవునట్టి మార్గమునగల విశేషములు, సంవత్సర కాలము జీవుడు పడునట్టి బాధలు, యమలోకవర్ణనము, నరకముల పేర్లు యముని కోర్టులో విచారణ. చిత్రగుప్తుని లెక్క పరిశీలనము, మరణించిన జీవునకు చేయవలసిన కర్మవిధానము కర్మ చేయుటవలన మరణించిన జీవుడు పొందునట్టి లాభము ఏ యే పాపములు చేసినవానికి యెట్టి లోకము. పుణ్యము చేసినవాడు యెట్టి లోకమును జేరును. అనునట్టి విషయములు బహు విపులముగా వివరింపబడియున్నది. ఇటువంటి రహస్య విషయములను యీ గ్రంథము తప్ప మరేదియు చెప్పుటలేదు. అందరికి తెలియునటుల సులభశైలిలో వ్రాయబడినది. చిత్రములు గూడ కలవు. వెల 1-0-0

## శ్రీ కృష్ణ గోసాయి చిట్కాలు

ఇందులో వ్యాధి లక్షణము. అందుకు తగిన చికిత్సలు వివరింపబడినవి. ఔషధముల వివరములన్నియు అనుభవపూర్వకమైనవి. ఎవరికి వారే వ్యాధికి తగిన ఔషధములను తయారు చేసుకొని వాడుకొనవచ్చును. వైద్యుని సహాయ మక్కరలేదు ఇందులోని చిట్కాలు మూలికలతోనే కూడియున్నవి. తయారు చేసుకొను పద్ధతులు చాలా సులువయినవి. 0-12-0

# సకల సుగుణ అదృష్టదీపిక

(జ్యోతిష పండితులచే కొనియాడబడుచున్నది)

ఇట్టి గ్రంథము ఇదివరలో వెలువడియుండలేదు. సర్వ జనులకు బోధపడునట్లు సులభముగ వ్రాయబడెను. తారా బల, వాస్తు, ప్రయాణ, శకున, స్వప్న, రజస్వల, హస్తసాముద్రికము మొదలగు విషయములు ఎన్నియో కలవు. ఇందు సుమారు 130 విషయములు వరకు సవిస్తరముగ వ్రాయబడెను. ఈ గ్రంథమును వకసారి చదివిన జ్యోతిష్కుని అవసరము లేకనే తమంతట తామే సకల విషయములను, అదృష్ట విషయములను తెలుసుకొనుటేగాక, ఇతరులకుకూడ చూచి చెప్పవచ్చును.

అనేక తాటియాకుల గ్రంథముల పరిశీలించి వ్రాయబడెను.

ఇంకను ఎన్నో విషయములు కలవు. వకసారి చదివిన మీకే బోధపడును. 1-0-0

## సాముద్రిక శాస్త్రము

మీ భవిష్యత్తును తెలుసుకొనదలచినచో యీహస్త సాముద్రిక శాస్త్రమును చదువుడు. అరచేతియందుండు రేఖల ఫలితములను తెలుపునదే హస్తసాముద్రిక మనబడును. అనేక తాటియాకుల గ్రంథములను పరిశోధించి వ్రాయబడినది.

ప్రహ్లాదుడు, ఈశ్వరుడు, గర్గుడు, వరాహమిహిరాచార్యుడు మొదలగువారు హస్తసాముద్రికమును గురించి చెప్పిన విషయములన్నియు యీగ్రంథములో వివరముగ తెలుపబడియుండెను. వెల 0-8-0

మిలిటరీ పాకశాస్త్రము 1-0-0

సి. వి. కృష్ణా బుక్ డిపో, పి. బి. నెం. 1805 మదరాసు-1

# తెనాలి రామకృష్ణుని కథ

తెనాలి రామకృష్ణుఁడు ఒక ఆంధ్రకవి. ఇతని యూరు తెనాలి. ఈతఁడు శ్రీ కృష్ణదేవరాయల యొద్దనుండిన ఎన మండుగురు కవులలో నొకఁడు. సమయోచిత వాక్యనిర్వాహక మహాశక్తిసంపన్నుఁడు. ఈతఁడు వికటకవి యనియు రాయలవారి సభలో హాస్యకుఁడుగా నుండెననియు నితని విష యమై యనేక కథలు వాడఁబడుచున్నవి. ఈ గ్రంథమునందు రామలింగనికి సిద్ధుఁ డుపదేశించుట, కాళికాదేవి ప్రత్యక్ష మగుట, తాతాచార్యుల సందర్శనము, రామలింగడు పిశాచ వేషమును ధరించుట, కవి ధూర్జటి హాస్యమూ ప్రకటించుట, సహస్రఘంట కవి నోడించుట, భట్టుమూర్తివలన ముత్యాల హారముం గైకొనుట, రామకృష్ణుని విద్యా వినోదములు, వేశ్యకు స్వర్ణ యోగం బుపదేశించుట, చాటుధారా పద్య ములు, దశావతార పద్యములు మున్నగువానితో ఁబిడీకృ తంబై చదువరుల కెంతయు నాహ్లాదము గూర్పునంతటి హాస్య రసముట్టిపడుచుండును. కావున ఆంధ్రభాషాభిమాను లీగ్రంథ మును దప్పక చదివియే తీరవలయును, 1-0-0

నలభీమ పాక శాస్త్రము

అన్ని శాస్త్రములతోపాటు పాకశాస్త్రముకూడ ప్రతి వారును ముఖ్యముగ నేర్వదగినది. మన మనుగడకు ఆహారము ప్రధానమైనది. కనుక యెవరి దేహతత్వమునకే యాహారము అవసరమో ఆ యాహారమును తయారుచేసికొనుట మంచి మార్గము. ఈ గ్రంథమును శ్రద్ధతో జదివినచో తమకు గావ లసిన పదార్థముల వారే స్వయముగ చేసికొనవచ్చును. ప్రతి స్త్రీయు పురుషుడును చదువదగిన గ్రంథము. 1-0-0

# కార్తీక పురాణము

పదునెనిమిది పురాణములలో జేరిన యీ కార్తీక పురాణము నెందరో ప్రకటించియున్నారు. అట్టి గ్రంథమును మేము సులభశైలిలో వ్రాయించి సామాన్యజనులకు కార్తీక మహాత్మ్య మెట్టిదో తెలుసుకొనునట్లు చేయవలెనని వ్యయ ప్రయాసలకోర్చి ప్రకటించితిమి. ఈ గ్రంథమున సోమవార వ్రత విధానమును, అందువలన యెవరెవరు యేవిధముగ సద్గతుల గాంచిరో చక్కగ వర్ణింపబడినది. పుస్తకమును చదువ మొదలిడినచో కడపటి పుటవరకు చదువక విడువరు. ప్రతి హిందువుడు యీ గ్రంథమును చదువుటయేగాక యీ వ్రతమునుగూడ ఆచరించుట మంచిది. మంచికాగితములపై ముత్యములవంటి అక్షరములతో చక్కగ ముద్రింపబడినది. 128 పుటల గ్రంథము. 1-4-0

## జాతకాలంకారము

ఇది ప్రాచీన జ్యోతిష గ్రంథము. శ్లోకములకు సులభశైలితో తెలుగు తాత్పర్యము వ్రాయబడినది. ప్రతియొకరు తన జాతకచక్రమును దగ్గరుంచుకొని తమకు కలుగునట్టి ఫలితములను చూచుకొనవచ్చును. ఇది ప్రమాణ గ్రంథము. ఋషులచే వ్రాయబడినది. జాతకచక్రమున నే యే యింట నే యే గ్రహములుండిన యెట్టి ఫలితముల నిచ్చునో బహు విపులముగ తెలుపబడినది. కళత్రభాగము; ఆయుర్భావము యిటుల మానవునకు కలుగునట్టి సకల విషయములు యిందు వివరింపబడినది. జ్యోతిష్కునితో ప్రమేయము లేకయే ప్రతి యొకరు తమ భావములను తెలుసుకొనవచ్చును. 0-8-0

సి. వి. కృష్ణా బుక్ డిపో, పి. బి. నెం. 1805 మదరాసు-1

# యవనజాతకము

ఇది అత్యద్భుతమైన జ్యోతిషగ్రంథము. ప్రసిద్ధ ప్రాచీన జ్యోతిశ్శాస్త్రవేత్తలలో నగ్రగణ్యుడగు యవనాచార్యులచే రచింపబడినది. ఇది ప్రాచీన ప్రమాణ గ్రంథము. ఇందు వివరింపబడిన ఫలములు అత్యద్భుతమయినవి. ఏ యే సంవత్సరమున జన్మించినవానికి యెట్టి ఫలములు కలుగునను విషయముతో ప్రారంభించి అయన ఫలము ఋతుఫలము, మాస, వార, నక్షత్ర ఫలములు, లగ్నఫలము ద్వాదశరభావస్థిత గ్రహాఫలము, దిన, రాత్రి, తిథి, యోగ, కరణముల ఫలితములు తేటతెలుగున వివరింపబడినది. జ్యోతిష్కులతో నిమిత్తము లేక యే ప్రతివారు తమ జాతకచక్రమును దగ్గరనుంచుకొని తమ తమ భావములను తెలుసుకొనుటకు వీలుగ విషయములు వివరింపబడినవి. చదువగలిగిన ప్రతివారికి ఉపయుక్తమయిన గ్రంథము. 0-12-0

## దస్తావేజుల మతలబులు

యీ గ్రంథమున గవర్నమెంటు రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటువారు 1955-వ సంవత్సరమువరకు నిర్ణయించిన అన్ని విధములగు దస్తావేజుల నమూనాలను, రిజిస్ట్రేషన్ ఫీసు మున్నగువానిని చక్కగా వివరింపబడినవి. యీ పుస్తకమును బాగుగ చదివి దీని సహాయముతో సామాన్య విద్యాజ్ఞానము గలవారు దస్తావేజులను వ్రాసి దినము 1-కి రు 5-0-0 లు సంపాదింపవచ్చును. డాకుమెంట్ రైటర్లు తప్పక చదివి లాభము పొందుదురుగాక. 1-0-0

జ్యోతిషఫలప్రదర్శని 1-0-0

గురుశిష్య సంవాదము 1-0-0

# పుట్టుమచ్చల శాస్త్రము

ఈ గ్రంథములో మానవశరీరములో పుట్టుకతో కలుగునట్టి మచ్చలు, అపుడపుడు కలుగునట్టి మచ్చలు వీటిని గూర్చి చర్చింపబడినవి. జ్యోతిశ్శాస్త్రములో, సాముద్రికము, పుట్టుమచ్చలు భాగములయియున్నవి. జ్యోతిషమునకు లెక్కలు ప్రధానము. ఈపుట్టుమచ్చల శాస్త్రమునకు లెక్కలు అక్కరలేదు. శరీరమునగల మచ్చలనుబట్టియే ఫలితముల నెరుగనగును. ఏ యే ఆకారములో యే యే భాగమునగల మచ్చలకు యే యే ఫలితములు కలుగునో సులభశైలిలో వివరింపబడినవి. చదువ నేర్చిన ప్రతివారు దీని సహాయమున యితరుల అవసరము లేకనే మచ్చల ఫలితములను తేలికగ తెలిసికొనవచ్చును. 1-0-0

## హిందీ విద్యా బోధిని

తెలుగక్షరములు తెలిసిన ప్రతివారు ఈ గ్రంథ సహాయమువల్ల ఒక నెలలోనే హిందీభాషను సులభముగా నేర్చుకొనవచ్చును. ఉచ్చారణ, అర్థవివరణములు తెలుగక్షరములలో యీయబడినవి. హిందీ నేర్చుకొను వారికి ఇది చాల సహాయకారి. నేడే ఈ 112 పేజీల గ్రంథము కొనిపోవలెను.

వెల 1-4-0

| | |
|---|---|
| జ్యోతిష బాలశిక్ష | 0-8-0 |
| అనుపానమంజరి | 0-12-0 |
| సహదేవ పశు వైద్యము | 0-8-0 |
| పరమానంద శిష్యుల కథలు | 0-8-0 |
| కుక్కుట శాస్త్రము | 0-8-0 |

---

సి. వి. కృష్ణా బుక్ డిపో, పి. బి. నెం. 1805 మదరాసు-1

